# విషయసూచిక



1 అరణ్యపర్వ ప్రారంభము
2 శౌనకుడు ధర్మరాజునకు ధర్మములు చెప్పుట
3 సూర్యమూర్తి స్తోత్రము
4 సూర్యుడు ధర్మరాజునకు వరమిచ్చుట
5 విదురుడు పాండవులయొద్దకు బోవుట
6 దేవేంద్ర సురభి సంవాదము
7 మైత్రేయుడు దుర్యోధనుని శపించుట
8 భీముడు కిమ్మీరరాక్షసుని సంహరించుట
9 ద్రౌపది తనపరిభవమును కృష్ణునితో జెప్పుట
10 సౌంభక ఉపాఖ్యానము
11 సాల్వుడు మరలిపోవుట
12 పాండవులు ద్వైతవనమందు నివసించుట
13 ద్రౌపదీ ధర్మరాజ సంవాదము
14 భీమ ధర్మరాజ సంవాదము
15 వేదవ్యాసుడు వచ్చుట
16 కిరాతవేషముతో యీశ్వరుడు అర్జునునొద్దకువచ్చుట
17 అర్జునకృత పరమేశ్వర స్తోత్రము
18 ఇంద్రుడు అర్జునునకు ప్రత్యక్షమగుట
19 అర్జునుడు అమరావతికి బోవుట
20 అర్జునుని దివ్యాస్త్రలాభమునకు ధృతరాష్ట్రుడు దుఃఖించుట
21 నలమహారాజచరిత్ర ప్రారంభము
22 నలుడు దేవదూతయై దమయంతివద్దకు బోవుట
23 నలుడు దమయంతిని బెండ్లియాడుట

24 నలదమయంతులు అడవికి బోవుట
25 దమయంతి శాపముచే బోయవాడు చచ్చుట
26 దమయంతి సుబాహు పురమందు ప్రవేశించుట
27 నలుడు సర్పముచే కరువబడుట
28 సుదేవుడు దమయంతిని తెలుసుకొనుట
29 దమయంతి విదర్భాపురము జేరుట
30 నలుడు విదర్భకుబోవుట
31 దమయంతితో చెలికత్తె నలునిగుణములు దెల్పుట
32 నలుడు దమయంతిని జూచుట
33 నారదమహాముని వచ్చుట
34 తీర్థమహాత్మ్యము
35 రోమకుడు ధర్మరాజువద్దకు వచ్చుట
36 ధర్మవిశేషములు
37 అగస్త్య లోపాముద్రల వివాహము
38 దేవతలు విష్ణునిస్తుతించుట
39 అగస్త్యుడు సముద్రజలమును త్రాగుట
40 సగరపుత్రులు భస్మమగుట
41 ఋశ్యశృంగుని చరిత్రము
42 విభాండకుడు ఋశ్యశృంగుని వెదకుట
43 పరశురామునిమాహాత్మ్యము
44 సుకన్య చరిత్రము
45 చ్యవనుడు అశ్వినుల సోమపీథుల జేయుట
46 మాంధాతృ చరిత్రము
47 సోమకరాజర్షి చరిత్రము
48 శిబిమహారాజ చరిత్రము

49 అష్టావక్ర చరిత్రము
50 అవక్రీతు చరిత్రము
51 దేవతులర్థావసునకు వరములిచ్చుట
52 పాండవులు గంధమాదనపర్వతమునకు బోవుట
53 భీముడు సౌగంధికపుష్పమును తెచ్చుట
54 చతుర్యుగాచార వర్తనము
55 హనుమంతుడు భీమునకు తనరూపము జూపుట
56 భీముడు యక్షరాక్షసులతో యుద్ధము జేయుట
57 భీముడు జటాసురుని సంహరించుట
58 భీముడు పంచవర్ణ పుష్పములను తెచ్చుట
59 మణిమంతుడు మరణమునొందుట
60 మణిమంతుని శాపవృత్తాంతము
61 ఇంద్రుడు పాండవులయొద్దకు వచ్చుట
62 అర్జునుడు నివాతకవచులను జయించుట
63 అజగరోపాఖ్యానము
64 ధర్మరాజు భీముని వెదకుట
65 ధర్మరాజు నహుషప్రశ్నలకు ప్రత్యుత్తరమిచ్చుట
66 శ్రీకృష్ణుడు పాండవులయొద్దకు వచ్చుట
67 మార్కండేయుడు పాండవులయొద్దకు వచ్చుట
[illegible] బ్రాహ్మణ ప్రభావము
[illegible] అత్రిగౌతముల సంవాదము
[illegible] వైవస్వతుని వృత్తాంతము
1 ప్రళయప్రకారము
2 నారాయణ ప్రభావము
3 కలియుగ ధర్మములు

74 కల్కిరూప ధర్మప్రతిష్ఠాపనము
75 బ్రాహ్మణ ప్రభావము
76 శల్యుడు వామదేవమునిని ధిక్కరించుట
77 ఇంద్రద్యుమ్న మహారాజుచరిత్రము
78 కువలయాశ్వ చరిత్రము
79 మధుకైటభుల చరిత్రము



# మహాభారతము

## వచనము

## అరణ్యపర్వము

ఓ దేవా! హరిహరనాథా! జనమేజయునకు వైశంపాయనుడు యిట్లు తెలియ జెప్పెను. ఓ జనమేజయమహారాజా! అట్లు పాండవులు తమ ఆయుధములను ధరించి నారచీరలతో ద్రౌపదీ సహితులై ఉత్తరదిక్కునకు వెడలిరి. ఆ సమయమందు ఇంద్రసేనుడు మొదలగు పాండవుల మూలభృత్యులు పదునాలుగువేల రథములను తోలుకొని సుభద్రను, అభిమన్యు ప్రతివింధ్యాది పాండవ కుమారులను తీసికొని పాండవుల వెనుకనే వెళ్ళుచుండిరి. అప్పుడు హస్తినాపురమందలి జనులందరును అట్లు అడవులకు వెళ్ళు పాండవులను జూచి మహాదుఃఖము గలవారై యిట్లని జెప్పుకొనిరి. ధృతరాష్ట్ర దుర్యోధను లిద్దరును అధర్మమైన మాయాజూదమందు పాండవుల నోడించి నిర్దయులై వారి రాజ్యలక్ష్మిని తీసికొనిరి. పాండవులను అడవులకు పంపించిరి. ఇట్లుచేయుట తగదు. ధృతరాష్ట్ర దుర్యోధను లిద్దరును మహాపాపాత్ములు. భీష్మ ద్రోణ కృపాచార్య విదురులైనను దుర్యోధనుని చెడుతలంపును పోగొట్టి పాండవులను రక్షింపలేదు. భీష్మాదులేమి తలంచిరో తెలియలేదు. దుర్యోధనుడు పరమలోభియై కర్ణ శకుని దుశ్శాసనులను స్నేహితులనుగా జేసికొని యింత పాపకార్యమును జేసెను. దుర్యోధనుని రాజుగా జేసికొని అతని రాజ్యమందు మనముండజాలము. ఈ భూమిని ధర్మముగా పరిపాలించు రాజులు లేరు. కాన పరమధార్మికులైన పాండవులు వెళ్ళిన

అడవులకు మనముకూడా వెళ్ళెదము. అని యిట్లు హస్తినాపుర మందలి జనులందరులు జెప్పుకొని పాండవుల వెనుకనే వెళ్ళి పాండవులతో యిట్లనిరి.

ధర్మరాజాది పాండవులారా! మీరు మమ్ములను విడిచి అడవులకు వెళ్ళుచున్నారు. అట్లు వెళ్ళరాదు. మీకంటె మాకు యెవ్వడును దిక్కులేరు. ధృతరాష్ట్ర దుర్యోధనులు పాపాత్ములు. పాపాత్ములతో మేము జేరినయెడల మాకు పాపము గలుగుటకు సంశయము లేదు. మేము పాపములకు భయపడు చున్నాము. నువ్వులును, నీళ్ళును, వస్త్రములును. పుష్పములతో గూడియున్న యెడల మంచి పరిమళము గలిగియుండును. అటువలెనే సత్పురుషుల సహవాసము వలన సద్గుణములు గలుగును. మీరు సాధువులకు సమ్మతమునైన గుణములు గలవారై జన్మ. విద్యా. కర్మములచేత ప్రసిద్ధినిపొంది మంచినడవడిక గలిగియున్నారు. మీ సహవాసము వలన మేము ధర్మములను యెరింగి కృతార్థుల మగుదుము. లోకమందు జనులు పాపకర్మములను జేయకున్నను పాపాత్ములను జూచుట చేతను తాకుటచేతను, మాటలాడుట చేతను సహవాసాదులచేతను పుణ్యహీనులగుదురు. కనుక మేము దుర్యోధనుని రాజ్యమందుండజాలము. మేము మీ వెంబడి వచ్చి మీదగ్గర నే యుండెదము. ఇందుకుమీరు సమ్మతింపవలయును. అని యీరీతిగా హస్తినాపురమందలి జనులందరును పాండవులతో జెప్పికొని ప్రార్థింపుచు నమస్కరింపు చుండిరి. ఆ పురజన సమూహములను జూచి ధర్మరాజిట్లు పలికెను.

పురజనులారా! మాయందు సద్గుణములు లేకున్నను మీకు మాయందుగల అనురాగముచేత మాయందు సద్గుణములున్నట్లు ప్రకాశించుచుండెను. మా వెంబడి మీరు వచ్చుట మాకు సమ్మతమే. అయినను మీరు వనవాస దుఃఖములను సహింపజాలరు.

గనుక మీరు మా వెంబడి వచ్చుట మానుకొనుడు. అని యీ రీతిగా ధర్మరాజు కృపాపూరిత వాక్యముల చేత ప్రీతిపూర్వకముగా పురజనులతో జెప్పి వారినందరిని పంపించెను. అంతట పురజనులందరు పెద్ద ధ్వని కలుగునట్లు యేడ్చుచు హస్తినాపురమునకు వెళ్ళిరి. యీ ప్రకారము తమతో బాటు వనవాసము జేయుటకు వచ్చిన పురజనులను నిలిపి పాండవు లరణ్యావాసమును జేయుటకు వెళ్ళి గంగానదీ తీరములో ప్రమాణమను మర్రి చెట్టుక్రింద దిగిరి. అట్లుదిగిన పాండవులు గంగాస్నానము చేసి ఆపగలును రాత్రియు అక్కడ నేయుండిరి. అంతట మరునాటి ఉదయకాలమందు అనేకసహస్ర సంఖ్యలుగల బ్రాహ్మణోత్తములు తమతమ అగ్నిహోత్రములతో తమతమ బంధుశిష్య వర్గములను తీసికొని పాండవులదగ్గరకు వచ్చిరి. అట్లు వచ్చిన బ్రాహ్మణోత్తములు బ్రహ్మదేవునితో సమానులు. ఆ బ్రాహ్మణులందరును వేదఘోష చేయుచు అక్కడికి వచ్చిరి. ఆ వచ్చిన బ్రాహ్మణులను మిక్కిలి ప్రీతిపూర్వకముగా పూజించి వారి యాశీర్వాదమును పొంది ధర్మరాజు వారితో యిట్లుపలికెను.

ఓ మహాత్ములగు బ్రాహ్మణోత్తములారా! మేము మా శత్రువులగు దుర్యోధనాదుల వలన సకలరాజ్య సంపదలను విడిచితిమి. అట్లు భయంకరములైన అడవులకు వెళ్ళి కందమూల ఫలములను భక్షింపుచుండెదము. అటువంటి స్థితిని పొందియుండుటకు మేము అడవులకు వెళ్ళుచున్నాము. మాతో మీరు వచ్చుటవలన ప్రయోజనము లేదు. మావలనే మీరును కష్టించవలసిన పనియేమి? మీరు మీ గృహములకు పోయి హస్తినాపురములో సుఖముగా నుండుడు. పెద్దపులులును, చిరుతపులులును సింహశార్దూలాది క్రూర మృగములుండెడి అడవులకు మీరు రాగూడదు. అని యిట్లు ధర్మరాజు బ్రాహ్మణులతో జెప్పగా నా బ్రాహ్మణులందరును మహాదుఃఖముగలవారై ధర్మరాజుతో యిట్లనిరి.

మహాత్మా! ధర్మరాజా! మాకు మీకంటె యితరమగు గతి లేదు. ఇతరులను మేము ఆశ్రయింపము. నిన్ను ఆశ్రయించి బ్రతుకుటకు వచ్చితిమి. మీరు మమ్ములను విడుచుట ధర్మముగాదు. అల్పులైనను, తమను ఆశ్రయించిన వారిని భక్తులను విడువరు. మమ్మును మీరు పోషించెడి విషయమున మీరు చింతింపవద్దు. వనమందుండు కందమూల ఫలములను మేమే తెచ్చుకొని భక్షింపుచు, జపహోమ అధ్యయనాది పుణ్యకార్యములవలన మీకు సంతోషము కలిగింపుచు, కృతార్థుల మయ్యెదము. దుర్యోధనాదులు అధర్మమందు ప్రవర్తించి మీకు అపాయమును కలిగించిరి. దుర్యోధనుని రాజ్యమందు మేముండము. అని యిట్లు బ్రాహ్మణులందరును ధర్మరాజుతో జెప్పుకొని ప్రార్థించిరి. అప్పుడు ధర్మరాజు తమతో బ్రాహ్మణులు వచ్చుటకు సమ్మతించి తన మనస్సులో యిట్లని దుఃఖించెను. అయ్యో! దైవమా! ఇష్టములైన క్షీరాన్నాదులచేత యిదివరకు బ్రాహ్మణులకు తృప్తికలిగింపు చుంటిని. అటువంటి బ్రాహ్మణులు అడవులలో కందమూల ఫలములను భక్షింపుచుండగా నేను చూడజాలను. అని యీ రీతిగా ధర్మరాజు తన మనస్సులో తలంచి మహాదుఃఖము గలవాడై మూర్ఛపొంది క్రిందపడెను.

## శౌనకుడు ధర్మరాజునకు ధర్మము జెప్పుట

అప్పుడు శౌనకు డను బ్రహ్మర్షి ధర్మరాజునకు దుఃఖము పోగొట్టి యిట్లనెను. ధర్మరాజా! మనస్సునకు ఉపశాంతి కొరకు పూర్వము జనకగీతలు కొన్ని గలవు. ఆ జనకగీతలయందు గల అభిప్రాయమును జెప్పెదవినుము. దుఃఖభయములు గలిగినప్పుడు వివేకము లేనివాడు వ్యాకులమును బొందును. ఆత్మానాత్మ వివేకముగలవాడు దుఃఖభయములు గలిగినప్పుడు అవివేకివలె వ్యాకులమును బొందడు.

సకలదుఃఖములును శరీరమునకును మనస్సునకును సంబంధములై యుండును. ఆ శరీరమనస్సులవలన కలుగు దుఃఖము లేదు. ఆ దేహ మనోదుఃఖములచేత అవివేకులు తపింపబడి అనేక క్రూరబాధలను పొందుదురు. పెద్దలగువారు తమ వివేకబుద్ధులచేత ఆ రెండువిధము లైన సకలదుఃఖములను నశింపజేయుదురు. ఆత్మానాత్మ వివేకము గలవారే పెద్దలని చెప్పబడుదురు.

మరియు, వ్యాధియు, శ్రమయు, ఇష్టముగాని దుఃఖాది వస్తువులు లభించుటయు, యిష్టమైన సుఖాదివస్తువులుపోవుటయు ఈ నాలుగింటివలనను శరీరమునకు దుఃఖములు గలుగుచున్నవి. పై చెప్ప బడిన నాలుగును శరీరదుఃఖములని చెప్పబడును. ఆ శరీరదుఃఖములు నాలుగును పుణ్యకర్మములను జేయుటచేత నశింపుచున్నవి. మరియు కామక్రోధస్నేహాదులైన మనోవికారములన్నియు. మానసదుఃఖము లని చెప్పబడును. జలములచేత అగ్నిహోత్రము నశించినట్లు నిర్మల మైన ఆత్మజ్ఞానమువలన మనోదుఃఖములన్నియు నశించును. మనో దుఃఖము గలుగుటకు స్నేహము మూలకారణమగును. స్నేహమను సముద్రమునందు దిగినవాడు ధైర్యములేక మహాదుఃఖములను పొందును. దుఃఖముగలవాడు దుఃఖముచేత పరితపించును. దుఃఖ పరితాపముగలవాడు మోహముగలవా డగును. కామక్రోధాదిగుణ ములన్నియు స్నేహమువలననే గలుగుచున్నవి. గనుక ధర్మరాజా! బంధుమిత్రపుత్ర ధనసమూహములందు ప్రేమను విడువవలెను. ఆత్మ జ్ఞానముగలవారికి తామరాకునందు జలములంటనట్లు స్నేహము గలుగనేరదు. ఎటువంటి సమయమందైనను ఆత్మజ్ఞానుల మనస్సు నందు ప్రేమ నిలువజాలదు. అట్టి ప్రేమవలన రాగము గలుగును. రాగమువలన క్రోధముగలుగును. క్రోధమువలన కామముగలుగును. కామమువలన ఆశ గలుగును. ఆశవలన సకలపాపములు గలుగు

చున్నవి. సకలపాపకర్మలకును ఆశయే మూలకారణము. ఆశవలననే సకలదుఃఖములు గలుగుచున్నవి. బుద్ధిమంతులుగూడ యీ ప్రకారముగా తెలిసికొని ఆశను విడుతురు. తొర్రయందు గల నిప్పుచేత వృక్షము దహింపబడి నశించునట్లు ఆశగలవాడు ధనలోభముచేత వినాశమును పొందును. మరియు ధనమం దాశగలవాడు శుభములను పొందజాలడు. మృత్యువువలన ప్రాణులకు భయముగలిగినట్లు ధనవంతులకు సర్వదా రాజచోరబంధుజనజల అగ్నులవలన భయము గలిగియుండును.

ధర్మరాజా! జలములయందుగల చేపలును, ఆకాశమందు గల పక్షులును, మాంసమును భక్షించినట్లు, సకలజనులును ప్రతినిత్యమును అనేకవిధములచేత ధనవంతుని భక్షింపుచుందురు. ధనమువలననే దుఃఖములు గలుగుచున్నవి. కనుక అనేకదుఃఖములకు ధనముకారణమగును. ధనమువలననే మాయామోహావంచనలు గలుగుచున్నవి. ధనమును సంపాదింపవలెనని అపేక్షయున్నవానికి సకలదుఃఖములును కలుగక మానవు. ధనాపేక్షలేనివాని జన్మము కృతార్థతనుపొందును. అట్టిధనమువలన గర్వము కార్పణ్యము, భయము మొదలగు దుర్గుణములన్నియు గలుగుచున్నవి. గనుక ధనము సంపాదింపవలెనని చింతింపరాదు. రూపము, యౌవనము, ధనము, ఆయుష్యము, యిష్టగృహాదులు యివి యన్నియు నిత్యములు గానందున ఆ వస్తువులను గురించి బుద్ధిమంతులు మోహించరు. అని యీ విధముగా జనకగీతలయందలి అభిప్రాయమును శౌనకమునీంద్రుడు ధర్మరాజుతో జెప్పగా ధర్మరాజు యిట్లుచెప్పెను.

మహాత్మా! శౌనకమునీంద్రా! నాకు భోగాపేక్ష యెన్నడును కలుగలేదు. భయంకరములైన యీ యడవులయందు బ్రాహ్మణులను యెట్లు భరింతునోయని యిప్పుడు దుఃఖింపుచున్నాను. మావంటి

గృహస్థులు పోషింపదగినవారిని పోషింపవలెను. బ్రాహ్మణులను అతిథులను పూజింపక వ్యర్థముగా పంపరాదు. మావంటి గృహస్థుడు తన ధనమును విభాగించి యిచ్చుచు సాధుజనులను రక్షింపవలెను. సకల ఆశ్రమములలో గృహస్థాశ్రమము శ్రేష్ఠమైనదని పెద్దలు చెప్పగా వినియున్నాము. గృహస్థుడనువాడు దుఃఖముచేత భయపడిన వానికభయమియ్యవలయును. దప్పికగలవానికి జలములనియ్యవలెను. ఆకలిగొన్నవానికి అన్నమును పెట్టవలయును. బడలిక గలవానికి పాన్పుపీటలు మొదలగునవి యివ్వవలెను. యిట్టిధర్మములు గృహస్థునకు విధివిహితములగుట అనాదిసిద్ధము. ఈ ధర్మములు శ్రేష్ఠమైన గృహస్థధర్మములు. తృణములును,, భూమియు జలములును ప్రియవాక్యములచేత ఆదరించుటయు యీ విషయములందరికిని ఆవశ్యముగానుండ తగినవి. తాను భుజించుటకొరకు అన్నమువండుటయు, యజ్ఞముచేయకనే వ్యర్థముగా పశువును హింసించుటయు, యివి రెండును పాపహేతువులగును. అగ్నిహోత్రములును, ఎద్దులను, అతిథులను, బంధువులను, విద్వజ్జనులను, గురుజనులను, మిత్రులను, స్త్రీలను, వీరలను పూజింపనియెడల కీడుగలుగును. గనుక గృహస్థుడైనవాడు సర్వజీవులకును తృప్తిగలిగింప వలయును. గనుక ప్రతినిత్యము పక్షులకును, కుక్కలకును, శ్వాపదములకును సాయంకాల ప్రాతఃకాలములయందు గృహస్థుడు వైశ్వదేవముజేసి ఆహారము పెట్టవలెను. వైశ్వదేవాది యజ్ఞముజేసి మిగిలిన యన్నమును భక్షించినవాడు అమృతాశియని చెప్పబడును. యజ్ఞశేషాన్నము అమృతమని చెప్పబడును. ఈ విధముగా వర్తించువాడు గృహస్థుడని చెప్పబడును. అనియిట్లు ధర్మరాజు శౌనకమునీంద్రునితో జెప్పగా శౌనకుడు ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! విషయ సుఖములయందు అపేక్షగలవారు ఎంతజ్ఞానవంతులైనను అసాధ్యమైన మనోవికార

మును పొందుదురు. వారి యింద్రియములు వారివశమందుండక విషయములయందు వ్యాపించుచుండును. శబ్దస్పర్శరూప రసగంధ ములు విషయములనబడును. ధర్మరాజా! సంకల్పమువలన కామము పుట్టును. కామముతోగూడిన మనస్సుచేత ప్రేరేపింపబడి శ్రోత్ర త్వక్ చక్షుర్జిహ్వాఘ్రాణములను యింద్రియము లైదును శబ్దస్పర్శ రసరూపగంధములను విషయములందు సర్వదా తిరుగుచుండును. గనుక విషయసుఖములయందు ఆశయను బాణముచేత కొట్టబడిన జీవులు తేజస్సుయందు ఆశగల మిడుతలవలె దుఃఖాగ్నియందు పడు దురు. అట్లుపడి తమ్ముతామెరుగజాలక అజ్ఞానకర్మ ఆశలవలన సం సారచక్రమందు వర్తింపుచుందురు. గనుక బ్రహ్మాదితృణ పర్యంతము గల సకలభూతప్రవర్తనమందు రాగద్వేషములను విడిచి అభిమాన మాత్సర్యములను విడువవలయును. అట్లు అభిమాన మాత్సర్యము లను విడచినవారు వేదమందు జెప్పినప్రకారము జ్ఞానబుద్ధియు, ఇం ద్రియనిగ్రహము, వ్రతవిశేషము, గురుసేవ, ఆహారయోగము, అధ్యయనాగమము, కర్మసన్యాసము, చిత్తనిరోధము, యీ యెనిమి దింటిని గలిగి వీనిచేత కర్మానుష్ఠానము చేసినమహాత్ములు తమతమ తపో మహాత్మ్యమువలన సంసారమును జయింతురు.

ధర్మరాజా! నీవును శుశ్రూషాశ్రవణ, గ్రహణధారణ, ఊహా పోహాఅర్థవిజ్ఞానములను గలియున్నావు. నీచేత ప్రారంభింపబడు సర్వకార్యములును చక్కగా ఫలించును. పశువులును, రుద్రులును, దేవతలును, తపోమహాత్మ్యమువలననే సకలైశ్వర్యసమృద్ధిని బొంది యున్నారు. గనుక నీవును తపస్సువలననే యిష్టసిద్ధినిబొందుము. తప స్సిద్ధులైనవారు తాముదలచిన ఫలమును పొందుదురు. నీవును శాంత చిత్తముగలవాడవై తపస్సుచేసి యోగార్థసిద్ధిని పొంది బ్రాహ్మణు లను పోషింపుము. నీకునీమనోరథము సఫలమగును. అనియిట్లు శౌనక

మునీంద్రుడు ధర్మరాజుతో చెప్పెను. ఇట్లు ధర్మరాజు శౌనకునివాక్యములనువిని తనపుర్మునడుమ కూర్చుండి ధౌమ్యునకు నమస్కరించి యిట్లు పలికెను.

మహాత్మా! ధౌమ్యుడా! బ్రాహ్మణులందరును నాతోగూడ అడవికి రాదలచిరి. మీరుశ్రమపడలేరనియు, మానుకొనుడనియు నేను చెప్పినను ఆబ్రాహ్మణులు మానుకొనక మీతోవచ్చెదమనిరి. భయంకరములైన వనములయందు ఏ వుపాయముచేత యీ బ్రాహ్మణులకు ఆహారమును సంపాదింతునో తెలియుటలేదు. యీ బ్రాహ్మణులను నేను విడువలేను. ఏమిచేయుదునో చెప్పుము. అని యిట్లు ధర్మరాజు అడుగగా ధౌమ్యుడు చాలాసేపు యోచించి ధర్మరాజునకు యిట్లుచెప్పెను. ధర్మరాజా! పూర్వము సకలభూత రాసులుపుట్టి ఆకలిచేత పరితపించుచుండెను. సూర్యదేవుడు భూతముల ఆకలి బాధను పోగొట్టదలచి కృపగలవాడై ఉత్తరాయనమందు భూమియందుగల జలములను పీల్చుచుండును. దక్షిణాయనమందు పర్జన్యరూపమునుదాల్చి ఓషధులను పుట్టించును. మరియు రాత్రులయందు చంద్రకిరణామృతముచేత ఆయోషధులను తడుపుచు వృద్ధిపొందించును. యీ ప్రకారము సూర్యుడు ఓషధులను పుట్టించి వృద్ధిబొందించుచు ఆయోషధులయందు అన్నముపుట్టించి ప్రజలప్రాణములను రక్షించుచుండెను. అందుచేతనే అన్నము సూర్యమయమని చెప్పబడును. పూర్వము భీమ, వైన్య కార్తవీర్య నహుషాది రాజులందరును అన్నము సూర్యమయమనియెరిగి యోగ సమాధినిష్ఠులై సూర్యుని ప్రార్థించి అన్నమునుపొంది ఆపదలయందు ప్రజలను ఉద్ధరించిరి.

ఓ ధర్మరాజా! నీవును సూర్యుని భక్తిపూర్వకముగా ప్రార్థింపుము. సూర్యదేవుడు దేవముని సిద్ధసాధ్యగంధర్వసర్పాదులచేత

నమస్కరింప బడుచుండును. లోకమునకు ఆధారుడగును. సకలవేద స్వరూపుడగును. బ్రహ్మ విష్ణు మహేశ్వరులతో సమానుడు. సకల అంధకారములను తనకిరణములచేత పోగొట్టును. మహాకృపగల వాడు, మూడులోకములను రక్షించువాడును సహస్రకిరణవంతుడును అగును. అటువంటి సూర్యుని తలచుకొని భజియింపుము. నీకు మనోరథము సఫలమగును అని ధౌమ్యుడు ధర్మరాజుతో జెప్పి సూర్యునకుగల 108 నామములను అర్థసహితముగా ధర్మరాజునకు యిట్లని చెప్పెను.

ధౌమ్య :—ఓం

శ్లో. సూర్యోర్య మాభగస్త్వష్టా పూషార్కస్సవితారవిః
గభస్తి మానజఃకాలో మృత్యుర్ధాతా ప్రభాకరః॥
పృధివ్యాపశ్చ తేజశ్చ ఖం వాయుశ్చపరాయణం
సోమోబృహస్పతి శ్శుక్రో బుధోంగారక ఏవచ॥
ఇంద్రోవివస్వాన్ దీప్తాంశు శ్శుచిశ్శౌరి శ్శనైశ్చరః
బ్రహ్మవిష్ణుశ్చ రుద్రశ్చస్కంధో వైవరుణోయమః॥
వైద్యుతో జాఠరశ్చాగ్ని రైంధనస్తేజ సాంపతిః
ధర్మధ్వజో వేదకర్తా వేదాంగో వేదవాహనః॥
కృతంత్రేతా ద్వాపరంచ కలిస్సర్వ మలాశ్రయః
కళాకాష్ఠా మహూర్తాశ్చక్షపాయామస్తథాక్షణః॥
సంవత్సరకరోశ్వత్థః కాలచక్రో విభావసుః
పురుషశ్శాశ్వతో యోగీ వ్యక్తా వ్యక్తస్సనాతనః॥
కాలాధ్యక్షః ప్రజాధ్యక్షో విశ్వకర్మాతమోనుదః
వరుణస్సాగరోంశశ్చ జీమూతో జీవనోరిహా॥
భూతాశ్రయో భూతపతి స్సర్వలోక నమస్కృతః,
స్రష్టాసంవర్త కోవహ్ని స్సర్వస్యాది రలోలుపః॥

అనంతః కపిలో భానుః కామదః సర్వతోముఖః ।
జయోవిశాలోవరద స్సర్వధాతు నిషేచితా॥
మనస్సుపర్ణోభూతాది శ్శీఘ్రగః ప్రాణధారణః ।
ధన్వంతరి ర్ధూమకేతు రాదిదేవోదితేస్సుతః॥
ద్వాదశాత్మారవిందాక్షః పితామాతా పితామహః ।
స్వర్గద్వారం ప్రజాద్వారం మోక్షద్వారం త్రివిష్టపం॥
దేహకర్తా ప్రశాంతాత్మా విశ్వాత్మా విశ్వతోముఖః ।
చరాచరాత్మా సూక్ష్మాత్మా మైత్రేయః కరుణాన్వితః ॥
ఏతద్వైకీర్తనీయస్య సూర్యస్యామిత తేజసః।
నామాష్టశతకంచేదం ప్రోక్తమేత త్స్వయంభువా॥
సురగణ పితృయక్షసేవితం హ్యసురనిశాచర సిద్ధవందితం।
వరకనకహుతాశన ప్రభంప్రణిపతితోస్మిహితాయభాస్కరః।
సూర్యోదయేయస్సు సమాహితః । పఠేత్
సపుత్రదారాన్ ధనరత్న సంచయాన్ !
లభేత జాతిస్మరతాం నరస్సదా ।
ధృతించ మేధాంచ సవిందతే పుమాన్ ॥
ఇమం స్తవం దేవ వరస్య మానవః।
ప్రకీర్తయేచ్ఛుచిమనా స్సమాహితః
విముచ్యతే శోకదవాగ్ని సాగరా ।
ల్లభేతకామా న్మనసాయథేప్సితాన్ ॥

ఈ నామములను వర్ణోచ్చారణ విధియుక్తముగా ధౌమ్యుడు ధర్మరాజునకు ఉపదేశించి మరల యీ విధముగా పలికెను. ధర్మరాజా! పూర్వము యీ సూర్యజపధ్యానానుష్ఠాన మంత్రక్రమమును దేవేంద్రునివలన నారదుడు పొందెను. ఆ నారదుని వలన వసువనురాజు గ్రహించెను. ఆ వసురాజు వలన నేను పొందితిని. ఈ

అనుష్ఠానముచేత భక్తిపూర్వకముగా సూర్యుని ఆరాధింపుము. అని యీవిధముగా ధౌమ్యుడు ధర్మరాజునకు జెప్పెను.

## ధర్మరాజు సూర్యునారాధించి వరమునుగొనుట

ఓ జనమేజయ మహారాజా ! తనకు విహితుడైన ధౌమ్యుని వలన ధర్మరాజు యీ విధముగా ఉపదేశమును పొంది పుష్పముల చేత సూర్యుని పూజించెను. ధర్మరాజు గంగానదీ జలములయందుండి విషయములయందు యింద్రియములను పోనివ్వక గ్రహించెను. పిమ్మట వాయువు నాహారముగా జేసికొని ప్రాణాయామమును జేయుచు సూర్యనామములచేత సూర్యునిగురించి జపముచేయుచుండెను. అప్పుడు సూర్యదేవుడు ధర్మరాజునకు ప్రత్యక్షమై కరుణ గలవాడై యాతని కిట్లనెను. ధర్మరాజా! నీతపస్సునకు మెచ్చితిని. నీవు పండ్రెండు వత్సరము లరణ్యమందుదువు. ఈ పండ్రెండుసంవత్సరములు కందమూల ఫలశాకములు వంట యింటియందు పాకము గావింపబడి, ద్రౌపదిచేత అక్షయముగా భక్ష్యభోజ్య లేహ్యచోష్యములను నాలుగు విధములగు ఆహారములుగా నుండగలవు. ఆయాహారము లక్షయములై రుచివంతములగు చుండును. అని యీరీతిగా సూర్యుడు ధర్మరాజునకు వరమిచ్చి అంతర్ధానుడై వెడలెను. ఈ ప్రకారము ధర్మరాజు సూర్యునివలన వరమును పొందినపిమ్మట కంద మూల ఫలశాకములను ద్రౌపది వండగా కందమూలాదులు భక్ష్య భోజ్య లేహ్య చోష్యములగుచు అక్షయములై మహారుచి గలిగి యుండెను ఆటువంటి భోజన సమృద్ధిచేత ధర్మరాజు అనేక సహస్ర బ్రాహ్మణులను పోషించుచు తృప్తిగలిగింపుచుండెను. ఆ బ్రాహ్మణులును, ధర్మరాజాది భర్తలును భోజనముచేసిన పిమ్మట మిగిలిన విఘస అమృతాన్నమును ద్రౌపది భక్షించుచుండెను. ఈ విధముగా

కొన్నిదినముల పర్యంతము గంగాతీరమందుగల ప్రమాణమను మఱ్ఱి చెట్టుక్రింద యుండిరి. పాండవు లా బ్రాహ్మణులచేత దీవింపబడి బ్రహ్మ ఋషి సంఘములతోగూడి కామ్యకవనమునకు వెళ్ళిరి. ఒకనాడు హస్తినాపురమందు ధృతరాష్ట్రుడు విదురుని పిలిపించి యిట్లనెను. విదురుడా! నీవు శుక్రాచార్యునికంటె మిక్కిలి బుద్ధిమంతుడవు. పాండవులకును కౌరవులకును సమానుడవు. నీవు ఆలోచించిచెప్పుము. పాండవు లికను యేమిచేయుదురో చెప్పుము. వారిక నేమియు చేయ జాలరని తోచుచున్నది అని ధృతరాష్ట్రుడు పలుకగా విదురు డిట్లు సమాధానము నొసంగెను. ధృతరాష్ట్ర మహారాజా! పాండవులు దేవస్వరూపులు. ధైర్యచిత్తముగలవారు. పాండవుల యోగ్యతను నీవెరిగియున్నావు, భీమార్జునులిద్దరును లోకప్రసిద్ధమైన భుజాబల సంపన్నులును నానావిధ యుద్ధవిశేష విద్యలందు సమర్థులును అగు దురు. వారు యుద్ధమందు శత్రువులను బ్రతికిపోనివ్వరు. అధర్మ మైన జూదమాడుటవలన పాండవులకును నీకొడుకులగు కౌరవులకును విరోధము కలుగునని పూర్వమే నీకు నేను జెప్పితిని. నామాటలను నీవు వినక దుర్యోధనుని మాటలను నీవువింటివి. ఇక నైనను పాండవు లను రప్పించి వారి రాజ్యమును వారికిచ్చి ధర్మమును కీర్తిని నిలు పుము. రాజ్యమును, ధర్మార్థకామములును ధర్మమూలములగును. కనుక నీవు ధర్మమార్గ మందే వర్తింపుము. నీకొడుకగు దుర్యోధను డధర్మవంతుడు. దుర్మార్గులైన కర్ణ, శకుని, దుశ్శాసనులచేత శిక్షింప బడుచు స్నేహము గలిగియుండును. అటువంటి దుర్యోధనుని చెడు కార్యములకు నీవు సమ్మతింపకుము.

నీపెద్ద కొడుకగు దుర్యోధనుడు పుట్టిన చెడుకాలమందు అనేక దుర్నిమిత్తము లను నేను యెరింగి దుర్యోధనుని వలన కౌరవకుల మునకు కీడుకలుగునని పూర్వమే నీకు జెప్పితిని. దుర్యోధనుడు కుల

దూషకుడు. కులదూషకుని దూషించి కులమును రక్షించుట ధర్మ మగును. ధర్మరాజును సకల రాజ్యమునకు ప్రభువునిగాజేసి నీవు పుత్ర పౌత్ర మిత్ర మంత్రి బంధుజన వర్గముల నందరిని రక్షింపుము. ద్రౌపదీ భీములను ప్రార్థించుటకు సభామధ్యమునకు దుశ్శాసనుని పంపుము. ధర్మరాజు మహాతపస్సంపన్నుడు సూర్యునివంటి తేజస్సు గలవాడు నీకొడుకులగు దుర్యోధనాదులు చేసిన చెడుకార్యములును ధర్మరాజు మనస్సునందుంచడు. నీవు ధర్మరాజును పిలిపించి ఆదరిం చుము. ఈ ప్రకారము చేసితివేని నీవలన యీ కౌరవకులము పుణ్యా కీర్తులచేత ప్రకాశించును.

అని యిట్లు విదురుడు ధృతరాష్ట్రునకు జెప్పెను. ఆమాటలకు ధృతరాష్ట్రుడు మిక్కిలి కోపించుకొని యిట్లు పలికెను. విదురుడా! నా దేహమునకు పుట్టిన నా పెద్దకొడుకగు దుర్యోధనుని విడుచుటకు నేను సమ్మతింపను. కొడుకులను చంపెడి నిర్దయులు యెక్కడను కన బడలేదు. యీప్రకారము నీవును చెప్పరాదు. నాకొడుకుల అభి వృద్ధిని నీవు యెప్పుడును సహింపకుందువు. నీసహాయము నాకు అక్కర లేదు. నీవు పాండవుల దగ్గరకైనను మరియొక చోటికైనను నీకిష్ట మైన స్థలమునకు వెళ్ళుము. అని ధృతరాష్ట్రుడు విదురునితో జెప్పెను.

## విదురుడు ధృతరాష్ట్రుని విడిచి పాండవులయొద్దకుబోవుట

ఆమాటలను విదురుడువిని ఆక్షణమందే మనోవేగముతో నడచెడి రథమెక్కి కామ్యకవనమందుండెడి పాండవుల దగ్గరకు బోయెను. విదురుని రాకను దూరముగాజూచి ధర్మరాజు భీమునితో యిట్లుచెప్పెను. భీమా! దుర్యోధనుడు గాండీవము మొదలగు మన ఆయుధములను జూదమందపహరించుటకు మరచిపోయెను. శకుని మాటలనువిని గాండీవాది ఆయుధములను మనలనుండి జూదమును

నెపముచేత అపహరించుటకు ప్రయత్నించుచుండును. అందునిమిత్తమై, మరల జూదమాడుటకు మనలను పిలుచుకొనిపోవు నిమిత్తమై విదురుని పంపించి యుండవచ్చును. అట్లు గాని యెడల యీవిదురుడిక్కడి కిప్పుడు వచ్చుటకు కారణ మగుపించదు. ఇకను నేను జూదమాడను. ఈ జూదమును ఆడించుకొరకు మనలను పిలుచుకొనుటకు గాను విదురుడు వచ్చియుండునా!, యీతడు చెప్పిన ప్రకారము మనము ప్రవర్తింపవలెను. ఇప్పుడు మనము చేయతగిన దేదియో తెలియుటలేదు. అని యిట్లు భీమునితో ధర్మరాజు జెప్పుచు తమలో తాము ఆలోచించుకొను చుండిరి. ఆ సమయమున విదురుడు పాండవుల వద్దకు వచ్చెను. పాండవులు విదురునికెదురుగా వెళ్ళి వినయ ప్రియ సత్కారములచేత సంతోషింపజేసి యీతని రాకకు గలకారణమును ధర్మరాజు అడిగెను. అంత విదురుడిట్లు చెప్పెను. ధర్మరాజా! కౌరవులకును పాండవులకును హితుడవు. ఇక నేమి చేయవలసియుండునో కార్యస్థితిని జెప్పుమని ధృతరాష్ట్రుడు నన్నడిగెను. నేను రెండు పక్షముల వారికిని మేలుగలిగించు విధానమును హితమును వాక్రుచ్చితిని. "సర్వజనులకును రుచికలిగించు ఆహారము రోగపీడితునకు హితముగానట్లు" నేను చెప్పినహితము ధృతరాష్ట్రునకు రుచింపలేదు. కార్యగతులయందు గల వాస్తవ స్వరూపమును చెప్పినయెడల గొప్ప బుద్ధిగలవారామాటల నాదరింతురు. అల్పమగు భాగ్యబుద్ధి గలవారికి మంచిమాటలు విషమువలె విరసమునకు కారణములగును. అటువంటి మంచిమాటలను నేను జెప్పినందున ధృతరాష్ట్రుడు నామీద కోపముగలవాడై నన్ను దూషించి నాతో ఇట్లు చెప్పెను. విదురుడా! నీవు విపరీతమైన బుద్ధిగలవాడవు. నాదగ్గర నీవు ఉండవద్దు. పాండవుల దగ్గరకు వెళ్లుము. అని యీరీతిగా ధృతరాష్ట్రుడు నాతో జెప్పెను. అందువలన నేను మీ దగ్గరకు వచ్చితిని.

ధర్మరాజా! రూపలావణ్యవతి యగు యౌవన స్త్రీ ముసలి వాడైన శ్రోత్రియునికి లభించినను, ప్రీతిని కలిగింపనేరదు. అట్లే రాజ్యలక్ష్మి అధర్మాత్ముడైన ధృతరాష్ట్రునియందు విరక్తిగలిగి యున్నదేగాని ప్రీతిని పొందదు. ధర్మరాజా! దుర్యోధనాది కౌరవు లందరును అధర్ములు. దుర్మార్గులగు దుర్యోధనాదులకు రాజ్యలక్ష్మి స్థిరముగానుండదు. ఆ రాజ్య సంపదలన్నియు తమంతట తామేవచ్చి కామించి నిన్ను పొందగలవు. నేను చెప్పిన ప్రకారము నీవు ప్రవర్తింపవలయును. అని యీరీతిగా విదురుడు ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజందులకు సమ్మతించి నీవు చెప్పినట్లు ప్రవర్తించెద నని విదురునితో జెప్పెను. అంతట కొన్ని దినములకు పాండవుల దగ్గర విదురుడున్నాడని ధృతరాష్ట్రుడెరిగి ధైర్యములేనివాడై తన మనస్సులో యిట్లని తలంచెను. విదురుడు నాకు మనస్సువంటివాడు. నేత్రమువంటివాడు, నాదగ్గరయుండి కార్యాకార్యములను జెప్పుచుం డును. విదురుడు లేనియెడల ఒక నిమిషమైనను నేను నిర్వహింప జాలను. అని యిట్లు ధృతరాష్ట్రుడు తలచి, సంజయునకు యిట్లని చెప్పెను.

సంజయుడా! విదురుడు నాకు తమ్ముడు. శాంతచిత్తము గల వాడు. నాచిత్తవృత్తిని యెరిగినవాడు. అటువంటి విదురుడు ఇప్పుడు కామ్యక వనమందు పాండవులదగ్గర నున్నాడు. ఆవిదురుని వెంట బెట్టుకొని నాదగ్గరకు తీసికొనిరమ్ము. విదురుడు లేనియెడల నేనొక నిమిషమైనను నిలువజాలను. అని యిట్లు ధృతరాష్ట్రుడు సంజయు నితో జెప్పిపంపించెను. వెంటనే సంజయుడతిత్వరితగతిని కామ్యక వనమునకుబోయి ధర్మరాజును జూచెను. అంతట నక్కడ ననేక సహస్రముల బ్రాహ్మణులును, భీమార్జున నకుల సహదేవులను ధౌమ్యుడును, ద్రౌపదియు విదురుడునుగూడి ధర్మరాజును సేవింపు

చుండిరి. అట్లున్న ధర్మరాజును జూచి సంజయుడు పరమ సంతోషమును బొందెను. ఆధర్మరాజు వనవాసము చేయుచున్నను మూడు లోకములను రాజ్యము చేయుచున్నట్లు సంతోషమును పొందెను. ధర్మరాజునకును సంజయుడు భక్తిపూర్వకముగా నమస్కరించి యిట్లు పలికెను.

—ధర్మరాజా! మిమ్ములను, విదురుని సర్వదా ధృతరాష్ట్ర మహారాజు తలచుచుండును. మీా అనుమతిని బొంది తనతమ్ముడైన విదురుని తీసుకొని వచ్చుటకు నన్ను మహారాజు పంపించెను. అని ఈ విధముగా సంజయుడు ధర్మరాజుతో జెప్పగా నంతట ధర్మరాజు విదురునకు యిట్లు చెప్పెను. విదురుడా! సర్వజనులును ధృతరాష్ట్ర మహారాజుయొక్క ఆజ్ఞాప్రకారము ప్రవర్తింపుచున్నారు. అట్లందరు నడచునప్పుడు మనముగూడ ఆ ధృతరాష్ట్రునియం దధికభక్తి గలిగి యుండవలెను. కనుక నీవు ఆలస్యము చేయక శీఘ్రముగా మాతండ్రి యగు ధృతరాష్ట్ర మహారాజువద్దకు వెళ్ళుము. అని యిట్లు ధర్మరాజు విదురునితో జెప్పెను. సంజయుని వెంబడి విదురుడు హస్తినాపురికి వెళ్ళి ధృతరాష్ట్రుని దగ్గర ప్రవేశించి యెప్పటివలె నుండెను. ధృతరాష్ట్రుడు విదురుని అతిస్నేహముచేత కౌగిలించుకొని శిరస్సు వాసన చూచి యిట్లుపలికెను. తమ్ముడా! విదురుడా! నీవు మహాశాంతము గలవాడవు. నేను బుద్ధిహీనుడనై నిన్ను నిందించి పంపించితిని. నా అవివేకమునకు నీవు క్షమింపవలయును. అని ధృతరాష్ట్రుడు విదురునితో జెప్పెను. అప్పుడు విదురుడు వినయపూర్వకముగా భక్తితో యిట్లనెను.

ధృతరాష్ట్ర మహారాజా! నీవును, నీకొడుకగు దుర్యోధనుడును న్యాయముతప్పి మాటలాడినను న్యాయధర్మప్రకారము నేను చెప్పవలయును. అది నాకు ధర్మము. అట్లు చెప్పకుండుట అధర్మము.

యుద్ధవీరులైన పాండవులతో మీకు విరోధముండరాదు. వారిని నిగ్రహించుట న్యాయముకాదు. అని విదురుడు ధృతరాష్ట్రునితో జెప్పుచుయెప్పటివలె రాజకార్యములందు సహాయుడై ధృతరాష్ట్రుని దగ్గరనే యుండెను. ధృతరాష్ట్రునివద్ద విదురుడుండుటను దుర్యోధనుడు శంకించి కర్ణ శకుని దుశ్శాసనులారా! విదురుడు పాండవులకు ఇష్టుడు. ఆ విదురుడు మరల మా తండ్రియగు ధృతరాష్ట్రుని దగ్గరజేరి కార్య సహాయుడై యున్నాడు. ధృతరాష్ట్రుడును విదురునియందు ప్రీతికలిగి అతనితో యాలోచనలు చేయుచున్నాడు. వీరిద్దరును చేరి పాండవుల నిచ్చటకు రప్పించిన యెడల అగ్ని విషములచేత పాండవుల కపాయ ముకలిగింపవలెను. అని దుర్యోధనుడు చెప్పగా ఆమాటలను శకుని విని దుర్యోధనునితో యిట్లనెను.

దుర్యోధనా! బాల్యముచేత యిట్లు తలంచితివి. విదుర ధృతరాష్ట్రులు విపరీతబుద్ధి గలవారై పాండవులను రప్పించినను వారురారు. పాండవులు సర్వదా సత్యవ్రతులగుదురు. గనుక వారు జేసిన యొడంబడికను జరుపనిదే రారు. అని శకుని జెప్పగా కర్ణుడు దుర్యోధనునకు యిట్లు జెప్పెను. దుర్యోధనమహారాజా! మనమిప్పుడు సకల సైన్యములతో వెళ్ళి పాండవులతో యుద్ధముచేసి వారిని జంపుదము. వారినిజంపి యీ భూమిని శత్రుశూన్యముగా జేయుదము. పాండవులను జంపినయెడల నీకు వారి విషయమై కలుగు శంకలుండనేరవు. గాన నీవిప్పుడు పాండవులమీదికి యుద్ధమునకు పోవుటకు ప్రయత్నింపుము. అని యీ రీతిగా కర్ణుడు దుర్యోధనునితో జెప్పెను. దుర్మార్గుడైన దుర్యోధనుడు కర్ణుని మాటలకు సంతసించి యుద్ధసన్నద్ధుడై సమస్త సైన్యములను జేర్చుకొని బయలువెడలెను. వేదవ్యాస మునీంద్రుడు తన దివ్యదృష్టివలన యీ సమాచారము నంతయు తెలిసికొని వచ్చెను. ఆ వచ్చిన వ్యాసమునీంద్రుడు దుర్యోధనుని

పాండవులమీదికి యుద్ధమునకు బోవుట మంచిదిగాదని వారించి ధృత రాష్ట్రిన కిట్లు పలికెను ధృతరాష్ట్రా! పాండవులు రాజ్యమును వదలి అడవులకుబోయి వొంటరిగా నున్నారు. ఆ పాండవులను చంపుటకు నీకొడుకగు దుర్యోధనుడు సైన్యసహితముగా వెళ్ళదల చెను. యిది ధర్మముగాదు. పాండవులు ధైర్యసత్యవంతులు. పాండ వులు పదమూడు సంవత్సరములు అరణ్య అజ్ఞాతవాసములను జరిపి పిమ్మట వారే మీ మీదకు యుద్ధమునకు రాగలరు. పాండవులు వన మందున్నారని తలచి వారి మీదకు బోయి అవమానమును బొంది వచ్చుటకు దుర్యోధనుడు ప్రయత్నించి యున్నాడు. ఇది ధర్మము గాదని దుర్యోధనునితో జెప్పి వానిని వారింపుము. నేనును నీవును భీష్మ ద్రోణ విదురులును వుండియు, అధర్మ కార్యమును చూచుచు ఉపేక్షించి యుండరాదు. పాండవులతో విరోధమువలన మేలుకలుగ నేరదు. అని యీ విధముగా వేదవ్యాసమునీంద్రుడు ధృతరాష్ట్రి నితో జెప్పెను. ఆమాటలను ధృతరాష్ట్రిడు విని దుఃఖించి వ్యాస మునీంద్రునితో నిట్లుజెప్పెను.

తండ్రీ! వ్యాసమునీంద్రా! నాకును గాంధారికిని, భీష్మవిదుర కృపాచార్య ద్రోణులకును యిష్టములేని మాయజూదమందు దుర్యో ధనుడు ప్రవర్తించెను. దుర్మార్గుడైన దుర్యోధనులు నాకు పుత్రుడై నందున పుత్రమోహముచేత వానిని విడువలేకుంటిని. నేనేమిజేయ వలెనో తెలియుటలేదు. అని యిట్లు ధృతరాష్ట్రిడు జెప్పగా విని వేద వ్యాసమునీంద్రు డిట్లు పలికెను.

## ధృతరాష్ట్రునకు వ్యాసుడు యింద్రదసురభిసంవాదము జెప్పుట

ఓ కుమారా! ధృతరాష్ట్రిమహారాజా! సకలస్నేహములకంటె తలిదండ్రులకు పుత్రులయందు దధికస్నేహముండును. పరిపూర్ణ ధనము లున్నను పుత్రులులేనివారికి సంతోషముండదు. పూర్వము సకల

గోవులకు తల్లియగు సురభి దేవేంద్రుని దగ్గరకుబోయెను. కరుణా స్వభావముచేత యేడ్చెను. అప్పుడు దేవేంద్రుడు సురభినిజూచి ఆశ్చర్యమును బొంది యిట్లు చెప్పెను. సురభీ! నీవిట్లు దుఃఖించుటకు కారణమేమి? అందరును క్షేమముగా నున్నారుగదా! చెప్పుము అని దేవేంద్రుడు అడుగగా సురభి యిట్లుఅనెను. మహాత్మా! దేవేంద్రుడా! నీవజ్రాయుధముచేత నాకొడుకులగు యెద్దులు తప్ప తక్కిన జీవరాసులన్నియు రక్షింపబడి క్షేమముగానున్నవి. నీవు మూడు లోకములను రక్షించెడి ప్రభుడవు. నాకొడుకులగు యెద్దులను మాత్రము రక్షింపక యుపేక్షించితివి. అద యెట్లనగా నామనవిని చిత్తగింపుము. లోకమందు జనులు బలముగల యెద్దు నొకప్రక్కను, బలములేని యెద్దును మరియొకప్రక్కను కట్టి తోలుదురు. ఆ బలహీనమగు ఎద్దు మహాభారమును భరింపలేక భూమిని దున్నజాలక అధికశ్రమ జెందియుండును. అట్టి బలహీనమగు యెద్దును, కట్టియు, కొట్టియు, పొడిచియు, తిట్టియు జనులు బాధింపుచుండిరి. అందుకు నేను దుఃఖింపుచున్నాను. అని యీవిధముగా సురభి దేవేంద్రునితో చెప్పగా దేవేంద్రు డిట్లుచెప్పెను.

సురభీ! నీకు పుత్రులగు యెద్దులు, అనేకసహస్రములు గలవు. ఆ యెద్దులలో కొన్నిటికిమాత్రము దుఃఖముగలుగునేగాని అన్ని యెద్దులకును ఒకటే విధమైన దుఃఖము ఒకసారే గలుగనేరదు. గనుక అందులకు నీవు దుఃఖింపకుము అని దేవేంద్రుడు చెప్పగా సురభి యిట్లు పలికెను. దేవేంద్రా! బలహీనములైన యెద్దును నాగేటికి గట్టి తోలునప్పుడు యెద్దులు దుఃఖముగలవై దుర్బలములై యుండును. అటువంటి పుత్రుల దుఃఖమును నేను జూడజాలను అని యీరీతిగా సురభి దేవేంద్రునితో చెప్పెను. అప్పుడు దేవేంద్రుడు కరుణించి వర్షమువలన గడ్డిని వృద్ధిచేయించి బలహీనములైన యెద్దులకు బలముగలిగించెను,

ధృతరాష్ట్రా! యీ ప్రకారము యింద్రసురభి సంవాద మను యితిహాసము వేదములయందు వినబడుచున్నది. అని వేదవ్యాస మునీంద్రుడు ధృతరాష్ట్రునితో మరల నిట్లనెను. కుమారా! కాబట్టి నీకును పుత్రస్నేహము సామాన్యమైనదిగాదు. అధికముగానే యుండును. అయినను పాండవులు దీనులై వనమునకుబోయి కష్టములను బొందియున్నారు. వారియందు నీవుదయగలిగి యుండవలెను. నీవును పాండురాజును. విదురుడును. మీరు ముగ్గురును నాకును నాకు కుమారు లగుదురు. మీరు ముగ్గురును నాకు ఒక్కరూపమే యైనట్లు నీకొడుకు లైన దుర్యోధనాదులు నూరుగురును, పాండవులైదుగురును నీకు ఒకేరూపముగా నుండవలెను,

ధృతరాష్ట్రా! సత్పురుషుల సహవాసముచేత దుర్మార్గులుమంచి బుద్ధిగలవా రగుదురు. నీకుమారుడగు దుర్యోధనుడు ధర్మరాజు దగ్గరనున్నయెడల శాంతచిత్తుడై ధర్మాత్ముడగును. రాజర్షియగు ధర్మరాజుతో సహవాసము గలిగియున్న యెడల సర్వజనులకు మేలగును. గాన ధర్మరాజును సేవింపుచు కొంతకాలమువరకుండుటకు ధర్మరాజుదగ్గరకు దుర్యోధనుని పంపుము. అట్లు పంపినయెడల రెండు పక్షములవారికిని మేలుకలుగును. అని యిట్లు వ్యాసమునీంద్రుడు ధృతరాష్ట్రునితో జెప్పెను. ధృతరాష్ట్రుడంతట వ్యాసునికి నమస్కరించుచు యిట్లుఅనెను. వ్యాసమునీంద్రా! నామాటలను దుర్యోధనుడు వినడు. యీ కురుకులమును రక్షింపవలెనని మీకు బుద్ధికలిగి యున్నయెడల ఆ దుర్యోధనుని మీరే శిక్షింపుడు. అని ధృతరాష్ట్రుడు వ్యాసమునీంద్రునితో జెప్పి నమస్కరించెను. వ్యాస మునీంద్రుడు ధృతరాష్ట్రునితో యిట్లు చెప్పెను. ధృతరాష్ట్రా! యిప్పుడు త్వరలోనే మైత్రేయమహాముని వచ్చును. ఆతడు ధర్మ ప్రకారము దుర్యోధనుని స్థిరముగా శిక్షింపగలడు. అని వేద వ్యాసమునీంద్రుడు ధృతరాష్ట్రునితో జెప్పుచు అంతర్ధానుడై వెళ్ళెను.

జనమేజయమహారాజా! వేదవ్యాసమునీంద్రుడు వెళ్ళినపిమ్మట కామ్యకవనమందుండు ధర్మరాజు దగ్గరనుండి మైత్రేయ మహామునీంద్రుడు ధృతరాష్ట్రునిదగ్గరకు వచ్చెను. ఆమైత్రేయమునీంద్రుని ధృతరాష్ట్రుడు భక్తిపూర్వకముగా పూజించి తనకు మేలుగలుగునను బుద్ధిచేత విశేషముగా పూజించెను. ఇట్లు మైత్రేయ మునీంద్రుడు ధృతరాష్ట్రునిచేత పూజింపబడి సుఖముగా విశ్రమించుచుండెను. ధృతరాష్ట్రుడు రెండుచేతులను జోడించుకొని యిట్లుపలికెను.

మైత్రేయా! మహాత్మా! మునీంద్రా! ఇప్పుడు మీరుఎక్కడనుండి వచ్చితిరో సెలవిండు. అని ధృతరాష్ట్రుడు అడుగగా మైత్రేయ మునీంద్రుడు యిట్లుపలికెను. మహారాజా! కామ్యకవనమందుండు పాండవులదగ్గరనుండి నేను వచ్చితిని. పాండవులు మహాతపస్సంపన్నులై జడలుధరించి కృష్ణాజినములను వస్త్రములనుగా కప్పుకొని నారచీరలు ధరించియున్నారు. పాండవులు కూరగాయలను పండ్లను కందమూలములను ఆహారముగా భక్షించుచు కామ్యక మను మహారణ్యమందు నివసించియున్నారు. నేను ఆ పాండవుల దగ్గరనుంచి నిన్నును నీకొడుకగు దుర్యోధనుని జూచుటకొఱకు యీ హస్తినాపురికి యిప్పుడు వచ్చితిని. నేను సకల పుణ్యతీర్థములను జూచు నిమిత్తమై తిరుగుచు కురుజాంగలమను పుణ్యతీర్థమును జేరి అక్కడ కురువంశశ్రేష్ఠులగు పాండవులను జూచితిని అని మైత్రేయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు తలవంచుకొని యిట్లనెను. మహాత్మా! మైత్రేయ మునీంద్రా! ఆకురుజాంగలపుణ్యస్థలమందుండు పాండవులు కుశలముగానున్నారుగదా! పాండవులు సత్యభాషణులు. వారు మమ్ములను తలచుచుందురేమో చెప్పుడు. పాండవులు భుజాబలమున యమధర్మరాజుతో సమానులగుదురు. పాండవులు దుర్యోధనాదులయందు గల స్నేహమునకు విఘ్నముకలుగకుండునట్లు తాముంగీకరించినప్రకారము

అరణ్య అజ్ఞాతవాసములను జరుపుచుండగదా! అని ధృతరాష్ట్రుడడుగగా మైత్రేయమునీంద్రు డిట్లుపలికెను. ఓ ధృతరాష్ట్రమహారాజా! మహామునులందరు సర్వదా పాండవులదగ్గరకు వచ్చుచు ప్రీతిపూర్వకముగా పాండవులను దీవించుచుందురు. అటువంటి మహామునులు దీవించుటచేతను, వారు ధర్మబుద్ధిగలిగి యుండుటచేతను పాండవులకు కుశలము గలిగియున్నది. పాండవులు తాముచేసిన నియమమును తప్పినయెడల సూర్యచంద్రులు గతులుతప్పుదురు. పుణ్యాత్ములైన పాండవులకు నిష్కారణముగా నీకుమారుడగు దుర్యోధనుడు కీడు గలిగించెను. అని యిట్లు మైత్రేయమునీంద్రుడు ధృతరాష్ట్రునితో జెప్పి అక్కడుండెడి దుర్యోధనునితో యిట్లుచెప్పెను.

దుర్యోధనా! నీవు బుద్ధిమంతుడవైతివేని పాండవులతో విరోధమును మానుము. అట్లు మానితివేని నీకును పాండవులకును కురుకులమునకును మేలుకలుగును. నామాట వినుము. పాండవులు వజ్రదేహములు గలవారు. అమితపరాక్రమవంతులు. దేవేంద్రునివంటి తేజోవంతులు. పాండవులలో కొందరు నూరేసి యేనుగుల బలమును కూడి కలిగియున్నారు. మరికొందరు పాండవులు పదివేల యేనుగుల దేహబలమును కలిగియున్నారు. అందువలన వారందరును భయంకరమైన ఘోరయుద్ధమందపేక్షగలిగియుందురు. అధికోత్సాహవంతులై యుందురు. పాండవులైదుగురిలో భీముడుమహాబలవంతుడు. భీముడు బకాసురహిడింబాసురులను యుద్ధమున జంపెను. భీముడు పదివేల మదపుటేనుగుల బలశక్తిగల జరాసంధుని ద్వంద్వమల్లయుద్ధమందు ఒక్కడే చంపెను. భీముడు భయంకరాకారుడగు కిమ్మీరుడనురాక్షసుని ఘోరవనమందు జంపెను. ఆభీముని యెదరించి యుద్ధముచేసెడి వీరులు యీలోకమునందగుపడ నేరరు. పాండవులకు కృష్ణధృష్టద్యుమ్నులిద్దరును సంబంధసహాయులై యున్నారు. గనుక

దుర్యోధనా! ముదిమిచావులు గల మనుష్యులు పాండవులను యెదిరించి జీవింపజాలరు. నీవు పాండవులతో కలసి స్నేహముగానుండుటకు సమ్మతింపుము. అట్లుచేయుట మంచిదేయగును. అని మైత్రేయుడు దుర్యోధనునితో జెప్పెను.

## మైత్రేయుడు దుర్యోధనుని శపియించుట

మైత్రేయుని మాటలను దుర్యోధనుడాదరింపక తనకాలి బొట్టనవ్రేలిచేత నేలనువ్రాయుచు రెండుచేతులను పైకెత్తినవ్వుచుండెను. అట్టిదుర్యోధనునిజూచి మైత్రేయమునీంద్రుడు కోపించుకొని యిట్లు పలికెను. దుర్యోధనా! నీవు పాండవులకు చేసిన మహాపరాధమునుబట్టి నీకును పాండవులకును యుద్ధముజరుగును. ఆయుద్ధమందు భీముని గదదెబ్బచేత నీ రెండుతొడలును విరుగునుగాక! అనియీరీతిగా మైత్రేయమునీంద్రుడు దుర్యోధనుని శపించెను. ఆశాపమునకు భయపడి ధృతరాష్ట్రుడు మైత్రేయునితో యిట్లుపలికెను. మహాత్మా! మైత్రేయమునీంద్రా! మీరుయిచ్చినశాపమున కనుకూలము గాకుండునట్లు అనుగ్రహింపవలయును. మీరు కోపమును విడువుడు. అని ధృతరాష్ట్రుడు ప్రార్థింపగా మైత్రేయుడు కోపమువిడిచి ధృతరాష్ట్రునికిట్లు చెప్పెను.

ఓ ధృతరాష్ట్ర మహారాజా! యీ దుర్యోధనునకు సమబుద్ధి గలిగిన యెడల నాశాపఫలము తొలగిపోవును. దుర్యోధనుడు బుద్ధిహీనుడై గర్వించి యున్నయెడల నాశాపమను అగ్నిహోత్రము యొక్క ఫలితమును తప్పక యనుభవింపగలడు. అనియిట్లు మైత్రేయమునీంద్రుడు ధృతరాష్ట్రునితో జెప్పి యనుగ్రహబుద్ధినిగలిగి యుండెను. అప్పుడు ధృతరాష్ట్రుడు మైత్రేయునితో యిట్లుపలికెను. మహాత్మా! ఘోరమైన అరణ్యమందు భీముడు కిమ్మీరరాక్షసుని చంపెనని విం

టిని. ఆచంపినవిధానమెట్టువంటిదో వివరింపుము అని ధృతరాష్ట్రుడడు గగా మైత్రేయుడిట్లు చెప్పసాగెను. ఓ ధృతరాష్ట్రమహారాజా! నా మాటలు నీకొడుకగు దుర్యోధనునకు రుచింపవు. గనుక నేనుచెప్పుట వలన ప్రయోజనములేదు. పాండవసహాయులైన బ్రాహ్మణులవలన ఆవృత్తాంతమును విదురుడు చక్కగా తెలిసికొనెను. ఆ విదురుని వలన నీవు తెలిసికొనుము. అని యీరీతిగా మైత్రేయ మునీంద్రుడు ధృతరాష్ట్రునితో జెప్పి వెళ్ళెను. ధృతరాష్ట్రుడు కిమ్మీరవధ కథవినుటకై ఆసక్తుడగుచు విదురునియడుగగా విదురుడు ధృతరాష్ట్రునితో యిట్లు పలికెను.

ధృతరాష్ట్రమహారాజా! హస్తినాపురమందలి పాండవులచట నుండివెళ్ళి గంగాతీరమందు కొన్నిదినములుండి అక్కడనుండికామ్యక వనమున ప్రవేశించుటకొరకు మూడుదినములు రాత్రింబవళ్ళు నిరంతర ప్రయాణమునుజేసిరి. ఒకనాడు రాత్రికాలమందు రాక్షసులు సంచరించువేళలో పాండవులు నడచివెళ్ళుచు, ఒక రాక్షసునిజూచిరి. రాక్షసుడు రాక్షసమాయనుగలిగింపుచుండెను. రాక్షసునకు మిక్కిలి తీక్ష్ణములైన కోరలుగలిగియుండెను. ఆకోరలను, తన నోటినిదెరచి గ్రుడ్లుదెరచి ప్రకాశింపజేయుచుండెను. ఆరాక్షసుని తలవెంద్రుకలు పచ్చగానుండి దూలుచుండెను. ఆ రాక్షసుడు ఉరుమువంటి మహా ధ్వనిచేత అరచుచు సకలప్రాణులకును మహాభయమును కలిగింపు చుండెను. ఆరాక్షసుడు నడుచుచుండగా వానిపాదములు తగులుట చేత భూమికదలుచుండెను. భూమికదలుటచేత తీగలు, పొదలుకూడ కదలుచుండెను. పాండవులు అట్టిరాక్షసుని తమ యెదుట జూచిరి. పాండవులు బ్రాహ్మణసమూహముల ముందరనడచుచు కృష్ణాజినము లను కప్పుకొని పోవుచుండిరి. ఆవచ్చు పాండవులను రాక్షసుడుజూచి మార్గమునకు అడ్డుపడు పర్వతమువలె పాండవుల కడ్డమువచ్చెను.

వాని దేహము పర్వతమువలెనుండెను. అంత గొప్ప దేహమును, అధి వరకు పాండవులును బ్రాహ్మణసమూహములును జూడనందున దేహపరిమాణమునకు ఆశ్చర్యభయములు గలిగియుండిరి. అరాక్షసుని ద్రౌపదిజూచి కండ్లుమూసికొని దుశ్శాసనునిచేత లాగబడిన తల వెండ్రుకలు వెనుక వ్రేలాడుచుండగా భయపడి పాండవుల మధ్యకు వెళ్ళెను. అప్పుడు పంచపర్వతముల మధ్యనుండు నదీదేవతవలె ద్రౌపది ప్రకాశించుచుండెను. మరియు శ్రోత్రాది యింద్రియములు శబ్దస్పర్శాది విషయములను గ్రహించునట్లు పాండవులైదుగురును ద్రౌపదినిపట్టుకొని భయపడకుండునట్లు ఊరడించిరి. అప్పుడు మహాత్ముడైన ధౌమ్యుడు పాండవులు జూచుచుండగా తనతపోమహిమవలన మంత్రములచేత ఆ రాక్షసుని మాయాకార్యములను నశింపజేసెను. ఆసమయమందా భయంకరరాక్షసునిజూచి ధర్మరాజిట్లని పలికెను. అయ్యా! నీవుయెవ్వరివాడవో చెప్పుము. నీవుయెవ్వడవో చెప్పుము. యీవనమందు యెందుకున్నావో చెప్పుము అని యీరీతిగా ధర్మరాజు అడుగగా రాక్షసుడిట్లు పలికెను.

ఓ మనుష్యాధమా! నేను బకాసురుని తమ్ముడను. నాపేరు కినాశుడు. మనుష్యులు నన్ను కిమ్మీరుడందురు. యీకామ్యవనమందుండు సర్వజంతువులను భక్షించుచు, యీవనమును విడువక, సర్వకాలములయందును యిక్కడనే వుందును. నేను మాయలచేత యుద్ధముచేయుచు మనుష్యులనుచంపుచు, భక్షింపుచుందును. నేను శత్రువులచేత గెలువబడకుంటిని. నాకు సకలజనులు భయపడి యీ వనమునకుదూరముగా వెళ్లుదురు. మీరుయెవ్వరో జెప్పుడు. ఇక్కడికి యెందుకువచ్చితిరి? మిమ్ములనందరినిజంపి యిప్పుడే భక్షించెదను. అనియిట్లు కిమ్మీరరాక్షసుడు ధర్మరాజుతో జెప్పెను. ధర్మరాజురాక్షసునితో యిట్లనెను. కిమ్మీరరాక్షసుడా! నేను ధర్మరాజు నగు

దును. ఇతడు భీముడు. వాడు అర్జునుడు. వారిద్దరును నకులసహదేవులు; మేమయిదుగురము పాండవులము. మేము ఒక యేర్పాటు ప్రకారము వనవాసము చేయుటకువచ్చితిమి. అనిధర్మరాజు జెప్పగా నామాటలను కిమ్మీరుడువిని అట్టహాసముతో యిట్లుజెప్పెను.

ధర్మరాజా! భీముఁ డితడేనా! ఎంతపుణ్యముఁజేతినో యిప్పుడు యీభీముని జూచితిని. ఈ భీముని చంపవలెనని నేనుసర్వదాతలచు చుందును. నాపుణ్యమువలన, తనంతటతానే యీభీముడు నాదగ్గిరకు వచ్చెను; ఈదుర్మార్గుడైన భీముడు మాయన్నయగు బకాసురుని చంపెను. నాస్నేహితుడగు హిడింబాసురునిజంపెను. అట్లుచంపియున్న భీముని యిప్పుడుమ్రింగి అగస్త్యుడు వాతాపిని జీర్ణముజేసికొనినట్లు జీర్ణముచేసికొందును. అని యిట్లు కిమ్మీరరాక్షసుడు ధర్మరాజుతో జెప్పెను. ఆమాటలకు ధర్మరాజు కోపించుకొనెను. ఆకోపమును దెలిసికొని అర్జునుడు గాండీవమును ఎక్కుపెట్టెను. నకులసహదేవు లిద్దరును మిక్కిలితీక్ష్ణములైన కత్తి, బాణములను ధరించిరి.

## కిమ్మీరుడను రాక్షసుడు భీమునిచే జచ్చుట

ధృతరాష్ట్రమహారాజా! కిమ్మీరుడును, భీముడును మిక్కిలి కోపముగలవారై ఒకరినొకరు చంపదలచి యుద్ధమునకుతాకిరి. మహా వాయువుచేత ఉప్పొంగిన రెండుమహాసముద్రములవలె కిమ్మీర భీములిద్దరును, భయంకరకోపవంతులై ప్రకాశించుచుండిరి. కిమ్మీర భీములిద్దరును యుద్ధమునకుతలపడి అక్కడనుండెడి వృక్షములను పెరికి కొని యుద్ధముజేసిరి. ఆయుద్ధమందు ఆవృక్షములు వారియిద్దరిశిర స్సులమీద తగిలి యేనుగు శిరస్సునందుతగిలిన తామరతూండ్లవలె పగిలిపోయెను. ఈప్రకారము రెండున్నర గడియల పర్యంతము వృక్షములతో యుద్ధముజేసిరి. అంతట దగ్గరగలవృక్షములన్నియు నశిం

చెను. పిమ్మట రాళ్ళతో యుద్ధము జేయుటకు ప్రారంభించిరి. ఆశిలా యుద్ధమందు భీముడు వేసిన పెద్దశిల, గొమ్ముయందు దగిలినందున కిమ్మీరుడు బలహీనుడాయెను. కిమ్మీరుడు సూర్యునిపట్టిన రాహువు వలె భీమునిపట్టుకొనెను. అప్పుడు భీముడు వానిని బలహీనునిగా యెరిగి, తన రెండు చేతులచేత వానికటికంఠప్రదేశములను పట్టుకొని క్రిందపడ వేసెను. అప్పుడు భీముడు కిమ్మీరుని దేహమందుగల పెద్ద యెముకను విరిచి బకాసురుని చంపినట్లుచంపి వానినుద్దేశించి యిట్లు పలికెను.

ఓ కిమ్మీరరాక్షసుడా! నీకిష్టులగు బకహిడింబాసురులు యిది వరకే చచ్చిరి. నీవు వారిద్దరిని తలచుకొని దుఃఖింపుచుండునంత పుణ్యముజేయక నీవును యిప్పుడు జచ్చితివి. అని యిట్లు భీముడు జెప్పుచు కిమ్మీరుని చంపి వాని కళేబరమును దారినుండి తప్పించి పారవేసెను. మహారాజా! యీరీతిగా ధర్మరాజుయొక్క మాట ప్రకారము అనాయాసముగా భీముడు కిమ్మీరుని చంపి ఆ వనమం దుండువారికి రాక్షసభయమును పోగొట్టెను. అప్పుడు ధర్మరాజ అర్జున నకుల సహదేవులును ధౌమ్యాది బ్రాహ్మణసమూహములును భీముని పొగడిరి. అని యిట్లు భీముడు కిమ్మీరుని జంపిన కథాక్రమము నంతయు విదురుడు ధృతరాష్ట్రునితో జెప్పెను. ఆకథనంతయు దుర్యో ధనాదులు విని భయపడిరి. ఓ జనమేజయ మహారాజా! యీప్రకా రము పాండవులు కిమ్మీర రాక్షసుని జంపి కామ్యకవనమందుండిరి. పాండవులు రాజ్యమును విడిచి అడవులలోనున్నారని విని పాంచాల యాదవ భోజ అంధక కులస్థులందరును దుర్యోధనాదులను నిందించిరి. కృష్ణునితో, సకలయాదవులును, ధృష్టద్యుమ్నాది పాంచాలురును కామ్యకవనమందుండు పాండవులదగ్గరకు వచ్చిరి. అప్పుడు కృష్ణుడు కౌరవులయందు అధికకోపముగలవాడై సకలయాదవ పాంచాలురతో యిట్లు పలికెను.

ఓ యాదవ పాంచాలులారా! దుర్యోధనాది కౌరవులందరును మోసముచేసి పాండవుల కపకారము జేసిరి. మనము యుద్ధమందు పాపాత్ములైన కర్ణ శకుని దుర్యోధన దుశ్శాసనాదుల నందరిని చంపి పీనుగుపెంటలు జేయుదము. రాక్షస భూతకాక గృధ్రాదులకు తృప్తి గలిగింతము. పాపాత్ములగు దుర్యోధనాదులను జంపి సకలరాజ్యములను ధర్మరాజున కిత్తము. అని యిట్లు కృష్ణుడు యాదవ పాంచాలురతో జెప్పుచు ప్రళయకాల రుద్రునివలె కోపించుకొని, భయంకరముగా తోచుచుండెను. అర్జునుడు కృష్ణునకు కోపమునుమాన్పి శాంతచిత్తునిచేసి కృష్ణునితో యిట్లుపలికెను. మహాత్మా! కృష్ణా! నీవు సర్వలోక పూజ్యుడవగుదువు ఈశ్వరుడగుదువు. అనాది పురుషుడవగు విష్ణుదేవుడ వగుదువు. చరాచరములైన సకల భూతములును నీయందే పుట్టుచు నిలుచుచు నశించుచుండును. ఓ మహాత్మా! కృష్ణా! నీవు పూర్వము కందమూల ఫలములను భక్షించుచు గంధమాదన పర్వతమందు పదివేలసంవత్సరములు తపస్సు జేసితివి. పుష్కరమందు జలముల నాహారముగా జేసికొని పదునొకండు వేల సంవత్సరములు తపస్సు జేసితివి. ప్రభాసమనెడి పుణ్యతీర్థమందు అనేక దివ్యసంవత్సర సహస్రములు యేకపాదమందుండి ఘోర తపస్సు చేసితివి. బదరీవనమందు వాయువు భక్షించుచు రెండుచేతులను పైకెత్తి యేక పాదమందు నిలిచియుండి అనేక సహస్ర సంవత్సరములు తపస్సుజేసితివి. నీవు కృష్ణాజినమును వస్త్రములుగా ధరించి నియమముచేత కృశించిన శరీరముతో సరస్వతీ చక్రమందుండి పండ్రెండు సంవత్సరముల పర్యంతము సర్వ వ్రతములను జరిపితివి. నీవు తపస్సునకు మూలకారణ పురుషుడవగుదువు. మరియు నీవు చైత్రరథమందు శ్రేష్ఠములైన మహాయజ్ఞములను అనేకములు జేసి

తివి. ఒక్కొకయజ్ఞమునకు నూరేసి లక్షల బంగారములను దక్షిణల నిచ్చితివి. అటువంటి యజ్ఞపురుషుడవగుదువు. తపోయజ్ఞములను రెంటియందును, మహాసమృద్ధిగల తేజోవంతుడవగుదువు. అట్టి తేజోవంతుడవై సకలదైత్య రాక్షసరాజులను జంపి దేవేంద్రునకు ప్రభుత్వమును స్థాపించితివి. నీవు సర్వలోక ప్రభుడవు. పూర్వమునీవు అదితి కశ్యపులకు వామనుడవై పుట్టి త్రివిక్రమములచేత మూడులోకములను వ్యాపించిన విశ్వరూపుడవగుదువు. కృష్ణా! అటువంటి నీవు నరకాసుర శిశుపాలాది దుర్మార్గులను చంపు నిమిత్తమై యిప్పుడు భూమియందు యాదవకులమున బుట్టితివి. మరియు, అసత్యము మదము, మాత్సర్యము, క్రోధము, దుర్వికారము, మొదలగు చెడు గుణములు. నీ మనస్సునందు నిలువవు. నీవు మహాగుణవంతుడ వగుదువు. అని యిట్లు అర్జునుడు కృష్ణుని స్తుతియించి రెండు చేతులను జోడించుకొని నమస్కరించుచు వినయ పూర్వకముగా నిలిచియుండెను. కృష్ణుడంత అర్జునునిజూచి యిట్లు పలికెను.

అర్జునా! మనమిద్దరము నరనారాయణుల మను అనాది మునులము. నీవు నరుడను మునివి. నేను నారాయణుడను. మనము మహాశక్తివంతులమై పుట్టితిమి. సత్యముగానీకును నాకునుగూడ నీవు, నేననెడి భేదముండనేరదు. మనకిద్దరికి నట్టిభేదము యెన్నడును కలుగదు. మనకు భేదమును కొంచెమున్నలేదు. నేను నీవేయగుదువు. నీకు యిష్టుడగువాడు నాకును యిష్టుడేయగును. నీకు శత్రువగువాడు, నాకును శత్రువగును. ఇది నీవు సత్యముగా నమ్ముము. అనియీరీతిగా కృష్ణుడు అర్జునునితో జెప్పెను. ఈ ప్రకారము కృష్ణార్జును లిద్దరును అన్యోన్య స్నేహసంభాషణములను జేయుచుండిరి.

## ద్రౌపది శ్రీకృష్ణునితో దనపరిభవమును జెప్పి దుఃఖించుట

అనేక రాజసమూహముల మధ్యమందుండు కృష్ణుని దగ్గరకు ద్రౌపదివచ్చి రెండుచేతులను జోడించుకొని యిట్లు స్తుతించెను. మహాత్మా! కృష్ణదేవా! సృష్టికాలమందు మొట్టమొదట నీవుప్రజాపతివని అసితుడైన దేవలుడు జెప్పెను. నీవు సత్యమువలన యజ్ఞములను పుట్టించినందున నిత్యసత్యమయుడవైన యజ్ఞపురుషుడవని కశ్యపుడు జెప్పెను. నీ శిరస్సునందు స్వర్గముండుటచేతను, నీ పాదములయందు భూమియుండుటచేతను నీ నేత్రములయందు లోకములుండుటచేతను నీవు సర్వమయుడవని నారదుడు జెప్పెను. సర్వమునులును నీవు అక్షయజ్ఞాననిధివని జెప్పిరి. సకలరాజర్షులకును, యోగధనులగు బ్రహ్మర్షులకును, సాధుజనులకును, నీవేగతియగుదువు. జ్ఞానయోగు లందరును పరబ్రహ్మమగు నిన్నే పొందుదురు. నీవు దయాసముద్రుడవగుదువు. సర్వలోకశరణ్యుడవు. నీమనోవృత్తికి తెలియని విషయము లేదు. అయినను నేను పొందినఅవమానము చెప్పుకొనెదను. చిత్తగింపుము. సకలరాజులకు ప్రభువైన పాండురాజునకు నేను కోడలనైతిని. యుద్ధసమర్థులైన పాండవులకు భార్యనైతిని. భగవంతుడవగు నీకు స్నేహితురాలనైతిని. మహాశక్తివంతుడగు ధృష్టద్యుమ్నునకు చెల్లెలనైతిని. ధృతరాష్ట్రునికొడుకైన దుశ్శాసనుడు నాశిఖ పట్టుకొని సభకుయీడ్చి తెచ్చి ఆపాపాత్ముడు నేనుకట్టినవస్త్రమును పెరికి వూడ తీసెను. ఇట్లు మహాభయంకరమైన గొప్పఅవమానమును పొందితిని. అప్పుడు యితరులవలెనే పాండవులైదుగురును నన్నుజూచుచు వూరకుండిరి. భీష్ముడు మొదలగు వృద్ధజనులందరును, సభయందుండి చూచుచు పలుకకుండిరి. తమను శరణుజొచ్చినవారిని పాండవులు కృపచేత రక్షింతురు. నేను శరణనిఅరచినను యీపాండవులు నా

మాట ఆలకింపలేదు. భీమార్జునులకు యెంత భుజాబలమున్నను ప్రయోజనము లేదు. నాకు సహోదర, పుత్ర, బంధుజనులున్నను నాకు లేనివారే అయిరి. కృష్ణా ! అట్లుదుశ్శాసనుని చేత అవమానింప బడినప్పుడు కర్ణుడు నన్నుజూచి నవ్వెను. దుశ్శాసనుడు నాకు కలిగించిన అవమానముకంటె కర్ణునినవ్వు నాకు మిక్కిలి అవమానము కలిగించి నామనస్సును అగ్నివలె దహించుచున్నది. ఆ అవమాన పరితాప దుఃఖమును యింత మాత్రమని నేనుచెప్పజాలను. పూర్వము భీముడు బాల్యమందు వేదముజదువుచు బాలక్రీడయందు వినోదముగా నున్నప్పుడు గంగానదియొడ్డున నిద్రింపుచుండెను. అట్లునిద్రింపుచున్న భీముని అంటకట్టించి గంగానదీ జలమధ్యమందు దుర్యోధనుడు పడవేయించెను. దుర్యోధనుడు భీమునకు విషము పెట్టించెను. విషసర్పములను కరపించెను. కుంతీదేవితోకూడా ఆరుగురనువారణావత పురమందు లక్కయిండ్లలో ప్రవేశపెటి ఆలక్కయింండ్లనుదహించెను. యీప్రకారము దుర్యోధనుడు పాండవుల కనేకవిధములైన అపకారములుచేసి, యిప్పుడు అధర్మమైన జూదమందు ధర్మరాజు యొక్క రాజ్యమును అపహరించి రాజులమధ్యమందు పాండవులను గర్వించెను. దుర్యోధను డిట్లవమానించినను పాండవులు పరాక్రమింపక సహారకుండిరి. అటువంటి పాండవులు నా అవమానమును యెట్లుగా సహించియుందురు, అనియిట్లు ద్రౌపది కృష్ణునితో జెప్పుకొని కన్నీటిని ధారగాకార్చుచు, ఆకన్నీటిచేత స్తనములుతడియుచుండగా తనఅరచేతులచేత నేత్రములు వొత్తుకొనుచుండెను. అట్లు దుఃఖించుచున్న ద్రౌపదినిజూచి కృష్ణు డిట్లు పలికెను.

ద్రౌపదీ ! నీ మనస్సునకు కలిగిన దుఃఖాగ్నిచేతను, అర్జునుని క్రూరబాణముల దెబ్బలచేతను, ధృతరాష్ట్రుని పుత్రమిత్రాదిబలమంతయు, మృత్యువునుబొందును. ఈ మాటయే సత్యమగునుజుమీా

సముద్రములు యేడునుయింకినను, రాత్రింబగళ్ళు చలించినను, నా మాట తప్పదు. ఆ ధృతరాష్ట్రుని పుత్రమిత్రబంధుజనులు గల సైన్యమంతయు యమునిపాలగును. అని యిట్లు కృష్ణుడు ద్రౌపదితో జెప్పెను. అప్పుడు అర్జునుడు ద్రౌపదిని జూచి యిట్లుఅనెను. ద్రౌపదీ! యీ కృష్ణుడు మనకందరకును కుశలము గలిగించి పాపములను పోగొట్టును. కృష్ణుని కృప గలిగియుండగా నీవు దుఃఖించవద్దు. మన శత్రువుల నందరను నిర్మూలముగా జంపివేసెదను. మనకు కృష్ణుని కృపవలన విజయము గలిగి రాజ్యసామ్రాజ్యము లభింపగలదు. అని యీరీతిగా అర్జునుడు ద్రౌపదితో జెప్పగా ధృష్టద్యుమ్నుడు క్రోధముతో ద్రౌపదికి యిట్లనియెను.

చెల్లెలా! ద్రౌపదీ! దుర్మార్గులగు దుర్యోధన దుశ్శాసనులను యుద్ధమందు భీముడు జంపును. కర్ణుడు అర్జునునిచే జంపబడును. నేను యుద్ధమందు ద్రోణాచార్యుని జంపుదును. నీవు దుఃఖించవద్దు అని యిట్లు ధృష్టద్యుమ్నుడు ద్రౌపదితో చెప్పెను. ఇట్లు అందరును ద్రౌపదిని వూరార్చిరి. పిమ్మట కృష్ణుడు ధర్మరాజునకు యిట్లనె. ధర్మరాజా! నేను ద్వారకాపట్టణమందుండి యుయుధానునివలన నీ సమాచారమంతయు విని ఆ క్షణమందే యిక్కడికి వచ్చి ఆపదను పొందియున్న నిన్ను జూచితిని. నిన్ను జూచినవెంటనే నాకు గలిగిన దుఃఖము నశించెను. ఆసమయమందున నేను మీదగ్గర లేనందున యిట్టి దుఃఖము కలిగెను. స్త్రీలయందు కోరికయు, జూదమందభిలాషయు, వేటాడుటయందు కోరికయు, కల్లు త్రాగుటయందాసక్తియు, యీ నాలుగును దుర్వ్యసనములని చెప్పబడును. ఆ నాలుగు దుర్వ్యసనములయందు ప్రవర్తిల్లకుండ నుండవలయును. ఆ నాలుగింటిలో జూద మధర్మమునకు కారణమగును. అట్టి అధర్మమైన జూదమును మాననియెడల పాపము కలుగును,

అని యిట్లు హేతుదృష్టాంతములను జూపి కృపాచార్య ద్రోణ విదురభీష్ములను సహాయము చేసికొని ధృతరాష్ట్రునివొప్పించి జూదమాడుటను నిలుపుదును. నేను చెప్పిన మంచిమాటలను వినిన మూఢులను చీల్చి చెండాడుదును. నేను దగ్గరయున్నప్పుడు మీకు యేకష్టములును గలుగజాలవు. నేను సముద్రతీరమందు సాల్వునితో పది నెలలు యుద్ధము చేసి సాల్వుని చంపుటకు అక్కడ వుండని ఆ కారణమువలన మీరుజూదమాడు కాలమందు మీదగ్గరకు నేను రాలేదు అని యిట్లు కృష్ణుడు ధర్మరాజుతో జెప్పెను. అప్పుడు ధర్మరాజు ఆ సాల్వుని చంపిన క్రమమును తెలుపుమని కృష్ణునడిగెను. అప్పుడు కృష్ణుడు సౌంభకాఖ్యానమును సవిస్తరముగా జెప్పుటకు ప్రారంభించి ధర్మరాజుతో యిట్లు చెప్పెను.

## కృష్ణుడు ధర్మరాజునకు సౌంభకాఖ్యానము చెప్పుట

ఓ ధర్మరాజా! నీవు రాజసూయయజ్ఞమును చేసినప్పుడు నన్ను పూజించితివి. నన్ను పూజించుటకు శిశుపాలుడు సహింపక నాచేత చచ్చెనుగదా! ఆశిశుపాలుడుచచ్చిన సమాచారమును వాని తమ్ముడగు సాల్వుడువిని, నామీద అధికక్రోధముగలిగి యుండెను. సాల్వునకు సౌంభకమను పేరుగల యొకనగరముండెను. ఆ సౌంభకనగరము కామగమనముగలదై యుండును (తలచిన స్థలమునకువెళ్ళుట కామగమనమని చెప్పబడును). ఆ సాల్వుడు, తన సౌంభకనగరముతో యుద్ధసన్నద్ధుడై ద్వారకా నగరమును ముట్టడించి యిట్లు అనెను.

జనులారా! నా యన్నయగు శిశుపాలునిజంపిన దుర్మార్గుడైన కృష్ణు డెక్కడనున్నాడో తెలియలేదు. ఆకృష్ణునిజంపుటకును విజయలక్ష్మిచేత ప్రకాశించుటకును వచ్చితిని. అనియిట్లు సాల్వుడనురాక్షసుడు చెప్పుచు తనచతురంగబలములచేత ద్వారకాపట్టణమును ముట్ట

డించెను. ఆసాల్వునియొద్ద గల యేనుగులు, ద్వారకాపట్టమునకు వెలుపలనుండు ఉద్యానవనములను నిర్మూలము జేసెను. వనమునందుగల తాటివృక్షములను సాలవృక్షములను యేనుగులు పెరిచి నిర్మూలము చేసెను. ఆద్వారకాపట్టణమందు సర్వదా గడ్డియు, జలములును, ధాన్యములును సమృద్ధిగలిగియుండును. ద్వారకాపట్టణమందు ఫిరంగీలు కాల్చెడి యంత్రములును, అనేకవిధములైన యంత్రములును మిక్కిలిగా నుండెను. ద్వారకాపట్టణముచుట్టును, అసాధ్యములైన ప్రాకారములుగలవు. ద్వారకాపట్టణమందుగల గొప్పతలుపులు గోపురములుగల ద్వారములయందు అపరిమితములైన బలములుండి సర్వదారక్షింపబడుచుండును. ప్రతిద్వారమునకును నాలుగేసి గోపురములు గలిగియుండును. ద్వారకాపట్టణమందు మహాబలవంతులగువీరభటుల సైన్యములసందడి మిక్కిలి అధికముగానుండును. యుద్ధసన్నద్ధములైన అపరిమితములగు యేనుగులును గుఱ్ఱములును, రథములును, సర్వదా గలిగియుండును. మిక్కిలి ప్రకాశించెడి తీక్ష్ణబాణములును, చక్రాయుధములకుప్పలును. తోమరాయుధముల రాసులును, గండ్రగొడ్డండ్రును, పాశాంకుశములు మొదలగువానిరాసులును, సంపూర్ణముగానుండును. యుద్ధవీరులుండెడి గృహములు విశాలముగా నుండును. ఇటువంటి విశేషముగల ద్వారకాపట్టణమును భేదించుటకు సాధ్యముగాక సాల్వరాక్షసుడు ద్వారకాపట్టణమునకు వెలుపలదిగియుండెను. చలివేంద్రపందిళ్ళును, యజ్ఞశాలలును, దేవాలయములును, పుట్టలును లేసి సమప్రదేశమందు దట్టముగా శిబిరముకట్టుకొనియుండి ప్రతినిత్యము ఆసాల్వరాక్షసుడు ద్వారకయందుండు జనులకు ఉపద్రవము జేయుచుండెను. ధర్మరాజా! ఆసమయమున నేను మీదగ్గర యింద్రప్రస్థపట్టణమందే యుంటిని. ఈరీతిగా సాల్వరాక్షసుడు తనసౌంభకనగర విజృంభణముచేత ఉపద్రవము జేయుచుండగా, అది

సహింపజాలక, ప్రద్యుమ్న, చారుదేష్ణ సాంబుడు మొదలగు యాదవ కుమారులు, చతురంగబలములను తీసికొని యుద్ధసన్నద్ధులై, ద్వారక లోనుంచి వెలుపలికివచ్చిరి. అప్పుడు మహాబలవంతుడగు సాంబుడు సాల్వుని సేనాపతియగు క్షేమమూర్తియనువానిని యెదిరించియుద్ధము చేసెను. సాంబునియొక్క క్రూరబాణసమూహములకు క్షేమమూర్తి భయపడక ఒకలక్షబాణములను సాంబునిమీద గుప్పెను. క్షేమమూర్తియొక్క నేర్పును సాంబుడు సహింపలేక బంగారుపిడుగులుగల క్రూరబాణములను వేసెను.

ఆ బాణములు క్షేమమూర్తి రథమునకు గట్టిన గుర్రములకు తగిలి మర్మస్థానములు ఛేదింపబడెను. ఆ దెబ్బలబాధలు ఆ గుర్రములు సహింపజాలక అతివేగముగా రథము యీడ్చుకొనియుద్ధభూమి వెలుపలికి పారిపోయెను. ఆ గుర్రములు సారథికి వశ్యములుగాక పోయెను. ఇట్లు సాల్వునిసేనాపతియగు క్షేమమూర్తియుద్ధభూమినుండి తొలగిపోయెను. సాల్వుని యుద్ధభటుడగు వేగవంతుడనువాడు అతి వేగముగా బాణములనువిడుచుచు, సాంబునిమీదికి యుద్ధమునకు వచ్చెను. అప్పుడు చారుదేష్ణుడు కోపించుకొని, సాంబునితొలగుమని చెప్పుచు, గదాయుధముచేత వేగవంతుని శిరస్సును పగులగొట్టెను. వజ్రాయుధముచేతపడిన పర్వతమువలె ఆగదదెబ్బచేత వేగవంతుడు చచ్చి క్రిందపడెను. అప్పుడు సాల్వుని రథికుడగు చింత్యుడనువాడు చారుదేష్ణునిమీాద మిక్కిలితీక్ష్ణబాణములను ప్రయోగించెను. చారుదేష్ణుడు ధనుస్సును దీసుకొని మంత్రపూర్వకముగా ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను. ఆ ఆగ్నేయాస్త్రము జాజ్వల్యమానముగా పోయి విచింత్యుని రొమ్మును ఛేదించి దహించి చంపెను. ఆవిచింత్యుడు చచ్చుటకు సాల్వుని సేనయంతయు సంక్షోభించెను. సాల్వరాక్షసుడు తనసైన్యమునకుగల సంక్షోభమునుమాన్పి యుద్ధసన్న

ద్ధమైన రథమెక్కి యాదవసైన్యముమీద బాణసమూహములను గుప్పెను. ఆబాణసమూహములచేత యదుసైన్యములో ప్రతిబలము బాణములమయమైయుండెను. అప్పుడు ప్రద్యుమ్నుడు యుద్ధసన్నద్ధమైనరథమెక్కి సాల్వుని మీదికి వచ్చెను. ఆ ప్రద్యుమ్నునిరథమునకు హంసవర్ణములుగల తెల్లనిగుఱ్ఱములు పూన్పబడియుండెను. అతని రథమునకు బంగారుకఱ్ఱమీద మకరధ్వజముకలిగి ప్రకాశింపుచుండెను. నారిదెబ్బతగులకుండునట్లుగా చేతికి ఉడుముతోలుకట్టుకొనియుండెను. యీ ప్రకారము ప్రద్యుమ్నుడు యుద్ధసన్నద్ధుడై సాల్వరాక్షసునియెదిరించి వానిమీద అపరిమితమైన బాణవర్షము కురిసెను. సాల్వుడును ప్రద్యుమ్నునిమీద తీవ్రబాణములను గుప్పెను. అంతట ధనుర్విద్యాపండితులగు ప్రద్యుమ్నులుసాల్వరకు యిద్దరికిని మహాఘోర యుద్ధము జరిగెను. ఆఘోరయుద్ధమునుజూచి ద్వారకయందలి జనులందరును సౌంభకనగరమందలి జనులును మిక్కిలిభయపడి తల్లడిల్లుచుండిరి. కొంతసేపటికి ప్రద్యుమ్నునియొక్క తీక్ష్ణబాణముల దెబ్బకు సాల్వుడుమూర్ఛిల్లి తనరథముమీదపడెను. ధర్మరాజా! అంతటసాల్వరాక్షసుడు మూర్ఛతెలిసికొని లేచి యమధర్మరాజువలె మండిపడుచు యమదండము వంటి క్రూరబాణములను ప్రద్యుమ్నునిమీద వేసెను. ఆబాణములదెబ్బకు ప్రద్యుమ్నుడు మూర్ఛిల్లెను. వెంటనే ప్రద్యుమ్నుని సారథియగు దారుకుని కొడుకు రథమును తొలగించి శీఘ్రముగా తోలుకొనిపోయెను. అట్లు ప్రద్యుమ్నుని రథము తోలుకొనిపోయి యుద్ధభూమి కతిదూరమందు నిలిపెను. అంతట ప్రద్యుమ్నుడు మూర్ఛదెలిసికొని సారథితో యిట్లనెను.

దారుకుని పుత్రుడా! సారథీ! భయంకరమైన యుద్ధభూమిని తప్పించి బహుదూరమునకు నన్ను తెచ్చితివి. ఇట్లు తెచ్చుట నీకు తగదు. ఆ భయంకరయుద్ధమునకును, సాల్వునకును, నీవు భయపడితి

వేమో చెప్పుము. యాదవవంశమందు పుట్టినవారు. యుద్ధమందు వెనుకతీయరు. యుద్ధము చేయలేనివారిని చంపరు. శరణు జొచ్చిన వారిని రక్షింపకమానరు. యీ విషయములు మూడును యాదవ వంశమందు బుట్టినవారికి సహజగుణములై యున్నవి. ఆ మూడు విషయములను విపరీతముగా స్వప్నమందైనను యాదవులు తలంచరు. నేను పరాక్రమమును విడిపించి యుద్ధమందు వెనుకతీసితినని వినిన యెడల బలరాముడును కృష్ణునికొడుకులగు నా తమ్ములును, అక్రూరాదులును, సభయందు నన్ను జూచి నవ్వుదురు. చెడ్డకార్యమును జేసితివి. ఇకనైనను, సాంబచారుదేష్ణు లున్నచోటికి సాల్వునకు యెదురుగా రథముతోలుము అని యిట్లు ప్రద్యుమ్నుడు తనసారథిని నిందించి పలుకగా సారథి యిట్లు పలికెను.

ప్రద్యుమ్నా! రథికునకు కష్టము కలిగినప్పుడు సారథి ధైర్యము గలవాడై తన రథికుని రక్షింపవలయును. ఆ రథికుడును ఆ ప్రకారముగానే సారథిని రక్షింపవలయును. రథికసారథు లిద్దరును ఒకరి నొకరు రక్షింపుచుండవలయును. సాల్వుని బాణముల దెబ్బలచేత నీవు మూర్ఛిల్లినందున నీ రథమును యిక్కడికి తోలుకొనివచ్చితిని. యీ తప్పిదమును నీవు సహింపవలయును. మన రథమును గుర్రములను యెట్లు నడపించెదనో చూడుము. అని యిట్లు దారుకునికొడుకగు సారథి ప్రద్యుమ్నునితో జెప్పుచు, సవ్య, అపసవ్య, చిత్రమండల గతులచేత, గుర్రములను నడిపించెను. అట్లు నడిపించి ఆక్షణమందే సాల్వునకు అప్రదక్షిణముగా రథమును మరలగెత్తించెను. అప్పుడు సాల్వుడు ప్రద్యుమ్నునియొక్క సారథి సామర్థ్యమును సహింపలేక ఆ సారథిమీద మూడుబాణములను వేసి రాక్షసమాయచేత అనేక బాణములను ప్రద్యుమ్నునిమీద వేసెను. ఆ సమయమందు ప్రద్యుమ్నుడు ఆ మాయాబాణముల నన్నింటిని నశింపజేసి భయంకర

ముగా సాల్వుని ముఖవక్షస్థలములయందు బ్రహ్మాస్త్రమును ప్రయో గించెను. ఆ బ్రహ్మాస్త్రముచేత సాల్వరాక్షసుడు బాధింపబడి మూర్ఛనుపొంది రథముమీాద పడెను. అప్పుడు ప్రద్యుమ్నుడు మరియొక దివ్యబాణముచేత సాల్వుని చంపదలచెను. ఆ సమయము నందు ఆకాశమునందు హాహాయను ధ్వనులు గలిగెను. అంతట దేవ గణములచేత ప్రేరేపింపబడిన నారదమారుతు లిద్దరును ప్రద్యుమ్నుని దగ్గరకు వచ్చి యిట్లు చెప్పిరి. ప్రద్యుమ్నా! యీా సాల్వరాక్షసుడు నీచేత చావడు గనుక నీవు వీనిమీాద బాణము వేయక యూరకుండుము. నీ దండ్రియగు కృష్ణుడు యీాసాల్వుని జంపునని పూర్వము బ్రహ్మ దేవుడు చెప్పెను. అని యిట్లు నారదమారుతు లిద్దరు చెప్పగా వారి మాటప్రకారము ప్రద్యుమ్నుడు బాణము వేయక యూరకుండెను.

## సాల్వుడు ప్రద్యుమ్నునిచే బాధితుడై మరలిపోవుట

అని యీారీతిగా కృష్ణుడు ధర్మరాజుతో జెప్పి మరియు నిట్ల నెను. ధర్మజా! సాల్వుడు మూర్ఛ తెలిసికొని ద్వారకాపట్టణ మును ముట్టడించుట మానుకొని సౌంభకనగర మెక్కి మరలి పోయెను. ధర్మరాజా! అంతట నీ రాజసూయ యజ్ఞము పూర్తి యైన పిమ్మట నేను నీ యనుమతినిబొంది ద్వారకాపట్టణమునకు వెళ్ళితిని. అప్పుడు సాల్వుని బలములచేత ద్వారకకు వెలుపలనుండు ఉద్యానవన వృక్షములన్నియు విరిగిపడియుండెను ద్వారకాప్రదే శములన్నియు విరిగి చెడిపోయెను. వేదాధ్యయనము జేయు బ్రాహ్మ ణులు గృహములును, అగ్నిహోత్రశాలలును, నిశ్శబ్దముగానుండెను. ద్వారకయందుండు స్త్రీలును భయముచేత భూషణములను ధరించ కుండిరి. అటువంటి ద్వారకాపట్టణమును నేను చూచితిని. ఆహుకుని కొడుకువలన సాల్వునియుద్ధ వృత్తాంతమునంతయు వింటిని. అట్లు

విని ఆ సాల్వునిచంపక యీ ద్వారకయందు ప్రవేశింపరాదని నిశ్చ యించితిని. అట్లు నిశ్చయించి బలరామాదులతో యిట్లంటిని.

బలరామాదులారా! మీరుయేమరక, జాగ్రతగలిగి యీ ద్వారకా పట్టణమును రక్షించుకొని మీరు యీ ద్వారకయందే యుండుడు. నేనువెళ్ళి సాళ్వరాక్షసుని జంపి పిమ్మట యీద్వార కలో ప్రవేశించెదను. అని యిట్లుబలరామాదులతో జెప్పిఆద్వారకయం దునిలిపితిని. అప్పుడే ప్రయాణభేరిని మ్రోయించుటకు నియమించితిని. నన్ను దీవించుటకు వచ్చిన పురోహిత బ్రాహ్మణులకు నమస్కరిం చితిని. అప్పుడే శైబ్య సుగ్రీవములను గుర్రములను పూన్చియున్న రథమెక్కితిని. నాపాంచజన్య శంఖధ్వనియు, పంచమహావాద్యముల ధ్వనులును దిక్కులకు చెవుడుగలుగునట్లుగా మ్రోగెను.

మరియు అప్పుడు జనులందరును, నన్ను దీవించెడి ధ్వనులు మిక్కిలి అధికముగా నుండెను. నాగరుడధ్వజము మనోహరముగా ఆకాశమందు ప్రకాశించుచుండెను. యీ ప్రకారముగా నేను అపరి మితములైన చతురంగ బలములను తీసికొనివెళ్ళి అనేక పర్వతవన నదీ సరస్సులను దాటి మార్తికావత దేశమునకు వెళ్ళితిని. నేను వెళ్ళుటకు మునుపే సాల్వుడు తన సౌంభకనగరమందెక్కి సముద్ర కుక్షి ప్రదేశమునకు బోయెను.

ధర్మరాజా! నేనును ఆసాల్వుని వెనుక నేవెళ్ళి సాల్వునిసైన్య ముతో యుద్ధము జేసితిని. సాల్వునిసైన్యముమీద నానావిధ బాణ వర్షమును కురిపించితిని. సాల్వుని వీరులును అనేక బాణసమూహము లచేత నన్నును నాసారథియగు దారుకుని గుర్రములను కెక్కుమును మునుగునట్లు కప్పిరి. అప్పుడు నేనును అనేక బాణసహస్ర పరంపరలను ప్రయోగించి ఆ బాణముల నన్నిటిని తొలగించి సాల్వుని సైన్య ముతో మహాయుద్ధము జేసితిని. ధర్మరాజా! ఆ యుద్ధమందు నాశార్ఙ

ధనస్సువలన నాచేత వేయబడిన క్రూర తీక్ష్ణబాణ శతములచేత ఆ సాల్వుని రాక్షససేనయందుగల దైత్య రాక్షసుల దేహసమూహములు చచ్చి సముద్రకుక్షిలో బడెను. ఆపడిన రాక్షసుల దేహములు కొండలుగా నుండెను. ఆ దైత్యరాక్షసుల మహాదేహసమూహములన్నియు సముద్రములో బడగా ప్రళయకాలమందు చలించి మ్రోగినట్లు సముద్రమందు మహాధ్వని కలిగెను. ఆసముద్ర ధ్వనికంటె నా చతురంగబల ధ్వనులు అధికముగానుండెను. అప్పుడు ఆభటులు సింహానాదములు అధికముగా జేయుచుండిరి. నాగుఱ్ఱములు సకిలింపుచుండెను. నా యేనుగులు అధికముగా ఘీంకరించుచున్నవి. యీ రీతిగా నాసైన్యము లధికోత్సాహవంతములుగా నుండెను. ఆసాల్వుని సైన్యములు దైన్యమును బొంది క్షీణింపసాగెను. ఆ విషయమును సాల్వుడుచూచి సహింప జాలక మరల తన సౌంభకనగరమునెక్కి నాతో మాయాయుద్ధము జేయుటకు ప్రయత్నించి వచ్చెను.

అప్పుడు సాల్వుడు గంద్ర గొడ్డండ్రను. పాశములను, కత్తులను శూలాయుధములను, ముద్గరాయుధములను, నామీద మాయ చేత కురిపించెను. అప్పుడు నేనును బాణములను ప్రయోగించి మాయచేత ఆ సాల్వుని మాయ నశింప జేసితిని. సాల్వుడు నామీద క్రూరమైన శిలావర్షము కురిపించెను. సాల్వుడు అంధకారమును గలిగించి దుర్దినముగా జేసెను. అందుచేత చల్లదనము గలిగియుండెను. సాల్వుడు తన మాయచేత ప్రకాశము కలిగించి సుదినముగా జేయుచు ఉష్ణమును గలిగించెను. స్వాలుడు నూరు సూర్యులను నూర్గురు చంద్రులను లక్ష విష్ణురూపములును ఆకాశమనందు గలిగించి ప్రకాశింప జేసెను. అప్పుడు నేను. పగటి కాలమనియు, రాత్రికాలమనియు మెఱుగక పోతిని. ధర్మరాజా! నేను సర్వమాయలను పోగొట్టు ఆగ్నేయాస్త్రమును ప్రయోగించి సకల మాయలను

పోగొట్టితిని. ధర్మరాజా ! ఆ సమయమందు ద్వారకాపట్టణమునుండి ఆహుకుడు పంపగా ఒకడు మిక్కిలి త్వరితముగా వచ్చి నాతో యిట్లు పలికెను.

కృష్ణా ! ద్వారకా పట్టణమందు సాల్వునిచేత నీ తండ్రియగు వసుదేవుడు పట్టుబడెను. ఇక్కడనీవు యెవ్వరితో యుద్ధముచేయు చుంటివో తెలియలేదు, నీవు శీఘ్రముగా మరలి ద్వారకకు వచ్చి నీ పట్టణమును రక్షించుకొనుము. అని యిట్లు వచ్చిన ఆ మనుష్యుడు నాతో జెప్పెను. ఆ మాటనువిని నేను అదరిపడి యిట్లనితలంచితిని. మహాపరాక్రమ వంతులగు బలరామాదు లుండగా వసుదేవుడు సాల్వునిచేత పట్టుబడడు. గనుక యీ మాట అసత్యమగును. అని యిట్లు నేను తలంచి సంశయించుచు ఆశ్చర్యమును బొంది యుంటిని. అంతట కొంచెము సేపటికి, సాల్వుని సౌంభకనగరమందు వసుదేవుడు దూరముగా నాకు కనబడెను. పుణ్య కర్మ ఫలము వశించిన పిమ్మట భూమికివచ్చెడి యయాతిరాజువలె వసుదేవుడుండెను. వసుదేవుడు భూషణకాంతులచేత హీనుడై, వికారములైన వెంట్రుకలు కలిగి వికారమగు వస్త్రమును ధరించియుండెను. వసుదేవుడు సౌంభకమందుండి పాపాత్ముడైన సాల్వునిచేత బాధింపబడు చుండెను. అటువంటి వసుదేవుడు సౌంభకమందు నాకు కనబడెను. అప్పుడు నేను మిక్కిలి మోహము దుఃఖము గలవాడనైతిని. చేతిలోనుండు నా శార్ఙ్గధనుస్సు జారిపడెను. అప్పుడు నేను దేహమును మరచి మోహదుఃఖములచేత రథముమీద పడితిని. అట్లుపడిన నన్ను జూచి నా సైన్యమంతయు తల్లడిల్లి దుఃఖించెను.

చాలాసేపునకు నేను తెలివితెచ్చుకొని సాల్వుని సౌంభక నగరమందు జూడగా దానియందు వసుదేవుడు కనబడలేదు. ఆ సమాచారమంతయు సాల్వుని మాయయని అప్పుడు నేను యెరిగితిని.

అటుపిమ్మట మాయావంతుడైన సాల్వునిజూచి వానిమీద నేను కోపించుకొని బాణములు వేసితిని. అప్పుడు సాల్వరాక్షసుని సౌంభక నగరము అదృశ్యమాయెను. సాల్వుని సైనికులగు రాక్షసులందరును నన్ను పెద్దగా తిట్టుచుండిరి. ఆ తిట్టుల ధ్వనులు పదిదిక్కులయందును అధికముగా వ్యాపించెను. అంతట నేనును క్రూరబాణసమూహము లను ప్రయోగించి రాక్షసుల నందరను చంపితిని. సాల్వుడంతట తన సౌంభకనగరమును ప్రాగ్జ్యోతిషనగరమునుగా జేసి తానును మను ష్యుడై నామీద పర్వతవర్షమును కురిపించెను. కఠినములైన శిలలు గల పర్వతసమూహములు మీదికి వచ్చెను. ఆ సమయమందు నేను వజ్రబాణములను ప్రయోగించి ఆ పర్వతముల నన్నిటిని నరికివేసి నశింపజేసితిని. అట్టిసమయమందు నా సారధి యగు దారుకుడు నన్ను జూచి యిట్లుపలికెను

మహాత్మా! కృష్ణా! యీసాల్వుడు మహావీరుడు. వీనినిజం పక ఉపేక్షింపరాదు. మహాపరాక్రమవంతులగు నీవంటివారు యీ సాల్వునివంటి మాయావంతులను వుపేక్షింపరు. సాధారణమనుష్యునై నను యుద్ధమందు మహాపరాక్రమవంతులు చంపుదురు. గనుక యీ మహావీరుడగు సాల్వుని జంపివేయుము. అని యిట్లు సారధియగు దారు కుడు నాతో జెప్పెను. ఆమాటలను నేనువిని కోపించుకొని నాదివ్య చక్రాయుధమును తీసికొంటిని. చక్రాయుధము అగ్నిజ్వాలలనుగ్రక్కు చుండెను. నాశత్రువులగు రాక్షసయక్షగంధర్వదైత్య దానవులను భస్మము జేయునదియగును. అటువంటి నాదివ్య చక్రాయుధమును అభిమంత్రించి సాల్వుని సౌంభక నగరమందు ప్రయోగించితిని. అం తట చక్రాయుధము ప్రళయకాలమందు పరివేషముతో గూడినసూర్య మండలమువలె ప్రకాశించుచు ఆకాశమందు వ్యాపించి ఆసౌంభక నగరమధ్యమందుపడెను. పూర్వము రుద్రుని బాణాగ్నిచేత త్రిపుర

ములు దహింపబడి క్రిందబడినట్లు నాచక్రాయుధాగ్నిచేత సౌంబక నగరము దహింపబడి క్రిందబడెను. అంతట నాసాల్వుడును నాచక్రాయుధముచేత రెండుతునకలై క్రిందబడెను.

## పాండవులు ద్వైతవనమునకు వచ్చియుండుట

అనియీరీతిగా కృష్ణుడు తనచేత సాల్వుడు చచ్చినక్రమమంతయు ధర్మరాజునకు జెప్పెను. కృష్ణుడు పాండవుల అనుమతినిబొంది సుభద్ర అభిమన్యులను బంగారురథముమీదయెక్కించుకొని ద్వారకాపట్టణమునకు వెళ్ళెను. అప్పుడు ధృష్టద్యుమ్నుడును ద్రౌపదీపుత్రులను అయిదుగురిని తీసికొని ద్రుపదునిపట్టణమగు కాంపిల్యనగరమునకువెళ్లెను. అంతట పాండవులును రథములనెక్కి ఆయుధములను ధరించి యింద్రసేనాది మూలభృత్యులు యిరువదిమంది ముందు నడచుచుండగా అనేక బ్రాహ్మణసహస్రములతో ద్వైతవనమునకు పోయిరి. అంతట ధర్మరాజు తనతమ్ములనుజూచి యిట్లుఅనెను.

భీమాదులారా! ఇది మహాభయంకరమైనఅడవి. సింహములును శరభమృగములును, సర్పములును. పెద్దపులులును, మదపుటేనుగులును, యీద్వైతవనమందు విశేషముగాగలిగియున్నవి. ఈ ద్వైతవనములో మనముయేమరక జాగ్రత్తగా ప్రవర్తింపవలయును. శత్రువులనేకములగు మాయాకార్యములను ప్రయోగింతురు. ఆవిషయమును మనస్సునందుంచుకొని జాగ్రత్తగలిగి యుండవలయును అనిధర్మరాజు భీమాదులగు తనతమ్ములతోజెప్పెను. అప్పుడు ధర్మరాజుతోభీము డిట్లనెను. అన్నా! ధర్మరాజా! నారదవ్యాసాదిమునులందరును బ్రహ్మవేత్తలగు బ్రహ్మర్షులగుదురు. నారదవ్యాసాదిమునులుసర్వలోకగృహములకును నిరాటంకముగా ప్రవేశించుచుందురు. ఆనారదవ్యాసమునుల నందరిని నీవు వుపాసించుచుందువు. ఆమునులంద

రును నీ కుశలమునే కోరుచుందురు. నీ ప్రతాపమువలన అందరును రక్షింపబడుదురు. యీ ద్వైతవనమందునను సకలకాలముల యందును పుష్పఫలములు గలిగియుండును. యీవనమందుగల వృక్షముల కొమ్మలకొనలయందు నెమళ్ళును, కోకిలలును, యెక్కియుండి మధురముగా కూయుచున్నవి. ఈ వనమందుగల సరస్సులయందు కొంగలును, బలాహకములును, చక్రవాకపక్షులును, కన్నెలేడిపిట్టలును, సారసపక్షులును, తుమ్మెదలును, వీనిగుంపులు అనేకములు గలిగియున్నవి. యీవనమందుగల నదులలో నిర్మలములైన జలప్రవాహములు గలిగియున్నవి. ఈ ద్వైతవనమందు మహర్షుల సమూహములున్నారు. గనుక మనము యీ ద్వైతవనమందుందము అని యిట్లు అర్జునుడు ధర్మరాజుతో జెప్పెను. అంతట మనోహరమైన తీగలగుంపులుగల అయిదువృక్షముల మూలములను ప్రత్యేకముగా పాండవులు నివాసముగా జేసికొనిరి.

ఈ రీతిగా పాండవులు ప్రత్యేకముగా నొక్కొక్క వృక్షమూలమందు నివసించియుండి తమకు యిష్టదేవ పితృదేవకార్యములను జేయుచు తమనుజూడవచ్చిన నుహామునులకును. బ్రాహ్మణులకును మనోహరములైన ఆహారములను బెట్టుచు, తృప్తిగలిగింపుచుండిరి. ఇట్లుపాండావులు ద్వైతవనమందునివసించియుండగ మార్కండేయమహామునీంద్రుడు తనశిష్యగణముతో పాండవులదగ్గరకువచ్చెను. పాండవులు సంతోషముగా మార్కండేయమునీంద్రుని పూజించిరి. వనవాసదుఃఖమును అనుభవించెడి పాండవ ద్రౌపదులను జూచి మార్కండేయు డిట్లు పలికెను.

పాండవులారా! పూర్వము శ్రీరాముడు తనతండ్రియగు దశరథుని ఆజ్ఞలను పాటించి రాజ్యమునువిడచి లక్ష్మణసీతలను వెంట బెట్టుకొని వనమునకు వెళ్ళియుండెను. అట్లు వనమందున్న శ్రీరాముని

నేనుజూచితిని. ఇప్పుడు వనవాసముజేసెడి ధర్మరాజును జూచితిని. ఈ ధర్మరాజు బ్రాహ్మణవంశములను పోషింపుచు సత్యధర్మవంతుడై, మహాకీర్తివంతుడై, శాంతవంతుడై యున్నాడు. పూర్వము సగర భరత, నల, యయాతి, వైన్యులు మొదలగు రాజులందరును. అధిక ధర్మ సత్యములచేత సకలలోక భోగములనుపొంది మహాదైశ్వర్య వంతులైరి. ఆ పాపాత్ముడైన దుర్యోధనుడు, పాపాత్ముడగు శకుని యొక్క దుర్బోధవలన, ధర్మముదప్పి మీకు అపకారముజేసెను. ఈ దుర్యోధనునివలె ధర్మముదప్పినవాసని, యిదివరకు రాజులలో యెవ్వ రిని నేను చూడలేదు. మీరు సర్వదా ధర్మవంతులు, సత్యవ్రతులు. గాన మీకు యిష్టసిద్ధియగును. అని యిట్లు మార్కండేయ మునీం ద్రుడు పాండవులతో జెప్పి వెళ్ళెను. అప్పుడు ధర్మరాజు సాయంకాల సంధ్యావందనము చేయుచుండెను. అప్పుడనేక బ్రాహ్మణులగ్నిహో త్రములనుజేసి సాయంకాలహోమములను జేయుటకు సిద్ధపడిరి. అట్టి ధర్మరాజు బ్రాహ్మణ సహస్ర అగ్నిహోత్రములను బకదాల్భ్యుడను మహామునిజూచి యిట్లు పలికెను.

పాండవులారా! బ్రాహ్మణసమూహములందరును, మీకు సర్వదా పుణ్యములను గలిగింపుచుందురు. బ్రాహ్మణులందరును ఋగ్వేద యజుర్వేద సామవేదములను సర్వదా అభ్యసింపుచున్నారు. పరమశాంతులై సర్వదా మీకు శుభములుగలిగింపుచుందురు. అందు చేత యీ అరణ్యవాసము సద్గుణరాశిగా దోచుచున్నదేగాని అరణ్యవాసముగా దోచలేదు. బ్రాహ్మణుల అనుగ్రహమువలన పూర్వము బలిచక్రవర్తి మొదలగువారందరును, అనేకకాలములు అక్షయ లక్ష్మివిభవముగలవారై సకల భూచక్రమును పరిపాలించిరి. వాయుసహాయుడైన అగ్నిహోత్రుడు అరణ్యమును దహించినట్లు బ్రాహ్మణసహాయుడైన రాజు శత్రువర్గములను నిశ్శేషముగా జంపి

వేయును. రాజగువాడు ధర్మాత్ముడై బ్రాహ్మణులచేత శిక్షింపబడు చున్నయెడల, అట్టిరాజునకు ధర్మార్థకామమోక్షములు నాల్గునుకలుగును. బ్రాహ్మణుడు దగ్గరలేక అధర్మవంతుడైన జనులునిందింతురు. ప్రజానురాగములేని రాజునకు రాజ్యముస్థిరముగానుండదు. మీరు బ్రాహ్మణప్రియులు. నిత్యధర్మ సత్యవంతులు. సర్వదామీకుశుభము గలుగుచుండును. అనియిట్లు బకదాల్భ్య మహామునీంద్రుడు పాండవులతో జెప్పెను. అప్పుడు పాండవులదగ్గరయుండెడి మునులందరును, ఆమునీంద్రునిపూజించిరి. అంతట పాండవులు తమయిష్టప్రకారముండి దుఃఖములు నశించుకథలను జెప్పుకొనుచుండిరి.

## గయోపాఖ్యానము

ఒకనాడు శ్రీకృష్ణుడు ద్వారకాపురమునుండి బయలుదేరి మంత్రి సామంతాదులు, సత్యభామాది కాంతామణులు, బలరామ సాత్యకి ప్రముఖులు, పురోహితులు, సేనానాయకులు వెంబడింప బృందావన విహారమునకు వెడలెను. వనవిహారము సల్పిన పిదప యమునానదీ తోయములందు జలక్రీడలనాడ నిశ్చయించిరి. అట్లు శ్రీకృష్ణుడు జలకేళిసల్పి లోకబాంధవునికి అర్ఘ్యప్రదాన మాచరించుచుండుదుకు సూర్యుని మనంబున తలచి, దోసిట జలమును వదలునంత గయుడను గంధర్వవల్లభుడు గగనమార్గమున బోవుచు, తమ్మోనుమిసిన, నది శ్రీకృష్ణుని దోసిటబడెను. శ్రీకృష్ణుడంత భీకరముగా క్రుద్ధుడై తనహస్తమునతమ్మోనుమిసిన దుర్మార్గుని దెల్పుమని గంగను, నిర్భంధించెను. గంగ గయుని వృత్తాంతముచు దెలియజెప్పెను. నాకు కీడొనరించిన దుర్మార్గు డెచ్చటకేగినను, వానిం బట్టి వధింతునని ప్రతినబట్టెను.

అంత గయుడు బ్రహ్మలోకమునుజూచి యింటికి జనుచుండ ఆకాశవాణి, గయుని కృత్యమును, అందుకు శ్రీకృష్ణుడు గావించిన

ప్రతిజ్ఞయుకూడ దెలియబల్కెను. గయుడు భార్యాసహితుడై దుఃఖించుచు, బ్రహ్మదేవుని శరణుజొత్తమని సత్యలోకమునుగూర్చి వెడలెను. బ్రహ్మ గయుని రక్షింపజాలనని పల్కెను. పిమ్మట గయుడు, కైలాసమున కేగి పార్వతీవల్లభుని రక్షింపుమని కోరెను. శంకరుడును, తాను కాపాడజాలనని పల్కెను. గయుడేమియు దోచక నిలిచియుండెను. అంతట దేవమౌనియగు నారదుడేతెంచి, గయుని స్థితిని విచారించి, యిట్లు పల్కెను. గయుడా! నిన్ను రక్షింపగలవాడొకడున్నాడు. అతడు శ్రీకృష్ణుని ప్రేమనమరంది, అర్జునుడనువాడు. శరణు అనువారిని రక్షింపగల సమర్థుడు. వాని కడకేగి శరణు కోరుము అని పలుకగా గయుడు సందేహించెను. కాని నారదుడు అందుకు తగునుపాయమును దెల్పి గయుని అర్జునునికడకు పంపెను.

పుష్పములతోడను ఫలములతోడను, అలరారుచు అనేక విధమైన అడవిజంతువులతో నిండియున్న ద్వైతవనమును గయుడు చేరెను. దూరముగా గాండీవధారియైయున్న అర్జునుని గయుడు చూచెను. గయుడు తన రెండుచేతులను జోడించి, ఫల్గునా! శరణు శరణు నీవు తప్ప నన్ను గాచువారులేరు. అభయమిమ్ము అని వానిపాదములపై వ్రాలెను. ఎవరడ్డుపడిననుసరే నిన్ను నేను రక్షింతును. లెమ్ము అని అర్జునుడు గయుని భయముబాపి లేవనెత్తెను. పిమ్మట గయునివృత్తాంతము, వాని భయకారణమును అర్జునుడు తెలిసికొనెను. పిమ్మట శ్రీకృష్ణునితో తనకు అకారణవైరము వచ్చెనని తలచి మనంబున విచారింప దొడంగెను.

ధర్మరాజదిచూచి అర్జునా! నీవెన్నడును యింత ఖిన్నుడవు కాలేదు. నేడేల యిట్లుంటివి అని అడిగెను. అర్జునుడు గయుని వృత్తాంతమును, తాను రక్షింతునని ప్రతినబూనిన విధమును ధర్మరాజునకు దెల్పెను. ధర్మజుడు శ్రీకృష్ణునితో వైరము కల్గినదని

చాలా విచారించెను. అర్జునుడును చేయునదిలేక తన అన్నదమ్ము లతో నీసంగతి చెప్పెను. వారందరును అర్జునునికి ధైర్యముజెప్పి గయుని రక్షింప నిశ్చయించిరి. శ్రీకృష్ణుడు వేగవంతుడను చారుని బిలిచి గయుడున్న నెలవు దెలిసికొని, వానిని ద్వైతవనమునకు బంపి పాండవులతో చెప్పి గయుని గొనిరమ్మని బంపెను.

వేగవంతుడు ద్వైతవనమును జేరి పాండవులను సమీపించి కుశలమును దెలిపి, శ్రీకృష్ణుడు దెలుపమని చెప్పిన గయుని వృత్తాంతమును ధర్మరాజునకు దెల్పెను. ధర్మరాజు వేగవంతునితో యిట్లనెను. వేగవంతా! మాయర్జునుడు తెలియక గయునికి అభయమిచ్చెను. గాన అర్జునుని మన్నించి గయుని రక్షించి మమ్ముకాపాడుమని చెప్పుము అని చెప్పిపంపెను. వేగవంతుడట్లే శ్రీకృష్ణునకు నివేదించెను. శ్రీకృష్ణుడాగ్రహాయత్తచిత్తుడై అక్రూరునిబిలిచి అర్జునునితో నామహిమలను దెలియబల్కి గయునిటకు గొనిరమ్ము అని పల్కెను. అక్రూరుడు అర్జునునిగాంచి, అర్జునా! శ్రీకృష్ణుడు తీవ్రముగు శపథము పట్టినాడు. నీవు గయుని విడువుము. నీకు బంధువు వానిని విడనాడగూడదు. అని బహురీతుల బ్రతిమాలిచెప్పెను. అర్జునుడందుల కంగీకరించలేదు. అక్రూరుడు ద్వారకకేగి శ్రీకృష్ణునకు అర్జునుని వాక్యములుచెప్పెను. శ్రీకృష్ణుడు రౌద్రమును వెదజల్లుచు సుభద్రను బిల్చి, అర్జునునితో గయునివిడిచిపుచ్చుమని వ్రాయబారమంపెను. సుభద్ర సందేహింపుచు భర్తనిరాకరించునేమో యని మనంబున దలచుచూ, అలంకరించుకొని ద్వైతవనమునకేగి అర్జునుని సమీపించి యాదవాన్వయుల క్షేమమును దెల్పెను. పిమ్మట సుభద్ర తాను వచ్చిన కారణమును, అర్జునున కెఱింగించెను. శ్రీకృష్ణుడు సాక్షాత్ శ్రీమహావిష్ణువనియు, వానితో వైరమునుకలిగియుండుట తగదనియు సుభద్రజెప్పెను. దుర్యోధనాదులతో వైరముగల్గినపుడెల్ల శ్రీకృష్ణుడే

గదా మిమ్ములను కాపాడినది అని సుభద్ర భర్తకు వివరించెను. కాన గయుని కృష్ణునకు వప్పగించి నానితో స్నేహముగానుండుమని సుభద్ర భర్తతో చెప్పెను. అర్జునుడు అందులకు అర్జునుడు సుభద్రతో తాను శరణునిచ్చినవానిని విడిచిపుచ్చననియూ, తెలియక అట్లు కాపాడెద నంటిననియు. అన్నమాటను కాదనకూడదనియు, యుద్ధమనిన భయము లేదనియు, యిట్టిరాయబారములకు స్త్రీలు రాకూడదనియు, గద్దించి సమాధానమిచ్చెను. సుభద్ర తనమాట శౌరియు, అర్జునుడునుకూడ వినకుండెనని, తిరిగి శ్రీకృష్ణునివద్దకేగి, తాను చెప్పుమన్నరీతిగా చెప్పితిననియు, అర్జునుడు గయుని విడువననెననియు పల్కెను. శ్రీకృష్ణుని, సుభద్ర గయుని, అర్జునుని రక్షింపుమని బ్రతిమాలెను. శ్రీకృష్ణుడు అంగీకరించలేదు. సుభద్ర రుక్మిణీ సత్యభామాదులచేత చెప్పించెను. అంతఃపురమువిడచి యీపలుకులు యిచ్చట పలికిన నేను అంగీకరించువాడనుకాను అని కృష్ణుడు రౌద్రాకారముతో పలికెను.

శ్రీకృష్ణుడు సైన్యములను అర్జునునిపై యుద్ధమునకు సంసిద్ధపరచెను. నారదమౌని కలహమును వృద్ధిగావింపవలెనని హస్తినాపురికేగి ధృతరాష్ట్రునితో గయుని వృత్తాంతమును, అర్జునునకును శ్రీకృష్ణునకును జరుగు సమరవృత్తాంతము చెప్పెను. ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో సైన్యములనుచేర్చుకొని పాండవులకు సహాయులై కృష్ణుని బరిమార్చుమని బల్కెను. దుర్యోధనుడు తన సైన్యములను దీసికొని, ద్వైతవనమునకేగి ధర్మరాజుకు నమస్కరించి తాను సహాయమునకై వచ్చితినని పల్కెను. ధర్మరాజు సంతసించెను. అంతలో శ్రీకృష్ణుడు సర్వసైన్యములతోవచ్చి ద్వైతవనమువద్ద శంఖము పూరించెను.

కౌరవసైన్యములు, పాండవసైన్యములు కలిసి శ్రీకృష్ణుని సైన్యములతో తుములయుద్ధముచేసిరి. కొందరు మూర్ఛిల్లిరి. కొం

దరు మరణించిరి. అంత అర్జునుడు యుద్ధమునకు సిద్ధుడై శ్రీకృష్ణు నెదుర్కొనెను. యిరువురును ఒకరి నొకరు నిందించుకొనుచు యుద్ధము చేసిరి. శ్రీకృష్ణుడు తన విశ్వరూపమును అర్జునునకు చూపించెను. అర్జునుడు సంతసించి శ్రీహరికి మ్రొక్కెను. కాని గయుని విడువలేదు. కృష్ణుడు విడువమనెను. అర్జునుడు వినలేదు. ఆకాశమున అమరసంఘములు చూచి ఆనందించుచుండిరి. శ్రీహరియు అర్జునుడును యుద్ధముచేయుచుండిరి. అంతలో శ్రీకృష్ణుని బాణములకు అర్జునుడు మూర్ఛిల్లెను. అట్టి అర్జునునిజూచి శ్రీకృష్ణుడు విచారించెను. అర్జునుడు లేచి గయునిచంపదలచిన కృష్ణునెదుర్కొని మూర్ఛిల్ల జేసెను. పిమ్మట అర్జునుడు శ్రీకృష్ణునిజూచి విచారించెను.

శంకరుడు కృష్ణార్జునుల కోపమును వారింపదలచి ప్రమధ గణములతో బయలుదేరి ద్వైతవనమునకు వచ్చెను. ఇరువురకు బోధజేసి వారి ప్రతినలకుతగిన సమాధానమును చెప్పి వారిని శంకరుడు సంతసపరచెను. అర్జునుడు శ్రీకృష్ణునికి నమస్కరించి గయుని రక్షింపుమని, తన తప్పులు మన్నింపుమని ప్రార్థించెను. యుద్ధ భూమిలో జచ్చినవారినందరిని బ్రతికింపుమని శ్రీహరిని అర్జునుడు వర మడిగెను. అచ్యుతుడా వరములనిచ్చి అర్జునుని కౌగిలించుకొనెను. గయుడు మణిపురమునకు సుఖముగా వెడలెను. శ్రీకృష్ణుడు గరుడ వాహనారూఢుడై ద్వారకవెడలెను. శంకరుడు వృషభ వాహనారూఢుడై కైలాసమున కేగెను. తుంబురునారదాదులు గానముచేసిరి. సురలు పుష్పవృష్టి గురిసిరి.

## శశిరేఖా పరిణయము

పాండవులు అరణ్యవాసముచేయుచు ద్వైతవనమందు ఆశ్రమ మేర్పాటుచేసికొని కాలము గడపుచుండిరి. పాండవులలో అర్జునుడు

బలరాముని సోదరియగు సుభద్రను పెండ్లాడెను. సుభద్రకు అభిమన్యుడను కుమారుడుదయించెను. బలరాముని భార్య రేవతి గర్భవతి యయ్యెను. పాండవు లరణ్యావాసమును జేయుచున్నందున సుభద్ర, అభిమన్యుడు పుట్టింటనే యుండిరి. రేవతికి క్రమముగా పది మాసములు నిండినవి. శుభదినమందు సుందరిని గనెను. పుత్రిక కల్గెనని బలరాముడు పురోహితులను రావించి జాతకర్మాదులను గావించి, శశిరేఖయని పేరుపెట్టెను. సహజముగుటచే అందరును బాలికపుట్టినది మొదలు అభిమన్యునకు భార్యకాగలదని పల్కుచుండిరి. సుభద్ర తనకు కోడలగునని శశిరేఖను ముద్దులాడుచుండెను. శుక్లపక్ష చంద్రునిరీతి శశిరేఖ అభివృద్ధిపొందుచుండె. బలరాముడు తన బాలికను చదువునేర్పింతునని మేనల్లుడగు అభిమన్యునితో చేర్చి చదువవేసెను. యిరువురును అన్యోన్యముగా విద్యలు నేర్చుచుండిరి. కాలక్రమమున శశిరేఖకు పండ్రెండు వత్సరములు వచ్చెను. శశిరేఖ యౌవన విలాసములన్నియు నేర్చెను. బలరాముడా కన్నియనుగాంచి యిక విలాసముగా విహరించుట కూడదని తలచి శశిరేఖను అంతఃపురముననే నివసింప నియమించెను. శశిరేఖయు తండ్రి యానతిని అంతఃపురమందే చెలికత్తెలతో విహరించుచు శృంగారలీలలు నెరపుచు వనవిహారమునకు బోయెను. ఆదినముననే అభిమన్యుడును తోడివారలంగూడి డేగవేటకై వెడలెను.

పక్షులపై డేగను విసరుచూ అభిమన్యుడానందించుచుండగా ఆడేగకు పక్షులు దొరకనందున, అది శశిరేఖ విహరించు వనమందు జేరెను. రాజనందనుడగు అభిమన్యుడు రాజకన్యయగు శశిరేఖనుగాంచి ఆమె యౌవన ప్రాదుర్భావమును, అవయవలక్షణములను చూచి మోహితుడయ్యెను. పిమ్మట శశిరేఖ చెలులతో యింటికి వెడలెను. సఖులను విడిచి భోజనముగావించి, యింటివద్ద

విశ్రమించెను. మరునాడుదయమున శశిరేఖలేచి కాలకృత్యంబులదీర్చి కొని చెలులతో ముచ్చటలాడుచుండెను. అభిమన్యుడును దంతధావనాదికృత్యంబులగావించి గుఱ్ఱమునెక్కి వేటకుజనెను. ద్వారకాపురమందిట్లుండగా హస్తినాపురమందు దుర్యోధనుడు. భీష్మ, ద్రోణాది కురువృద్ధులను రావించి తనకుమారుడైన లక్ష్మణునకు బలరాముని కుమార్తెయగు శశిరేఖను పెండ్లికై యడిగి రండని నియమించెను. భీష్మ ద్రోణులు వల్లెయని రథములనెక్కి ద్వారకాపురముజేరి, బలరాముని గాంచిరి. బలరాముడు వారి కాతిథ్యమొసంగి సుఖాసీనులగావించెను. కుశలప్రశ్నలకు పిమ్మట భీష్మద్రోణులను వారి రాకకు కారణమడిగెను. కురువృద్ధులు కుశలముదెలిపి, దుర్యోధనుని కుమారుడైన లక్ష్మణునకు శశిరేఖనిచ్చి పెండ్లిగావింపుమని యడిగిరి. బలరాము డతి ఆనందముతో వారికోరికలనుదీర్ప నంగీకరించి, శశిరేఖను బిలువనంపి వారికి మ్రొక్కించెను. వారును పసుపు, కుంకుమ, పండ్లు, శశిరేఖకిచ్చిరి. శశిరేఖకు అంగీకారము కానందున గిఱ్ఱున దిరిగి మేడకువెళ్ళెను. బలరాముడు భీష్మ ద్రోణులకు విందుగావించి సెలవిచ్చి పంపెను. అంతట వారు శ్రీకృష్ణదర్శనార్థమైచని, శ్రీహరిని దర్శించి, తామువచ్చిన కార్యమును తెలియజెప్పిరి. మేనల్లుడగు అభిమన్యుడుండగా, లక్ష్మణకుమారున కేల శశిరేఖను అడుగవచ్చితిరని శ్రీకృష్ణుడు నవ్వెను. దైవఘటన యెట్లగునో తెలియజాలమని బల్కుచు శ్రీకృష్ణుడు భీష్మ ద్రోణులకు సెలవిచ్చి పంపెను. వారు హస్తినాపురికి జని దుర్యోధనునకు జరిగిన వృత్తాంత మెఱింగించి లగ్నము మరునాడే యని దెలియజేసిరి.

సుభద్ర యీవార్త విని బలరామునివద్దకుపోయి కంట నీరు విడుచుచు శశిరేఖను అభిమన్యునకు యిచ్చి పెండ్లిగావింపుమని యడిగెను. అందుకు బలరాముడు పరిహసించుచు, నిన్ను అర్జునునకిచ్చి

నందుకు అడవిభాగ్యము ననుభవించుచుంటివి. మరల నీకొమరు నకు నాకూతునిచ్చి యేమిసుఖ మనుభవించవలెను. చాలు చాలని నిరసించెను. సుభద్ర చింతించి శ్రీకృష్ణునికడ కేగి విషయమంతయు చెప్పెను. వారిబిడ్డకు పెండ్లి వారునిశ్చయించుకొనిరి. నేనేమి చేయగలను, అని శ్రీకృష్ణుడు పల్కెను. యీవర్తమానము సుభద్ర అభిమన్యునకు దెలియజెప్పెను. అభిమన్యుడాగ్రహము జెందెను కాని తల్లినూర డించెను. యిరువురును కలిసి ద్వైతవనమందున్న పాండవులకడ కేగుటకై బయలుదేరి, ఘోరారణ్యము సంపబడి పోవుచుండ, అభి మన్యుడు విరహవేదనబడుచు ఘటోత్కచుడున్న యరణ్యమందు యల సటచే విశ్రమించెను. శశిరేఖయు చెలులవలన అభిమన్యుని వృత్తాం తము నెఱింగి తన చిలుకను వానిజాడ నెఱింగిరమ్మని బంపెను. చిలుక అభిమన్యుని కలిసి వానివలన సమాచారమును వినుచుండెను.

అంతట ఘటోత్కచుడు మానవునిజాడ యెఱింగి ప్రచండకోప మున వానిపై బడనుంకించెను. అభిమన్యుడుగ్రుడై వాని నెదుర్కొనెను. యిరువురు ఘోరముగా పోరిరి. అంత నారదమహాముని యటకు విచ్చే సెను. ఇరువురు అన్నదమ్ముల కుమారులనియు, అట్లు పోరుట మం చిదిగాదని నారదుడు ఘటోత్కచాభిమన్యులకు దెల్పెను. అంత హిడింబ సుభద్రను కౌగిలించుకొనెను. శశిరేఖను అభిమన్యునకిత్తు రని తలచియుండ లక్ష్మణకుమారునకిచ్చిరని సుభద్ర చెప్పెను. ఘటోత్కచుడు తానుపోయి శశిరేఖను తన మాయాశక్తిచేత తెచ్చి యిత్తునని ద్వారకాపురికిపోయి దోమవలె అంతఃపురముచొచ్చి, నిదు రించుచున్న శశిరేఖను మంచముతోకూడ, కావలివారలకు దెలియ కుండ మాయచేగొనివచ్చి అభిమన్యునికడ నిలిపెను. పిమ్మట ఘటో త్కచుడు దేవేంద్రాదులకు శుభలేఖలనుబంపి అభిమన్యుని వివాహము తన యాశ్రమమున జరుపుచున్నానని తెలియపరచెను. దేవేంద్రా

దులు వచ్చిరి. నారదుడేతెంచెను. వారీవృత్తాంతము నెఱింగిరి. ఘటోత్కచుడు ద్వారకాపురిజేరి తానే మాయాశశిరేఖయై, వేరొకమంచముపై పవళించియుండెను. శ్రీకృష్ణుడీ సంగతి నెఱింగి నవ్వెను. రుక్మిణీసత్యభామలా నవ్వునకు కారణమేమని యడిగిన మాయాశశిరేఖ వృత్తాంతమును శ్రీకృష్ణుడు వారల కెరింగించెను.

దుర్యోధనాదులు మరునాటి ఉదయమున పెండ్లిప్రయత్నముతో హస్తినాపురమునుండి ద్వారకాపురమునకు తర్లివచ్చిరి. బలరాముడు వారికి విడిదియేర్పాటుచేసెను. ద్వారకాపురమంతయు అలంకరించిరి. పురోహితులు వచ్చిరి. మాయాశశిరేఖకు మంగళస్నానము లుగావించిరి. లగ్నము సమీపించెను. భూషణములతో అలంకరించి, పెండ్లికూతురును సిద్ధపరచిరి. లక్ష్మణకుమారునికి కూడ తలయంటి పెండ్లిముస్తాబుగావించిరి. కల్యాణవేదికపై యిరువురను కూర్చుండజేసి, పురోహితులు కంకణముగట్టింపబోయిరి. మాయాశశిరేఖ చూపరులకందరకు శశిరేఖ ఆకృతిగా కన్పించినను, లక్ష్మణకుమారునికిమాత్రము అనేకరూపములుగా వికృతాకారములుగా కనుపింపసాగెను. లక్ష్మణకుమారుడు భీతిల్లి, తనకు పెండ్లిగావింతుమని కొండముచ్చును దెచ్చినారనియు, తనకు పెండ్లి అవసరము లేదనియు, విడచిపుచ్చిన చాలుననియు పెద్దలను ప్రార్థించెను. మాయాశశిరేఖ లక్ష్మణకుమారునకు ఒకమారు వికృతాకారముగను, ఒకమారు పెండ్లికూతురుగాను కనుపింపజొచ్చెను. మాయాశశిరేఖ కంకణముకట్టునపుడు కొండముచ్చుగను, జీలకర్ర బెల్లము నుంచునపుడు వెలుగుబంటిరూపముగను, మంగళసూత్రమును కట్టునపుడు జడలతో వికృతమైన మహాభూతముగాను తలంబ్రాలు పోయునపుడు పెద్దపులిగాను లక్ష్మణకుమారునకు కనుపట్టి భయపెట్టెను. భీష్మద్రోణులు మేనల్లునకివ్వక పరులకిచ్చిన బలరాముని కృత్యమునకు ఇది ఫలితమనివారిలోవారు బల్కిరి. ఘటోత్కచుడు, మాయాశశిరేఖ రూపమును వదలి, బ్రహ్మాండమైన వికృతాకారముతో నిజరూపమునుచూపి, దుర్యోధనాదుల నెదుర్కొని హస్తినాపురివరకు తరి

మెను. పిమ్మట ద్వారకాపురి జేరి శ్రీకృష్ణుని దర్శించి, తనతప్పు మన్నింపు మని ఘటోత్కచుడు శ్రీకృష్ణుని ప్రార్థించెను. శ్రీకృష్ణుడు వానిని మెచ్చుకొని సెలవిచ్చి పంపెను. ఘటోత్కచుడు జరిగిన వృత్తాంత మెల్ల అడవియందుగల అసురులకు, అభిమన్యునకు సుభద్రకు చెప్పెను. అందరును హర్ష మొందిరి. శ్రీకృష్ణుడు బలరామునితో శశిరేఖాభి మన్యుల బిలిచికొనివచ్చి వివాహముగావింపుమని బల్కెను.

బలరాముడును, శ్రీకృష్ణుడును రథారూఢులై రాక్షసాశ్రమ మునకుబోయిరి. ఘటోత్కచుం డత్యానందముతో వారిని గౌరవించెను బలరాముడు, ఘటోత్కచుని, సుభద్రను, అభిమన్యుని, దేవేంద్రాదు లను, తనతప్పు మన్నింపుడని ప్రార్థించి, శశిరేఖాభిమన్యులను, సుభద్రనూ, ఘటోత్కచుని వెంబడిదీసికొని ద్వారకాపురిచేరెను. బలరాముడు కోటలో ప్రవేశించి రథములుదిగి, కల్యాణప్రయత్నము గావించెను. సక్రమముగా మంగళస్నానములు గావించి వధూవరు లకు పురోహితులు, పెండ్లిగావించిరి. అప్పగింతలు నెరపిరి. భోజనాది కములు గావించినపిదప గర్భాధాన యత్నములు సలిపిరి. అంతటి నుండి, నిరతంబు దంపతులు సురతసౌఖ్యములతో నేకశరీరులై చిర కాలమీక్షితిపై వృద్ధిబొందిరి.

## ద్రౌపదీ ధర్మరాజుల సంవాదము

ఓ జనమేజయమహారాజా! ద్రౌపది ధర్మరాజున కిట్లుపలి కెను. ప్రాణేశ్వరా! ధర్మరాజా! ముసలివాడైన ధృతరాష్ట్రుడు తన కొడుకగు దుర్యోధనుని మాటవిని క్రూరుడై, మిమ్ములను అడవు లకు పంపించెను. మీరాజ్యవిభవములను అపహరించెను. మీ రాజ్య మును అపహరించిన పిమ్మట ధృతరాష్ట్రునిచిత్తము శాంతమా యెను. పాపాత్ముడైన ధృతరాష్ట్రుని చిత్తముజూడగా యినుమువలె గట్టిదిగా నుండును. దుర్యోధనుడు మిమ్ములను అవమానింపజేయు టకు ప్రయత్నించినప్పుడు ధృతరాష్ట్రుడు కూడదని జెప్పలేదు. ధృత రాష్ట్రుడు కలహమందు యిష్టముగలిగియున్నాడు. మీరు యిదివరకు

నిర్మలమైన మేడలయందు విహరింపుచుంటిరి. ఇప్పుడు భయంకర మైన అడవులయందు తిరుగుచున్నారు. పూర్వము మనోహరము లైన పీఠములయందు కూర్చుండుచు మెత్తనిపాన్పులయందు పండు కొనుచుందురు. దర్భాసన కృష్ణాజినాది చర్మములయందు పండు కొనుచున్నారు. పూర్వము చందనములను అగరుగంధములనుపూసి కొనుచుందురు. ఈ వనములయందు దుమ్ములును ముండ్లును మీ దేహ ములయందు వ్యాపించుచున్నవి. పూర్వము మీరు రాజులచేత సేవింపబడుచుంటిరి. ఇప్పుడు వనములయందు క్రూరమృగములచేత సేవింపబడుచున్నారు. ఇట్లు మిమ్ములను నేను జూచిచూచి దుఃఖశాంతిని చేసికొనజాలను. మీకు సకలభోగములను తొలగించుటయందు ధృతరాష్ట్రునివలెనే దైవము కూడా ప్రతికూలుడాయెను. ధర్మరాజా! నీతమ్ములు నలుగురును నీయాజ్ఞకు పరాక్రమమునువిడిచి కష్టములను బొందుచు శుష్కింపుచున్నారు. నీతమ్ములందరును చెరలోనున్న సింహపు పిల్లలవలె శుష్కించుచున్నారు.

ధర్మరాజా! పూర్వము రాజులందరును నీపాదములకు నమస్కరింపుచుండగా రాజులకిరీటముల యందు గల పద్మరాగ మణుల కాంతులు సోకుటచే తన పాదములు యెర్రగానుండును. యిప్పుడు యీ పర్వతములయందు తిరుగుటచేత కఠినశిలలు తగిలి అరిగినందున నీపాదములు యెర్రగానున్నవి. మీరు సర్వదా సుఖములను అనుభవింపుచు, యిప్పుడు వనవాసదుఃఖములను అనుభవింపవలసివచ్చినందున నామనస్సు పరితపించుచున్నది. మీగృహమందు ప్రతినిత్యము పదివేలమంది బ్రాహ్మణులు బంగారుపాత్రములయందు యిష్టాన్నములను భుజించి తృప్తిబొందుచుందురు. వారు భుజింపగా మిగిలిన అన్నములను మీరు భక్షింపుచుందురు. అటువంటి మీరు యిప్పుడు కందమూల ఫలాదులను భుజించి జీవించుచున్నారు. మీశత్రువులమీద క్రోధమును విడచియున్నారు. మీరు యీ ప్రకారముండుట తగదు. భీముడు పదివేలయేనుగులతో సమానమగు బలముకలవాడు. అట్టి భీముడు యిప్పుడు అడవిలో తిరుగుచు, కాయగూరలుతిని బీదతనము

కలిగియున్నాడు. అర్జునుడు రెండు చేతులుగలవాడైనను వేయిచేతులు గల కార్తవీర్యార్జునుని కంటె అధికబలవంతుడగును. ఆ అర్జునుడు ఒక బాణమని పరులకు తోచునట్లుగా ఐదుబాణములను ఒక్కచోటనే వేయుటకు సమర్థుడగును. అటువంటి అర్జునుడు యిప్పుడు వనమృగములలో కలిసి తానును ఒక మృగమువలెనే దోచుచున్నాడు. సౌఖ్యమును అనుభవింపదగిన నకులసహదేవు లిద్దరును దీనులైయున్నారు. అటువంటి నీతమ్ములను నలుగురను నీవుచూచియు శాంతమును పొందియుండరాదు. రాజగువాడు శాంతమును తేజస్సును యీరెంటిని ఆయా కాలములయందు ప్రయోగించవలెను. అట్లు ప్రయోగించని రాజునకు ప్రజానురాగప్రతాపములు కలుగనేరవు. యీ విషయము యితిహాసమువలన దెలియుచున్నది. ఆ యితిహాసమును జెప్పెదను వినుము. పూర్వము బలిచక్రవర్తి తన తాతయగు ప్రహ్లాదునితో యిట్లుచెప్పెను.

తాతా! ప్రహ్లాదా! శాంతతేజస్సులలో విశేష మెద్దియో జెప్పుము. ఆ రెంటిలో విశేషగుణము గలదానినే నేను అనుష్ఠించెదను. అని యిట్లు బలిచక్రవర్తి యడుగగా ప్రహ్లాదు డిట్లుపలికెను. మనుమడా! బలిచక్రవర్తీ! రాజగువాడు సర్వదాశాంతము వహించియుండరాదు. సర్వదా తేజస్సునే ధరించియుండరాదు. రాజగువాడు సర్వదా శాంతమూర్తియై యున్నను, తేజోమూర్తియై యున్నను దోషము గలుగునని మునులు జెప్పుదురు. అదియెట్లనగా జెప్పెద వినుము. సర్వదా శాంతమును ధరించిన యెడల అట్టి రాజునకు భృత్యులు భయపడక అవమానమును కలిగింతురు. ధనాధిపతులగు వారందరును ధనములను అపహరించి గర్వమును జూపుదురు. యీ ప్రకారమే సకలభృత్యులును శాంతుడైన రాజునకు భయపడక పనులు జేయక అపకారములు జేయుచుందురు. కనుగ రాజునకు సర్వదా శాంతము కూడదు. రాజగువాడు సర్వదా తేజోధికుడైన యెడల సకలజనులకును సర్వదా దుఃఖము గలుగుచుండును. క్రూరసర్పము గృహమందున్నరీతిని తేజోధికుడైన రాజు ప్రజలను

బాధింపుచుండును. ఆయా కాలములను కనిపెట్టి రాజగువాడు శాంత తేజములను కనిపెట్టవలయును. అట్లు కనిపెట్టి శాంత తేజస్సులను గనుపరచు రాజునకు రెండులోకములయందు సిద్ధిగలుగును. అని యీరీతిగా ప్రహ్లాదుడు బలిచక్రవర్తితో జెప్పెను. అని ప్రహ్లాద బలీంద్రుని సంవాదమును ద్రౌపది ధర్మరాజుతో జెప్పి మరల యిట్లు పలికెను.

ధర్మరాజా! శత్రువుడు ఒక అపకారము కొంచెమైనను, చేసినయెడల క్షమింపవచ్చును. దుర్యోధనాది కౌరవులు పాప బుద్ధిచేత మీకు అనేక అపకారములను జేయుచున్నారు. అటు వంటి కౌరవులను నీవు సహించియుండరాదు. నీవు యిపుడు కోపించు టకు తగిన సమయము. కనుక నీవు కోపమువహింపుము. నీవు కోపము గలవాడవై నీతమ్ముల కాజ్ఞాపించినయెడల నీతమ్ములు ఆ దుర్యో ధనాదికౌరవుల నందరను చంపుదురు. అని ద్రౌపది ధర్మరాజుతో జెప్పగా ధర్మరాజు యిట్లనెను.

ద్రౌపదీ! క్రోధమువలననే పాపముగలుగును. క్రోధమువలన ధర్మార్థకామములు నశించును. క్రోధముగలవాడు న్యాయధర్మముల నెరుంగనేరదు. కోపవంతుడు గురుజనులనైన నిందించును. కోప వంతుడు చంపదగినవారినైనను జంపును. కోపవంతుడు తనను తాను చంపుకొనుటకు ప్రయత్నించును. కోపవంతుడు ధర్మాత్ములగు వారికి భయము కలిగింపుచుండును. గాన యిట్టి కోపమును పొందుటవలన మేలులేదు. జ్ఞానముగల మహాత్ముడు తన జ్ఞానమను జలముచేత క్రోధమను అగ్నిహోత్రమును చల్లార్చును. శాంతముగలవాడు దేశ కాలస్వరూప మెరిగి తేజస్సును ధరించును. భూమితో సమానమైన ఓర్పు గలవానికి సర్వదా విజయసిద్ధి యగును. ఓర్పుగలవాని పరాక్ర మము సర్వకార్యములను ఫలింపజేయుటకు శక్తివంతమై మిక్కిలి ప్రకాశించును. క్రోధము సమర్థత, శౌర్యము, శీఘ్రభావము, యీ నాలుగు గుణములను తేజస్సువలన బుట్టినవగును. యీనాలుగు గుణములును ఓర్పుగలవాని యందు బలహీనములగును. పూర్వము

కశ్యపగీతలగు గాథలయందు యీ అభిప్రాయము తెలియుచున్నది. అది చెప్పెదను వినుము.

ద్రౌపదీ! వేదములును, యజ్ఞములును, శౌచములును, సత్యములును, జ్ఞానమును, ధర్మమును; చరాచరమైన ప్రపంచమంతయు శాంతమందే యుండును. తపస్సుచేసినవారికిని, సకల వేదములను చదివినవారికిని. యజ్ఞములు చేసినవారికిని, బ్రహ్మవేత్తలకును గలుగు పుణ్యగతులన్నియు శాంతమూర్తులు బొందుదురు. వేదవ్యాస, భీష్మ, విదుర, కృపాచార్య, ద్రోణాచార్య. సంజయుడు మొదలగువా రందరును, నా శాంతమును పొగడుచుందురు. శాంతగుణములేని దుర్యోధనాదు లందరును మరణము నొందుదురు. అని యిట్లు ధర్మరాజు ద్రౌపదితో జెప్పగా ద్రౌపది యిట్లు పలికెను.

ఓ ధర్మరాజా! నీవు శాంతమందే చిత్తమును నిలిపియున్నావు. పాపములేని బుద్ధిగలవాడవై యున్నావు. సర్వదా ధర్మమందే వర్తించుచు కృపగలిగియున్నావు, దేవధర్మము నిన్ను రక్షించునని శత్రువులయందు నీవు సమబుద్ధిగలిగి యుండరాదు. దుర్యోధనాదులందరును ధర్మహీనులు. అటువంటి పాపాత్ములను నీధర్మమేమియు జేయలేదు. కీడు జేసిన వారిని శిక్షింపవలయును. అట్లు శిక్షింపనియెడల దూషింపబడుదురు. అని యిట్లు ద్రౌపది ధర్మరాజుతో జెప్పి దైవముమీద కోపించుకొని దైవమును యిట్లని నిందించెను. ఓ పాపిష్ఠిదైవమా! గుణములచేత గొప్పవారగు పాండవులకు హీనత్వమును కలిగించితివి. గనుక నీవు అధర్మమందు ప్రవర్తించినవాడవైతివి. న్యాయమును తప్పితివి. నీకు దుర్యోధనాది హీనులు చుట్టములైరి. మహాత్ములగు పాండవులు శత్రువులైరిగదా! అని యిట్లు ద్రౌపది దైవమును ధర్మమును ఆక్షేపించుచుండెను. అట్టి ద్రౌపదిని జూచి ధర్మరాజు యిట్లు చెప్పెను.

ద్రౌపదీ! నీవు నాస్తికులవలె ధర్మబుద్ధిలేనిదానవై దైవమును దూషింపుచున్నావు. శ్రేష్ఠులగు పెద్దలచేత అనుష్ఠింపబడుచుండు ధర్మమును అతిక్రమించిన మూఢులకు ప్రాయశ్చిత్తములేదు,

మైత్రేయ, మార్కండేయ, వ్యాస, వసిష్ఠ నారదాదులు ధర్మము తప్పక నిత్యులై జీవించి యున్నారు. మునులందరును పరమ యోగ ధరులై యున్నారు. వారిని మనము ప్రత్యక్షముగా జూచుచున్నాము. ఆవ్యాస నారదాది మునులందరును నన్ను ధర్మపరుడని మన్నించు చుందురు. ఇతరులు నన్ను అన్యాయము జేసినను నేను ధర్మమును తప్పను. మంచిధైర్యబుద్ధిచేత విచారింపగా సకల జనులును స్వర్గ మును యెక్కుటకు ధర్మము నిచ్చెన వంటిదగును సుమా! తపస్సు నకు వేదశాస్త్రములను చదువుటకును బ్రహ్మచర్య దానయజ్ఞాది పుణ్యకర్మలకును, పుణ్యఫలము లేని యెడల దేవఋషి గంధర్వాదు లందరును పుణ్యకర్మములను చేయక మానవలయును. ద్రౌపదీ! నీవును ధృష్టద్యుమ్నుడును అగ్నికుండమందు పుట్టిరి. మీయిద్దరి జన్మములును పుణ్యఫలము లున్నట్లే పాపఫలములు గలిగియున్నవి. పూర్వము బ్రహ్మదేవుడు అత్రి మొదలగు తన పుత్రులకు కర్మ ఫలము గలదని చెప్పెను. ఆ బ్రహ్మపుత్రులలో కశ్యపుడు ధర్మ వేత్తయాయెను. ఆబ్రహ్మదేవుని దయవలనమనుజులుపుణ్యపాపముల యందు ప్రవర్తించి దేవత్వమును పొందుదురు. అని యిట్లు ధర్మ రాజు ద్రౌపదితో జెప్పగా ద్రౌపది యిట్లనెను. ధర్మరాజా! కర్మఫల ములయందు కర్మఫలప్రాప్తికి దైవము కారణమగును. ఆదైవము కారణముగాదని జెప్పుటకు నేనంత వివేక శూన్యురాలనుగాను. నేను దైవముచేత దుఃఖముగలదాననై విసికి దైవమును దూషించితినే గాని మరియొకటి గాదు. వేదశాస్త్రములును విధి విధానములును అప్రమాణమని జెప్పు దుర్మార్గులకు పుణ్యగతులు లేవని నేను యెరు గకుండలేదు. ధర్మరాజా! పూర్వము నీతిమంతులైన బ్రాహ్మణులు నా తండ్రియగు ద్రుపదునకు జెప్పినమాటలు నేను వింటిని. ఆమాట లను చెప్పెదను వినుము. వివేకము గలవారు ఫలసిద్ధికొరకు కర్మము లను జేయవలయును. కర్మములను జేయక, స్థావరముల వలె జనులు జీవింపజాలరు. అల్ప ఫలము గలిగినను కర్మములను జేయుచున్న వారిని జూచుచున్నాము. దైవమానుష ప్రయత్నములు రెండును

కర్మఫల ప్రాప్తికి కారణములగును. పురుషుడు కార్య సిద్ధియగునని మనస్సునందు నిశ్చయించి కర్మములను జేయుటయందు వుత్సాహము గలిగియుండవలెను. అట్లు వుత్సాహమును గలిగి దైవమునునమ్మి కర్మములు చేసినయెడల దైవసహాయమై కర్మసిద్ధిని గలిగించును. కర్మము చేయుటయందు వుత్సాహము గలవాడు నువ్వులయందు నూనెను పొందినట్లు, కట్టెలయందు అగ్ని పుట్టినట్టును, వుపాయ పూర్వకముగా కర్మసిద్ధిని పొందును. ఉత్సాహములేక కర్మమును చేయనివాడు దైవమును నమ్మినను కర్మసిద్ధిని పొందడు. మరియు పైరుపెట్టదలచిన వాడు భూమిని చక్కగాదున్ని విత్తనములు చల్లును. ఆ వెంటనే వర్షముకురిసిన యెడల ఫలసిద్ధి కలుగును. వర్షము కురియని యెడల విత్తనములు చల్లినవాడు తానేమి చేయవలయునో ఆపనిని చేయునేగాని వూరకుండడు. కనుక ధర్మరాజా కర్మఫలములన్నియు దైవమానుష ప్రయత్నములవలన సిద్ధింపు చున్నవి. అయినను పురుషుని వుత్సాహముచేత సంపాదింపబడినవై ఆ కర్మఫలములు మిక్కిలి స్థిరములై సురక్షితములై యుండును. అపేక్షలేక కేవల దైవమును నమ్మినవాడు నీటిలోపలనుండు ఓడ వలె వ్యర్థుడగును. గనుక నీవు కర్మఫల సిద్ధి నిశ్చయించి వుత్సాహము గలవాడవై నీ తమ్ముల పరాక్రమముచేత శత్రువులను జయింపుము. మనయందుగల దీనభావమును పోగొట్టుము. అని ద్రౌపది ధర్మరాజుతో జెప్పెను. ఆ మాటలకు అనుకూలముగా భీముడు ధర్మరాజున కిట్లని పలికెను.

## భీమ ధర్మరాజుల సంవాదము

ఓ ధర్మరాజా! మన తండ్రి తాతల సొత్తగు రాజ్యమును భేదించుటకు యెవరికిని శక్యముగాదు. అట్టి రాజ్యమును అర్జునుడు రక్షింపుచుండెను. అర్జునునిచేత రక్షింపబడు యీ రాజ్యమును తీసికొనుటకు దేవేంద్రునకైనను సాధ్యముగాదు. అట్టి రాజ్యమును దుర్యోధనుని వశముగావించి భయంకరమైన ధర్మలోపము గలుగు

నను భయముచేత నీవిట్లు రాజ్యమును విడిచి అడవులలో నుండ రాదు. ధర్మరాజా! సింహములనుండి పక్కలు మాంసమును తీసుకొనునట్లు దుర్యోధనుడు మన రాజ్యలక్ష్మిని తీసికొనెను. దుర్యోధనుడును, స్నేహితులగు కర్ణ శకుని దుశ్శాసనులును తమ మనస్సులందు యేమని తలచిరో తెలియదు. దుర్మార్గులగు దుర్యోధనాదులను ధర్మమార్గముచేత గెలువరాదు. గాన పాపాత్ములగు కౌరవులను గెలుచుటకు యుద్ధము నిమిత్తము ప్రయత్నింపుము. నీవు ధర్మార్థకామ ప్రధానములచేత సకలరాజ్య సంపదలను విడిచితివి. అందుచేత మిత్రులకు దుఃఖము కలిగించితివి. నీవు శత్రువులకు సంతోషము గలిగించితివి. అట్లు నీవు మునివృత్తిని ధరించి, ధర్మమందు బుద్ధిని నిలిపితివి. బలహీనునివలె దుఃఖమును అనుభవించుచున్నావు. ఇట్లు చేయుట నీకు తగదు.

భుజాబలము లేనివాడు పరులసంపదలను తీసికొనజాలడు. దుఃఖముచేత పరితపించును. నీవు మహాబలవంతుడవై యుండియు, బలహీనునివలె వూరకుండరాదు. అన్నా! ధర్మరాజా! పూర్వమే నీయనుజ్ఞను పొంది యీ కౌరవులనందరను యుద్ధమందు మేము చంపిన యెడల యీ వనవాస దుఃఖము మనకు తప్పిపోవును. భయంకరములైన అడవులయందు క్రూర మృగములతో సహవాసము జేయుచు మనముండరాదు. మనము వనవాస విషయము యేర్పాటు తప్పునను భయముచేత శాంతులమై యున్న యెడల మనలను పరాక్రమ హీనులనుగా కౌరవులు దలంతురు. మనము యిప్పుడు యుద్ధమునకు గల ఉత్సాహమును విడిపించి మునివృత్తిచేత యీ వనముల యందుండరాదు. పురుషుడు సర్వదా ధర్మమందే మనసునుంచరాను. ప్రాణము లేనివానిని సుఖదుఃఖములు విడిచినట్లు ధర్మకామములు నీతిలేని పురుషుని విడుచును. ధర్మకామములు రెండును జెడినపిమ్మట, ధనమునకు ప్రయత్నము చేయువాడు క్రూరవనములలో గోవును రక్షించు వాని చందమునగును. ధర్మార్థములకు హానిగా కర్మముజేయువాడు స్వల్పజలమందునుగల జల జంతువులవలె చెడి

పోవును. అటువలెనే ధర్మార్థములు చెడినపిమ్మట కామముచేత పురుషుడు చెడిపోవును.

కనుక ధర్మరాజా! ధర్మార్థములు రెండును సముద్రమేఘము వలె అన్యోన్య అభివృద్ధిగలవై యుండును. యీ ప్రకారము ధర్మార్థ కామములను యెరిగి అనుష్ఠించువాడు సకలైశ్వర్య వంతుడగును. నీవు కేవలము ధర్మమునే ఆచరించుచున్నావు. నీవు అనుష్ఠించు ధర్మము అర్థకామములను చెరుపుటయేగాక నీకును నీబంధువులకును బాధను కలిగింపుచున్నవి. గనుక ధనహీనుడు యజ్ఞమందు బ్రాహ్మణాదులను దక్షిణలచేత పూజించుటకు సమర్థుడుగాడు. మరియు సకల జగత్తులును ధర్మమయములే యగును. ధర్మముకంటె అధికమైనది మరియొకటిలేదు. అయినను ధనము కొరకు ఉపయోగించిన ధర్మమును క్షత్రియులు ముఖ్యముగా దానినే అనుష్ఠింపుచుండరాదు. శ్రేష్ఠమైన క్షత్రియ ధర్మములను జెప్పెదను వినుము. ఉత్తమ క్షత్రియుడగు వాడు యుద్ధమందు శత్రువులను గెలువ వలయును. తగిన రీతిని సకలరాజ్యమును తీసికొని జనులకు భయము లేకుండు నట్లుగా పరిపాలింపుచు రక్షింపవలయును. ప్రీతిపూర్వకముగా తగిన వారికి ధనము లివ్వవలయును. బ్రాహ్మణులను చక్కగా పూజింప వలయును. ఈ ధర్మములను రాజులు అనుష్ఠించిన యెడల, సకల సంపదలును, పుణ్యగతులును గలుగవు.

ధర్మరాజా! కేవల ధర్మమునుమాత్రమే ఆచరించిన యెడల శత్రువులనుజయించుటకు సాధనము గానేరదు. కపటవంతులను కపటముచేతనే చెరుపవలెను. మరియు రాక్షసులందరును దేవతలకు పూర్వ భ్రాతలగుదురు. అట్టిరాక్షసులను దేవతలు కపటముచేతనే చంపిరి. కనుక నీవు వనవాసనియమధర్మమును విడిచి శత్రువులను జయించు టకు ప్రయత్నింపుము. నీవు ప్రయత్నించితివేనిసృంజయకేకయపాంచా లాదిరాజులగు మనస్నేహితులందరును, నీకు సహాయులై ప్రీతినిగలిగిం తురు. మిత్రసమృద్ధిగలరాజు శత్రుబలములను సులభముగా భేదింప గలడు. దేశకాల బలములుగల రాజుకు అసాధ్యకార్యము లేదు,

తేనెనుతీసికొనుటకు ప్రయత్నించినవానిని తుమ్మెదలుకుట్టిచంపినట్లు అనేకబలహీనులుగూడి బలవంతునిబట్టి చంపగలరు. సూర్యుని అన్నమందుండు పొలవలె దుర్యోధనుని రాజ్యలక్ష్మిని జనులందరును దూషించి పురజనులందరును నీయందనురాగమును గలిగియున్నారు. నీవు రాజ్యమును యేలుటయందు సకలజనులును ఆసక్తిగలిగియున్నారు. ఇందుకు నీవుఆలస్యము జేయక యుద్ధము జేయుటకు ప్రయత్నింపుము. సర్వాయుధసన్నద్ధమైనరథమెక్కి హస్తినాపురమునకు యెదురుగా నిజప్రయాణమును చేయుము. క్షత్రియులకు పరాక్రమము గొప్పగుణము. నీవు రాజులకు తగినపరాక్రమ వంతుడవగుము. ఈ క్షణమందే యుద్ధభూమికి అర్జునునిపిలుచుకొని వెళ్ళుము. అర్జునుని గాండీవమువలన విడువబడిన క్రూరబాణములచేత కౌరవకులమను అరటివనమును నశింపజేయుము.

ధర్మరాజా! శత్రువులగు దుర్యోధనాలందరును మహాసైన్యముగలవారని నీవుతలచవద్దు. నా గదాయుధముయొక్క దెబ్బలకు దుర్యోధనాదులు మహాసైన్యము యుద్ధమందు నిలువజాలదు. నీశత్రువుల నందరిని చంపివేసి సకలభూచక్రమును పరిపాలింపుము. ప్రజాపరిపాలనముకంటె అధికధర్మము వేరే రాజునకుండ నేరదు. రాజగువాడు రాజ్యమేలుచు బహుదక్షిణపూర్వకముగా యజ్ఞములుచేసి బ్రాహ్మణులకు దేవతలకు తృప్తికలిగించుచుండవలయును. రాజ్యము చేసెడిరాజు బ్రాహ్మణులకు అగ్రహారములిచ్చి పాపములను పోగొట్టుకొని రాహువుచే విడువబడిన చంద్రునివలె ప్రకాశించును. అని యిట్లు భీముడు ధర్మరాజుతో జెప్పగా ధర్మరాజు యిట్లుచెప్పెను.

తమ్ముడా! భీమా! నీవుచెప్పినమాటలు న్యాయమును ధర్మయుక్తముగానున్నవి. నీమాటవలన యిష్టసిద్ధికాగలదు. నీవుచెప్పిన మాటలు రాజధర్మమునకు తగియున్నవి. నీమాటలనుచక్కగా యోచింపవలెను. సకలరాజ్యములను చక్కగాయోచించి చేసినయెడల సులభముగా ఫలించునని పెద్దలుజెప్పుదురు. కనుక నీవు చెప్పినవిషయమును చక్కగాయోచింపవలెను. పన్నెండు సంవత్సరములు వనవాస

ము చేయునట్లును ఒక సంవత్సరము జనులచేత యెరుగబడకుండునట్లు జనులుండు ప్రదేశమందుండునట్లును, నేను నిండుసభయందు ప్రతిజ్ఞ చేసివచ్చితిని. మహాగుణవంతుడగు సజ్జనుడు కామక్రోధములనుగలిగి శాంతమును విడిచి చంచలలక్ష్మికి ఆశపడి సత్యధర్మములను తప్పడు. అట్లు తప్పినసజ్జనుడు పెద్దమనుష్యులదగ్గర పెద్దమనిషివలె వుండజాలడు. కనుక నేను పూర్వము చేసివచ్చిన వనవాస అజ్ఞాతవాస నియమమును సర్వవిధములచేతను అతిక్రమింపజాలను. మనకు శుభము కలిగెడికాలమునకు యెదురుజూచుచుందుము. సకలరాజ్య పుత్రధన కీర్తులన్నియు సత్యముతో సమానములుగావు. అని యీరీతిగా ధర్మరాజు భీమునకుచెప్పగా భీముడిట్లు పలికెను. అన్నా! ధర్మరాజా! యముడు జనులకు సర్వదా సమీపమందుండి కాలమును కనిపెట్టి జనులనందరను జంపుచుండును. నిమిషమాత్రమైనను జీవింపవచ్చునని స్థిరముగా జెప్పుటకు సాధ్యముగాదు. అట్టిజీవితకాలవిషయమును నీవు స్థిరముగాతలచి కార్యమును జాగుచేయరాదు. దేహవంతునకు మరణముతప్పక లభించును. మరణముగలుగకమునుపే పగతీర్చుకొననిి వానిజన్మము వ్యర్థమగును. సకలరాజులయెదుట దుర్యోధనాది కౌరవులచేత మనము అవమానింపబడితిమి. ఆ యవమానమునకు తగినట్లు శత్రువులను చంపెడిపర్యంతము నామనస్సు సర్వదా పరితపించుచున్నది. నాకంటె అధికముగా అర్జున నకుల సహదేవ కుంతీదేవులుపరితపించుచున్నారు. వీరిదుఃఖమునుదీర్పక శత్రువులనుసంతోషపెట్టునట్లు యీయడవియందు కృపాధర్మములను గలిగియున్నారు. ఇట్లుండుట నీకుతగదు. ఇది బ్రాహ్మణ ధర్మమేగాని క్షత్రియధర్మము కాదు. మనధర్మశాస్త్రమునందు జెప్పబడిన రాజధర్మములను నీవుయెరిగియే యున్నావు. శత్రుసంహారమును జేయనియెడల మనకు అత్యంతమగుహానిగలుగును. అదియునుగాక యెట్లయినను కష్టించి పండ్రెండు సంవత్సరముల పర్యంతము మనము వనవాసముచేసినను పరులుయెరుంగకుండునట్లు ఒకదినమైనను అజ్ఞాతవాసము జేయజాలము. అది యెట్లనగా చెప్పెదను వినుము. ధర్మరాజా! యీవనమందున

బాలవృద్ధులు మొదలుగాగల సకలజనులును నిన్నెరుగుదురు. నీవు రాజులలో సూర్యునివలె ప్రకాశించుచు లోకప్రసిద్ధుడవై యున్నావు. నీతమ్ములందరును సింహములవంటి పరాక్రమవంతులై యున్నారు. నిన్నును, నీతమ్ములగు మమ్మును యెరుగనివారు లేరు. మనము రహస్యముగానున్నను, రహస్యముగానుండు మేరుపర్వతము నందరును యెరుగునట్లు మనలనందరను యెరుగుదురు. గనుక మనము యితరులచేత యెరుగబడకుండునట్లు ఒకదినమైనను అజ్ఞాతవాసమును జరుపజాలనియెడల మరల పండ్రెండుసంవత్సరము లరణ్యవాసము చేయవలసివచ్చును. ఈ ప్రకారము జూడగా మనకుయెప్పటికిని అరణ్యవాసము నివర్తింపనేరము. ఇప్పుడు యీవనమందు యిదివరకుపదమూడు మాసములు వనవాసమును జరిపితిమి.

సంవత్సరములకు బదులుగా మాసములను జరుపుట అంతటను ప్రసిద్ధమైయున్నది. ఇందువలన ధర్మమునకు విరోధము లేదు. మనము శత్రువులతో యుద్ధముచేసి విజయముపొందుటకు యిదిమంచి సమయము. అని భీముడు ధర్మరాజుతో జెప్పెను. ఆ భీమునిమాటలను ధర్మరాజువిని అధికమైన నిశ్వాసమును విడుచుచు వ్యాకులమైన ముఖముగలవాడై చాలసేపు చింతించి భీమునితో యిట్లు పలికెను.

తమ్ముడా! భీమా! యుద్ధపాండిత్యపరాక్రమ గర్వములయందు నీవుమిక్కిలి ప్రసిద్ధుడవు. నీవు చెప్పినట్లు చేయుటవలన మేలుకలుగును, అయినను నేనుచెప్పెడిమాటను ధైర్యబుద్ధిచేత వినుము. స్వల్ప వుపాయము కల కార్యమును సాహసించిచేసినను దోషము లేదు. యీకార్యము మహాకార్యమగును. మహాకార్యమును సాహసించి చేయరాదు. చక్కగా యోచించి చేసినయెడల సిద్ధిబొందును. విచారపూర్వకముగా ఆరంభించిచేసిన కార్యమునకు దైవముకూడా అనుకూలమగును. గనుక మనకార్యవిషయమై చక్కగా యోచింపవలెను.

భీమా ! ధృతరాష్ట్రుని కొడుకులగు దుర్యోధనాదులందరును శూరులు, శత్రువులచేత జయింపబడనివారు. మనకు శత్రువులు. కర్ణ, శల్య భూరిశ్రవులు మొదలగు యుద్ధవీరులందరును మహాబలపరాక్రమ వంతులై దుర్యోధనాదులకు స్నేహితులైయున్నారు. పూర్వము మన చేతజయింపబడిన రాజులందరును దుర్యోధనునిచేత సన్మానింపబడి దుర్యోధనుని పొగడుచున్నారు. రాజులందరును దుర్యోధనుని నిమిత్తమైయుద్ధమందు తమప్రాణములను విడచుటకు సిద్ధముగానున్నారు. రాజులందరును భూమియందు ప్రసిద్ధులైయున్నారు. సకల శస్త్రాస్త్ర విద్యలయందును సమర్థులగుచున్నారు. వారలలో కర్ణుడు మహాగర్వ వంతుడు. అభేద్యమైన సహజకవచమును గలిగియున్నాడు. ధనుర్విద్యయందు మిక్కిలి సమర్థుడు. మహాభుజాబలవంతుడు. అటువంటి కర్ణునిదలచిననాడు నాకన్నుమూయబడదు. అటువంటి కర్ణుడు దుర్యోధనునకు ప్రాణస్నేహితుడు. భీష్మద్రోణ కృపాచార్యులు ముగ్గురును మనకును కౌరవులకును సములేమైనను వారుకౌరవుల దగ్గరనేయున్నారు. భీష్మ ద్రోణ కృపాచార్యులు ముగ్గురును అపరిమితమగు దివ్యాస్త్రములను కలిగియున్నారు. భీష్మాదుల నందరిని జయించిన పిమ్మట దుర్యోధనుని జంపవలయును. వారందరిని జయించకయే దుర్యోధనుని జంపుటకు సాధ్యముగాదు. అని యిట్లు ధర్మరాజు భీమునితో జెప్పుచు యోచింపుచుండెను.

## వేదవ్యాసుడు ధర్మరాజునొద్దకు వచ్చుట

ఆసమయమందు పాండవుల పుణ్యవశమువలన వేదవ్యాస మునీంద్రుడు ధర్మరాజుదగ్గరకు వచ్చెను. వ్యాసుడు కృష్ణాజినమును వస్త్రముగాధరించి బ్రహ్మదేవునితోసమాన తేజోవంతుడై యుండెను. సర్వలోకములచేత నమస్కరింపబడిన వాడగును. అటువంటి వ్యాస

మహామునీంద్రుడురాగా పాండవులు పరమభక్తిపూర్వకముగా వారిని పూజించిరి. ప్రీతిపూర్వకముగావచ్చిన వ్యాసమునీంద్రుడు ధర్మరాజునకు యిట్లనెను.

ధర్మరాజా! భీష్మ ద్రోణ కృపాచార్య కర్ణులు నలుగురును యుద్ధవీరులనియు అమితపరాక్రమ వంతులనియు వారిని యుద్ధమందు చంపుట కష్టమనియు నీవు భయపడుచున్నావు. నీభయమును నేనెరిగి ఆభయమును పోగొట్టుటకు యిక్కడకు వచ్చితిని. నాదగ్గర ఒకవిద్యగలదు. అధికమగు యోగబలమువలన ఆ విద్యను నేనుపొందితిని. యీవిద్య అతిరహస్యమైనది. ఈవిశేషమగు విద్యనుసేవించుటకు అర్జునుని పంపించుము. అర్జునుడు యీవిద్యనుసేవించి సిద్ధిని పొందును. అని యిట్లు వేదవ్యాస మునీంద్రుడు ధర్మరాజుతో జెప్పి, ధర్మరాజు నేకాంతప్రదేశమునకు తీసికొనిపోయి శాస్త్రప్రకారము ప్రతిస్మృతియను విద్యను ధర్మరాజునకు ఉపదేశించి యిట్లుచెప్పెను.

ధర్మరాజా! ఈ ప్రతిస్మృతి యనువిద్యను నీవు అర్జునునకు ఉపదేశించి ఉత్తరదిక్కునకు పంపుము. యీ విద్యవలన అర్జునుడు అధికమగు తపోబలవిభవముగలవాడై ఇంద్ర యమ వరుణ కుబేరాది దేవతలను ప్రత్యక్షము జేసికొనును. ఆ విద్యాప్రభావమువలన, అర్జునుడు రుద్రునిప్రత్యక్షము చేసుకొనును. సకలదేవతలవలనను, యీశ్వరునివలనను, సకలదివ్యాస్త్ర లాభమును అర్జునుడు పొందగలడు. అర్జునుడు సకల దివ్యాస్త్రసంపన్నుడై శత్రువులనందరిని జయించును. యీద్వైతవనమందు మీరుబహుకాలముగానున్నారు. అందుచేత వనమందుగల వృక్షములయందు పుష్పఫలములు తగ్గినవి. ఒక్కచోటనే బహుకాలముండుటవలన ప్రీతిగలుగదు. కనుక మీరు మరియొకవనమునకు వెళ్ళుడు. అని యిట్లు వ్యాసమునీంద్రుడు ధర్మరాజుతో జెప్పి వెళ్లెను. అంతట పాండవులు వ్యాసుని కృపావాక్యము

లకు సంతోషించి ద్వైతవనమునువిడిచి బ్రాహ్మణ సమూహము లతో కామ్యకవనమునకు బోయిరి. పాండవు లా కామ్యకవనమందు సరస్వతీనదీతీరమందు నివాసము జేసికొని కొంతకాలముండిరి. అంతట ఒకానొక దినమందు ధర్మరాజు అర్జునునిజూచి యిట్లుపలికెను. తమ్ముడా! అర్జునా! భీష్మద్రోణాదులందరును సర్వశత్రువులను జయించిన మహావీరులు. నాలుగుపాదములుగల ధనుర్వేదము భీష్మాదుల యందు స్థిరముగానిలిచి వారినిఆశ్రయించి యున్నది. బ్రాహ్మణులకు వేదము వశమైనట్లు ధనుర్వేదమంతయు భీష్మద్రోణాదుల వశమైయున్నది. దివ్యమహామంత్రములలో కూడినదై ధనుర్వేదము భీష్మాదులకు వశములోనుండును. కనుక భీష్మ ద్రోణాదులందరును మనతో యెదిరించి యుద్ధముచేయుదురు. వారిందరిని కౌరవప్రముఖులు పూజింపుచుందురు. ఇందుకు సంశయములేదు. దివ్యాస్త్రసంపన్నులైన భీష్మాదులను గెలిచెడివుపాయము కరుణించి జ్ఞాననిధియైన వ్యాసమునీంద్రుడు నాకు జెప్పెను. ఆ వ్యాసమునీంద్రుడు చెప్పిన విద్యను నీవు గ్రహించి ధనుర్బాణ కవచప్రాసఖడ్గములను ధరించి ఇతరులచేత జయింపబడక ఉత్తరదిక్కునకు వెళ్ళుము. అట్లు వెళ్ళి తపోయోగముచేత దేవేంద్రుని ప్రత్యక్షము జేసికొనుము. పూర్వము దేవతలందరును వృత్రాసురునకు భయపడి తమఆయుధ బలపరాక్రమముల నన్నిటిని దేవేంద్రునియందు సమర్పించిరి. ఆదేవేంద్రుని కృపవలన, దేవేంద్రునియందుగల ఆయుధ బలపరాక్రమము లన్నియు నీకులభించును. దేవేంద్రుని వుపదేశమువలన యీశ్వరుని ఆరాధింపుము. యీశ్వరునికృపవలన యిష్టసిద్ధిబొందుదుము. ఈప్రకారము వేదవ్యాసమునీంద్రుడు నాతోచెప్పి ప్రతిస్మృతియను విద్యను నాకు ఉపదేశించివెళ్ళెను. ధర్మరాజు యీవిద్యను అర్జునునకుచెప్పి ఉపదేశించెను. అర్జునుడాయోగవిద్యను గ్రహించిన ప్రభావమువలన

అధిక తేజోమూర్తియై దివ్యాస్త్రలాభమును పొందుటకు ధర్మరాజు చేత అనుజ్ఞనుపొందెను. అర్జునుడు శాస్త్రప్రకారము హోమముజేసి అగ్నిహోత్రునకు తృప్తికలిగించెను. బ్రాహ్మణులచేత దీవనలనుబొందెను. అర్జునుడు ధౌమ్యాది బ్రాహ్మణుల అనుమతినిబొందిధర్మరాజ భీమ నకుల సహదేవులతోజెప్పి తపస్సుచేయుటకు వెళ్ళునిమిత్తము ప్రయత్నముచేసెను. అప్పుడు అర్జునుడు గాండీవమును చేతియందు ధరించి యుండెను. అక్షయబాణములుగల రెండుఅంబుల పొదులను గలిగియుండెను. గొప్పభుజములుగలిగి యుండెను. బంగారుమయమైన కవచమునుధరించి యుండెను. అటువంటి అర్జునునిచూచి సకలభూతములును బ్రాహ్మణోత్తములును సంతోషము చేత వుప్పొంగి అర్జునుని యిట్లని దీవించిరి. ఈ అర్జునునకు శీఘ్రముగా యిష్టసిద్ధియగుగాక సకలవిఘ్నములును నశించుగాక! అని యిట్లు సకలభూతములును, బ్రాహ్మణోత్తములును అర్జునుని దీవించిరి. అప్పుడుద్రౌపది అర్జునుని దగ్గరకువచ్చి అర్జునుని ఉత్సాహమునుయెరిగి అతనితో యిట్లనెను.

ప్రాణేశ్వరా! అర్జునా! అవమానములు సహించెడి క్షత్రియకులమందు ఇకను నాకు జన్మము కలుగకుండవలెను. నాకు గల అవమానమును నీవు సహించియుంటివి గనుక ఇక నాకు బ్రాహ్మణకులమందేజన్మము గలుగునుగాక. ప్రాణనాథా అర్జునా! మేమందరము శత్రువులు కలిగించిన అవమాన మను సముద్రమందు మునిగి యున్నాము. నీవు కరుణచేత మమ్ములనందరి నుద్ధరింపుము. అన్యులు పూనుకొనని యీ మహాకార్యమునకు నీవు పూనుకొంటివి. నీవు మహాగుణవంతుడ వగుదువు. దిక్కులును, భూమియు, చంద్రుడును, ఆకాశములు, భూమియు, గాలియు నిన్ను సర్వదా రక్షించుచుండుగాక. అని యిట్లు ద్రౌపది అర్జునుని దీవించి, తన దృష్టులచేత అర్జునుని ప్రేమతో కౌగిలించుకొనినట్లు నటించుచు అర్జునుని విడిచి

యుండుటకు సమ్మతింపని మనస్సును కొంతసేపటికి సమ్మతింపజేసెను. అంతట అర్జునుడు యీశాన్యదిక్కు తట్టునకు వెళ్ళెను. అర్జునుడు ఇంద్రసంబంధమైన యోగశక్తివలన సర్వలోకములచేత జూడజాలని మహాతేజోవంతుడై హిమవత్పర్వతగంధమాదన పర్వతములను గడచి పోయెను. అర్జునుడు యోగవిద్య, ధనుస్సు అను రెంటిని సహాయము చేసికొని యింద్రకీలమను మహాపర్వతమును దాటిపోవుటకు పోవుచుండెను. అప్పుడు నీవు వెళ్ళవద్దని ఒక మధురధ్వని అర్జుననకు వినబడెను. అప్పుడే ఆకాశములోనుండి అర్జునునిమీద భోరనపుష్ప వర్షము కురిసెను. అందుకు అర్జునుడు ఆశ్చర్యమును బొంది వెళ్ళుచుండగా, అతనియెుందర వృక్షమూలమందు ఒక ముసలిబ్రాహ్మణుడుండెను. ఆ బ్రాహ్మణుడు అధిక బ్రహ్మతేజోవంతుడై సర్వదా యమనియమాదులచేత శుష్కించిన దేహము గలిగియుండెను. అట్టి బ్రాహ్మణుని అర్జునుడు జూచి నమస్కరించి బ్రాహ్మణునిదగ్గిరనుండి విశ్రమించుకొనుచుండెను. ఆ బ్రాహ్మణుడు అర్జునుని జూచి యిట్లు పలికెను. పురుషశ్రేష్ఠా! నీవు యెక్కడినుండి వచ్చుచున్నావో చెప్పుము. మహాతేజస్సు గలిగియున్నావు. ధర్మనియమమును గలిగి యున్నావు. నీవు యీ పర్వతవనమందున్నందువన ప్రయోజనము లేదు. నీవు సిద్ధిని పొందితివి. నీకు యిష్టములైన పుణ్యఫలములను పొందుము. ఈ పర్వతవనమందు పరమశాంతులైన తపస్సంపన్నులుందురు. ఇక్కడ ధనుర్బాణ ఖడ్గకవచాదులను ధరించియుండవలసిన పనిలేదు. నీవు ధనుర్బాణములను ధరించియున్నావు. నీవు క్షత్రియుడవో కాదో తెలియలేదు. కామక్రోధాదులులేని బ్రాహ్మణులు యీ పుణ్యభూమియందుందురు. నీవు యీ పుణ్యభూమియందు ఆయుధములను ధరించియుండవద్దు. ఈ ఆయుధములను విడువుము. అని యిట్లు ఆ ముసలి బ్రాహ్మణుడు అర్జునునితో జెప్పి బోధించెను,

ఆ విఘ్న వాక్యములకు అర్జునుడు చలింపకుండెను. ఆ అర్జునుని ధైర్యమునకు ఆ బ్రాహ్మణరూపధారియైన దేవేంద్రుడు మెచ్చి నిజరూపమును జూపి యిట్లు అనెను.

ఓ పుత్రుడా! అర్జునా! నీధైర్యమునకు నేను మెచ్చితిని. నీకు యిష్టములైన వరముల నిచ్చెదను వేడుము. అని దేవేంద్రుడు జెప్పగా అర్జునుడు భక్తిపూర్వకముగా రెండుచేతులను జోడించి నమస్కరించి యిట్లనెను. మహాత్మా! దేవేంద్రా! నీ అనుగ్రహము వలన నాకు దివ్యాస్త్రలాభము గలుగవలయును. ఇదియే నాకిష్టమైన వరము. అని అర్జునుడు వేడుకొనగా దేవేంద్రు డిట్లు పలికెను. పుత్రుడా! అర్జునా! నీవు కోరినప్రకారము దివ్యాస్త్రములను యిచ్చెదను. నీవడిగినది దుర్లభముగాదు. పుణ్యలోకములును, దేవత్వము, సర్వకామములును వేడుకొనుము యిచ్చెదను. అని దేవేంద్రుడు అర్జునునితో జెప్పగా అర్జునుడు దేవేంద్రునకు యిట్లనెను. మహాత్మా! దేవేంద్రా! ఆవరములన్నియు నాకక్కరలేదు. నాకు దివ్యాస్త్రములు కావలయును. దుర్యోధనాది శత్రువులందరును మాకు గొప్ప అవమానదుఃఖములను కలిగించిరి. ఆ మహాదుఃఖముచేత నా సహోదరులందరును పరితపించుచు దీనులైయున్నారు. నేను వారి దుఃఖమును పోగొట్టజాలక ఊరక వెళ్ళినయెడల నన్ను జనులు దూషింతురు. అని యిట్లు అర్జునుడు దేవేంద్రునితో జెప్పెను. ఆ కొడుకుమాటలకు దేవేంద్రుడు సంతోషించి కృపగలవాడై యిట్లనెను. అర్జునా! దివ్యాస్త్రములను పొందవలెనని నీకు మిక్కిలిగా యిష్టమున్నయెడల శీఘ్రముగా, అధికయోగశక్తివలన శివుని ప్రత్యక్షము చేసికొనుము. ఆ యీశ్వరుని అనుగ్రహము పొందితివేని యీశ్వరుడు నీ యిష్టమును ఫలింపజేయును. ఈశ్వరుని అనుగ్రహము గలిగినవెంటనే దిక్పాలాది దేవశ్రేష్ఠులందరును నీకు సకలమైన దివ్యాస్త్రములను యివ్వగలరు,

అని యీరీతిగా దేవేంద్రుడు అర్జునునితో జెప్పి అంతర్ధానుడై వెళ్ళెను. అంతట అర్జునుడు దేవేంద్రుడు చెప్పినప్రకారము సమాధి చిత్తముగలవాడై హిమవత్పర్వతశిఖరమునకు వెళ్ళి తపోవనమందు యీశ్వరుని గురించి తపస్సుచేయుటకు ప్రారంభించెను. ఆ తపోవనమందు పుష్పములచేత పరిపూర్ణములైన నానావిధ వృక్షములుండెను. మనోహరములైన సరస్సులుండెను. అట్టి తపోవనమందు అర్జునుడు తపశ్శు జేయుటకు ప్రారంభించెను. అప్పుడు దేవవాద్యధ్వనులును, దేవవృక్షపుష్పముల యందు గల సువాసనతోగూడిన గాలియు, యీ రెండును అర్జునుని మనస్సునకు సంతోషము గలిగింపుచుండెను. ఆ తపోవనమం దర్జునుడుండి మనోవాగ్దేహ కర్మముల యందు నియమముగలవాడై యీశ్వరునియందే చిత్తమునిలిపి తపస్సుజేయుచుండెను. అట్లు అర్జునుడు తపస్సు ప్రారంభించి మూడు దినములకు ఒక్కసారిగా పండ్లు భక్షించుచు త్రిరాత్రి ఉపవాసముల చేత మాసము గడిపెను.

పిమ్మట ఆరేసి దినములు ఉపవాసముజేయుచు రెండవమాసమును పిమ్మట పదిహేను దినములు ఉపవాసముజేయుచు మూడవ మాసము గడపెను. నాలుగవ మాసమందు సర్వదా వాయువును భక్షించుచు రెండుచేతులను పైకెత్తి ఏకపాదమందు గల బొట్టన వ్రేలి కొనయందు నిలిచియుండి నాలుగవ మాసమును జరిపెను. జనమేజయమహారాజా! యీ ప్రకారముగా అర్జునుడు అతిఘోర తపస్సు జేయుచుండెను. అట్టితపస్సుజేయు అర్జునుని జూచి ఆ వనమందు ఋషులు ఆశ్చర్యమును పొంది యీశ్వరుని దగ్గిరకు పోయి యిట్లనిరి.

మహాత్మా! పరమేశ్వరా! మహాబలవంతుడగు అర్జునుడు అతిఘోర తపస్సు జేయుచున్నాడు. అతని తపః ప్రభావము కలిగిన

అగ్ని హోత్రమందుగల పొగలు మేఘములువలె ఆవనమందు వ్యాపించి యున్నవి. అర్జునుని తపోభారమునకు సకలజీవులును భయపడు చున్నారు. అర్జునుని తపస్సువంటి తపస్సును చేసినవారు యిదివరకు లోకమందు కనపడలేదు. అర్జునుని యిష్టమును దీర్చి అతని తపో భారమును వారింపుము. అని యిట్లు మునులందరును యీశ్వరునితో జెప్పుకొని ప్రార్థించిరి. ఆ మునులమాటలను యీశ్వరుడు విని నవ్వు ముఖము గలవాడై మునుల కిట్లుచెప్పెను. మునులారా! అర్జునుని యభిప్రాయమును నే నెరుగుదును. వానికిష్టమైన వరమిచ్చి వాని మనస్సునకు సంతోషమును గలిగించెదను. మీ రందరును మీ మీ యాశ్రమములకు వెళ్ళి సుఖముగా నుండుడు. అని యిట్లు యీశ్వరుడు మునులతో జెప్పి వారిని పంపించెను.

## ఈశ్వరుడు కిరాతవేషముతో అర్జునునియొద్దకు వచ్చుట

జనమేజయమహారాజా! ఈశ్వరుండంతట బంగారు వంటి వర్ణముగల దేహముగలవాడై గొప్పధనస్సును ధరించి యెరుకల రాజాయెను. పార్వతీదేవియు, యెరుకల స్త్రీరూపమును ధరించెను. భూతగణములన్నియు యెరుకలవాండ్రై పొట్టిచేతులు గలిగి మిడి గ్రుడ్లు గలవారైరి. ఆభూతముల భార్యలందరును యెరుకల స్త్రీ రూపములను ధరించియుండిరి. ఈ ప్రకారముగా భూతములన్నియు యెరుకలవాండ్ర రూపములను ధరించి, ఆ యెరుకలరాజు ముందర బారులుతీరి నిలిచియుండిరి. అంతట పరమేశ్వరుడగు యెరుకలరాజు వేటయను నెపముచేత అర్జునుడుండు వనమునకు వచ్చెను. ఆ యెరు కలసైన్యము వచ్చునప్పుడు ఆ వనమందుగల భూమియంతయు కదలుచుండెను. ఆ వనమందుండు మృగములును, పక్షులును, భయ పడి మూగలవలె కూయక కుంటివానివలె కదలక గుడ్డివానివలె

చూడజాలకుండెను. అట్టి సమయమందు యెరుకల సైన్యముతో పరమేశ్వరుడు శీఘ్రముగా అర్జునుని దగ్గరకు వచ్చుచుండెను. అంతట పరమేశ్వరుని చేత బోధింపబడిన మూకుడను రాక్షసుడు అడవిపంది రూపమును ధరించి అర్జునుని భేదించెడి నిమిత్తమై భయంకరముగా అర్జునుని దగ్గరకు వచ్చుచుండెను. అప్పుడు అర్జునుడు సారమందు ఆ యడవిపందిని జూచి గాండీవమును ధ్వనింపజేయుచు, ఆ పంది మీాద బాణమును వేయుటకు ప్రయత్నించెను.

అప్పుడు ఆ అడవి పంది, బాణమువచ్చునట్లు పరుగెత్తుచు, అర్జునుని దగ్గరకు వచ్చెను. ఆ పందిమీాద బాణము వేయవద్దు. వేయవద్దని యెరుకలరాజు అరచుచుండెను. వానిమాటను అర్జునుడు ఆదరింపక గొప్పబాణమును ఆపందిమీాద వేసెను. అంతట యెరుకల వాని రూపము ధరించిన యీాశ్వరుడును ఒకబాణము ఆ పందిమీాద వేసెను. ఈరీతిగా వేసిన ఈశ్వరార్జునుల బాణములు రెండును ఒక్కసారే రెండు పిడుగులు పడునట్లు మ్రోయుచు ఆ పందియొక్క రెండు ప్రక్కలయందును తగిలెను. ఆ రెండు బాణముల భారవేగముచేత ఆపంది సముద్రమందు తిరిగిన మందర పర్వతమువలె గిరగిరతిరిగెను. ఇట్లు ఈశ్వరార్జునుల రెండు బాణములు తగులుటచేత ఆమూకుడను రాక్షసుడు పందిరూపమును విడిచి, రాక్షసరూపమును దాల్చి మాయమైపోయెను. అందుకు అర్జును డాశ్చర్యమునుపొంది తన యెదుట ఒక యెరుకలరాజును జూచెను. ఆ యెరుకలరాజు గొప్ప ధనస్సును ధరించి యుండెను. మేరుపర్వత శిఖరమువంటి ఆకారము కలిగి అపరిమితమైన యెరుకల పదాతిసైన్యమును గలిగియుండెను. యౌవనవంతులైన అనేక యెరుకలజాతి స్త్రీపురుషుల సహస్రములతో కలిసి యుండెను. అటువంటి యెరుకలరాజును జూచి అర్జును డిట్లు పలికెను.

ఓ యెరుకలవాడా! నీవు యెవ్వడవో చెప్పుము. ఈ వనము మనుష్యులకు గోచరముకాదు. ఈ దివ్యవనమందు నీవు స్త్రీలతో గూడి సంచరించుటకు కారణమేమో తెలియను. మరియు నేను కొట్టిన పందిని నీవునుకొట్టి మృగయా ధర్మవిరోధమును చేసితివి. కనుక ఇప్పుడు నా తీక్ష్ణబాణముచేత నిన్ను చంపివేసెదను అని యిట్లు అర్జునుడు చెప్పగా ఆ యెరుకలరాజు నవ్వుచు యిట్లనెను. అయ్యా! ఆ పందిని నేను కొట్టితిననియు, ఆ పంది నా బాణముచేత చచ్చెననియు, నీవు చెప్పుచున్నావు. నీవిట్లు చెప్పుట న్యాయము గాదు. నీకులేని శౌర్య సంపదను జెప్పుకొనుచు, అల్పుని వలె గర్వ మును జూపితివి. ఇకను నీ విట్లు చెప్పుట, బడాయి జూపుటవలన ప్రయోజనము లేదు. నీకుబలము శక్తి యున్న యెడల, నాతో యుద్ధము చేయుము. నీ భుజాబలమును యిప్పుడే మాపెదను. అని యిట్లుయెరు కల రూపముననున్న ఈశ్వరుడు అర్జునునితో జెప్పుచు బాణములను వేయుచు అర్జునుని మీదకు వచ్చెను.

అర్జునుడు, యెరుకల రాజుమీద పిడుగులవంటి క్రూర బాణ వర్షమును కురిపించెను. ఆసమయమందు వర్షధారలను పర్వతము గ్రహించినట్లు అర్జునుని బాణవర్షమునంతయు ఈశ్వరుడు తన దేహ మందు అణచుకొనెను. ఆ బాణసమూహము లన్నియు, యెరుకల రాజు దేహమందణగి పోయెను. ఆ బాణముల దెబ్బలకు యెరుకల వాని దేహమందు ఒక్కగాయమైనను కలుగలేదు. అప్పుడు అర్జును డందుకు ఆశ్చర్యమును పొంది తనమనస్సులో యిట్లని తలంచెను. నాభుజబలముచేత నాగాండీవము వలన విడువబడిన బాణములన్నియు యీ యెరుకల వానికి తగిలి వ్యర్థములాయెను. నాబాణములను వీడు సహించి ఒకగాయమునయినను పొందక యెప్పటివలె ఉత్సాహ మును పొందియున్నాడు. నాక్రూర బాణములను సామాన్య పురు

షుడు సహింపజాలడు, ఇతడు, దేవేంద్రుడో, ఈశ్వరుడో, కుబే రుడో, అయి యుండవచ్చును. అవివేకియందు ఉపయోగించబడిన మంచి మాటలవలె నేను వేసిన అపరిమిత క్రూరబాణము లన్నియు యీ యెరుకలవాని యందు వ్యర్థములాయెను.

ఈ యెరుకలవాడు నామీద వేసిన బాణములు క్రూర దివ్యాస్త్రములువలె నాదేహమందు తగిలి నాదేహమునకు బాధ గలిగింపుచున్నవి. ఇంతబాధను, ఇదివరకు నేనెన్నడును పొందలేదు. యీ యెరుకల కేషధారి యెవ్వడో తెలియకున్నది. ఈహిమవ త్పర్వతమందు దేవతలు నివసింతురు. ఒక దివ్యపురుషుడు యీ యెరుకల రూపముచేత వచ్చియుండవచ్చును. అనియిట్లు అర్జునుడు తనమనస్సులో తలచుచు, పిడుగులతో సమానములైన దివ్యబాణము లను, ఆయెరుకులవానిమీద వేసెను. ఆదివ్యబాణములన్నియు యెరు కలవానిదేహమం దణగిపోయెను. అప్పుడు అర్జునుని అంబులపొదుల యందుగల యక్షయబాణములు, కనబడలేదు. ఆయంబులపొదుల యందుగల యక్షయబాణములులేక వట్టిసంచులు మాత్రముండెను. ఆ అక్షయబాణములులేని అంబులపొదులను అర్జునుడుచూచి ఆశ్చ ర్యమునుపొంది తనమనస్సులో యిట్లనితలంచెను. ఖాండవవనమును దహించిన దినమందు అగ్నిదేవుడు నాకు అక్షయబాణములుగల యీ రెండంబులపొదులను యిచ్చెను. ఈ అంబులపొదులయందు ఇప్పుడు బాణములులేవు. ప్రళయకాలమందు యెండిపోయిన సముద్రమువలె యిప్పుడు యీరెండంబుల పొదులును బాణములులేకయున్నవి. ఇది యేమియాశ్చర్యమో తెలియకున్నది. అని యీరీతిగా అర్జునుడు తన మనస్సులో తలచుచు కోపించుకొని గాండీవమును యెత్తి ఆయెరుకల వానిమీదవైచెను. ఆ గాండీవముకూడా ఆయెరుకలవాని దేహమం దణగిపోయెను. ఈప్రకారము అర్జునుడు గాండీవమును పోగొట్టుకొని

అపరిమితమగు కోపముతో కత్తి తీసికొని యెరుకలవాని శిరస్సునందు కొట్టెను. ఆకత్తియు యెరుకలవాని శిరస్సునం దణగిపోయెను. అర్జునుడు వృక్షములను, బండలను పెరికి యెరుకలవానిమీద విసరి వేసెను. అవియన్నియు యెరుకలవాని దేహమునకు అద్భుతముగా అణగి పోయెను.

అర్జునుడు మిగులకోపముగలవాడై యీశ్వరుడగు యెరుకలవానిని పట్టుకొని పిడికిలిచేత పొడుచుచు ముష్టియుద్ధము జేసెను. అర్జునుని శౌర్యగౌరవములను అక్కడనున్న యెరుకలవాండ్రందరును బాగడుకొనిరి. అప్పుడు ఈశ్వరుడు తనదివ్యదేహముచేత అర్జునుని దేహమును పీడింపజేసెను అశివునిదివ్యదేహమును తగులుటచేత అర్జునుడు మూర్ఛిల్లి క్రిందబడెను. ఆసమయమందు అర్జునునిశౌర్యపరాక్రమధైర్య గుణములకు ఈశ్వరుడు మెచ్చి యెరుకలదేహమునువిడచి తనదివ్యదేహమును ధరించి అర్జునునకు ప్రత్యక్షమాయెను. అప్పుడు ఈశ్వరుని దివ్యదేహమందుగల జడలలో బాలచంద్రుడుండెను. చేతియందు శూలాయుధముండెను. కంఠమునల్లగానుండెను. యేనుగుచర్మమును వస్త్రముగా ధరించియుండెను. ముఖమందు మూడవనేత్రమగు అగ్నిహోత్రుడుండెను. సర్పములు మెడయందు హారములుగా గలిగియుండెను. ఈ ప్రకారముగా ఈశ్వరుడు నిజరూపముతో అర్జునునకు ప్రత్యక్షమై యిట్లుపలికెను.

అర్జునుడా! క్షత్రియులలో యెవ్వరును నీవంటిశౌర్య ధైర్యవంతులు లేరు. ఏ యుగములయందైనను, యెప్పుడైనను నీవంటి శౌర్యధైర్యవంతుడగు క్షత్రియుడు లేడు. నీతపస్సునకును, నీకుగల క్షాత్రగుణమునకును నేనుమెచ్చితిని. నీకోరికను సఫలముజేసెదను. సకలదేవ రాక్షసమనుష్య లోకములను, నీవేజయింపగలవు. నాస్వరూపమును జూడుము. అనియిట్లు పరమేశ్వరుడు అర్జునునితో జెప్పి

అర్జునునకు దివ్యదృష్టినియిచ్చెను. అప్పుడు అర్జునుడు దివ్యదృష్టిచేత పరమేశ్వరుని దివ్యస్వరూపమునుజూచి కృతార్థుడై పులకరింపబడిన మనోదేహముగలవాడై సాగిలిపడి నమస్కరించెను. అర్జునుడు సాష్టాంగనమస్కారములు జేసి భక్తిపూర్వకముగా పరమేశ్వరుని యిట్లని స్తుతించెను.

## అర్జునుడు పరమేశ్వరుని స్తోత్రముజేయుట

అర్జునః-శ్లో॥ కపర్దిన్ సర్వదేవేశ భగనేత్ర నిపాతన।
దేవదేవమహాదేవ నీలగ్రీవ జటాధర ॥ 1 ॥
కారణానాంచ పరమం జానే త్వాం త్ర్యంబకం విభుమ్ ।
దేవానాంచ గతిం దేవ త్వత్ప్రసూత మిదం జగత్ ॥ 2 ॥
అజేయ స్త్వం త్రిభిర్లోకై స్సదేవాసుర మానుషైః ।
శివాయ విష్ణురూపాయ విష్ణవే శివరూపిణే ॥ ; ॥
దక్షయజ్ఞ వినాశాయ హరిరుద్రాయ వైనమః ।
లలాటాక్షాయ శర్వాయ మీఢుషే శూలపాణయే ॥ 4 ॥
పినాకగోప్త్రే సూర్యాయ మార్జాలీయాయ వేధసే ।
ప్రసాదయేత్వాం భగవన్ సర్వభూతమహేశ్వర ॥ 5 ॥
గణేశంజగతశ్శంభుం లోకకారణ కారణమ్ ।
ప్రధాన పురుషాతీతం పరం సూక్ష్మతరం హరమ్ ॥ 6 ॥
వ్యతిక్రమం మేభగవన్ క్షంతు మర్హసి శంకర ।
భగవద్దర్శనా కాంక్షః ప్రాప్తోస్మిమం మహాగిరిమ్ ॥ 7 ॥
దయితం తవదేవేశ తాపసాలయ ముత్తమమ్ ।
ప్రసాద యేత్వాం భగవన్ సర్వలోక నమస్కృతమ్ ॥ 8 ॥
నమేస్యాద పరాధోయం మహాదేవాతి సాహసాత్
కృతోమయాయ మజ్ఞానాత్ విమర్దోయస్త్వయాసహ
శరణం ప్రతిపన్నాయ తత్ క్షమ స్వార్హ శంకర॥

ఓ మహాత్మా ! పరమేశ్వరా ! నీవుసర్వలోకము హేశ్వరుడవు. సకలలోకములు పుట్టుటకు పెరుగుటకు లయించుటకు నీవే మూలకారణుడవు. త్రిపురాసురులను చంపినవాడవు. విష్ణుదేవునకు ప్రియుడవు. నీవు చంద్రుని ధరించినవాడవు. దేవేంద్రాది దేవతలకు ఆనందమును కలిగింపుచుందువు. నీవు పుణ్యస్వరూపుడవగుదువు. ముఖమందు అగ్ని నేత్రము గలవాడవగుదువు. దక్షునియజ్ఞమును నశింపజేసినవాడవగుదువు. నీస్వరూప తత్వమును బుద్ధిమంతులు విచారించుచు అధ్యాత్మ యోగబుద్ధి విజ్ఞానమాయాకర్మలకు కారణమని వర్ణింతురు. నీవుపరమాత్ముడవని భావింపుచుందురు. నీవు సర్వేశ్వరుడవగుదువు. సర్వజ్ఞుడవగుదువు. సర్వాత్మ స్వరూపుడవగుదువు. నిర్వికల్పప్రభావుడవగుదువు. నీవు పృథివ్యప్తేజోవాయురాకాశ సూర్యచంద్రాదులను కలిగించి సర్వలోకములను ప్రవర్తింప జేయుచున్నావు. సంసార చక్రక్రియాయంత్రమును వహించితివి. నీవు ఆదిదేవుడవగుదువు. నీ భక్తులగు జనులు అత్యంత యోగసంసిద్ధిచేత నిర్మలజ్ఞానవంతులై సంసార మాయాంధకారమును జయింతురు. కామక్రోధాదులనువిడిచి నీభక్తులై నీపాదకమలములను సేవింపుచు తృప్తులగుదురు. నీవు సత్యజ్ఞానానంద స్వరూపుడవు. భార్గవ అగస్త్యకుత్సాది మహాముని గణములచేత స్తుతింపబడుదువు. నీముఖమందుగల అగ్నినేత్రముచేత మన్మథుని భస్మముజేసితివి. నీవు భస్మమును పూసికొని యుందువు. గంగను ధరించి యుందువు. సకలదేవగరుడ గంధర్వసిద్ధసాధ్య సర్పరాక్షసరాజులందరును నీ అనుగ్రహమువలన శాశ్వతములైన సకలైశ్వర్యములను పొందిరి. నీవు సర్వజీవులను శిక్షించెడి యీశ్వరుడవగుదువు. సర్వలోకప్రభుడవు. సకలదేవతలచేత పూజింపబడుదువు. నేను కోరిన వరములనిమ్ము. నీవు కృపామూర్తివి. మూడులోకములకు ప్రభుడవు. నీకు నమస్కారము. నమస్కారము. నమస్కారము.

అని యిట్లు అర్జునుడు పరమేశ్వరుని స్తుతింయించి రెండు చేతులను జోడించుకొని మరల యిట్లు పలికెను.

పరమేశ్వరా ! నీవు యెరుకులవాడవని తలచి మిమ్ములను యెరుగక మీతో యుద్ధము చేసితిని. నాతప్పిదమును మీరు క్షమింప వలయును. నీచరిత్రములను యెరుగుటకు యెవ్వరికిని సాధ్యము గాదు. అని యిట్లు అర్జునుడు పరమేశ్వరునితో జెప్పుకొని ప్రార్థించెను. పరమేశ్వరుడు కృపావిస్తారదృష్టిచేత అర్జునునకు తృప్తికలిగించి నవ్వుచు అర్జునుని చేతిని పట్టుకొని యిట్లు పలికెను.

అర్జునా ! నీవు చేసిన తప్పును క్షమించితిని. మనుష్యులకు సాధ్యముగాని నీ పరాక్రమమునకు మెచ్చితిని. పూర్వజన్మమందు నీవు నరుడనెడి దేవఋషి నగుదువు. నీవునారాయణునకు స్నేహితుడవు. నరనారాయణులను మీరిద్దరును బదరీవనమందు అనేకసహస్ర సంవత్సరములుతపస్సుచేసిన మహాత్ములగుదురు. మీయిద్దరికారణము వలన జగత్తులు రక్షింపబడుచున్నవి. ఈగాండీవమను ధివ్యధనుస్సు పూర్వమునీదేయగును. ఈ గాండీవమువలననే పూర్వము దేవేంద్రుని రాజ్యాభిషేకకాలమందు నీవు దానవులను జయించితివి. ఆ గాండీవము ఇప్పుడు అక్షయబాణములుగల అంబులపొదులతోటి నామాయవలన మ్రింగబడెను. నామాయాశక్తివలన నీఅక్షయబాణములుగల అంబులపొదులును నీగాండీవమును నాదేహమందు అణగి యున్నవి. ఇదిగో! నీ గాండీవమును నీ అక్షయబాణములుగల రెండు అంబుల పొదుల నీకిచ్చితిని. దీసికొనుము. ఇకను నీ కిష్టమైనవరమును వేడుము. యిచ్చెదను. అని యిట్లు యీశ్వరుడు అర్జునునితో జెప్పగా, అర్జునుడు యిట్లనియె.

మహాత్మా ! పరమేశ్వరా ! నాకుఇష్టమైన వరమును దయచేయదలచితివేని నీ పాశుపతమను దివ్యాస్త్రమును నాకు యిమ్ము.

నా యందు కరుణింపుము నీపాశుపతాస్త్రమును, బ్రహ్మశిరమను దివ్యాస్త్రమునుకూడ ప్రళయకాలమందు ప్రయోగింపబడి జగత్సంహారము చేయుననివింటిని. ఆరెండు దివ్యాస్త్రములవలన అభిమంత్రింపబడి అనేకశతసహస్ర సంఖ్యలుగల శూలాయుధములును, గదలును, సర్పములవంటి బాణములును పుట్టునని వింటిని. నీకృపవలన నీపాశుపతాస్త్రమును, పొంది సకలదైత్యదానవయక్షరాక్షస పిశాచ సర్పములను జయించెదను. మరియు, సహజకవచకుండలములుగల కర్ణుని జయించెదను. అనియిట్లు పరమేశ్వరునితో జెప్పెను. అంతట పరమేశ్వరుడు కరుణించి మంత్రధ్యాన జపహోమ పూర్వకముగా పాశుపతమను దివ్యాస్త్రమును అర్జునునికిచ్చెను. ఆ పాశుపతాస్త్రమును సంధించుపద్ధతియు, విడుచు పద్ధతియు, అర్జునునకు చూపి తెలిపెను. యీరీతిగా అర్జునునకు పరమేశ్వరుడు ప్రీతిపూర్వకముగా పాశుపతాస్త్రము నిచ్చి యిట్లుచెప్పెను.

అర్జునా! యీ పాశుపతాస్త్రమునకు సాధ్యముగానిది లేదు. ఆ యస్త్రమును అల్పులయందు బ్రయోగించినయెడల జగత్సంహారము గావించును. యీ దివ్యాస్త్రప్రభావము, దేవేంద్ర, కుబేర, వరుణ, యమధర్మరాజాది దేవతలెవ్వరికిని దెలియజాలరు. యీ యస్త్రస్వరూపమును దేవతలే దెలుపలేనప్పుడు మనుష్యుల విషయమై చెప్పవలసిన యగత్యములేదు. అర్జునా! పాశుపతమను దివ్యబాణముచేత నీవు సకలలోకములను జయింపగలవు. అని యీశ్వరుడు అర్జునునకు వరమిచ్చి పాశుపతాస్త్రము నిచ్చి, మంత్రపూర్వక మగు ప్రయోగ ఉపసంహారములను తెలిపి అంతర్థానుడై వెడలెను. వేయి సూర్యులు గల సూర్యమండలమువలె ప్రకాశించుచున్న పాశుపతాస్త్రము అర్జునుని చేతియందుండెను. అర్జునుని చేతియందుగల దివ్యాస్త్రమును జూచి సకలదైత్యదానవ దేవయక్షరాక్షస గణములంద

రును మిక్కిలి భయమును పొందిరి. అప్పుడు భూమియంతయు దిర్దిర దిరిగెను. అట్లు భూమి చలించినందున సముద్రపర్వతము లన్నియు కదలెను. పరమేశ్వరుని దివ్యదేహము అర్జునుని దేహమును తాకినందున అర్జునుని దేహము పరిశుద్ధమగుటయేగాక సకలపాపములు లేనిదై అధికమైన తేజోబలములను గలిగియుండెను. ఆ విషయములను అర్జునుడు విని యెరిగి సంతోషమును గలిగియుండెను. అట్లు అర్జునుడు సంతోషించి తన మనస్సులో యిట్లని తలంచెను. పరమేశ్వరుడగు శివునిచూచితిని. ఆ శివుని ముఖమందుగల అగ్నినేత్రమును జూచితిని. అందువలన అధిక పుణ్యాత్ముడనై కృతార్థుడనైతిని. యీ దినమందు నాకు పాశుపతాస్త్ర లాభము గలిగినందున ధర్మరాజునకు శత్రువిజయము గలుగును. సకలరాజ్యలక్ష్మి యంతయు ధర్మరాజునకు లభించును అని యీరీతిగా అర్జునుడు తనమనంబున తలచుచు సంతోషచిత్తము గలిగియుండెను.

## ఇంద్రుడు దేవగణములతో అర్జునునకు ప్రత్యక్షమగుట

జనమేజయ మహారాజా! ఈప్రకారము ఈశ్వరునిచేత అర్జునుడు పాశుపతాస్త్రము మొదలగువరములను పొందెనని దేవేంద్రు డెరిగి సకలదేవగణములను తీసికొని అర్జునునిదగ్గరకు వచ్చెను. ఆ దేవేంద్రుని వెంబడి కుబేరుడును, యముడును, వరుణదేవుడును, అశ్వినీదేవతలు మొదలగు దేవశ్రేష్ఠు లందరును వచ్చిరి. సకల దేవగణములును ఆ దేవేంద్రుని వెంబడివచ్చిరి. ఆ దేవగణము లందరును రాగా వారి దివ్యవిమానములన్నియు ఆకాశమందు ప్రకాశింపుచుండెను. అట్టి సమయమందు గొప్ప గంభీరధ్వనితో ప్రీతిపూర్వకముగా యమధర్మరాజు అర్జునునకు యిట్లనెను.

అర్జునా! దేవేంద్రుడు మొదలగు దేవత లందరును నీకు వరము లివ్వవలెనను వేడుకచేత యిప్పు డిక్కడికి వచ్చి

యున్నారు. ఈ దేవేంద్రాది దేవతలనందరిని జూడుము. నీకు దివ్యదృష్టి నిచ్చితిని. యీ దివ్యదృష్టిచేత సకలదేవతలను జూడుము. నీవు పూర్వజన్మమందు నరుడను దేవఋషివి. నీవు బ్రహ్మదేవుని యొక్క ప్రార్థనమూలమున శ్రేష్ఠమైన క్షత్రియకులమందు యిప్పుడు మనుష్యుడవై పుట్టితివి. సూర్యాంశమువలన బుట్టిన కర్ణుని నీవు చంపుదువు. దేవదైత్యదానవగంధర్వ యక్షరాక్షసాంశము వలన బుట్టిన సకలరాజులను నీవు యుద్ధమందు జంపుదువు. నీకు అక్షయమైన కీర్తి కలుగును. అని యీరీతిగా అర్జునునకు యమధర్మరాజు వరమిచ్చి తన దండాయుధమును విధియుక్తముగా అర్జునునకిచ్చెను. వరుణదేవుడు శత్రుభయంకరములైన తన పాశాయుధములను అర్జునునకిచ్చెను. అంతట కుబేరుడు కుబేరాస్త్రమును, ప్రీతిపూర్వకముగా అర్జునునకిచ్చెను. ఇట్లు దివ్యపురుషుడైన అర్జునుడు యమునివలన దివ్యదృష్టిని పొంది దేవరూపధరులైన పితృదేవతలను జూచెను. తన యెదుట నిలిచియున్న మహానీలవర్ణుడైన యమధర్మరాజునుజూచెను. మరియు వైడూర్యవర్ణుడైన వరుణదేవునిజూచెను. బంగారు వర్ణముగల కుబేరునిజూచెను. యక్షగణములందరును కుబేరుని సేవింపుచుండిరి. అర్జును డటువంటి కుబేరుని జూచెను. ఈ ప్రకారము అర్జునుడు దివ్యదృష్టిచేత దేవశ్రేష్ఠులను జూచి వారివలన దివ్యాస్త్రములను పొంది వాక్పుష్పఫలములచేత ఆ దేవతల కందరికిని తృప్తి గలిగించెను. అర్జునుడు ఐరావతమను ఏనుగుమీద యెక్కివుండు దేవేంద్రుని జూచి పరమసంతోషమునుపొందెను. అప్పుడు దేవేంద్రు డర్జునుని జూచి తన మనస్సులో నిట్లని తలంచెను. నా పుత్రుడైన అర్జునుడు ఈశ్వరుని కృపవలన ఇష్టవరమును పొందెను. వీడుమహా గుణవంతుడు. సకల బంధుమిత్రులకును ఆనందము గలిగించును. అని యిట్లు దేవేంద్రుడు తన మనస్సులో దలచి తన వేయికన్నుల

చేత అర్జునుని జూచుచు వేయికన్నులు గల ఫలిత మీా యర్జునుని జూచుటయేయని పరమానందముతో పరమాశ్చర్యరసమందు మునిగి యుండెను. దేవేంద్రుడు అర్జునునిజూచి సంతోషించి యిట్లుపలికెను. అర్జునా ! నీవు పరమేశ్వరునివలన పరమసిద్ధిని పొందితివి. గనుక దేవ కార్యమును దీర్చుటకు నీవే యోగ్యుడవు. నా దివ్యరథమును యిక్కడకు పంపెదను. నీవారథమునెక్కి స్వర్గలోకమందుగల నా అమరావతి పట్టణమునకు రమ్ము. అమరావతియందే నీకు దివ్యబాణములను యిచ్చెదను. అని యీరీతిగా దేవేంద్రు డర్జునునితో జెప్పి దేవగణములతో కూడి అమరావతి పట్టణమునకు వెళ్లెను. అర్జునుడు దేవేంద్రుని రథమునకు యెదురుజూచుచుండెను. ఆ సమయమున దేవేంద్రుని సారథియగు మాతలి దేవేంద్రుని దివ్యమహారథమును తోలుకొని అర్జునునిదగ్గరకు వచ్చెను. దేవేంద్రుని దివ్యరథమునకు వాయు వేగముతో సమానవేగముగల పదివేల దివ్యాశ్వములు కట్టియుండెను. ఆ పదివేల దివ్యాశ్వములచేత ఆ దివ్యరథము ఆవహింపబడి యుండెను. దివ్యరథము మేఘమార్గమువలన మహావిభవముతో ప్రకాశించుచు వచ్చెను. ఆ దివ్యరథమునందు గల నవరత్న కాంతి సమూహములచేత భూమ్యాకాశములు రెండును, దేదీప్యమానముగా ప్రకాశించుచుండెను. ఆ దివ్యరథము వచ్చునపుడు కలిగిన గంభీరధ్వనిచేత పర్వతగృహాలయందు ప్రతిధ్వని గలిగియుండెను. నానావిధ ఆయుధములు గలిగియుండెను. అనేకసహస్రముల మెరుపులు ఒక్కసారి గలిగియున్నంత ప్రకాశముగలిగియుండెను. అటువంటి దేవేంద్రుని దివ్యరథమును దేవేంద్రుని ఆజ్ఞచేత మాతలి తోలుకొనివచ్చెను. అట్లువచ్చిన మాతలి అర్జునుని జూచి యిట్లు పలికెను.

అర్జునా ! సకలదేవరాక్షసులు తమకిరీటములందలి నవరత్నములు సోకునట్లుగా దేవేంద్రుని పాదములకు నమస్కరింపుచుందురు.

నీతండ్రియగు దేవేంద్రుడు నిన్ను జూడదలచి, అమరావతీపట్టణము నకు తీసికొని రమ్మని నన్ను పంపించెను. అనేక శత రాజసూయ అశ్వమేధ యజ్ఞములను జేసినవారికైనను ఈ రథము లభించదు. ఈ రథముమీద నెక్కి స్వర్గలోకమందు గల అమరావతి పట్టణము నకు రమ్ము. అని యిట్లు దేవేంద్రుని సారథియగు మాతలి అర్జును నితో జెప్పెను. అప్పు డర్జునుడు గంగాస్నానముచేసి పరిశుద్ధమైన దేహముగలవాడై దేవఋషి పితృతర్పణములు చేసి మాతలితో గూడియుండి ఆ దివ్యరథముమీద కూర్చుండెను.

## అర్జును డమరావతికి బోవుట

అట్లు అర్జునుడు దేవేంద్రుని రథముమీద నెక్కి అది వరకు తానున్న మందరపర్వతమును జూచి యిట్లుపలికెను. పర్వత రాజమా! మందరమా! నీయందు మహాత్ములగు వారు తపస్సమా ధుల నభ్యసించుచుందురు. అటులుండి అనేక పుణ్యలోకములను గోరుచు తపస్సు చేయుచుందురు. మహాత్ముల కందరకును నీవు ఆశ్ర యముగా నుందువు. దేవతా స్త్రీ పురుషులందరును నీయందు, విహ రింతురు. మహోత్సవములను గలిగియుందురు. నీవు మనోహరము లైన రత్నమయములైన చరియలను గలిగియున్నావు. నీయందుగల పుణ్యతీర్థములను సేవించుచు గంగానదియొడ్డున యిసుకతిన్నెలయందు గల వృక్షముల ఫలములను భక్షింపుచు సుఖముగా నుంటిని. నా అభీష్టవరములను పొందితిని. ఇకను అమరావతి పట్టణమునకు వెళ్ళి వచ్చెదను అని యిట్లు అర్జునుడు మందరపర్వతముతో జెప్పి దేవ మార్గమునకు వెళ్ళెను. (మందరపర్వతము హిమవత్పర్వతముతో చేరినదేయని తోచుచున్నది) ఇట్లు అర్జునుడు దివ్యరథముమీద నెక్కి స్వర్గలోకమందు దేవేంద్రుని పట్టణమగు అమరావతి ప్రవే

శించెను. అమరావతి పట్టణమందు మనోహరములైన రత్నమయము లగు మేడలును, విమానములును, గలిగియుండెను. పరమధర్మమార్గ ప్రకారము ప్రజాపరిపాలనము జేసిన రాజులును ఘోరయుద్ధమందు తమ ప్రభువులను స్తుతించుచు ప్రాణములను విడచిన వీరులును, యజ్ఞ విధులచేత దేవబ్రాహ్మణులను తృప్తిపరచిన పుణ్యాత్ములును, మహాతపస్సంపన్నులును ఆ యమరావతియందు గల మేడలయందు నివసించియుందురు. సకలలోక పట్టణములలో సమానముగా ఆ అమరావతి పట్టణము ప్రకాశించుచుండెను. అమరావతి పట్టణమందు సూర్యచంద్రాగ్నుల తేజస్సులేకున్నను, ఆపట్టణ తేజస్సుచేతసర్వదా ప్రకాశము గలిగియుండును. అగ్నిహోత్రములు లేనివారును, వేదమునకు విరుద్ధాచారముగలవారును మాంసమునే ఆహారముగా గల వారును యుద్ధమందు భయపడి పారిపోయెడివారును ఆ అమరావతికి పోజాలరు. అటువంటి అమరావతీపట్టణమందు అర్జునుడు ప్రవేశించి ఆపట్టణగోపురసమీపమందుండు ఐరావతమను దేవేంద్రుని యేనుగును జూచెను. ఆయేనుగు శిరస్సులోనుంచి సర్వదా మదజలధారలు కారు చుండెను. ఆటువంటి మదజలధారలచేత ప్రకాశించుచు సెలయేరులు గల మంచుకొండవలె ఆ ఏనుగు గొప్పదేహము గలిగి తెల్లగా ప్రకాశించుచుండెను. అటువంటి ఐరావతమును అర్జునుడు చూచుచు, దేవసిద్ధసాధ్యగంధర్వ కిన్నరగణములచేతస్తుతింపబడుచు వెళ్ళుచుండెను. ఆ సమయమందు ఆ చుట్టుప్రక్కలనుండు ఉద్యానవనములలో నుంచి పుష్పపరిమళములు గల చల్లని గాలి అర్జునునకు యెదురుగా కొట్టు చుండెను. ఆగాలికి అర్జునుడు సంతోషించెను. అప్పుడు దేవతలందరును వచ్చి అర్జునునిజూచి యిట్లని చెప్పుకొనిరి.

దేవతలారా! అర్జునుడు నరుడను అనాదిముని. దేవేంద్రుని పుత్రుడు. కృష్ణుడగు నారాయణునకు స్నేహితుడు. శివునిచేత వర

ములు పొందినవాడు. అని యీరీతిగా దేవతలు ప్రీతిపూర్వకముగా జెప్పుకొనసాగిరి. అంతట అర్జునుడు అమరావతి పట్టణముయొక్క విభవమును జూచి సంతోషించుచు అప్సరస్త్రీల సంగీతముచేత సంతోషించుచు వెళ్ళుచుండెను. అప్పుడు సిద్ధమునిగణములందరును అర్జునుని దీవింపుచుండిరి. అర్జునుడు అమరావతిపట్టణమునకు వెళ్ళి మాతలి జెప్పిన స్థలమందు రథముదిగెను. అర్జునుడు రథముదిగి దేవేంద్రుడున్న చోటికి వెళ్ళి వారికి నమస్కరించెను. అప్పుడు దేవేంద్రుడు తన పుత్రుడైన అర్జునుని కౌగిలించుకొనెను. పరమానందముచేత పులకాంకితుడాయెను. దేవేంద్రుడు ముందుగా అర్జునుని తన తొడమీద కూర్చుండ నియమించి పిమ్మట తన సింహాసనముమీద తనప్రక్కన కూర్చుండబెట్టెను. అంతట దేవేంద్రుడు తన కఠినమైన చేతులతో ఐరావతమును అదలించు కఠినహస్తతలముతో, అర్జునుని దేహమును తడుపుచుండెను.

అప్పుడు దేవవేశ్యాస్త్రీ లందరును చామరములను విసరుచుండిరి. అర్జునుడు యేకసింహాసనమందు దేవేంద్రునితో కూర్చుండు మహావిభవమును గలిగియుండెను. అంతట దేవేంద్రుని ఆజ్ఞవలన దేవగంధర్వ సిద్ధవిద్యాధరు లందరులు అర్జునుని పొగడిరి. దేవేంద్రుని ఒకరత్నమయమైన గృహములోనికి అర్జునుని పంపెను. ఆ గృహమందు అర్జునుడుండగా నాతని సమీపమున గంధర్వులు మనోహరములగు సంగీతములు పాడుచుండిరి. ఆసంగీతధ్వనులు అర్జునుని చెవులకు మహోత్సవమును కలిగింపుచుండెను. అంతట సూర్యాస్తమయమాయెను. చంద్రుడు ఉదయించెను. దట్టముగా వెన్నెలవ్యాపించుటచేత దిక్కులనుస్త్రీ అలంకరింపబడినట్లుండెను. ఆరాత్రికాలమందు దేవేంద్రుని యానతిచొప్పున ఊర్వసియను అప్సరస్త్రీయొకతె అర్జునునితో భోగింపదలచెను. ఊర్వశి వెన్నెలవంటి తెల్లనివస్త్ర

వెన్నెలవంటి తెల్లనివస్త్రమును కట్టుకొని, కర్పూరము, కస్తూరి, కుంకుమతోఁగూడిన సుగంధమును పూసికొనెను.

నానావిధ దివ్యపరిమళములుగల పుష్పములను ధరించెను. మణిమయములగు భూషణములచేత అలంకరింపబడెను. ఈ రీతిగా ఊర్వశి అలంకరించుకొని యింటియందు మెఱుపు మెరపుతీగవలె ప్రకాశించుచుండెను. అట్టిఊర్వశి అర్జునుని గృహమునకు తిన్నగా వచ్చుచుండెను. అప్పుడు దానికాళ్ళయందుండు మణిమయములైన అందెలు ఝుళఝుళయని మ్రోగుచుండెను. నడుమునందుండు వడ్డాణమందుగల గజ్జెలు ఘల్లుఘల్లుమనుచు క్రేంకారధ్వనిగలిగి మ్రోగుచుండెను. ఈ ప్రకారముగా ఊర్వశిదేహమందుగల భూషణములు ధ్వనింపుచుండెను. ఆధ్వనులను వినగా మన్మథుని ఆజ్ఞవలన వాద్యములు మ్రోగుచున్నట్లుండెను. ఊర్వశి జగన్మోహనములైన రూపసౌందర్య అలంకారములు గలిగి అర్జునుని గృహమునకు వచ్చెను. అర్జునుడు భయభక్తిసంతోషములతో యెదురుగావెళ్ళి ఊర్వశికి నమస్కరించెను. అట్లు నమస్కరించి రెండుచేతులను ముడుచుకొని ఊర్వశికి యిట్లుచెప్పెను.

తల్లీ! ఊర్వశీ! నీవునన్ను పుత్రస్నేహముచేత మన్నించి నాకు శుభములు గలిగించుటకు వచ్చితివి. నీవిటునాయందు కృపగలిగి సంతోషముగా వచ్చుటవలన నేను కృతార్థుడనైతిని. అని యీరీతిగా అర్జునుడు చెప్పగా ఊర్వశి నేత్రదృష్టులను తుమ్మెదలు అర్జునుని సౌందర్యమను తేనెను త్రాగెననునట్లుండెను. అర్జునుని మాటలను విని ఊర్వశి యిట్లుపలుకసాగెను.

అర్జునా! నీ యొక్క మహాగుణములను నారదాదిమహామునులవలన నేను వినియున్నాను. నీగుణములను సంతోషించి సర్వదా నీతోరమింపవలెనని అపేక్షించియున్నాను. నీతోరమించుటకు ఇష్టము

గల దాననై ఇప్పుడు నీదగ్గరకు వచ్చితిని. నీవు సరికాని మాటల చేత నేను నీకు తల్లినని యొకన్యాయమును సూచించితివి. నీకు నేను ఏవిధముగా తల్లినగుదునో నిశ్చయముగా జెప్పుము. మేము దేవవేశ్యా స్త్రీలము. ఇటువంటి వరుసలు వావులుమాకులేవు. ఈ స్వర్గలోక మందు అట్టివరుసలు వెదకరాదు ఇచ్చట స్త్రీపురుషులు బంధువరు సలు లేక తమయిష్టప్రకారము రమింపుచుందురు. ఈ లోకమందట్టిది దోషము లేనియాచారమై యున్నది. నీవు ఇప్పు డీ స్వర్గలోకమునకు వచ్చుటచేత దివ్యపురుషుడవైతివి. గాన నామనోరథము సఫలమగు నట్లు నాతో రమింపుము పారిజాత వృక్షములయందుగల పూదే నెను పానముచేయు తుమ్మెదల ధ్వనులు గల స్థలములయందునాతో రమింపుము. మేరుపర్వతముయొక్క చరియలయందు నాతో భోగ సుఖముల ననుభవింపుము. చల్లని మెల్లని గాలిగల నందనాదివన ములయందు నాతో యిష్టసుఖముల ననుభవింపుము. ఆకాశగంగా సమీపమందుగల రత్నమయములగు నరుగులయందును. బంగారు మయములైన మనోహర స్థలములయందును, నాతో భోగించిగి నాకు తృప్తికలిగింపుము. వెన్నెలచేత సుందరముగానుండు ఇసుకతిన్నెల యందు నాతోరమించి యిష్టసుఖముల ననుభవింపుము. దేవతలు విహరించు స్థానములయందు సర్వదా సంభోగకేళీ సౌఖ్యమను సముద్రమందు తేలునట్లు చేయుము. అనియిట్లుఊర్వశి అర్జునునితో జెప్పెను. ఆకామమును గలిగించు మాటలను అర్జునుడువిని నిర్వి కారమగు మహాధైర్యచిత్తముగలవాడై ఊర్వశితో నిట్లనెను. ఊర్వశీ! నీవుజెప్పుమాటలు ధర్మద్రోహమును గలిగించుచున్నవి. నీ విట్లుజెప్పరాదు. ఇది మహాదోషము. ఇట్లు చెప్పవచ్చునో చెప్ప రాదోయని యూహించక నన్నుగురించి ఇట్లు చెప్పితివి. దేవతలంద రను పుట్టించుటకును, రక్షించుటకును సమర్థులగుదురు. ఆదేవతలు

ఎట్లునడిచినను దోషములేదు. నేను కర్మభూమి యగు భూలోకమున బుట్టి కర్మమున కధికారి నైతిని నాకీస్వర్గలోకమందుగల యాచారము పనికిరాదు. మా వంశకర్తయగు పురూరవ మహారాజునకు నీవుభార్యవైతివి. ఆకారణమువలన నీవు నాకు తల్లివగుదువు. మరియు నీవు దేవేంద్రునకు పరిచర్యలు జేయుచున్నావు. అందువలన నీవు నాకు తల్లివగుటకు సంశయములేదు గాన తల్లీ! ఊర్వశీ! నీవు నన్ను పుత్రవాత్సల్యముచే గ నునింపుము. అని అర్జునుడు ఊర్వశితో చెప్పి ప్రార్థింపసాగెను. ఊర్వశి మన్మథబాణములచేత బాధింపబడి కోపము వలన యెఱ్ఱనినేత్రములు గలదై అర్జునునిజూచి యిట్లని శపించెను.

అర్జునా! నేను నీమీద కామము గలిగియుంటిని. నా మనోరథమును నీవు నిష్ఫలముగావించితివి. నీవుమనుష్యలోకమందు గౌరవములేనివాడవై స్త్రీలమధ్యమందు నపుంసకుడవై యుందుము అని ఊర్వశి అర్జునుని శపించి తనగృహమునకు వెళ్ళెను. ఆరాత్రిగడచిన పిదప మరునాటిఉదయమున దేవేంద్రుడు ఆ వృత్తాంతమునంతయు విని తనకుమారుడగు అర్జునున కిట్లనెను. అర్జునా! ఏ యుగముల యందైనను నీవంటి ధైర్యవంతుని మేముచూడలేదు. నీవుసర్వదా ధర్మబుద్ధిగలవాడవై యున్నావు. నీ ఇంద్రియనిగ్రహమునకు మును లందరు మెచ్చుకొని నిన్ను పొగడుదురు. ఊర్వశి నీకిచ్చినశాపమును నీవనుభవించి తీరవలయును. మీరు పదమూడవ సంవత్సరమందు జరుపవలసిన అజ్ఞాతవాసకాలమందు నీవు నపుంసక రూపముచేత ప్రవర్తించుచు రాజకన్యలకు నృత్యమును నేర్పుచుండుము. పదమూడవ సంవత్సరాంతమందు నీకు ఊర్వశి యిచ్చిన శాపము నశింపగలదు. అని యీరీతిగా అర్జునునితో దేవేంద్రుడు జెప్పి ఊర్వశి యిచ్చినశాపము ఒకసంవత్సరము పర్యంతమే అర్జునునియం దుండు

నట్లుగా అనుగ్రహించెను. జనమేజయమహారాజా! ఈ కథనువినిన పురుషులకు సకల పాపములు నశించునని వైశంపాయన మునీంద్రుండు జనమేజయ మహారాజుతో చెప్పి యిట్లుపలికెను.

జనమేజయ మహారాజా! దేవేంద్రుడు వజ్రాస్త్రము మొదలగు దివ్యాస్త్రములను అర్జునునకిచ్చెను. వాని ప్రయోగములను, రహస్యములను ఉపసంహారణాది క్రమములును స్పష్టముగా దేవేంద్రుడర్జునున కుపదేశించెను. మరియు దేవేంద్రుడు సకల దివ్యాస్త్రములను మంత్ర పూర్వకముగా అర్జునునకిచ్చి యిట్లు పలికెను. పుత్రా! అర్జునా! భయంకరములైన ఘోరయుద్ధములయందు నీవు శత్రువుల చేత జయింపబడని మహాశక్తివంతుడవు కాగలవు. నిన్ను యుద్ధమందెవ్వరును గెలువజాలరు అని దేవేంద్రు డర్జునునకు వరమిచ్చి మహాస్నేహ భావముతో చిత్ర సేనుడను గంధర్వరాజును పిలిచి అర్జునునితో యిట్లు పలికెను. అర్జునా! ఈ చిత్రసేనుని దగ్గఱ నీవుండి సంగీత వాద్య నాట్యములను నేర్చుకొనుము. అని దేవేంద్రుడు చెప్పగా అర్జునుడు చిత్రసేనునిదగ్గఱనుండి సంగీతవాద్య నాట్యములను అభ్యసించుచుండెను. ఈ ప్రకారముగా అర్జునుడు స్వర్గలోకమం దున్నకాలము భూలోకమందు ఏడు సంవత్సరములాయెను. (ఇచ్చట అర్జునుడు దేవలోకమునందు దేవేంద్రుని దగ్గర యున్నకాలము భూలోకమందుండు పాండవులకు ఏడుసంవత్సరము లైనదని చెప్పబడియున్నది. కాని ఈ అరణ్యా పర్వములో చతుర్థాశ్వాస ప్రారంభమందు పాండవులకు భూలోకమందైదు సంవత్సరములగునంతకాలము అర్జునుడు దేవలోకము నందున్నట్లు చెప్పబడి యున్నది. ఐదుసంవత్సరము లనుమాటయే నిశ్చయమని తోచుచున్నది.) అంతట ఒకనాడు రోమశుడను మహామునీంద్రుడు స్వర్గలోకమునందు గల అమరావతియను పట్టణమునకువచ్చి దేవేంద్రుని

జూచి దేవగణములచేత పూజింపబడి దేవేంద్రునితోకూడి ఏకసింహా సనమందు కూర్చున్న అర్జునుని జూచి ఆశ్చర్యమును బొంది దేవేం ద్రునకు ఇట్లనెను.

మహాత్మా! దేవేంద్రా! అనేకయుగముల పర్యంతము తప స్సుచేసిన వారుకూడ నీ సభయందుండజాలరు. మహాతపస్సంప న్నులయందైనను నీవింత కృపగలిగి యుండవు. అటువంటి ఈదేవ సభయందు ఇక్కడ నీతో ఏకసింహాసనమందున్న ఈ మనుష్యు డెవడో తెలియకున్నది? నీ రెండవమూర్తివలె ఈతడు ప్రకాశించు చున్నాడు. ఈ మనుష్యుడెవ్వడో ఎక్కడివాడో చెప్పుము. అని రోమశమునీంద్రుడు దేవేంద్రుని అడుగగా దేవేంద్రు డిట్లని చెప్ప సాగెను. రోమశమునీంద్రా! యీతడు నరుడను పురాణదేవర్షి. నా అంశమువలన మనుష్యలోకమందు కుంతియందు పుట్టెను. ఇతని పేరు అర్జునుడు. కృష్ణుని స్నేహితుడు. ఈ అర్జునుని యందు శివుడు కృపగలవాడై ఇతనికి పాశుపతాస్త్ర మిచ్చెను. సకలదేవ శ్రేష్ఠు లును, నేనును అర్జునునకు సకల దివ్యబాణములను ఇచ్చితిమి. అర్జు నుడు నాకు ప్రీతిగా దేవకార్యమును తీర్చుటకు సమర్థుడై యున్నాడు. పూర్వము సగరుని కుమారులందరును భూమియందుండి మిక్కిలి గర్వించి యుండిరి. అప్పుడు కపిల మహాముని తన వేడి చూపులచేత సగరుని కుమారులనందరిని దహించివేసెను. అట్టికపిల మహామునీంద్రు డిప్పుడు కృష్ణుడై నారాయణుడని చెప్పబడుచున్నాడు. ఆ నర నారాయణులిద్దరును ప్రతియుగమందును జగత్తున కుపకారము గలుగ జేయుచుందురు. భూభారమును మాన్పుటకును దైత్యదానవ రాక్షసాదులను చంపుటకును భూమియందు కృష్ణార్జునులను పేర్ల చేత మనుష్యులై పుట్టిరి. పాతాళమందు నివాత కవచులను రాక్షసు లనేకులు దేవతల కపకారము జేయుచున్నారు. ఆ నివాతకవచుల

అర్జునుడు చంపును. ఈవిధముగా దేవేంద్రుడు అర్జునుని ప్రభావ మును రోమశమహామునీంద్రునితో చెప్పి మరల యిట్లనెను.

రోమశమునీంద్రా ! నీవు భూలోకమునకు బోయి ధర్మరాజు నకును భీమాదులకును సంతోషము గలుగునట్లుగా నాదగ్గఱ అర్జు నుడు ఉన్నాడని జెప్పుము. భీష్మ ద్రోణ కర్ణాది వీరులను జయింప గల దివ్యాస్త్రములను అర్జునుడు పొందెనని ధర్మరాజుతో జెప్పుము. అర్జునుడు శీఘ్రముగా నీయొద్దకు వచ్చునని ధర్మరాజుతో జెప్పుము. నేను చెప్పినట్లుగా సకలపుణ్య తీర్థములను సేవించుటకు ధర్మరాజును బంపుము. ధర్మరాజు సకల పుణ్యతీర్థములు సేవించిన యెడల సకల పాపములను విడిచి సమస్త భూరాజ్యమును బొందును. ధర్మరాజు పుణ్యతీర్థములను సేవించుటకు వెడలునప్పుడు నీవును ఆ ధర్మరాజు నకు సహాయముగా యుండుము. అని దేవేంద్రుడు రోమశమునితో జెప్పి పంపించెను. జనమేజయ మహారాజా ! భూలోకమందు దేడు సంవత్సరములు గలుగు కాలమున అర్జునుడు దేవేంద్రుని దగ్గర యున్న విషయములను జెప్పితిని. ఇకను హస్తినాపురమందుగల ధృతరాష్ట్రుని సమాచారమును అడవులయందున్న ధర్మరాజాదుల సమాచారమును జెప్పెదవినుము.

## అర్జునుని దివ్యాస్త్రలాభము విని ధృతరాష్ట్రుడు దుఃఖించుట

అర్జునుడు ఈశ్వరాదులవలన దివ్యాస్త్రములను పొందిన విషయమును వేదవ్యాసుడు ధృతరాష్ట్రునితో జెప్పెను. అర్జునుని దివ్యాస్త్రలాభమును ధృతరాష్ట్రుడు విని పరమదుఃఖము గలవాడై సంజయునితో యిట్లు జెప్పెను. సంజయా ! పూర్వము అర్జునుడు దేవసైన్యముతో వచ్చిన దేవేంద్రుని ఓడించి, అగ్నిహోత్రునిచేత ఖాండవవనమును దహింపజేసెను. అర్జునుడు భూమియందుండు సకల

రాజులనుజయించిధర్మరాజుచేతరాజసూయ మహాయజ్ఞమునుజేయించి మహాసమర్థుండగుటవలన మహాబల పరాక్రమముగల సింహామునకు కవచము దొడిగినట్టి యీశ్వరుడు మొదలగు దేవతలందరును పాశు పతము మొదలగు దివ్యాస్త్రము లను అర్జునున కిచ్చిరి. అటువంటి మహాశౌర్యముగల అర్జునుడు యోధుడైయుండగా పాండవులను గెలుచువారులేరు. పాండవులు పరమ ధర్మాత్ములై సత్యవంతులై యున్నారు. నిర్మలమగు ఆచారమును గలిగియున్నారు. అటువంటి పాండవులకు సకల శుభములును కలుగగలవు. ఆపాండవులతో మన దుర్యోధనుడు విరోధము కలిగించుకొనెను. అందువలన దుర్యోధను నకు అతని బంధు స్నేహితులకు కూడ హాని వాటిల్లును. వజ్రా యుధముచేత పర్వతములు నశించినట్లు అర్జునుని దివ్యబాణ సమూ హముల చేత యుద్ధమందు శత్రుసైన్యములు బ్రతుకవు. ప్రళయ కాలమందుగల సూర్యకిరణములచేత చరాచర భూతములు తపించ బడినట్లు అర్జునుని బాణాగ్నివలన దుర్యోధనాదులందరును యుద్ధ మందు పరతపింతురు. అని ధృతరాష్ట్రుడు సంజయునితో జెప్పుకొని దుఃఖింపు చుండెను. అప్పుడు సంజయుడు ధృతరాష్ట్రునకు యిట్లు జెప్పెను. మహారాజా! పూర్వము దుర్యోధన దుశ్శాసను లిద్దరును ఆసభలో పాండవులకు అవమానమును కలిగించిరి. అప్పుడు మీరైన నను వారిని శిక్షింపక ఊరకుండిరి. నీ వుపేక్షవలన పాండవులు మాయాజూదమున వోడి రాజ్యమును విడచిరి. పాండవు లంతట కామ్యకవన మందుండిరి.

అప్పుడు కృష్ణుడు అనేక రాజులను వెంటబెట్టుకొని పాండవుల దగ్గరకు వచ్చెను. నీ కొడుకులగు దుర్యోధనాదులు చేసిన అవమాన మునకు ద్రౌపదికి కలిగిన అవమానమునకును, కృష్ణుడు మిక్కిలి దుఃఖించెను. కృష్ణుడట్లు దుఃఖించి మిగుల క్రోధముతో పాండవు

లతో యిట్లనెను. ధర్మరాజాదిపాండవులారా! మీకు కీడుకలిగించిన దుర్యోధనాదులను చంపెదను. హస్తినాపట్టణమునకు ధర్మరాజుని రాజ్యాభిషిక్తుని జేసెదను. పూర్వము ధర్మరాజు రాజసూయ యజ్ఞమును జేసినప్పుడు ఇంద్రప్రస్థ పట్టణమందు పొందిన యైశ్వర్యముల కంటె యెక్కువగు విభూతిని యిప్పుడు ధర్మరాజునకు కలిగించెదను. అని యీరీతిగా కృష్ణుడు పాండవులతో చెప్పెను. అప్పుడు ద్రుపద, సృంజయ, కేకయ, ధృష్టద్యుమ్న బలదేవసాంబ సాత్యకి మొదలగు వారందరును, కృష్ణునిమాటలను వినిరి. అంతట సత్యవంతులైన పాండవులు శాంతవాక్యములచేత కృష్ణుని కోపమును చల్లార్చిరి. ఆ సమయమందే అర్జుననకు సారథ్యము సేయుమని పాండవులు కృష్ణుని ప్రార్థించిరి. యీరీతిగా కామ్యకవనమందు కృష్ణునకును పాండవులకును సంభాషణలు జరిగినట్లుగా మేమువింటిమి. అని యిట్లు సంజయుడు ధృతరాష్ట్రునితో జెప్పి మరల యిట్లు పలికెను.

ధృతరాష్ట్రా! పదమూడు సంవత్సరముల పర్యంతము పాండవులు అరణ్యవాస అజ్ఞాతవాసములను జరుపుదురు. పిమ్మట పదునాలుగవ సంవత్సరమందు పాండవులు కృష్ణునిముందుంచుకొని యుద్ధమునకు వత్తురు. లోకమందు యితరులు ఘోరతపస్సుచేసి దేవతలవలన వరములను పొందజాలరు. ఆమహాత్ముడైన అర్జునుడు తనధనుర్విద్యాసామర్థ్యమువలన శివునిమెప్పించి ఆ శివునిచేతవరములను పొందెను. ఆ యర్జునుని దివ్యబాణముల దెబ్బలును, భీముని గదాదెబ్బలును, నీయుపెటూరూపమైన పిడుగులును, యీ మూడును గలిసి దుర్యోధనాది కౌరవులకు నాశ హేతువు లాయెను అని యీరీతిగా సంజయుడు ధృతరాష్ట్రునితో జెప్పగా ధృతరాష్ట్రు డిట్లనియెను.

సంజయా! నేను ముసలివాడననియు, పుట్టంధుడననియు బుద్ధిహీనుడననియు తలంచి నాకొడుకగు దుర్యోధనుడు బలగర్వమదముల

చేత నామాటలను వినడు. ఆ శకుని కర్ణాదుల దురాలోచనలనే సర్వ దావినుచుండును. ఆ దుర్యోధనునికిగల చెడుబుద్ధిని నే నేమని వివరింతును. భీష్మ ద్రోణ విదురులను లక్ష్యపెట్టడు. కర్ణ శకునుల నిద్దరిన్నే హితులను గావించుకొని వారిమాటలప్రకారము వర్తింపుచుండును. యీరీతిగా దుర్యోధనుడు పరమదుర్మార్గుల సహవాసముచేత చెడిపోయెను. అందులకు నేనేమియు చేయజాలను. అని యీరీతిగా ధృతరాష్ట్రుడు సంజయునితో జెప్పెను. అని యిట్లు వైశంపాయనమునీంద్రుడు జనమేజయునితో జెప్పి మరల యిట్లుపలికెను.

జనమేజయమహారాజా! వనమందుండు ధర్మరాజాది పాండవుల వృత్తాంతమును చెప్పెదనువినుము. అర్జునుడు దివ్యాస్త్రలాభము కొరకు వెళ్ళినపిమ్మట కొన్నిసంవత్సరముల పర్యంతము పాండవులాయావనములందు కాలము గడపుచుండిరి. అర్జునుడు తమదగ్గిరకు రాకపోవుటకు ధర్మరాజాదులు తమలోతాము మహాదుఃఖముగలవారై యిట్లు చెప్పుకొనిరి. అర్జునుడు పాండురాజుకొడుకులలో సింహమువంటివాడగును. మనతండ్రియగు పాండురాజుయొక్క కీర్తిని ప్రకాశింపజేయువాడగును. దేవేంద్రాది దేవతలవలన వరములను బొంది అర్జునుడిక్కడి కెప్పుడువచ్చునో తెలియలేదు. మనము ప్రీతిపూర్వకముగా అర్జునుని యెప్పుడుచూతుమో తెలియకున్నది. అని యిట్లు ధర్మరాజ భీమ నకుల సహదేవులు నలుగురును అర్జునుని రాకను గురించి చెప్పుకొనుచు సర్వదా అర్జునుని తలచుచుండిరి. అట్టిసమయమందు భీముడు ధర్మరాజునకు యిట్లనెను.

అన్నా! ధర్మరాజా! నీ యాజ్ఞాప్రకారము అర్జునుడు వెళ్ళి యెక్కడనోయుండి పరమనిష్ఠచేత తపస్సుచేయుచున్నాడు. అర్జునుడిక్కడకు రాకుండుటకు కారణమేమో తెలియకున్నది. అర్జునుడు పరమధర్మాత్ముడు. అతనిని విడచి మనమున్న యీ సంవత్సరములు

మనకు యుగములువలె గడచిపోయెను. అర్జునుని చూడవలెనను కోరికచేత అర్జునుడు వెళ్ళినది మొదలుకొని జరిగిన సంవత్సరములు మనకు యుగసమానములాయెను. పాండవ పాంచాలవీరులజీవనములు అర్జునునియందే నిలిచియున్నవి. అర్జునుని భుజాబలమువలన మనము శత్రువులనుజయించి సకలరాజ్యమును తీసికొందుమనితలచి యుంటిమి గాన ఆలస్యముచేయక అర్జునుని యిక్కడకు తీసికొనివచ్చుటకు కృష్ణుని నియమింపుము. అర్జునుడువచ్చినయెడల నేనును అర్జునుడును కృష్ణుని సహాయముజేసికొని వెళ్ళి ధృతరాష్ట్రుని కొడుకులందరిని ఒక్కసారేచంపి సకలరాజ్యమును తీసికొందుము. మనఅరణ్యావాస అజ్ఞాతవాస కాలనియమముతో పనిలేదు. ఈలోపలనే కౌరవులను జంపి రాజ్యమును తీసికొందుము. నీవు సత్యముతప్పుటయందు భయ పడుమువు. కనుక నీవు యీవనమందేయుండి పదమూడేళ్ళు జరిగిన పిమ్మట హస్తినాపురమునకువచ్చి రాజ్యాభిషిక్తుడవగుము. దుర్మార్గ మైన జూదమందు మనలను దుర్యోధనుడు ఓడించి మనరాజ్యమును తీసికొనెను. పదమూడు సంవత్సరముల పర్యంతము మనముప్రూర కున్నయెడల, ఆదుర్యోధనునకు రాజ్యముస్థిరపడును గనుక యిప్పుడే మేమువెళ్ళి ఆదుర్యోధనుని చంపుదుము. కపటవంతులను కపటము చేత చంపుటవలన దోషములేదు. సర్వవిధములచేతను శత్రువులను జయించి రాజ్యముతీసికొనుట రాజధర్మమై యున్నది. ఇట్లు జేయుట శాస్త్రసమ్మతము. అని భీముడు ధర్మరాజుతో జెప్పెను. ఆ భీముని యుత్సాహమునకు ధర్మరాజు సంతోషించి భీముని కౌగిలించుకొని శిరస్సువాసనజూచి యిట్లుపలికెను. నాయనా! తమ్ముడా! భీమా! అగ్నిహోత్రమునకు గాలిసహాయమైనట్లు అర్జునునకు నీవుసహాయుడ వైనయెడల యుద్ధమందు శత్రువులు బ్రతికిపోజాలరు. అయినను యిప్పుడు నీవు కోపించుకొనుటకు సమయముకాదు. యీ పదమూడు

సంవత్సరములు వెళ్ళినపిమ్మట నీవును అర్జునుడును శత్రువులను జంపి విజయలక్ష్మిని పొందుడు. ఈ పదమూడు సంవత్సరములు గడచు పర్యంతము కోపమును సహించుకొని యుండుము. నేను సర్వవిధముల చేతను సత్యవాక్యమును తప్పుటకు సమ్మతింపజాలను. అని ధర్మరాజు భీమునితో జెప్పి భీమునికి కోపమును మాన్పెను. అని యిట్లు వైశంపా యనమునీంద్రుడు జనమేజయ మహారాజుతో జెప్పెనని ఉగ్రశ్రవ సుడు శౌనకాది మహామునులతో జెప్పెను.

ఇది శ్రీమహాభారతమందలి అరణ్యపర్వమందు
ప్రథమాశ్వాసము



## ద్వి తీ యా శ్వా స ము



దేవా ! హరిహరనాథా ! వైశంపాయనమునీంద్రుడు జనమే జయమహారాజునుజూచి యిట్లనెను. మహారాజా ! పైనచెప్పిన ప్రకా రము ధర్మరాజు భీమునకు కోపోపశమనము జేయుచుండగా ధర్మరాజు వద్దకు బృహదశ్వుడను మహాముని వచ్చెను. ధర్మరాజాది పాండ వులు శాస్త్రవిధిప్రకారము బృహదశ్వుని పూజించిరి. అట్లు ధర్మరా జుచేత బృహదశ్వుడు పూజలనంది విశ్రమించుచుండెను. అంతట ధర్మరాజు తమకు శత్రువులవలనకలిగిన అవమాన ఉపద్రవములనన్ని టిని బృహదశ్వునకుదెలిపి మరల యిట్లనెను. మహాత్మా ! బృహద శ్వమునీంద్రా ! మేము సకలరాజ్య భూమి బంధువులను విడిచి మృగ ములలోగలసి అడవులలో నున్నాము. ఇదివరకు మావలె యిటువంటి కష్టములనుపొందిన జనులున్నయెడల మాకెరింగింపుము. అని ధర్మ రాజు అడుగగా బృహదశ్వమునీంద్రుడు యిట్లనెను.

ధర్మరాజా! నీతమ్ములందరును దేవపురుషులతో సమానులు. ఈ బ్రాహ్మణులందరును దేవతలవంటి పుణ్యపురుషులు. నీవుధర్మబుద్ధి గలవాడవై నీతమ్ములను వెంటబెట్టుకొని రథములతోవచ్చి వనవాసము జేయుచున్నావు. ధర్మరాజా పూర్వము నలుడనురాజు పుష్కరునితో జూదమాడి తన సకలైశ్వర్యములను పుష్కరునకు వోడి తానొక్కడే అడవిభూములకువెళ్ళి మిక్కిలి కష్టములను పొందెను. అని యిటుల బృహదశ్వమునీంద్రుడు ధర్మరాజుతో జెప్పగా ధర్మరాజు యిటులనెను. మహాత్మా! బృహదశ్వమునీంద్రా! ఆ నలమహారాజు అడవులలో కష్టపడిన వృత్తాంతము నంతయు సవిస్తరముగా జెప్పుము. అని యిట్లు ధర్మరాజు అడుగగా బృహదశ్వుడు యిటులనెను.

## ధర్మరాజునకు బృహదశ్వుడు నలోపాఖ్యానము జెప్పుట

ధర్మరాజా! పూర్వము నిషధదేశపురాజగు వీరసేనుని కొడుకైన నలుడను రాజుండెను. ఆ నలమహారాజునకు అనేక అక్షౌహిణుల సైన్యముండెను. ఆ నలుడు జూదమాడుటయందు యిష్టముగలిగి యుండెను. ఆ నలుడు తనమహాతేజస్సుచేత సకలరాజులను జయించి ధర్మమార్గము తప్పక ప్రజాపాలనము జేయుచుండెను. ఆకాలమందు విదర్భదేశమున భీముడను రాజుకలడు. ఆభీమరాజు సంతానము లేనివాడై అనేకవ్రతములను జరుపుచుండెను. అంతట భీమరాజు, అతనిభార్య, దమను డనుముని నుపాసింపుచు ఆముని వరమువలన ఒక కూతును యిద్దరుకొడుకులను గాంచెను. ఆ కూతురుపేరు దమయంతి యందురు. ఆ కొడుకులను దమనాంతుడని, దమనుడని పిలుతురు. ఈరీతిగా విదర్భపురమునగల భీమరాజునకు దమయంతి జనించెను. ఆదమయంతి అత్యంత కాంతిరూప లావణ్య సౌందర్యములు గలిగి

యుండెను. నిర్మలములైన మహాగుణములను గలిగియుండెను. దేవ సిద్ధ సాధ్యకన్యలవంటి నూరుగురుస్త్రీలు సర్వదా ఆదమయంతి యను కన్యను సేవింపుచుందురు. ఈ ప్రకారము దమయంతి యనుకన్యకా రత్నము భూలోకమందు మహావిభవముతో ప్రకాశించుచుండెను. ఆ సమయమందు నలునిగుణములను దమయంతిదగ్గర జనులుపొగడు చుండిరి. దమయంతిగుణములను నలునిదగ్గర జనులు పొగడుచుండిరి. ఆ నలదమయంతు లిద్దరును జనులవలన ఒకరొకరి గుణములు విని మన్మథవికారమును గలిగియుండిరి. అంతట ఒకానొక దినమందు నలుడు దమయంతి గుణములనుదలచుచు మన్మథాగ్నిని సహింపజాలక ఉద్యానవనమునకు వెళ్ళియుండెను. ఆసమయమందు ఆకాశమందుండు స్త్రీలహారసమూహములవలె హంసలగుంపు భూమియందు వ్రాలెను. నలుడాహంసలగుంపునుచూచి నవ్వుచుబోయి అతిశీఘ్రముగా ఒక హంసను పట్టుకొనెను. తక్కిన హంసపక్షులన్నియు ఆ హంసను విడిచి పోజాలక ఆకాశమందు గుంపుగాజేరి అరచుచు గాలిచేత ఎగుర గొట్టబడిన తెల్లనిమేఘములవలె తిరుగుచుండెను. ఆ పట్టుబడిన హంసయు, తనకు ఆ నలరాజు, అపాయముజేయునని భయపడి మానుషవాక్యములచే యిట్లుపలికెను.

నలమహారాజా! నేను నీకు ప్రియమును కలిగించెదను. నీ ప్రియురాలగు దమయంతి దగ్గరకుబోయి నీగుణములను నామెకు జెప్పె దను. దమయంతి యితర పురుషులను అపేక్షింపకుండునట్లు నీయం దధికమగు రాగము గలిగియుండునట్లుగా జేసెదను. నన్ను విడువుము అని హంస నలునితో చెప్పెను. ఆ హంసమాటలను నలుడు వినగా, ఆతని మనస్సునకు అమృతధారలవలెదోచెను. అంత నలుడు హంసయందు యనురాగము గలవాడై విడిచెను. హంస తక్కిన హంసల గుంపులో జేరి, విదర్భపట్టణమునకు, పరుగెత్తెను. అట్టి సమయమందు, అనేకులగు చెలికత్తెలతో, దమయంతి ఉద్యాన వన

మందు విహరించుచుండెను. ఆ హంస లన్నియు ఉద్యానవనమందు వ్రాలెను. హంసలను చూడగానే, దమయంతియొక్క చెలికత్తె లందరును, మిక్కిలి సంతోషము గలవారై వెంటనే పరుగెత్తి ఒక్కొక రొక్కొక హంసను పట్టుకొనిరి. నలుడు పట్టుకొని విడిచిన హంసయే దమయంతిచేత పట్టుబడెను. ఆనలదమయంతులకు సంబంధము గలిగింపదలచిన యాహంస మనోహరమైన మనుష్యవాక్యములచేత దమయంతితో యిట్లనెను. దమయంతీ! నీ ప్రియుడగు నలుని దగ్గరనుండి యిప్పుడే నేనువచ్చితిని. నాలుగు సముద్రములమధ్యనుండు సకలరాజులను నేను జూచితిని. సమస్తమైన గుణసౌందర్యములందు నలునితో సమానులులేరు. నీవు ఆ నలమహారాజునకు భార్యవయిన యెడల, నీరూప, లావణ్య కాంతి, సౌభాగ్య విభవములు, సఫలములగును. నీకు సకల, శుభ. లక్షణ గుణములున్నందుకు, ఫలితము ఆ నలునకు భార్యవగుటయే. నీవు స్త్రీలలో శ్రేష్ఠమగు రత్నమువంటి దానవు. ఆ నలుడు పురుషులలో శ్రేష్ఠమగు రత్నమువంటి వాడు. మీ. యిద్దరును, జోడుగూడిన యెడల అన్యోన్యముగా, శోభను కలిగించును, అని హంస దమయంతితో చెప్పెను. ఆమాటలను దమయంతి విని తృప్తిజెందని మనస్సుగలదై హంసతో నిట్లనెను.

హంసా! నలమహారాజుయొక్క గుణములను నాకు చెప్పినట్లుగా నన్ను గూర్చి ఆ నలునకు తెలుపవలెను. నాయందు కృప గలిగి నలుని దగ్గఱకు వెళ్ళి నన్ను గురించి, నలమహారాజునకు దెల్పుము అని దమయంతి హంసతో చెప్పి ప్రార్థించెను. అంత ఆహంస నిషధ దేశమునకు పోయి నలుని జేరి దమయంతిని గురించి, యామెరూప సౌందర్యగుణాతిశయములను, వర్ణించి చెప్పెను. ఇట్లువారు పరస్పర రూపగుణాతియశములను విని, కామాగ్నిచే పరితపించుచుండిరి. ఈ

రీతిగా, అనేక దివారాత్రములు గడపిరి. ఆ పరితాపము తమ్ము బాధింపకుండునట్లు ఉద్యానవనములందు విహరించుచుండిరి. తామర రేకులచేతను, మెత్తని తామరతూండ్లచేతను, పచ్చకర్పూరపు పొడులచేతను, లేత చిగురుటాకుల పాన్పుచేతను, సీటిధారలచేతను, చందనగంధములచేత వారికామాగ్నిని చల్లార్చుచుండిరి. ఇట్లు నల దమయంతులిద్దరును పరస్పర రూపగుణములను దలంచుచు సంతోష కామములు గలవారై యుండిరి. క్రమముగా దమయంతి మన్మథాగ్నిచే పరితాపమునొంది, కాంతిహీనమగు ముఖముగలదై శుష్కింప సాగెను. ఆస్థితిలోనున్న దమయంతినిజూచి, చెలికత్తెలందరును భయపడి యామె వృత్తాంతమంతయు, భీమరాజునకు జెప్పదలంచి, యిట్లనిరి. ఓ భీమమహారాజా! ఒక హంసవచ్చి నలమహారాజు యొక్క రూపగుణములను గూర్చిదమయంతికి జెప్పెను. అంతటి నుండి సర్వదా దమయంతి, ఆ నలునే తలంచుచుండెను. ఆ హంస వెళ్ళిన దిక్కునకే చూచుచుండును. తన చెలికత్తెలతో ఏమియు మాట్లాడకుండెను. ఊరకనే యలయుచుండెను. మంచివైన భూషణ, ఆభరణ, ఆహార, విహారము లందును, పాన్పులయందును, ఆసన, భోజన భోగములయందును యుపేక్షలేక యూరకుండును. రాత్రింబవళ్ళు నిద్రలేక సర్వదా మెలకువగనే యుండును. సర్వకాలముల యందును నలునియందే బుద్ధిని నిలిపియుండును. మన్మథాగ్నిచే మిక్కిలిగా పరితపించుచున్నది. యితర రాజులయందు, యుపేక్షలేక యున్నది. యితరులెంత ఐశ్వర్యవంతులైనను, వారిని దలంచకయే యుండును. అని దమయంతి యొక్క వృత్తాంతమును, చెలికత్తెలు భీమరాజుతో జెప్పిరి. భీమరాజా వృత్తాంతమును విని, నలుని ఏవిధముగా రప్పింపవలెనో యని తలంచుచుండెను. అంత యవ్వనవంతురాలైన దమయంతినిజూచి, భీమరాజు స్వయంవరమును ఏర్పరచెను.

ఆ స్వయంవరమను నెపముచేత భూమియందుగల సకలరాజులను రప్పించెను. సకల దేశముల రాజులను, తమతమ, చతురంగబలములను తీసికొని, భూమికల్లడిలిపోగా, దమయంతీ స్వయంవరమునకు వచ్చిరి. ఆ స్వయంవరమునకు పర్వతనారదులను పురాణ మునులు వచ్చి భూలోకమంతయు తిరిగి, స్వర్గలోకమునకుపోయిరి. అచ్చట దేవేంద్రుడు, పర్వతనారదులను పూజించి యిట్లనెను.

ఓ మహాత్ములారా! భూలోకమందు అంతయు కుశలమేగదా భూలోకమందలి, ధర్మపాలనము జేయు రాజులు యుద్ధములుజేసి అందు జచ్చి అక్షయసుఖములను, వీరస్వర్గమును అనుభవించుటకై యిచ్చటకు వచ్చుచుందురు. అట్టిరాజులు బహు కాలమునుండి యిక్కడకు రాకుండుటకు కారణంబు తెలియకున్నది. దానిని, దెల్ప వేడెదను. అని దేవేంద్రుడు పర్వతనారదులను అడిగెను. అంతట నారదు డిట్లనెను. దేవేంద్రా! భూలోకమందు విదర్భ దేశాధీశు డగు భీముడను మహారాజునకు దమయంతియను, కూతురు గలదు. ఆ దమయంతి దేవకన్యలకంటె గూడ సౌందర్యవంతురా లగును. ఇప్పు డాదమయంతికి స్వయంవరము జరుగగలదు. భూమియందు గల సకలరాజులును దమయంతీ స్వయంవరవైభవమును జూచుటకు వెళ్ళుచున్నారు. అందువలన రాజులు యుద్ధములు చేయకున్నారు. యుద్ధములు లేనందున రాజులు స్వర్గమునకు రాలేకున్నారు. అని నారదుడు దేవేంద్రునితో చెప్పెను దేవేంద్రు డామాటలను విని దమయంతీ స్వయంవర మహోత్సవమును చూడదలచి కుబేరుడు మొదలగు దిక్పాలకులును, బంగారురత్నమయములైన విమానముల నధిరోహించి భూలోకమునకు దమయంతీ స్వయంవర మంటపమునకై వచ్చిరి. ఆ సమయమున స్వయంవరమునకు నలమహారాజు వచ్చుచుండెను. సూర్యులలో మహావిష్ణువవలె ఆ మహారాజులలో నలుడు

మిక్కిలి ప్రకాశించుచుండెను. అధికరూపవిభవ తేజస్సులు గలిగి యుండెను. రెండవమన్మథునివలె ప్రకాశించుచు వచ్చుచున్న ఆ నలమహారాజును జూచి దేవేంద్రాది దిక్పాలకు లందరును ఆకాశ మందు విమానములను నిలిపి భూమికివచ్చి నలునితో నిట్లని పలికిరి.

నలమహారాజా! నీవు నిత్యసత్యవ్రతుడవు. నీవు మాకు దూతవై మేముచెప్పినపనిని చేయుమని దేవేంద్రాది దేవతలందరును జెప్పగా నలు డిట్లనెను. మహాత్ములారా! మీరుచెప్పినట్లు మీకు దూతనై మీయిష్టప్రకారము జేసెదను. మీరు ఎవ్వరో నాకు దెలియజెప్పుడు. నేను మీకు దూతనై ఏమిచేయవలెనో చెప్పుడు. అని నలుడు అడుగగా, దేవేంద్రు డిట్లనెను. ఓమహారాజా! నేను దేవేంద్రుడను. వీరందరును దిక్పాలురు. మేమందరమును దమయంతీ స్వయంవరమును జూడవచ్చితిమి. నీవు మాకు దూతవై దమయంతికి మాపేర్లను దెల్పుచు మమ్ముల నెరిగింపుము. అట్లు జేసిన నామె మాలో నామెకు యిష్టమువచ్చినవానిని వరించును. అని దేవేంద్రుడు నలునితో జెప్పెను. అంతట నలుడు నమస్కరించుచు దేవేంద్రునితో యిట్లనెను. దేవేంద్రా! నన్ను మీ రెరింగి ఇట్టికార్యమునకు పంపుట న్యాయముగాదు. యోచింపకయే నాకీపని చెప్పితిరి. నాకు యిటు వంటి హీనకార్యమును జెప్పరాదు. అని నలుడు దేవేంద్రునితో జెప్పెను. దేవేంద్రుడు నలునితో ఇట్లనెను. నలుడా మేముచెప్పినది జేయుదునని నీవు యిష్టముతో బల్కితివి. అట్లుబలికి మేముచెప్పినది ఇప్పుడు జేయకుండ యుండరాదు. నీవు నిత్యమును సత్యమే వ్రత ముగాగలవాడవనియు ఈకార్యము నీవలన అనుకూలించు ననియు మేము ఎఱింగి నిన్ను దూతగా బంపవలసివచ్చినది. గాన నీవు యిప్పుడు దూతరూపమును బొంది దమయంతిదగ్గఱకు వెళ్ళి మమ్ము లనుగురించి ఆ దమయంతికి తెలుపవలయును. ఇది దేవకార్య మగు

టచే దీనిని నీవు తప్పక తీర్చవలెను. ఆ దమయంతి యుండు గృహము ఆయుధములచేత రక్షింపబడియుండును. అట్టి రాజగృహములోనికి ప్రవేశించు టసాధ్యమని నీవు తలంచవద్దు. అందు ప్రవేశించునపుడు నిన్ను ఎవరును నడ్డగింపజాలరు. అని దేవేంద్రుడు నలునితో జెప్పెను. నలు డామాటలను విని సందేహము లేనివాడై ఒంటరిగానే విదర్భ పట్టణమునకు పోయెను. నలుడు దమయంతి యుండెడి గృహములోనికి ప్రవేశించెను.

## నలుడు దమయంతివద్దకు దేవదూతయై పోవుట

నలమహారాజు దమయంతీ గృహమున ప్రవేశించినంతనే దమయంతి నలునిజూచెను. నలుడు దమయంతిని జూచెను. పూర్వము హంసచెల్పగా వినిన రూపసౌందర్యాది విభవములకంటె ఆ దమయంతి అధికరూపసౌందర్యములు గలిగియుండెను. దేవకన్యలబోలు నూరుమంది స్త్రీలు ఆ దమయంతిని సేవించుచుండిరి. మరియు సర్వదా నలుని దలంచుచు వాపోవుచు యూరడిల్లుచు యుండెను. అటువంటి దమయంతిని నలుడుచూచి మన్మథబాణములచేత బాధింపబడెను. ఆ సమయమున దమయంతి దగ్గఱనుండు చెలికత్తెలు నలుని చూచి ఆసనముల దిగి సంతోషముచేత నలునకెదురుగా వచ్చి నిలచిరి. నలుడును, దేవేంద్రసమాన వైభవము గలిగియుండెను. సూర్యునివంటి తేజస్సును గలిగి యుండెను. పరిపూర్ణమగు చంద్రుని వలె మనోహరుడుగా యుండెను. వరుణదేవునితో సమానమగు సుందర స్వరూపమును గలిగియుండెను. కుబేరునివలె ఐశ్వర్యవంతుడై యుండెను. అశ్వనీదేవతల బోలు రూపముగలవాడై యుండెను. ఆనలమహారాజును దమయంతిజూచి, విధిచేత ప్రేరేపింపబడినదై సిగ్గునువిడచి, నిర్భయముగా నలునితో యిట్లనెను.

రాజపుత్రా! నీవు మహానుభావుడవు. ఇక్కడికి ఎందులకు ఒంటరిగా వచ్చితివి. నాతండ్రియగు భీమరాజు భయంకరమైన శాసకుడు. అట్టి వానిచేత ఈ గృహము రక్షింపబడుచున్నది. ఎవరును ఈగృహమందు ప్రవేశింపజాలరు. ఎవరికి తెలియకుండ నీవీగృహమందెట్లు ప్రవేశించితివో దెలియకున్నది. నిన్ను జూడగనే నామనస్సున కామాగ్ని రగుల్కొన్నది గాన నీవెవ్వరవో, నీవృత్తాంతమేమో నాకుదెలియజెప్పుము. అని దమయంతి అడుగగా నలుడిట్లు బదులు చెప్పెను. దమయంతీ నేను దేవదూతను. నేను నలుడనురాజును. దేవేంద్రుడు కుబేరుడు వరుణుడు యమధర్మరాజాది దేవతలు మీస్వయంవరమును చూచుటకు వచ్చియున్నారు. వీరందరును, ముందునన్ను బంపించగా ఇప్పుడు నేను నీదగ్గరకు వచ్చితిని. ఆ దేవేంద్ర, కుబేర, వరుణ, యమధర్మరాజులలో నీవు ఏయొక్కరినైన వరియింపుము. అట్లుగావించితివేని ఆ దేవేంద్రాదుల కందరికి సంతోషము కలుగును. ఈరీతిగా నిన్ను ప్రార్థింపుమని ఆ దేవేంద్రాదులు నన్ను పంపించిరి. వారు నన్ను పంపించినందున నేనితరులకు దెలియకుండ యిచ్చటకు రాగల్గితిని గాన, నీవు వారియిష్టమును చేకూర్పుము. అని నలుడు దమయంతితో చెప్పెను. నలునిమాటలను దమయంతివిని తలవంచుకొనెను. పూర్వము హంసచేత నలునియొక్క రూపగుణ విభవములను, వినియున్నందున నలునియందే మిక్కిలి యనురాగముగలదై మనఃపరితాపముచే శుష్కించుచు నలుని తన యెట్టయెదుట గనుంగొని అతడు చెప్పుమాటలకు కడుంగడు దుఃఖము గలదై యిట్లనిపలికెను.

మహారాజా! నేను మానవకాంతను. దేవేంద్రాదులు దేవతలు. నాకును వారికిని మిక్కిలిభేదముగలదు. నేను సర్వదా దేవతలకు మ్రొక్కుచుందును. నేను నీధనమేయగుదును. హంసచేత వర్ణింప

బడిన నీగుణజాలమునువిని నీస్వరూపగుణములను దలంచి, నామన స్సున నిన్నే నిల్పికొంటిని. నీకొఱకై నీరాకకొఱకై స్వయంవర మను నెపముచేత, సమస్తమగురాజులను, యిక్కడికి రావించవలసివచ్చి నది. నీవులోకమందు మహాకీర్తివంతుడవుగాన యిచ్చటనే నీవునన్ను కరుణించి, నన్ను నీవువరించుబుద్ధిని బూనియుండుము. అటుల, నీవు నాకు భర్తవగుటకు సమ్మతింపనినాడు విషాగ్ని జలములచేత ప్రాణము లను విడిచెదను. అని యీరీతిగా దమయంతి నలునితో చెప్పెను. ఆమాటలను నలుడువిని దమయంతి కిట్లనిపలికెను. దమయంతీ! దేవేం ద్రాది దేవతలందరును, మహత్తరమగు ఐశ్వర్యమును గలవారు. మిక్కిలికీర్తివంతులు. అటువంటి దేవేంద్రాదులందరును, నిన్నుకోరు చున్నారు. వారిపాదధూళికికూడ నేను సమానుడను కాజాలను. అదియుంగాక నేను సామాన్యమైన మానవుడను. సంసారిని. నీయందు యనుగ్రహమునుజూపు చేవతలు నిన్ను గోరుచుండగా అల్పుడనగు నన్ను నీవు వరియించరాదు. మరియు వారికయిష్టమగు కార్యమును జేసినమానవులు అధోగతిపాలగుదురు గాన నీవు వారి యిష్టప్రకారము ప్రవర్తించి, నన్ను ప్రీతిపూర్వకముగా కాపాడు మని నలుడు దమయంతితో చెప్పెను. ఆమాటలను, దమయంతి విని కన్నీరుగార్చుచు, చాలాసేపు ఆలోచించి, నలునిలో యిట్లని పలికెను. మహారాజా ! నీయభిప్రాయమునకు, అపాయము లేని, ఒక ఉపాయమును, నేను నీకు జెప్పెదను వినుము. ఆ దేవేంద్రాదులు నాస్వయంవరమునకు వచ్చినయెడల వారియెదుటనే నిన్ను వరించెదను. అందుదోషమేమియు నుండనేరదు అని దమయంతి నలునితో చెప్పెను. నలుడు వెంటనే దేవేంద్రాదులవద్దకు మరలివచ్చి దమయంతికి, తాను చెప్పినయుదంతమును సవిస్తరముగా దెలియబలికెను. ధర్మరాజా! అంతట పుణ్యతిథినక్షత్రయుక్తమగు మహూర్తమునందు దమయంతి

స్వాయంవరము జరిగెను. అప్పుడు దేవేంద్ర, కుబేర, వరుణదేవ, యమ ధర్మరాజులు నలుగురును తమలోతాము యిట్లని యోచించిరి. దమయంతి నలమహారాజునే వరించునట. ఇతరులను వరింపదట మనము నలుగురము నలమహారాజువంటి రూపమును ధరించి, స్వాయంవరమంటపమునకు వెళలుదము. అప్పుడాదమయంతి ఎవ్వరిని వరించునో చూతమని దేవేంద్రాదులునలువురును యోచించి, నలుగురును నలుని రూపమును ధరించి, సంతోషముతో స్వాయంవర రంగమునకువచ్చిరి. ఆసమయమున దమయంతి తెల్లని పుష్పమాలను చేతియందు ధరించి, స్వాయంవరమునకువచ్చిన రాజులవిభవములను, జూచుచు వరుసగా వచ్చుచుండెను. ఇంద్రాది దేవతలు నలుగురును, నలునిబోలు ఏకైకరూపమును బొందియుండిరి. దమయంతి నిజమైన నలుని వారిలో నేర్పరచుకొనజాలక, తనమనంబున నిట్లనియోచింపసాగెను. దైవమా! ఇంద్రాది దేవతలు నలుగురును, నలునిరూపముతో ఇచ్చటకు వచ్చియున్నారు. ఇందు నలుని ఏరీతిగా తెలియగలను అని తనమనంబున దమయంతి సందేహించి దేవతలను నుద్దేశించి, దుఃఖించుచును ప్రార్థనచేసెను. ఓ దేవేంద్రాది దేవతలారా! వీరిలో నలుని తెలియదగు ఉపాయమును యొరిగింపుడు. మీరునలుగురును, మీకృత్రిమరూపములను ఉపసంహరించి, మీనిజరూపములను ధరింపుడు. నా ప్రార్థనమునంగీకరింపుడు అని దమయంతి దేవతలను, మనస్సులో దలంచి. దుఃఖించుచుండెను. దేవతలాదమయంతి ప్రార్థనని కరుణించి, భూమి తగులకుండునట్లుగా దమయంతిదగ్గర నిలిచియుండిరి. మరియు వారి దేహములయందు, చెమటనీరు లేకయుండిరి. కనురెప్పలు వ్రాలకుండెను. అట్టిగురుతులను దమయంతిజూచి, వారునలుగురును దేవతలని దలంచి, ధర్మవిధిప్రకారముగా నలమహారాజును వరియించెను. దమయంతి నలునివరియించునపుడు, సమస్తరాజలోకమును, దేవేంద్రాది

దిక్పాలురనుగూడ జూచుచుండిరి. అంతట దమయంతి నలుని కంఠ మందు పుష్పహారాలనుంచెను. దేవతలు సాధువాదములు చేయుచుం డిరి. బ్రాహ్మణులు ఆశీర్వాదములనధికముగా బల్కుచుండిరి. అనేక వాద్యధనులు, మిక్కిలి హెచ్చుగా మ్రోగుచుండెను. అనేక వాద్య ధ్వనులన్నియు వినగా గంభీరమై సముద్రగర్జనవలె వినపడెను.

## నలుడు స్వయంవరలబ్ధయైన దమయంతిని పెండ్లియాడుట

ధర్మరాజా! స్వయంవరమందు ఈరీతిగా నలుడు దమయంతి చేత వరియింపబడి మహా విభవముతో యామెను పెండ్లియాడెను. దేవేంద్ర, అగ్నిదేవ, వరుణదేవ, యమ, కుబేరులు అయిదుగు రును నలునకు వరములిచ్చిరి. వారిలో దేవేంద్రుడు యిట్లని వర మిచ్చెను. నలమహారాజా! నీవుకోరిన ప్రదేశమందు, నేను అగ్ని హోత్రమును గలిగింతును. వరుణదేవు డిట్లని వరమిచ్చెను. నీవు కోరిన స్థలములందు, నేను జలమును బుట్టించెదను. యమధర్మరాజు యిట్లని పలికెను. మహారాజా! నీ చిత్తము సర్వదా ధర్మమునందే, వర్తించునట్లు నేను వరమిచ్చితిని. కుబేరుడు యిట్లని పలికెను. నీధన సంపదలన్నియు, అక్షయముగా యుండునట్లు నేను వరమిచ్చితిని. అట్లు వారైదుగురును నలునకు, వరములనిచ్చి, దేవలోకమునకు, వెళ్ళుచుండిరి. ఆసమయమున ద్వాపర పురుషుడు వచ్చుచుండెను. ఆకలిపురుషుని దేవేంద్రాదులుజూచి యిట్లు పలికిరి. కలిపురుషా! నీవు ద్వాపరపురుషునితోగూడి, ఇప్పుడు యెక్కడికి యెందులకు వెళ్ళు చున్నావో తెలియజెప్పుము అని దేవతలు అడుగగా కలిపురుషు డిట్లుచెప్పెను. దేవేంద్రా! భూలోకమున దమయంతి స్వయంవరము జరుగనున్నదని వింటిని. ఆమెచేత నేను వరియింప బడుదునను దురాశ చేత నక్కడికి వెళ్ళుచున్నాను. ఆకలిపురుషునిమాటలకు, దేవేం

ంద్రాది, దేవతలు నవ్వి, కలిపురుషునితో, యిట్లనిరి. కలిపురుషా! నీవు దమయంతీ స్వయంవరమునకు వెళ్లుటవలన ప్రయోజనములేదు. ఇదివరకే స్వయంవరము ముగిసినది. ఆస్వయంవరమం దెవ్వరిని వరింపక నలమహారాజు నామెవరించెను.అని దేవేంద్రాదులు,అయిదు గురును కలిపురుషునితో చెప్పిరి. అందు కా కలిపురుషుడు మిక్కిలి కోపించి,తనస్నేహితుడగు ద్వాపరపురుషునితోయిట్లనెను. మిత్రమా! నలదమయంతు లిరువురును, రాజ్యము విడచిపోవునట్లు గావించె దను. నలునకు జూదమాడుటయందు చాల ప్రీతిగలదు. గాన నీవు, ఆపాచికలయందు ప్రవేశించి యుండవలెనని కలిపురుషుడు నిశ్చ యించి, స్నేహితుడగు ద్వాపరపురుషుని ఏర్పరచెను. ఆప్రకారమే ద్వాపరపురుషుడు సొగటాల కాయలయందు ప్రవేశించి యుండెను. కలిపురుషుడు నలుడుండు నిషధ దేశమునకు వెళ్లెను. ఆ సమయం బున నలమహారాజు, భూరిదక్షిణలతో అశ్వమేధాది మహాయజ్ఞము లనేకములు చేయుచుండెను. జపహోమాది. పుణ్యకర్మ లనేకములు చేయుచుండెను. అందువలన కలిపురుషుడు నలుని దేహమందు ప్రవేశించుటకు సాధ్యముగాక సమయమునకై వేచియుండెను. చాల కాలమువరకు నలునికొరకై అట్లనే కాచుకొని యుండెను. అంతట ఒకానొకదినమందు, నలుడు అల్పాచమానము (మూత్రము విడు చుట) చేసినపిమ్మటజలములచేత పరిశుద్ధుడై గాళ్లుకడుగుట, మరచెను. అట్లుకాళ్ళుకడుగకనే సంధ్యావందనము చేసెను. వెంటనే కలిపురుషుడు మంచిసమయమని దలంచి, నలుని దేహమందు ప్రవేశించెను. కలి పురుషుడు పుష్కరుడను రాజు దగ్గఱకుబోయి ఇట్లుజెప్పెను. పుష్క రుడా! నేను కలిపురుషుడను. ద్వాపరపురుషుడు నాసొగటాలకాయలం దణగి ప్రవేశించియున్నాడు. నేనునలుని దేహమందుప్రవేశించియుంటినిక

బుద్ధి మాంద్యము గలిగించెదను. నీవు ఈసాగటాల కాయలచేత నలునితో జూదమాడి, యాతని సర్వరాజ్యమును, గెలిచి తీసికొనుమని కలిపురుషుడు పుష్కరునితో జెప్పెను. పుష్కరుడు సమ్మతించెను. కలిపురుషుడు బ్రాహ్మణ వేషమును ధరించి, పుష్కరునకు సహాయుడై ద్వాపరపురుషుడు ప్రవేశించియున్న సాగటాలకాయలను తీసికొనెను. కలిపురుషుడు ఆసాగటాల కాయలను తీసికొని బ్రాహ్మణ రూపధారియై పుష్కరుని వెంటబెట్టుకొని, నలుని దగ్గఱకు బోయి ఇట్లనెను.

నలుడా! నీవుమాపుష్కరరాజుతో జూదమాడుమని, బ్రాహ్మణ రూపముననున్న కలిపురుషుడు పలికెను. అంత నలుడు తనమనస్సులో నిట్లని తలపోసెను. జూదమాడుటకు పిలువబడి, జూదమాడకుండుట ధర్మముగాదు. గాన జూదమాడెదనని నలుడు తలంచి వానితో జూదము ప్రారంభించెను. అంతట నలుడు పుష్కరునితో జూదమాడుచు, తనకుగల సమస్త ధనములను, పందెముగా నొడ్డుచు నొడ్డినవెల్ల నోడుచు నుండెను. స్నేహితులగు యితరజనులు జూదమాడుట చాలింపుమని నలునితో పలుకసాగిరి. కలిపురుషుని ప్రేరేపణము వలన నలుడు చపల బుద్ధిగలవాడై స్నేహితులమాటలవినక, సమస్తవిభవములను, సంపదలను, ధనములను, పందెముగా నొడ్డుచు, నన్నిటిని ఓడుచుండెను. ధర్మరాజా! యారీతిగా నలమహారాజు మాసముల పర్యంతము, పుష్కరునితో జూదమాడుచు, సమస్తధనములను, పదార్థములను నొడ్డుచు, ఓడుచు యుండెను. సకలవాహన సమూహములును, పుష్కరునికి ఓడిపోయెను. అంతట పురజనులును, బ్రాహ్మణులును, మంత్రులును, దమయంతిని తీసుకొనివచ్చి జూదమాడవద్దని, నలునితో చెప్పించిరి. కలిపురుషుడు నలుని మనస్సున బ్రవేశించి యున్నందున, పిచ్చివానివలె చపలబుద్ధితో

యుండెను. అందువలన నలుడు తనవారుచెప్పిన మాటలను వినక పుష్కరునితో జూదమాడుచుండెను.

దమయంతి మొదలగు వారందరును పలుకక యూరకుండిరి. దమయంతి, చింతాక్రాంతచిత్తయై తనమనస్సులో నిట్లనితలంచెను. దైవమా! జూదమందు యోడినకొలది ఆడుటయందు ఉత్సాహము గల్గుచున్నది. నేనేమిచేయవలెనో తెలియకున్నది? కీడు గలుగుటకు, జూదము మూలకారణము. సొగటాల కాయలు పుష్కరునికి స్వాధీనములై యున్నవి. ఆకాయలే నలునకు ప్రతికూలము గలిగించు చున్నవి గాన నాభర్తయగు నలునకు ఈ జూదమందు అపజయమే గలుగును. అని దమయంతి తనమనంబున తలంచి, నలుని అను మతినిపొంది, వార్ష్ణేయుడను సారథిని బిలచి యిట్లనెను. సారథీ! ఇంద్రసేనుడను కుమారుని ఇంద్రసేని యనుకుమార్తెను నిడుపురను ఈ రథముపై నెక్కించుకొని, విదర్భపురికిం దీసికొనిపొమ్ము. అట్లు తీసికొనివెళ్ళి నాతల్లిదండ్రుల దగ్గఱవిడచి, వారిని అచ్చట నప్పగించి నీవు శీఘ్రముగా మరలరమ్ము. అని దమయంతి సారథితో జెప్పెను. అందులకు, మంత్రులు, బంధువులు, ఇతరజనులు అందరును సమ్మ తించిరి. వెంటనేసారథి, కొడుకు కూతుండ్ర నిద్దరిని తీసికొని విదర్భ పట్టణమునకు వెళ్లెను. అంతట నలుడు సకలరాజ్యమును, పుష్కరునకు ఓడి, సకలరాజ్యభాగములను విడిచి, దమయంతిని తీసికొని. పట్ట ణమును విడిచి, వెడలుచుండెను. ఇట్లు నలుడు తనరాజధానినివిడిచి, బయలుదేరి మూడుదినముల వరకు ఆ పట్టణసమీపమందే నిలచి యుండెను. పుష్కరుని యధికార భయమువలన నొక్క మనుష్యు డైనను, నలునిదగ్గఱకు బోకుండెను. జనులు అందరు చెప్పినను, వారి మాటలను వినక జూదమాడెనని, నలునియందుబాజనులకు ద్వేష ముగలిగెను. ధర్మరాజా! ఆ నలుడు సర్వజనులచేత పూజింపబడిన వాడైనను, దైవాధీనముచేత యెవ్వరినలనను, సన్మానింప బడ లేదు.

## నలుడు దమయంతీ సహితుడై యడవికిబోవుట

ఇట్లు నలుడు దమయంతితో మాత్రముకూడి ఒక్కడును తన పట్టణ సమీపమందుండెను. అప్పుడు నలునకు ఆకలిబాధ మిక్కుటముగా నుండెను. అతడు జలములనే ఆహారముగా భక్షించుచుండెను. ఆ సమయమున బంగారు వికారమగు రెక్కలుగల కొన్ని పక్షులు ఆనలుని వద్దకువచ్చి తిరుగుచుండెను. ఆకలిచే బాధనొందుచున్న నలుడు, ఆ పక్షులను జూచి, వానింబట్టుకొని, భక్షింపదలచి, తాను కట్టుకొనిన మొలవస్త్రమును విప్పి పక్షులమీద విసరెను. ఆ పక్షులు ఆ వస్త్రముతోనే అతనివద్దనుండి ఆకాశమునకు ఎగిరిపోయినవి. ఆ పక్షులు ఆకాశము కెగసి, వస్త్ర విహీనుడై మొండిమొలతో నుండు నలుని జూచి యిట్లని పలికెను. నలమహారాజా! నీ యొక్క సమస్తమైన ధనములను, రాజ్యములను, మేము జూదమందు హరించితిమి. మేమే సొగటాల కాయలమై యాటలో నుంటిమి. ఇప్పుడు నీ వస్త్రమును హరించుటకు పక్షిరూపములతో నిచ్చటికి వచ్చితిమి. వచ్చినందులకు నీ వస్త్రమును హరింపగల్గితిమి. అని పక్షులు నలునితో చెప్పి ఆకాశమార్గమున ఎగిరి పోయెను. ఆ పలికిన పక్షులయొక్క మాటలనువిని ఆశ్చర్యమునుబొంది, యీ సొగటాల కాయల దోషమువలన నాకు ఇంత అపాయము గలిగినదని ఆశ్చర్యపడుచు తనలో యనుకొనుచు దమయంతి కట్టుకొనిన వస్త్రముయొక్క చెంగునుచించి తాను కట్టుకొనెను. అంతట నలదమయంతులిద్దరును ఏకవస్త్రముచే కట్టుకొని, పరస్పర ముఖావలోకనములచేత దుఃఖించుచుండిరి. అంతట నలుడు దమయంతితో ఇట్లని చెప్పెను. దమయంతీ! ఈ మార్గము దక్షిణదిక్కునకు బోవును. ఈ మార్గము విదర్భా పట్టణమునకు బోవును. ఈ మార్గము కోసల దేశమునకు బోవును. ఈ మార్గము ఉజ్జయినీపట్టణమునకుబోవును.

నాలుగు మార్గములలో మన మే మార్గమును బట్టి వెళ్ళుదమో చెప్పుము. నీవు అడవులలోనికి వచ్చి నాతో కష్టములు పడజాలవు. గాన నీవు ఇప్పుడు నీ బంధుజనులుండు విదర్భాపట్టణమునకు వెళ్లుము. అని ఇట్లు నలుడు, దమయంతితో చెప్పెను. ఆమాటలకు దమయంతి బోటబోట, కన్నీరుగార్చి, ఏడ్చుచు, గద్గదకంఠ స్వరముతో ఇట్లనెను. నాథా! నీవును, నేనును, విదర్భాపట్టణమునకు బోయి, సుఖముగా నుందము. భయంకరములగు అడవులకు బోవలసిన పని లేదు. క్రూరమృగములుండు వనములలో మనము నివసించవలసిన పని లేదు. అని దమయంతి చెల్పగా నలుడీ రీతిగా జవాబు చెప్పెను.

దమయంతీ! నీ తండ్రియగు భీమరాజుయొక్క రాజ్యము మనరాజ్యమే యగును. పూర్వము నేను గొప్పవగు ఐశ్వర్యముతో విదర్భదేశమునకు బోతిని. అప్పుడు నన్ను చూచి మన బంధుజనులందరును పరమానందమును బొందిరి. ఇప్పుడు నేను బీదవాడనైతిని. ఇట్టి స్థితిలో నేను ఆ విదర్భపట్టణమునకు బోజాలను అని దమయంతితో జెప్పి కలవంచుకొని యూరకుండెను. దమయంతి నలునితో నిట్లని చెప్పదొడంగెను. నాథా! సకల దుఃఖములను రోగములచేత పీడింపబడిన పురుషునకు భార్యయే పరమౌషధము. భార్యతో కూడియున్న పురుషునకు, ఎన్ని యాపదలు వచ్చినను కష్టముగా దోచవు. పురుషునకు శ్రమ గలిగినప్పుడును, అలసట గలిగినప్పుడును, ఆకలి దప్పులు గలిగినప్పుడును అట్టి యితరకష్టములేవి సంభవించినను, భార్య నివర్తింపజేయును. గాన నేను నీ పోషణలోనే జీవింపవలెనను, తలంపును, విడువుము. నేను వ్రతము బట్టితినని నీవు తలంపవలదు. నేను కష్టపడుదునని నీవు భావించవలదు. నన్ను నీవు విడువకుము. నీ వెంబడి నేనును వచ్చెదను. అందులకు సమ్మతింపుము. అని దమయంతి నలునితో చెప్పగా నలుడు ఇట్లనెను. దమ

యంతి నీవు చెప్పినరీతినే జేసెదను. నీవు నా ప్రాణసమానురాలవు. నేను నిన్ను విడువను. భయపడకుము. అని నలుడు దమయంతిని, ఊరడిలజేసి ఆమెను వెంటబెట్టుకొని, జనశూన్యమైన అడవికి వెళ్ళెను. ఆ యడవియందు ఒక సభాగృహము కనబడెను. ఆ గృహమందు నలుడు విశ్రమించి, దుమ్ము, ముండ్లనుగల, స్థలమందు పండుకొనెను. పిమ్మట నలుడు మార్గాయాసము చేత కండ్లుమూసికొని, పండుకొనినను, దుఃఖముచేత నిద్రపట్టలేదు అందుచేత నలుడు లేచి కూర్చుండి, తనపాదసమీపమున మిక్కిలి దుఃఖముచేత నిద్రించు దమయంతిని జూచి, యీరీతిగా విచారింప జొచ్చెను. దైవమా! నా సమస్తమైన రాజ్యసంపదలను, శత్రువులచేత, జూదమందు హరింపబడెను. నా బంధుమిత్రజనులను దేశజనులను వదలితిని, నాభార్యతో ఒంటరిగావచ్చి యీ మహారణ్యములో తిరుగుచున్నాను. అని నలుడు తన మనస్సులో తలచుచు దుఃఖించి మరల యీగతిని జింతించెను. అయ్యయ్యో! దైవమా! పూర్వము దమయంతి మెత్తని పాన్పునందు పండుకొని యుండగా దీని పాదములు పరిచారికా స్త్రీలు ఒత్తుచుందురు. అట్టి స్త్రీలు ఉపచారములు చేయుచుండగా దమయంతి సుఖముగా నిద్రింపుచుండును. అటువంటి దమయంతి ఇప్పుడు దుమ్ముతోనిండిన యీ ప్రదేశమందు నిద్రింపుచున్నది. ఈ దమయంతి దైవఘటనము వలన నాకు భార్యయై యిట్టి దుఃఖముల ననుభవింప వలసివచ్చినదిగదా! నే నీమె దుఃఖమును జూడజాలకున్నాను. ఎక్కడకైనను వెళ్ళెదను. నేను వెళ్ళినయెడల దమయంతి తన బంధుజనుల దగ్గరకు వెళ్ళి దుఃఖపడకుండ నుండగలదు. అని నలుడు తనమనస్సులో దలచి దమయంతిని విడిచి వెళ్ళుటకు ప్రయత్నించెను. దమయంతి మేల్కొనకుండునట్లుగా నామె వస్త్రములో సగము చించి నలుడు కట్టుకొని దమయంతిని లేపకనే వెడలి

పోయెను. అట్లు కొంతదూరముపోయి నలుడు దమయంతి యందు గల ప్రేమచేత నామెను విడువజాలక మరల నాస్థలమునకు వచ్చెను.

ధర్మరాజా! కలిపురుషునివలన నలుడు చపలబుద్ధి గలవాడై నను దమయంతి యందు గల ప్రేమచేత నామెను విడిచి వెళ్ళజాలక మోహము గలిగియుండెను. నలుడట్లు కలిపురుషునిచేత ప్రేరేపింపబడి దమయంతిని విడువదలచుచుండెను. దమయంతిపై గల ప్రేమచేత దానిని విడువజాలకయుండెను. ఇట్లు రెండువిధములయిన సంకల్పముల చేత నలుని మనస్సు ఊగుచున్న ఉయ్యాలమాదిరిగ చలింపుచుండెను. అప్పుడు నలుడు తన మనస్సులో యిట్లని నిశ్చయించెను. ఈదమయంతి బాలయనియు, యొంటరిగా యడవిపాలుజేసి వెడలరాదు అని తలచక కలిపురుషునిచేత ప్రేరేపింపబడి నిర్దయుడై దమయంతిని విడిచివెళ్ళెను.

ధర్మరాజా! నలుడట్లు వెళ్ళినకొంతసేపటికి దమయంతి మేలుకొని, నలునిగానక తన వస్త్రము గోయబడియుండుట జూచి నాలుగు దిక్కులను కలియజూచి లేచి మిగుల దుఃఖము గలదాయెను. అప్పుడు దమయంతి యీరీతిగా యేడ్వనారంభించెను. హా! నలమహారాజా! నీవు సకలభూమిని రక్షించుటకు సమర్థుడవు. నీ కుడిచేతియందు గల ఆయుధములచేత సకలశత్రువులను శిక్షించితివి. ఈ యడవియందు నన్ను విడచి నీవు నిర్దయుడవై వెడలితివి. నీవు యెన్నడును ధర్మమును తప్పలేదు. సత్యవ్రతముగలవాడవు. నీవు భయపడవద్దని నన్ను వూరడించితివి. ఆమాటలను నీ విప్పుడు మరచుట ధర్మముగాదు. ఈ పొదలలో దాగియుండి నాకు కనబడకుండనుండుట పాడిగాదు. నీ వేల యిట్టి క్రూరభావమును గలిగియుంటివో తెలియకున్నది. ఇకను నే నెక్కడికి వెళ్ళెదనో తెలియజాలకున్నాను. ఈ ఘోరారణ్యమునందు నిన్నెట్లు జూడగల్గుదునో తెలియకున్నది. నాలుగు వేదములు సమగ్ర

ముగా జదివిన వేదాధ్యయనఫలము ఒక సత్యమునకు సమానము. అట్టి వేదాధ్యయనఫలమే సత్యమునకు సమానమగును గాని వేరే మియు కాజాలదు. నీవు ప్రాణసమానురాలవనియు నిన్నెన్నడును విడువననియు నాతో జెప్పితివి. నీవు చెప్పిన సత్యవాక్యమును పాలింపుము. అని యీరీతిగా దమయంతి నలునుద్దేశించి చెప్పుచు యాక్రోశించుచు యేడ్చుచుండెను.

దమయంతి యీ సమయమున నొంటరిగా నుండుటయు, తన బాల్యమున సంభవించిన యట్టిస్వభావమునకును, మాటిమాటికి పాదములయందు ముండ్లు గ్రుచ్చుకొనుటకును, మృగసర్ప దుష్టజంతు భయమునకును విచారింపలేదు. నలునకు సహాయము లేదనియు, నలునకు గలుగు యాకలిదప్పులకును, శ్రమకును దుఃఖమునకును దమయంతి దుఃఖపడుచుండెను. ఈరీతిగా దమయంతి దుఃఖించుచు ఆ మహారణ్యములో నలుని వెదకుచు వెళ్ళుచుండెను. అట్లు దమయంతి యడవింబడి వెడలుచు అలయుచు మృగముల ధ్వనులకు భయపడుచు, యెండకు నోర్వజాలక చెట్ల నీడక్రింద నిలుచుచు వెళ్ళుచుండెను. దమయంతి యెలుగుగొడ్లను, పెద్దపులులను, అడవిపంది మొదలగు క్రూరమృగములను జూచి భయపడుచుండెను. గొప్ప పొదలయందు వెదకుచు, ముండ్లుగల ప్రదేశములను విడచిపోవుచు దిక్కులను జూచి యేడ్చుచు క్రిందబడుచు లేచుచు దమయంతి నలుని వెదకుచు నా యడవిలో వెళ్ళుచుండగా ఒక గొప్ప సర్పము యొక్క తోకను త్రొక్కెను. ఆ మహాసర్పము. దమయంతిని భక్షింపుటకై పట్టుకొనగా కదలజాలక నలుని యుద్దేశించి యీ విధమున దుఃఖించుచు యరచెను.

ప్రాణేశా! మహారాజా! ఇకనైనను నామాటల నాలకింపుము. నాకు శరణము నిమ్ము. అని యేడ్చుచున్న దమయంతియొక్క

యాక్రోశమును విని ఒక యెరుకలవాడు అతివేగముగా అచటికివచ్చి చూడగా ఒక మహాసర్పముచేత దమయంతి పట్టుబడియుండెను. ఆ యెరుకలవాడంతట తనచేతియందు గల కత్తిచేత ఆ మహాసర్పము యొక్క శిరస్సును నరికెను. అంతట రాహువుచేత విడువబడిన చంద్ర రేఖవలె దమయంతి ఆసర్పముఖమునుండి విడివడెను. ఎరుకలవాడా దమయంతి నూరడించి యా సమీపమునగల సరస్సును చూపించెను. ఆ సరస్సున దమయంతి స్నానమును జేసెను. ఎరుకలవాడా యడవి యందలి వన్యఫలములను దెచ్చియివ్వగా దమయంతి భుజించెను. పిమ్మట యెరుకలవాడు దమయంతి మనసున గల విచారమును బోద్రోలి యిట్లు పలికెను.

ఓ కాంతా! నీవు యెవ్వరిదానవో జెప్పుము. ఒంటరిగా నీ వనమునకు యెందులకు వచ్చితివో చెప్పుము. అని యెరుకలవాడు దమయంతిని అడుగగా దమయంతి తన వృత్తాంతము నంతయు యెరుకలవానికి వివరించి చెప్పెను. దమయంతిముఖము చంద్రబింబ మువలె నుండెను. ఆమె స్తనములు ఘనముగా నొప్పారుచుండెను. ఆమెనడక యేనుగుయొక్క నడకవలెనుండెను. ఆమె శరీరమంతయు సుగంధమయమై యుండెను. ఆమె దేహకాంతి ప్రకాశమానమై యుండెను. ఆమె నేత్రములు తామర రేకులవలె తోచుచుండెను. అటువంటి సర్వలక్షణయుక్తమగు దమయంతిని జూచి యెరుకలవాడు కామముగలవాడయ్యెను. ఆయెరుకలవాడా కామాగ్ని చేత పరితప్తుడై తన యభిప్రాయమును దమయంతి కెరింగించెను.

## దమయంతీ శాపముచే కిరాతుడు చచ్చుట

ధర్మరాజా! దమయంతి అగ్నిశిఖవంటిది. ఆమెను తాకుటకు గాని దగ్గర జేరుటకుగాని, నిదానించి చూచుటకుగాని యెవరికిని

సాధ్యముకానేరదు. ఆయెరుకలవాని కాయుర్దాయము ఆఖరగుట వలన ఆ దమయంతితో భోగింప నపేక్షించెను. అంతట దమయంతి యెరుకలవానిని జూచి కోపించి యిట్లనెను. దైవమా! నేను మహా పతివ్రత నయినయెడల యీ దుర్మార్గుడగు యెరుకలవాడు చచ్చుగాక! అని యీరీతిగా యెరుకలవానిని దమయంతి శపించెను. వెంటనే యెరుకలవాడు అగ్నిచేత దహింపబడిన వృక్షమువలె చచ్చి క్రిందబడెను. ఈవిధముగా దమయంతి దన పాతివ్రత్య మహిమచేత తన భర్తను మనస్సుననిలుపుకొని దుష్టమగు సర్పశార్దూలాది కౄర మృగములకు భయపడక నలుని వెదకుచు ఆ మహారణ్యములో వొంటరిగా వెళ్ళుచుండెను. దమయంతి యాయరణ్యమున ప్రతివృక్షమును సమీపించి నలునిగురించి యిట్లు అడుగుచు వెదకుచుండెను. ఓమామిడివృక్షమా! నాభర్తయగు నలుడెచ్చటనున్నాడో చెప్పుము. పున్నాగవృక్షమా! పురుషశ్రేష్ఠుడగు నలుడెచ్చటనున్నాడు? చందన భూజమా! హరిచందనము ధరించు నలుడిప్పు డెచ్చటనుండెను? అశోకతరురాజమా! స్నేహితుల విచారములను దొలగించు నలుడెచటనున్నాడు? వకుళభూరుహమా? నాభర్తయగు నలుడెచట నున్నాడు? విభీతకవృక్షమా! భయపీడితులగు జనుల బాధలను తొలగించు గుణసంపన్నతగల నలుడెచటనున్నాడు? ఓచెట్టులారా! నా భర్తయగు నలుడెచ్చటనున్నాడు? మీరు జూచితిరేమో జెప్పుడు యీయరణ్యములో నాభర్త నన్ను వదలివెళ్ళెను. నా భర్తయగు నలుడు లోకశ్రేష్ఠుడు. అని యీరీతిగా ప్రతివృక్షమును ప్రార్థించుచు, జూచుచు వెదకుచుండెను. అప్పుడు దమయంతిపాదములు ఎండకు పురపుర పొక్కుచుండెను. అందువలన చుఱ్ఱుమని కాలుచున్న కాళ్ళను సెలయేటి ప్రవాహములయందు నిలుపుచు, యేడ్చుచు, వృక్షపర్వత గుహాగృహములయందు తొంగితొంగి జూచుచు నలుని వెదకుచు వెళ్ళుచుండెను.

ధర్మరాజా! యీరీతిగా అఘోరారణ్యమందు దమయంతినలుని వెదకుచుతిరుగుచు తనపుణ్యపరిపక్వము వలన ఒకమునిపల్లెనుచూచెను. ఆమునిపల్లెయందలి మహామునులు, జలములను ద్రావుచు, గాలిని పీల్చుచు, కూరగాయలను దినుచు వృక్షమూలములందుండి తపము జేయుచుండిరి. దమయంతి మహామునుల యాశ్రమములను జూచెను. ఆమహారణ్యమందంతటను మృగములు, సర్పములు, దొంగలు, వెదురుకలవాండ్రు, పర్వతములు గలవు. అటువంటి మహారణ్యమందు ఒక నదీతీరమందు మునిపల్లె యుండెను. ఆమునిపల్లెయందుగల మహామునులు, వసిష్ఠ వామదేవ. వాలఖిల్య, నారదులవంటి గొప్పవారలయి యుండిరి. అటువంటి మునులను దమయంతి జూచి వారికినమస్కరించి నిలచెను. ఆమహామునులు దమయంతినిజూచి ఆశ్చర్యముతో ఓతల్లీ! నీవుయెవ్వరిదానవో చెప్పుము. నీవు యీవనదేవతవో, దేవకన్యకవో తెలియకున్నది. నీవు దివ్యతేజస్సుతో ప్రకాశించుచున్నావు. ఇట్టి శరీరముగలనీవు యీవనమందు తిరుగుటకు కారణమేమో చెప్పుము. అని మునులు అడుగగా దమయంతి యిట్లు చెప్పెను.

మునులారా! నేను నలమహారాజుయొక్క భార్యను. నలుడు పుణ్యపురుషుడు. అతడు అనేకమహాయజ్ఞములను జేసి లోకమందు మహాకీర్తినిపొందెను. నాపేరుదమయంతి. దైవాధీనమువలన నాభర్త యగు నలుడు నన్నుయీవనమందువిడిచి యెక్కడికో పోయెను. నేను ఆనలుని వెదకుచు యీ వనమందు తిరుగుచున్నాను. ఈతపోవనమునకు ఆనలుడువచ్చి కృతార్థుడై మీపాదములకు నమస్కరించి వెడలెనేమో చెల్పుడు. ఆనలుడు యేదిక్కునకేగెనో జెప్పుడు. ఆమార్గమును మీరెరింగిన యెడల యానతిండు. కొన్నిదినములలో నలునిదర్శనము నాకులభింపనియెడల నేనుప్రాణములను విడతును అని దమయంతి మహామునులతో దీనముగా జెప్పుకొని యేడ్చుచుండెను.

అంతట ఆ మునులు దమయంతియందు దయగలవారై యిట్లు జెప్ప సాగిరి.

దమయంతీ! కొలదిదినములలోనే నీవు నీభర్తయగు నల మహారాజును జూడగలవు. ఆనలుడు యెప్పటివలెనే తనపట్టణమందు రాజ్యము నేలుచుండును. అటువంటి నలమహారాజును నీవుచూడగ లవు. మేము తపోదృష్టిచేతచూచి చెప్పితిమి గాన నీవు నమ్ముచుండుము. అని మహామునులు దమయంతితో జెప్పి తమఅగ్నిహోత్రముతోగూడ అదృశ్యులైరి. ఆ తపోవనమున్ను కనుపింపలేదు. అక్కడగల పుష్ప ఫలవృక్షములును మాయమయ్యెను. ఆ సమీపమున ప్రవహించు నదియు కనుబడలేదు. అంతట మాయాదృశ్య విషయములను దమ యంతియెరిగి, కలయో నిజమో తెలియక, ఆశ్చర్యమును పొందుచు ముందునకు సాగిపోవగా నచ్చట యొకబాటసారులగుంపు దమయంతికి గోచరించెను. ఆగుంపునందుగల జనులు దమయంతినిజూచి యిట్లు చెప్పుకొనసాగిరి.

ఈకాంతామణి చెంపలయందు దుమ్ముపడియున్నది. ఆదు మ్ముపైన ముంగురులు దట్టముగా వ్యాపించినవి. ఈమె కట్టుకొనిన వస్త్రము అర్థవస్త్రముగా నున్నది. అదియుమిక్కిలి మురికిగానున్నది. యీామెకు ఆకలి, దప్పిక, నిద్రగూడ యున్నట్లు దోచదు. పిచ్చిప ట్టినదానివలెనున్నది. అని జనులగుంపులో దమయంతినిజూచి యొకరి కొకరు జెప్పుకొనుచుండిరి. కొందరు దమయంతినిజూచి పిశాచమనిరి. కొందరామెనుజూచి భయపడసాగిరి. కొందరా దమయంతినిజూచి విరగబడినవ్వజొచ్చిరి. కొందరామెను దరిజేరి నీవీయడవిని దిరుగుటకు కారణమేమని యడిగిరి. కొందరామెను దేవతగాభావించి నమస్కరింప సాగిరి.

దమయంతి బాటసారులగు వర్తకులగుంపునుజూచి తనమనం బున నిట్లనితలపోసెను. మహారణ్యమందు, జనులగుంపుకనుపించినవి,

నేనెంతపుణ్యమును జేసితినో తెలియజాలను. నాపుణ్యవశముచే యీ పుణ్యాత్ములు నాకంటబడిరి. అని దమయంతి తనమనంబున దలపోసి వర్తకులసంఘముతో నిట్లుచెప్పెను. జనులారా! నేనునలమహారాజు భార్యను. నేనిదివరలో యరణ్యమున నొంటరిగా దిరుగుచున్నాను. నాభర్త నన్నువిడిచెను. నేను శుష్కించుచు యీ యాశ్వుల యందు దిరుగాడుచున్నాను. దైవసముడగు నలమహారాజును మీరుజూచితి రేమో దెల్పుడు. అనియీరీతిగాదమయంతి వర్తకులగుంపు నడిగెను. అంత వర్తకసంఘములో ముఖ్యుడగు శుచియనువాడు దమయంతితో నిట్లనెను.

అమ్మా! ఈవనమందు మేము నలమహారాజునుచూడలేదు. ఏనుగులు, సింహములు, ఎలుగుగొడ్లు, పెద్దపులులు యీ వనముల యందు విశేషముగ నున్నవి. ఆమృగములను మేముసర్వదా జూచు చుందుము. ఈవనమునకు మనుష్యులు ఒంటరిగారాజాలరు. యీవన మందు యెండకనుపించదు. అని శుచియను వర్తకుడు దమయంతితో చెప్పెను. దమయంతి యీమనుష్యులగుంపు యెక్కడికిపోవునని శుచి యనువాని నడిగెను. అంత శుచియనువాడు దమయంతికిట్లు చెప్పెను. తల్లీ! యీమనుష్యులు చేదిపట్టణరాజగు సుబాహునియొక్క పట్టణ మునకు వెళ్లుదురు. అని శుచిచెప్పగా దమయంతి "వర్తకుడా! అటు లయిన మీతోగూడ నేను సుబాహునిపట్టణమునకు వచ్చెదను" అని వర్తకునితోజెప్పి తనభర్తయందు ప్రేమగలదై యాతని జూచుటయం దపేక్షతో మునులమాటలను దలంచుచు వర్తకులగుంపును వెంబడిం చెను. వర్తకులగుంపు మిక్కిలియెండ వచ్చుపర్యంతమునడచి మిక్కిలి శ్రమజెంది చల్లని జలములుగలయొక సరస్సుసమీపమున మహారణ్య మందు దిగెను. అట్లుదిగి వంటచేసికొని భోజనముజేసి జనులందరును అక్కడనేయుండి ఆ రాత్రియందు ఒడలుమరచి నిద్రింపుచుండిరి. ఆ

యర్థరాత్రికాలమందు ఆ చెరువునందు జలములు త్రాగు నిమిత్తమై ఏనుగులగుంపులు వచ్చెను. ఏనుగులగుంపులను జూడగా సముద్రమందు నీళ్ళు త్రాగుటకువచ్చు మేఘములగుంపులువలె నుండెను. ఆ ఏనుగులగుంపులు త్రొక్కుటచేత ఆమనుష్యులగుంపులో కొందరు చచ్చిరి. ఏనుగులతొండములచేత పొడిచినందున మరికొందరుజచ్చిరి. మరికొందరు ప్రాణభయమువలన అరచుచు పరుగెత్తికొనిపోయి గొప్పవృక్షములమీద యెక్కిరి. ఈరీతిగా అవివేకమనుగల లక్ష్మివలె ఆమనుష్యులగుంపు నశించిపోయెను. అట్టి మహాపదనుండి దమయంతి మరణమును తప్పించుకొని తనమనస్సులో యిట్లనితలంచెను. ఆహా! జీవింపవలెననుయాశగల యీ జనులు నిద్రింపుచుండగా యీ దైవమట్టి జనులను చంపెను. వారు మరణమునకు భయపడియరచినను నిర్దయుడై యుండెను. నేను మరణమును కోరుచుంటిని. దైవము నన్ను జంపుటకు మరచి యుండెను. దైవము మిక్కిలిమందబుద్ధిగలవాడు. మనుష్యులగుంపు వెంబడి వెళ్ళి యీయరణ్య దుఃఖమును బాపుకొనదలచితిని. అగస్త్యమునిచేత సముద్రజలములు పానముగావింపబడినట్లు ఏనుగులచేత యీమనుష్యులగుంపు నశించెను. నాకిన్నికష్టములు నా పూర్వజన్మ సంస్కారమువలన కలిగెనేమో తెలియకున్నది.

నాస్వయంవర సమయమున దేవేంద్రాది దేవతలునాయందపేక్ష గలిగి అక్కడకువచ్చిరి. ఆదేవతలయెదుట నేను నలుని వరించితిని. అందులకు ఆ దేవతలు కోపించుకొని నా కిట్టి కష్టములను కలిగించిరేమో తెలియకున్నది ఏలొకో! నాభర్తయగు నలుడు నన్నెడబాసిపోయెను. అందువలన నాకింత దుఃఖముకలిగినది. ఇక నేనేమిచేయుదును అనియిట్లు దమయంతి తనమనస్సులో తలచుచు దుఃఖించుచు మరునాటి ఉదయకాలమందు చావగామిగిలిన వర్తకజనులవెంబడి

వెళ్ళెను. ఇట్లుదమయంతి సర్వదా ప్రయాణములు చేసి చేదిపట్టణమును ప్రవేశించెను.

## దమయంతి సుబాహు పురమునందు ప్రవేశించుట

ధర్మరాజా! దమయంతి సుబాహురాజుయొక్క రాజధాని యగు చేదిపట్టణములోనికి ప్రవేశించి జనసంకులమైన రాజమార్గమందు వచ్చుచుండెను. పగటికాలమందు సూర్యకిరణములచేత కాంతిహీనమైన చంద్రరేఖవలె దమయంతి తేజోహీనమై యుండెను. దమయంతి డస్సియున్నను, మనోహరమైన ఆకారముగలిగి యుండెను. సుబాహుని రాజగృహముయొక్క మేడయందు రాజమాత యుండెను. ఆ రాజమాత రాజమార్గమందు వచ్చుదమయంతిని జూచి దాసితో యిట్లనిపలికెను.

ఓ దాసీ! అదిగో ఒకస్త్రీ వచ్చుచున్నదిచూడుము. ఆ చిన్నది చినిగిన మిక్కిలి మురికివస్త్రమును ధరించియున్నది. దాని ముంగురులు దుమ్ముతో గూడినవై వ్రేలాడుచున్నవి. ఆమె వెర్రివేషమును వేసిన లక్ష్మీదేవివలె గన్పడుచున్నది. ఆమెయందు నాకుచాల ప్రేమగలుగుచున్నది గాన, నీవిప్పుడాస్త్రీ నివటికి గొనిరమ్ము అని చెప్పి రాజమాత దాసిని పంపెను. ఆ దాసి పోయి దమయంతిని తీసికొని రాజమాత వద్దకు వచ్చెను. అంతట రాజమాత దమయంతిని జూచి ''చిన్నదానా! నీవు యెవ్వరిదానవు? నీవు మిక్కిలి దుఃఖావేశము గలిగియున్నావు. ఇందులకు కారణమేమి? చెప్పుము అని యడుగగా యామెతో దమయంతి యిట్లని చెప్పెను. తల్లీ! నేను నలమహారాజుయొక్క భార్యను. నా భర్తయగు నలుడు జూదమాడి శత్రువులచేత మోసింపబడి సకల రాజ్య సంపదలను బోగొట్టుకొనెను. నలుడంతట యడవికి వెళ్ళుచుండగా నేనును ఆ నలుని

వెంబడించితిని, ఆ నలుడా యడవియందధికమగు ఆకలి గలవాడై నేనును నిద్రింపుచుండగా నన్ను వంచించి యొంటరిగా యెచటికో పోయెను. అప్పటినుండి నేను యడవుల వెంబడి నలుని వెదకుచు వచ్చితిని. నేను సైరంధ్రీవ్రతమును బూనియుంటిని. భర్త వియోగ దుఃఖాగ్ని చేత పరితపించు చున్నాను. కంద మూల ఫలములను ఆహారముగా భక్షింపుచున్నాను. ప్రొద్దు గ్రుంకి నను అరణ్యభూములందే నివసింపుచుంటిని. అని యీరీతిగా దమయంతి రాజమాతతో చెప్పి బొటబొట కన్నీరు గార్చుచు పలుకకుండెను. అప్పుడు దమయంతితో రాజమాత యిట్లు పలికెను. ఓ చిన్నదానా! నీవు నా దగ్గరయుండుము. నీ భర్తయగు నలుని వెదకుటకు బ్రాహ్మణోత్తములను పంపించెదను. అని చెప్పిన రాజమాత పలుకులకు దమయంతి యిట్లు చెప్పెను.

రాజమాతా! నేను సైరంధ్రివలె నుండెదను. ఒకరు తినగా మిగిలిన యన్నము ముట్టను. పాదములను శుద్ధిచేయను. పరపురుషులతో పలుకను. నా భర్తను వెదకుటకు వెడలు బ్రాహ్మణోత్తములతో మాత్రము మాటలాడుదును. యీరీతిగా నీ వంగీకరించినచో నేను నీ దగ్గర యుండెదను. ఇందుకు భిన్నమైన యెడల నీ వద్ద నేనుండజాలను. (సైరంధ్రి యనగా భర్త విడచినప్పుడు పరగృహమందుండి స్త్రీలను శృగారించెడి పతివ్రతయని తెలియవలెను) అని చెప్పిన దమయింతి పలుకులకు రాజమాత యిట్లు చెప్పెను. అమ్మాయీ! నీ కిష్టమగు రీతినే నీవు నా యొద్దయుండుము. అనిపలికి రాజమాత యామెకు తనకూతురునిజూపి, సగౌరవముగా విచారింపుచుండుమని బలికి దమయంతికి వప్పగించెను. రాజమాతయొక్క కూతురు దమయంతికి పరిచర్యలు చేయుచుండెను. దమయంతియు పుణ్యవ్రతముల నాచరింపుచు సైరంధ్రీవృత్తిగలదై నలునితలచుచు

నలుని వియోగమునకు దుఃఖించుచుండెను. ఈ విధముగా దమయంతి చేదిదేశపురాజగు సుబాహునిపట్టణమందుండెను. దమయంతికి ఉప చారములుజేయు రాజమాతయొక్క కూతురుపేరు సునంద. దమ యంతి తనభర్తయగు నలుని దర్శనమునకు నిరీక్షించుచు సుబాహుని పట్టణమం దుండెను.

ధర్మరాజా! ఇక నలుని సమాచారమును జెప్పెద నాలకిం పుము. నలుడట్లు దమయంతిని అడవిలోవిడిచి ఘోరమగు అరణ్య మునబడి పోవుచుండెను. ఆ సమయమునం దాయడవిని యొకచోట జాజ్వల్యమానముగా అరణ్యముదహింపబడి భగభగమండుచుండెను. ఆయగ్నిమంటలు ఆకసమునంటుచుండెను. మేఘమార్గమునంటు నా యగ్నిమంటలవలన యచ్చటనుండు సకలభూతములును పరితాప మందుచుండెను. ఆయగ్నిహోత్రమధ్యమునుండి ఒకధ్వని వినబడెను. "మహారాజా! నన్నురక్షించుటకు శీఘ్రముగాయిచ్చటికిరమ్ము. ఆల స్యముచేయకుము" అనుధ్వని నలునకు వినబడెను. ఆధ్వని నలుడు విని సంశయింపక వెంటనే ఆకార్చిచ్చుమధ్యమునకు వెళ్ళెను. అక్కడ ఒకనాగకుమారుం డుండెను. ఆనాగేంద్రుడు గుండ్రముగా చుట్టుకొని విచారముగల ముఖముతో నుండెను. నలుడా నాగేంద్రునిజూచెను. నాగేంద్రుడు నలునిజూచి నమస్కరించి యిట్లుపలికెను. మహాత్మా నలమహారాజా! నేనునాగకుమారుడను. నాపేరు కర్కోటకుడందురు. నేను కర్మవశముచేత ఒకబ్రాహ్మణమునిని అవమానించితిని. ఆపా పమువలన యెక్కడికిని పోజాలకున్నాను. ఈకార్చిచ్చు నాలుగువైపు లను దహించుచు యిచ్చటకు వచ్చుచున్నది. ఇక్కడ నేనుండి చచ్చు టకు సమ్మతింపను. నాయందునీవుదయగలిగి ఒక సరస్సుగట్టునకునన్నె త్తికొనిపొమ్ము నన్నునీవురక్షించినయెడలనీకు నేను మేలుగలిగించెదను. అని కర్కోటకుడు నలునితో జెప్పెను.

## నలుడు కర్కోటకుడను సర్పముచేత కరవబడుట

అని కర్కోటకుడు చెప్పి తనను యెత్తికొనిపోవుటకు బరువులేకుండునట్లు బొట్టనవ్రేలంత దేహముగలవాడయ్యెను. అంతట నలుడు కర్కోటకుడను నాగసర్పము నెత్తుకొని మిక్కిలివేగముగా అగ్నిని తప్పించుకొని పరుగెత్తెను. అట్లుయెత్తుకొనిపోయి నిప్పుసెగలేని సరస్సు తీరమందున విడువదలచెను. కర్కోటకుడు నలునితో యిట్లనెను. ఇంకను పదియడుగులదూరము నన్నుతీసికొనిపొమ్ము. ఇక్కడనే విడువకుము. నీకు మేలుచేకూర్చెదను. అని కర్కోటకుడు నలునితో చెప్పెను. అప్పుడు నలుడు ఆ కర్కోటకుని సరిగాయడుగులు లెక్కించుకొనుచు దీసికొనిపోయి పదవయడుగువేయునంతలో ఆకర్కోటకసర్ప మా నలునికఱచెను. ఆసర్పమట్లు నలునికరచినంతనే నలుడు తనరూపమును విడిచి వికృతరూపమును దాల్చెను. ఆసమయమున కర్కోటకుడు తననిజరూపమునుజూపి యిట్లు పలికెను.

మహాత్మా ! నలమహారాజా ! నేనునిన్నుకరచితిననియు, నా విషముచే నీవు పీడింపబడితివనియు విచారింపవలదు. నిన్ను యితరులు దెలిసికొన్నయెడల నీకుమిక్కిలి కీడువాటిల్లగలదు గాన, నేను కరచి నీకీవికారరూపమును గలిగించితిని. నావిషము నీ శరీరము నెంతకాలముండునో నంతవరకు నీకు విష, సర్ప, రాక్షస, పిశాచ, శత్రుభయములు గలుగవు. నీకు సకలయుద్ధమందును విజయముగలుగును. నీ భార్యతోనీవు యెప్పటివలె కలిసిసుఖించెదవు. ఎప్పటివలె నీకు రాజ్యవిభవము గలుగును. నీనిజరూపమును నీవుయెప్పుడు ధరింపగోరుదువో అప్పుడు నన్నుతలంచుకొనుము. అట్లు తలచినయంత యీ వస్త్రము నీ చెంతకువచ్చును. అదినీవుధరించినయెడల నీవు క్షణమందే నిజరూపమును పొందగలవు. అని యిట్లు కర్కోటకుడు నలునకు వరమిచ్చెను. నలమహారాజా! ఇక్ష్వాకు కులమందుబుట్టిన ఋతుపర్ణుడను

రాజుగలడు. అతడు మిగుల ప్రసిద్ధుడు ఆ ఋతుపర్ణుని వద్దకుబోయి వానిని సేవింపుచుండుము. నీవు ఆ ఋతుపర్ణునకు అశ్వహృదయమను విద్యనుజెప్పుము. నీవు ఋతుపర్ణునివలన అక్షయహృదయమను విద్య నగ్రహింపుము. (అశ్వహృదయమనగా గుర్రముల విషయమైనది) (అక్షయహృదయమనగా జూదమాడుట విషయమైనది) నీవు బాహుకుడనుపేరుగల వాడవై ఋతుపర్ణునకు సారధివైయుండుము అని యీరీతిగా కర్కోటకుడు నలునకు మేలుకలుగు ఉపాయమునుజెప్పి కనబడకుండ వెడలిపోయెను. అంతట నలు డాకర్కోటకుడు చెప్పిన ప్రకారము అయోధ్యాపట్టణమునకువెళ్ళి ఋతుపర్ణ రాజును జూచి యిట్లు పలికెను.

ఓ ఋతుపర్ణ మహారాజా! నాపేరు బాహుకుడందురు. గుర్రములను శిక్షించుటయందు నేను సమర్థుడను. నేను అనేకరకములగు తినుబడివంటకములను చేయగలను. నిన్ను సేవించుటకు అపేక్షగలిగి వచ్చితిని. అని నలుడు చెప్పగా ఋతుపర్ణుడిట్లు చెప్పెను. బాహుకుడా! నాయొద్ద నీవుండుపక్షమున నాదగ్గరగల గుర్రములను శిక్షింపుచు ఆగుర్రములకు శీఘ్రగమనము గలిగింపుము. అని ఋతుపర్ణుడు నలునితో జెప్పెను. నలు డందులకంగీకరించి వల్లెయని చెప్పి ఋతుపర్ణుని సేవింపుచుండెను. నలుడు యీవిధముగా ఋతుపర్ణుని యశ్వవిద్యాధిపతియై పోకిరియశ్వములను వశముజేసికొనుచు శ్రేష్ఠమగు గుర్రములపై నెక్కి వాటిని శిక్షింపుచుండెను. నలుడు మనోహరములును, రుచ్యములగు అన్నములను వండుచు ఋతుపర్ణున కిచ్చుచుండెను. ఋతుపర్ణుడు వార్ష్ణేయజీవలులను యిద్దరు పురుషులను నలునివశమున నుంచెను. వారిని సహాయముగా జేసుకొని నలుడు వికారరూపముతో ముందుజెప్పినపనులు జేయుచు పరులకు తెలియకుండునట్లు సంచరింపుచుండెను. ఒకనాడు నలుడు ఒంటరిగా నుండి దమయంతిని తలచుకొని యీరీతిగా దుఃఖింపసాగెను.

ఓ భార్యారత్నమా ! నిన్ను అడవిలో ఒంటరిగా విడిచివచ్చి తిని. ఇప్పుడు నీవు ఎక్కడున్నావో తెలియలేదు. నీవు అడవులలో యెవ్వరిచేత పట్టుబడితివో తెలియలేదు. ఆయడవులలో క్రూరము లగు మృగములు ఆహారముకొరకు సంచరింపుచుండును. ఆ మృగ ములకడుపులలో నుంటివేమో తెలియకున్నది. నీతలిదండ్రులవద్ద నుంటివేమో తెలియకున్నది. దేశాంతరములయం దుంటివేమో తెలియకున్నది. నీవు ఏనుగువలె నడచుచుందువు. గొప్ప స్తనములను గలిగియుందువు. అని యీవిధముగా నలుడు దమయంతిని తలచుకొని మన్మథబాణములచేత బాధింపబడుచుండెను నలుడు దమయంతి యందు గల కామముచేత, మోహితుడై పరితాపముచేత రాత్రుల యందు నిద్రింపక నిట్టూర్పులు విడచుచుండెను.

నలు డీ రీతిగా దమయంతిని దలచుకొని మహాదుఃఖము గల వాడై నిట్టూర్పులు విడుచుచుండెను. ఆతని దుఃఖవాక్యములు విని జీవలుడు తన మనస్సులో యిట్లని తలంచెను. ఈ బాహుకునకు పెద్ద గూనుగలిగి యున్నది, వీనికి వంకరశరీరము గలిగియున్నది. హా బాహుకుడు యెందుకును పనికిరాని రూపమును గలిగియుండియు మన్మథునిచేత బాధింపబడుచున్నాడు. ఈ బాహుకుడు స్త్రీ యందు కామము గలిగియున్నాడు. ఈబాహుకుడు తలంచుచుండు యాడుది వీనికంటె లెస్సగా నుండవలయునుగదా! జీవలు డీవిధమున తలచుచు బాహుకునివద్దకు వచ్చి బాహుకుడా! ఇప్పుడు నీవు నీభార్యను తలచు కొనుచున్నావు. నీభార్యకును నీకును వియోగము గలుగుటకు కారణ మేమో జెప్పుము. నీభార్య నిన్ను విడిచినకారణమును నేను విన వలెను. అని యిట్లు అడుగగా బాహుకు డిట్లుపలికెను.

జీవలుడా ! నేను మిక్కిలి వికారరూపము గల శరీరమునుగలిగి యుంటిని. నన్ను జూచి జనులు నవ్వుచుందురు. ఇటువంటి నాకు

యాడుదానితో బనిలేదు. పూర్వము చంద్రప్రజ్ఞుడను నొక భటుడు గలడు. అతడు తన భార్యను నెందులకో విడిచి దుఃఖించెను. మరియు యామెను వెదకుచుండెను. గాని యాతడామె నెచ్చటను గానక యేడ్చుచుండెను. ఆతడేడ్చిన పద్ధతిని యిప్పుడు నేను తలంచుచుంటిని. అని యీవిధముగా బాహుకుడు జీవలునితో జెప్పెను. ధర్మరాజా! నలు డీరీతిగా వికారరూపదేహవంతుడై బాహుకుడను పేరుతో నయోధ్యాపట్టణమున నుండెను. ఇకను విదర్భపట్టణరాజగు భీముని వృత్తాంతమును జెప్పెదను వినుము. దమయంతి తండ్రియగు భీమరాజు విదర్భపట్టణముననుండి, నలుడు రాజ్యమును విడిచి యరణ్యమునకు బోయిన వృత్తాంతమంతయు వినెను. అంతట భీమరాజిట్లు దుఃఖించెను. అయ్యో! నలుడు జూదమాడి సకలరాజ్య సంపదలను పుష్కరునకు నోడి రాజ్యమును విడిచివెళ్ళెను. నా యల్లుడగు నలుడును నాకూతురగు దమయంతియు నెక్కడి కేగిరో తెలియకున్నది. అని యీరీతిగా భీమరాజు తలచి నలదమయంతులను వెదకుటకు విద్వాంసులయిన అనేకమంది బ్రాహ్మణోత్తములను పంపించెను. అట్లు పంపుసమయమున ఆ విప్రులను పూజలచేత సంతృప్తిపరచి యిట్లుపలికెను. ఓ విప్రోత్తములారా! ఆ నలదమయంతు లుండు ప్రదేశము నెరింగి నాతో వచ్చి చెప్పినవారికి వేయి గద్యాణములు (వెండినాణెములు) యిచ్చెదను. ఆ నలదమయంతులిద్దరిని యిచ్చటకు తీసుకువచ్చినవారికి అనేకసహస్రముల గోవుల నిచ్చెదను. అనేక అగ్రహారము లిచ్చెదను. అని భీమరాజు బ్రాహ్మణులతో జెప్పి పంపించెను.

## చేదిపురమున సుదేవుడను బ్రాహ్మణుఁడు దమయంతినెరుగుట

అంతట భీమరాజు పంపించిన బ్రాహ్మణోత్తము లనేకులు సకలదేశ పట్టణములకు వెళ్ళి నలదమయంతులను వెదకుచుండిరి. ఆ

భీమరాజు పంపించిన విప్రులలో సుదేవుడనువాడు చేదిదేశపురాజగు సుబాహుని పట్టణమునకుబోయెను. ఆ సుబాహుని యొక్క పురో హితులలో పుణ్యాహవాచనముచేయించు బ్రాహ్మణులతో సుదే వుడు చేరి రాజగృహములోనికి ప్రవేశించెను. ఆ యంతఃపురమున సునందతో గూడియున్న దమయంతిని సుదేవుడు జూచెను. ఆ దమ యంతి నివురు కప్పిన నిప్పువలెను. మేఘముచేత కప్పబడిన చంద్ర రేఖ వలెను, బురదయందు మునిగిన తామర పూవువలెను తేజో హీనమై యుండెను. అటువంటి దమయంతిని గుర్తించుటకు సాధ్యము గాకయున్నను, యామె కనుబొమల మధ్యగల పద్మమువంటి గురు తును, సూక్ష్మరీతిగ నున్నను, సుదేవుడు చక్కగా పరీక్షించెను. అట్లుచూచి యామెను దమయంతిగా నెరింగి తన మనంబున యీ రీతిగా తలంచెను.

ఈ దమయంతి తన భర్తయగు నలుని విడిచి ప్రవాహము లేని నదివలెను, కమలములేని సరస్సువలెను తేజోహీనమై యున్నది. అట్లు తేజోహీనమైనను పతివ్రతాప్రభావముచేత ప్రకాశింపు చున్నది. స్త్రీలు పతిభక్తి గలిగి యుండవలయును. స్త్రీల పాతి వ్రత్యమును యెవ్వరును హరింపజాలరు. పాతివ్రత్యమే తేజస్స్వ రూపమగును. పాతివ్రత్యమే సర్వగుణములకును అలంకారము వంటిది. స్త్రీలకీపాతివ్రత్యమే గొప్ప భూషణము. తక్కంగల భూష ణము లన్నియు నీ పాతివ్రత్యమునకు సమానములుగావు. రోహిణికి చంద్ర సమాగమము గలిగినట్లు యీ దమయంతికి భర్తృసమాగమ మెప్పుడు గలుగునో తెలియుటలేదు. యీ నలదమయంతు లిద్దరును సమానరూప యౌవనగుణ వయోసౌందర్యములను గలిగియున్నారు. ఈ నలదమయంతు లిరువురొకచో నుండగా చూచి భీమరాజెప్పు డానందించునో, యెప్పుడు కృతార్థుడగునో తెలియకున్నది. అని

సుదేవుడను విప్రుడు తనమనస్సులో దలంచి నెమ్మదిగా దమయంతి కడకుజేరి యామెతో నిట్లనెను.

తల్లీ ! దమయంతీ ! నీ తల్లిదండ్రులును, నీపుత్రులును, పుత్రికయు కుశలముగానున్నారు. నీబంధువులందరునుకుశలముగానున్నారు. వారెల్లరును నీకుశలమునుయెఱుగక దుఃఖించుచున్నారు. నీవునుదుఃఖింపకుము. నీ సహోదరునకు నేను స్నేహితుడను. నేను సుదేవుడను విప్రుడను. నీతండ్రియగు భీమరాజు నిన్ను వెదకుటకు సకలదేశములకును అనేకమంది విప్రులను పంపించెను. నేను యిచ్చటకువచ్చి నా పుణ్యమువలన నిన్నుజూచితిని. అని సుదేవుడు దమయంతితో జెప్పెను. అంతట దమయంతి సుదేవునెఱింగి తనతల్లిని, తండ్రిని, బంధుజనంబుల యొక్కొక్కరిగా నడదరినియడిగి కన్నీరు గార్చుచు యేడ్చుచుండెను. అప్పుడు దమయంతి దగ్గరనున్నసునంద, యకారణముగా నేడ్చుచున్న దమయంతినిజూచి, సైరంధ్రియిప్పుడెందుకో యేడ్చుచున్నదని రాజమాతకు కబురుచేసెను. రాజమాత యంతఃపురమునుండి దమయంతిదగ్గరకువచ్చెను. ఆమెవెంబడి అనేకమంది పరిచారికా జనమును వచ్చిరి. ఆసమయమున దమయంతియు సుదేవుడును తమలోతాము మాటలాడుచుండిరి. వారినిజూచి రాజమాత బ్రాహ్మణున కిట్లుచెప్పెను.

విప్రోత్తమా! యీ చిన్నది యెవ్వరికుమార్తెయో చెప్పుము. ఏకారణమువలన నీమె భర్తను విడిచెనో దెల్పుము. ఈమె సకల బంధువులను విడిచి పుణ్యవ్రతముల నాచరింపుచున్నది. నీవీమె నెట్లెరింగితివో దెలియబల్కుము. ఈమె పేరేమి ? అని రాజమాత సుదేవు నడుగగా సుదేవుడిట్లు పలికెను. రాజమాతా ! ఈమెపేరు దమయంతి. ఈమె విదర్భదేశపు రాజగు భీమరాజుకుమార్తె. మహాకీర్తివంతుడగు నలమహారాజునకు భార్య, దైవాధీనమువలన నలుడు

సమస్తరాజ్య సంపదలను విడిచివెళ్లెను. ఆనలుని వెంబడి దమయంతియు వెళ్లెను. ఆసమాచారమును భీమరాజువిని అనేకమంది విప్రులను సకలదేశములకును దమయంతిని వెదకుటకు పంపెను. నేను ఇక్కడకు వచ్చితిని. మీచే రక్షింపబడుచున్న యీ దమయంతిని జూచితిని. బ్రహ్మదేవుడీమె కనుబొమ్మలమధ్య శుభప్రదమైన పద్మమువంటి గురుతును నిర్మించెను. అట్టిగురుతీమె కనుబొమల మధ్య గలదు. నేను దానిని గుర్తించితిని. అది దుఃఖముచే కప్పబడినదైనను, నే నీమెను గమనించి దమయంతిగా నెరింగితిని. అని సుదేవుడు రాజమాతతో జెప్పెను. సునంద పరిశుద్ధమగు జలమును దెచ్చి దమయంతి కనుబొమ్మల మధ్యగల ప్రదేశమును చక్కగా కడిగెను. అంతట ఆపద్మాకారమగు గుర్తు గోచరించెను. ఆ గురుతును అందరును చూచి మిక్కిలి యాశ్చర్యమును పొందిరి. అంతట రాజమాత దమయంతిని కౌగిలించుకొని యానందముతో నిట్లని పలికెను.

అమ్మా! దమయంతి నీవు నాకుమార్తె కాగలవు. నేను నీకు తల్లిని కాగలను. అది ఎట్లనగా చెప్పెదను వినుము. నేనును, నీ తల్లియు చేది, దశార్ణ రాజుయొక్క కూతుండ్రము. మాఇద్దరిలో నీతల్లి భీమరాజునకు భార్యయయ్యెను. నేను వీరబాహునకు భార్యనైతిని. అందువలన నేను నీకు పినతల్లిని అగుదును. నాకునీవు కూతురవు అగుదువు. అని యీరీతిగా సుబాహుని తల్లియైన రాజమాత దమయంతితో చెప్పెను. అంతట దమయంతి వినయభక్తి పూర్వకముగా రాజమాతకు మ్రొక్కి సునందను ఎత్తికొనెను. అంతట దమయంతి ప్రీతిపూర్వకముగా కొన్ని దినములవరకు, ఆచేది పట్టణమందే యుండెను. అంతట ఒకానొక దినమందు, దమయంతి రాజమాతతో ఇట్లుపలికెను. తల్లీ! యీ చేదిపట్టణము నాకు పుట్టినిల్లు

యగును. యీ రెండు ప్రదేశములందును, నాకు సౌఖ్యము గలిగి యుండును. అయినను, నాకు నా తలి దండ్రులను, సహోదరులను, పుత్రుని పుత్రికలను జూడవలెనను వాంఛ దోచుచున్నది. గాన నేను విదర్భాపట్టణమునకు వెళ్ళెదను. అందులకు, నీవు అనుజ్ఞ నీయ వలెను. అని దమయంతి రాజమాతతో జెప్పి నమస్కరించెను. సుబాహుని తల్లియగు రాజమాత దమయంతియందు మిక్కిలి ప్రేమ గలదై సుబాహునితో జెప్పి కొంత సైన్యమునిచ్చి దమయంతిని పంపించెను. దమయంతి బంగారు రత్నమయమైన మేనామీద ఎక్కి సైన్యముతో, విదర్భా పట్టణమునకు వెళ్లెను.

## దమయంతి నలునెడబాసి విదర్భాపురము జేరుట

ధర్మరాజా! దమయంతి విదర్భాపురమునకు వెళ్ళి తన తల్లిదండ్రులు మొదలగు బంధుజనుల యొద్దనుండెను. అయినను దమయంతి నలుని జూచుటయందు అపేక్షగలదై నలుని దలంచుకొని విచారింపుచుండెను. దమయంతి తన బంధుజనుల దగ్గఱ యున్నను, దేహసౌఖ్యములను విడిచి, పూర్వపు మురికివస్త్రమునే కట్టుకొని యుండెను. ఆ దమయంతి దేహము పూర్వమువలెనే దుమ్ములో నిండి యుండెను. దమయంతి భర్తను ఎప్పుడు జూడగల్గుదునోయని మంచి వ్రతనియమమును గలిగియుండెను. ధర్మరాజా! దమయంతి భర్తృవియోగ దుఃఖముచేత ప్రాణములను భరింపజాలక యేకాంత మందొకనాడు తన తల్లితో ఇట్లు చెప్పెను.

తల్లీ! పుణ్యాత్ముడగు నలుని వెదకుటకు, బ్రాహ్మణులను, పంపుము ఆనలుని నేను చూడజాలని యెడల, అందరును జూచు చుండగా, ప్రాణములను, విడిచెదను. అని దమయంతి తల్లితో చెప్పెను. తల్లియు, కూతురు జెప్పిన మాటలను భీమరాజునకు

తెలియజెప్పెను. అంతట, దమయంతి తండ్రియగు భీమరాజు, నలుని వెదకుటకు సమర్థులగు విప్రులను నియమించెను. అట్లు నలుని వెదకుటకు వెడలుచున్న బ్రాహ్మణులనుజూచి, దమయంతి యిట్లుచెప్పెను. విప్రోత్తములారా! నిషధదేశపు రాజగు నలమహారాజు సమర్థతలేక, ఇప్పుడు తనను ఇతరులెరుగకుండ యున్నాడు. రూపమువలనచూచి మీరు నలుని ఎరుగజాలరు. అతనిని, గుర్తించు మార్గమును దెలిపెదను వినుడు. మీరు సమస్తమగు రాజసభలకును వెళ్ళి రాజా! నీవు సర్వదా సత్యవ్రతమును బూనియుందువు. నీభార్యను అడివిలోవిడిచి ఈ రీతిగా భార్యను విడుచుట ధర్మముగాదు. భర్తచేత భరింపదగినది భార్య. భార్యను భరించెడి వాడగుటవలన భర్తయయ్యెను. భార్యాభర్తలను ధర్మము నీయందు అసత్యము. ఇటువంటి నిర్దయగల బుద్ధిని బూనరాదు. నీ భార్య మహాపతివ్రత. అటువంటి పరమపతివ్రతయగు భార్యయందు నీవు దయబూనుము. అని యీరీతిగా సకల సభలయందును చెప్పవలయును. విప్రోత్తములారా! మీరిట్లు చెప్పగా మీ మాటలను, సహింపలేక మీకు బదులుగా జవాబును ఎవడు చెప్పునో యాతడే నలుడగును. యీరీతిగా మీరు నలుని గుర్తించి, నన్ను ఆనలునకు ఎరిగించి యిచ్చుటకు ఆ నలుని తీసికొని రండు. అతడట్లు రానియెడల ఆ సమాచారమును నాతో మీరు చెప్పుడు. అని దమయంతి విప్రులతో చెప్పి పంపించెను. ఆ విప్రోత్తములు, నానాదేశరాజ సభలకువెళ్ళి దమయంతిచెప్పిన ప్రకారము ప్రతిరాజసభయందు చెప్పిరి. వారి మాటలను ఎవరును బదులుమాట పలుకరైరి. పిమ్మట బ్రాహ్మణులందరును దేశ దేశములు దిరిగి విదర్భాపురమునకు మరలి వచ్చిరి. అంతట పర్ణాదుడను బ్రాహ్మణుడు దమయంతితో నిట్లు చెప్పెను.

అమ్మా! దమయంతీ! నేను అయోధ్యా పట్టణమునకు వెళ్ళితిని. అయోధ్యాపట్టణమునకు ఋతుపర్ణుడు రాజుగా యున్నాడు.

ఆతని సభయందు నీవు జెప్పిన మాటలను గంభీరముగా బల్కితిమి. ఆ ఋతుపర్ణుని దగ్గఱ పొట్టిచేతులు గలవాడు ఒకడు గలడు. వాని పేరు బాహుకుడు, వానికి ఋతుపర్ణుడు నూరురూపాయలు జీతము నిచ్చును. ఆ బాహుకుడు శీఘ్ర ప్రయాణమునకు సమర్థుడు. వంట జేయుట యందు మిగుల సమర్థుడు. వికారమైన శరీరమును, గలిగియున్నాడు. గుఱ్ఱములను శిక్షించుటయందు సమర్థుడు. అతడు నేడు నేను సభయందు జెప్పినమాటలనువిని, ఏకాంతమునకు నన్ను బిలిచి వెలవెల నవ్వుచు, నిట్టూర్పు విడుచుచు ఇట్లనెను. విప్రోత్తమా భర్తయందనేక లోపములున్నను భార్య వాటినన్నిటిని, సహించి, యుండవలెను. అట్టి యోరిమిగల భార్య మరియొక జన్మమున గూడ తనపురుషునితో ఇష్టభోగములను పొందగలదు. ధర్మబుద్ధిగలిగి యుండును. అని బాహుకుడు నాతో జెప్పి మరియొకమాట జెప్పక తన నివాస గృహమునకు వెడలెను. అని పర్ణాదుడు అను విప్రుడు దమయంతితో చెప్పెను. అంత దమయంతి చాలాసేపు యోచించి తన మనస్సున యిట్లని నిశ్చయించెను. ఈ విప్రుడు సభయందు జెప్పినమాటలకు నలుడే బదులుమాట చెప్పియుండును. ఇతరులకు బదులుమాట చెప్పవలసినంత యక్కఱలేదు గాన నితనితో మాట లాడినవాడు నలుడే యయి యుండవచ్చును. కాన తగినవారిని, బంపించి, బాహుకుని సమాచారమును చక్కగా నెఱుగవలయును. అని దమయంతి తనమనస్సులో యోచించి, నిశ్చయించి, తన తలిదండ్రుల, యనుమతిని, బొంది, సుదేవుని రప్పించి ఇట్లు చెప్పెను.

విప్రోత్తమా! నీవుగొప్ప విద్వాంసుడవు. సూక్ష్మబుద్ధిగలవాడవు. నేను చేదిపట్టణమందుండగా నన్ను నీవు యెరిగితివి. నీవునన్నెరిగి యిచ్చుటకు దెచ్చినట్లు ఆనలుని వెదకి యిక్కడకు తీసికొనిరమ్ము. నీ

విప్రుడు అయోధ్యాపట్టణమునకు ప్రయాణమై కమ్ము, నీవు దేశాంతర సంచారమును జేయు బ్రాహ్మణునివలె అయోధ్యాపట్టణమునకు వెడలి ఋతుపర్ణునితో యీవిధముగా దొందరగా జెప్పుము. ఓ ఋతుపర్ణ మహారాజా! విదర్భపట్టణరాజగు భీమరాజునకు దమయంతి యను కూతురున్నది. ఆదమయంతిని నలునకిచ్చి పూర్వము వివాహము చేసెను. ఆనలుడు దైవవశమువలన రాజ్యమునువిడిచి యెక్కడికో వెళ్ళెను. అంతట భీమరాజు అనేకమంది బ్రాహ్మణులను పంపించి నలుని వెదకించినను నలుడు కనబడలేదు. ఇక దమయంతికి రెండవ స్వయంవరమును రచియించుటకు ప్రయత్నించియున్నాడు. ఆస్వయంవరమునకు లోకమందుండు సకలరాజులును వెళ్లుదురు. అని యీరీతిగా ఋతుపర్ణరాజుతో జెప్పుము. అనిదమయంతి సుదేవునితో చెప్పి అయోధ్యాపట్టణమునకు పంపించెను. ధర్మరాజా! సుదేవుడను బ్రాహ్మణుడు అయోధ్యాపట్టణమునకు వెళ్ళి ఋతుపర్ణరాజునుజూచి యిట్లుపలికెను—రాజా! విదర్భాపట్టణమందు భీమరాజు దమయంతికి స్వయంవరమును రచియించెను. ఆస్వయంవరము రేపే జరుగును అని సుదేవుడు ఋతుపర్ణునితో చెప్పెను. ఆమాటలను ఋతుపర్ణుడు విని బాహుకునిజూచి యిట్లుపలికెను.

ఓ బాహుకా! నేను దమయంతి స్వయంవరమును జూచుటకు యీ దినముననే విదర్భా పట్టణమునకు వెళ్ళవలయును. ఆ స్వయంవరము ను జూడవలెనని నాకు అభిలాషగలదు. నీయశ్వవిద్యానిపుణత్వమును బ్రదర్శింపుము. అని యిట్లు ఋతుపర్ణుడు నలునితో జెప్పగా నలుడు, అట్లనేగావించెదనని ఋతుపర్ణునితో జెప్పి తన మనంబున యిట్లని దుఃఖించెను. నేను దమయంతిని అడవిలో వంచించి వచ్చితిని. అందులకు దమయంతి కోపమును వహించి మరల వివాహము చేసికొనుటకు ప్రయత్నించి యుండునేమో తెలియకున్నది. స్త్రీలస్వ

భావము లిట్లుండునుగదా! లోకమందు స్త్రీలనునమ్మిన పురుషులు పనికిమాలినవారగుదురు. తమయందు స్త్రీలు ప్రీతి గలిగియుందురని బలుకు పురుషులు కేవలము పిచ్చివాండ్రేయగుదురు. దమయంతి మహాపతివ్రత, నాకు భార్య. నాయందు ప్రాణస్నేహము గలిగియుండును. పుత్రవంతురాలై యుండును. అటువంటి దమయంతి మరల వివాహము చేసికొనుటకు ప్రయత్నింపదు. అయినను ఆమెసమాచారము నెరుంగవలయును. ఈఋతుపర్ణునితో విదర్భాపురమునకు వెళ్లెదను. అని యీరీతిగా నలుడు తనమనస్సులోదలచి ఋతుపర్ణునితో వెడలుటకు నిశ్చయించెను,

ధర్మరాజా! ఆవార్ష్ణేయుడనువాడు పూర్వము నలుని సారథి నలుడు అడవికివెళ్ళినపిమ్మట ఆ వార్ష్ణేయుడు నలుని రథమునుతీసికొని ఋతుపర్ణునివద్ద చేరియుండెను. ధర్మరాజా! అట్లు నలుడుతనమనస్సులో నిశ్చయించి తనరథమునకు గుఱ్ఱములను పూన్చెను. ఆ కట్టినగుఱ్ఱములు మిక్కిలి శుభలక్షణములను గలిగియుండెను. మనోవేగ వాయువేగములబోలు నడకగలిగియుండెను. అటువంటి గుఱ్ఱములను నలుడు తనపూర్వపు రథమునకుపూన్చి ఆరథమును తోలుకొని వచ్చుచుండెను. ఋతుపర్ణుడు విదర్భాపట్టణమునకు వెళ్ళదలచి నలునిచే పూన్చబడినరథముపై యెక్కెను. ఋతుపర్ణుడారథముపై నెక్కినపుడా గుఱ్ఱములు క్రిందకువ్రాలెను. అట్లు మ్రొగ్గిన గుఱ్ఱములనుజూచి ఋతుపర్ణుడు నలునితో చెప్పెను.

బాహుకా! ఈగుఱ్ఱములు బలహీనముగా నున్నవి. ఇక్కడికి విదర్భాపట్టణముబహుదూరము. ఈబలహీనపుగుఱ్ఱములంతదూరము పోజాలవుగనుక యీరథమునకు వేఱే గుఱ్ఱములనుగట్టుము. అని ఋతుపర్ణుడు చెప్పగా బాహుకుడిట్లు చెప్పెను—మహారాజా! ఈ గుఱ్ఱములు వాయువేగమున బరుగిడగలవు. ఈదినమున సూర్యాస్త

మయము కాకమునుపే మనము విదర్భ చేరగలము అని నలుడు చెప్పగా ఆ మాటలకు ఋతుపర్ణుడు మెచ్చి నలునితో యిట్లనెను. బాహుకా! నీవిప్పుడు నాతో చెప్పినట్లు చేసితివేని నీయశ్వశాస్త్ర సమర్థతకు తగు రీతిని నీయిష్టసిద్ధిని గలిగించెదను. అని ఋతుపర్ణుడు బాహుకునితో జెప్పి ఆ రథమెక్కి, బాహుక వార్ష్ణేయులతో గూడి వెళ్ళుచుండెను. అప్పుడు యెదుటదూరముగా గనుపించు వృక్షపర్వతాదులెల్లను చూచిన మరుక్షణముననే దగ్గరకువచ్చి నట్లుండెను.

ఈరీతిగా ఆరథము అతివేగముగా నడచుచుండెను. ఋతుపర్ణుడంత నవ్వి మిక్కిలియాశ్చర్యమునుపొంది తనమనంబున యిట్లని తలంచెను. మిక్కిలి దూరమందు గల పర్వతవృక్షాది వస్తువులన్నియు క్షణకాలమున రథమునకు వెనుకగా పోవుచున్నవి. ఈ బాహుకుని యశ్వవిద్యాసమర్థత చేత గుర్రములు వాయువేగమును మించిన వేగముతో నడచుచున్నవి. ఈరథము సూర్యునిరథమువలె దోచుచున్నది. ఇది నా రథము కాదు. బాహుకుడు సూర్యుని సారథియగు అనూరుడేమో తెలియకున్నది. ఈ బాహుకుడు శాలిహోత్రుడో, దేవేంద్రుని సారథియగు మాతలియో నలమహారాజో, తెలియుట లేదు. ఇప్పుడు యీ రథ గుర్రములు బాహుకుని సామర్థ్యమువలన మనోవేగముతో సమానముగా నడచుచున్నది. వయస్సుచేతను, విద్యాతిశయముచేతను ఈ బాహుకుడు నలమహారాజువలె తోచుచున్నాడు. ఆ నలుడిట్టి వికారరూపమును పొందియుండుటకు కారణమేమో తెలియకున్నది. మహాత్ములగువారు మారురూపములతో దేవతలచేత నియమింపబడి పరులకు తెలియకుండ ప్రవర్తింపగలరు. అటువంటి మహాత్ములను దెలిసికొనుటకు సాధ్యముగాదు. అని ఋతుపర్ణుడు తనమనంబున దలంచుచు బాహుకుని మెచ్చుకొనుచు వెళ్లుచుండెను. ఆ సమయమున ఋతుపర్ణుని పైనున్నయుత్తరీయముజారి క్రిందబడెను. అంతట ఋతుపర్ణుడు వెనుకకు మరలిచూచి బాహుకునితో నిట్లనెను.

బాహుకా! నా పైనిగల యుత్తరీయము జారిక్రిందబడెను. ఆవార్ష్ణేయుడు దిగివెళ్ళి ఆ యుత్తరీయమును దెచ్చుపర్యంతము రథమును కొంచెము మెల్లగా నడుపుము. అని ఋతుపర్ణుడు చెప్పగా బాహుకుడు విని నవ్వి యిట్లుచెప్పెను. మహారాజా! నీవుత్తరీయము పడినస్థల మిచటికి సుమారొక యామడదూరమున్నది గాన, అవార్ష్ణేయు డాయుత్తరీయమును దేజాలడు అని బాహుకుడు రథగమన మహావేగాతిశయమునుగూర్చి ఋతుపర్ణునితో చెప్పుచు అనేక దేశములను గడచివెళ్ళుచుండెను ఆ మార్గమందొక చోట ఒక తాండ్ర చెట్టుగలదు. ఆతాండ్రచెట్టునందు అనేకములగు ఆకులును, పండ్లును కొమ్మలును గలిగియుండెను. ఆ తాండ్రచెట్టును ఋతుపర్ణుడుచూచి బాహుకునితో యిట్లనెను.

బాహుకా! జనులందరును సకలవిద్యలను నేర్చియుండరు. కొందరు కొన్నివిద్యలనే యభ్యసింతురు. నేనుచూచిన మాత్రముననే సకలవస్తువుల సంఖ్యలను యెరింగి చెప్పగలను. ఈ తాండ్రచెట్టునందు గల ఆకులు, పండ్లు, వీటి సమూహముయొక్క సంఖ్యను జెప్పెద వినుము. ఈ రెండు కొమ్మలయందలి ఆకులును, పండ్లును, పదివేలును ఒకటియుగలవు. తక్కిన కొమ్మలయందు గల పండ్లును యాకులును గలసి రెండువేలతొంబదియైదగును. అని ఋతుపర్ణుడు బాహుకునితో చెప్పెను. ఆ లెక్కను బాహుకుడు విని యీ తాండ్రచెట్టునందు గల ఆకులను పండ్లను లెక్కించెదనని ఋతుపర్ణునితో చెప్పుచు తన రథమును నిలిపెను. ఆ క్షణముందే నలుడు ఉచ్చులచేతవంచి ఆ వృక్షము యొక్క కొమ్మలయందు గల ఆకులను పండ్లను ప్రత్యేకముగా యెంచెను. అట్లు లెక్కించగా ఋతుపర్ణుడు చెప్పిన లెక్కకు సరి పోయెను. అప్పుడు నలుడు ఆశ్చర్యమును పొంది ఈ విద్యను తన

కుపదేశింపవలయునని ఋతుపర్ణుని యడిగెను. అప్పుడు ఋతుపర్ణుడు నలునితో నిట్లనెను.

బాహుకుడా! ఇది అక్షహృదయమను ప్రసిద్ధమైన జూదవిద్య. ఈ అక్షవిద్యను విధియుక్తముగా యెరిగినవాడు చూచినమాత్రముననే సంఖ్యాపరిమాణమును యెరుగగలడు. మరియు సకలపాపములు పోగొట్టుకొని విషమువలన విడువబడును. సకల సద్గుణములచేత ప్రసిద్ధుడగును. సర్వజనులకు మేలుకలుగజేయును. అని యిట్లు ఋతుపర్ణుడు అక్షవిద్యాప్రభావమును బాహుకునితో జెప్పుచు ప్రీతిపూర్వకముగా అక్షవిద్యను బాహుకునకు వుపదేశించెను. ఇట్లు విదర్భాపట్టణమునకు శీఘ్రముగా వెళ్ళదలచి అతివేగముగా ఋతుపర్ణుడు బాహుకునకు అక్షవిద్యను ఉపదేశించెను. ధర్మరాజా! యీప్రకారముగా నలుడు ఋతుపర్ణునివలన అక్షవిద్యను గ్రహించి సంతోషించి నీకు అశ్వహృదయమను విద్యను యిచ్చెదను తీసికొనుమని చెప్పెను. అంత ఋతుపర్ణుడు నలునితో యిట్లనెను. బాహుకా! నీవలన అశ్వహృదయమను విద్యను గ్రహించెదను. ఇప్పుడు మనము శీఘ్రముగా విదర్భాపట్టణమునకు వెళ్ళవలయును. పిమ్మట నీవలన అశ్వహృదయ విద్యను నేను గ్రహించెదను. అంతవరకు ఆ యశ్వవిద్యను నీ వద్దనే యుండనిమ్ము. ఇప్పుడు శీఘ్రముగా రథము తోలుము అని యిట్లు ఋతుపర్ణుడు నలునితో జెప్పెను.

## నలుడు కలిచేత విముక్తుడై విదర్భకు బోవుట

ధర్మరాజా! ఆ యక్షవిద్యా సామర్థ్యమువలన పూర్వము నలుని దేహమునందుండు కలిపురుషుడు నలుని దేహమునుండి బయటకు వచ్చెను. ఆ వచ్చిన కలిపురుషుడు కర్కోటకునివిషమును గ్రక్కుచు నమస్కరింపుచు నేను కలిపురుషుడను అని నలునకు తెలియజెప్పెను.

అంతట నలు డా కలిపురుషునిజూచి కోపముగలవాడై వానికి శాప మివ్వదలంచెను. ఆనలుని కోపమును కలిపురుషుడు తెలిసికొని నలు నకు నమస్కరించి యిట్లు పలికెను.

మహాత్మా! నలమహారాజా! నేను నీ శరీరములో ప్రవేశించి సర్వదా కర్కోటకుని విషముచేత దహింపబడితిని. ఇక నన్ను శపిం పకుము. నాతప్పిదమును క్షమింపుము. నిన్ను స్తుతించిన జనులు నా వలన భయమును పొందరు. నాయందు నీవు కృపగలవాడ వగుము. అని యీరీతిగా కలిపురుషుడు నలునితో జెప్పుకొని ప్రార్థించెను. అంతట నలునకు కోపము నశించెను. ఆ సమయమున కలిపురుషుడు అక్కడనుండు తాండ్రచెట్టును ఆశ్రయించి యుండెను. అది మొదలు తాండ్రచెట్టు లోకప్రసిద్ధమై యుండెను. అప్పుడు నలునకు కలి పురుషునకును జరిగిన సంభాషణవ్యవహారమును ఋతుపర్ణవార్ష్ణేయు లెరుగరు. ఆ కలిపురుషుని వారు జూడలేదు. ధర్మరాజా! ఇట్లు నలుడు వికారరూపమును మాత్రము కలిగియుండెను. గాని తక్కిం గల పాపములచేత విడుబడెను. కలిపురుషుడు నలుని వదలినప్పుడే నలునకు సకలపాపములు నిర్మూలములయ్యెను. నలుడు రథమెక్కి సారథ్యమొనర్చుచు ఋతుపర్ణవార్ష్ణేయులతో విదర్భాపురమున కేగెను. ఆదినమున సాయంకాలమందు శ్రీ భీమరాజుయొక్క అనుమతి గైకొని పురములోనికి వెళ్ళెను. అట్లు వెళ్ళునప్పుడు దిక్కులందు మేఘధ్వనివలె అన్నిదిక్కులను రథధ్వని మారుమ్రోగుచుండెను. ఆ రథధ్వనిని దమయంతివిని నలుని రథధ్వనిగా తలంచెను. దమయంతి తనమనంబున నిట్లని తలంచెను. ఈధ్వని నలుని రథధ్వనియగును. నా భర్తయగు నలునిజూచు పుణ్యము కలిగినది. ఆతడు మహాపుణ్య కీర్తివంతుడు. ఆతనిని నేను జూడనియెడల నాప్రాణములు విడువవలసి యుండునని తలంచితిని. నా పుణ్యభాగ్యమువలన నలుడే రథమెక్కి వచ్చుచున్నాడు.

అని యిట్లు దమయంతి తన మనస్సులో దలచుచు రథము మీాదయెక్కి-వచ్చెడి ఋతుపర్ణు జూచెను. అట్లుజూచి యారథముపై నలుడు కనుబడనందున మహాదుఃఖముచేత పరితపించు చుండెను. ధర్మరాజా! ఋతుపర్ణు డంతట భీమరాజును జూచుటకొరకు ప్రీతి పూర్వకముగా వచ్చెను. అంతట భీమరాజు ఋతుపర్ణుని పూజించి ఒక సుందరమగు మేడపై నివసింపజేసెను. అప్పుడు ఋతుపర్ణుడు తన మనస్సులో నిట్లని తలంచెను. ఈ పట్టణమున స్వయంవర మను శబ్దము వినరాదు. భూమియందు గల రాజు లెవ్వరును యిక్కడకు వచ్చినట్లులేదు. ఇదివరకు దమయంతికి ఒక వివాహమైనది. అటు వంటి దమయంతి యిప్పుడు మరియొక పురుషుని వరియించునా? ఆ దమయంతి అంత అధర్మవతియగునా? అని ఋతుపర్ణుడు తలంచుచు మిక్కి-లి సిగ్గుగలవాడై యుండెను. బాహుకుడు రథశాలయందు రథమును గుఱ్ఱములను గట్టివేసి ఆ రథసమీాపమున విశ్రమించి యుండెను. దమయంతి బాహుకవార్ష్ణేయులతో వచ్చిన ఋతుపర్ణుని జూచి నలునిగానక మహాదుఃఖముగలదై కేశియను చెలికత్తెను బిలిచి యిట్లు చెప్పెను.

కేశీ! ఋతుపర్ణుడు అయోధ్యాదేశమునకు రాజు. వార్ష్ణేయుడు శూద్రుడగును. ఈతడు పూర్వము నలుని సారథియైనందున ఆవార్ష్ణే యుని నేనెరుగుదును. బాహుకుడు యెవడో నాకు తెలియదు. ఆ బాహుకుని జూచగనే నా మనస్సున కానందము గలుగుచున్నది. పూర్వము బ్రాహ్మణు డయోధ్యకు వెడలినప్పుడు ఆ సభయందు బ్రాహ్మణుని మాటలను విని ఆ బ్రాహ్మణునకు బదులు మాట చెప్పిన వాడు బాహుకుడేయై యుండవచ్చును. నీవా బాహుకుని దగ్గరకు బోయి అతనితో మాటలాడిరమ్ము. అని దమయంతి కేశితో జెప్పి

పంపించెను. అంతట కేశియను చెలికత్తె బాహుకుని దగ్గరకు బోయి యిట్లు చెప్పెను.

బాహుకా! నీకుశలమును అడుగుటకు దమయంతి నన్ను పంపించెను. మీరు యీ విదర్భాపట్టణమునకు వచ్చుటకు గల కారణ మేమో జెప్పుము. అని యీరీతిగా కేశి యడుగగా బాహుకు డిట్లు పలికెను. చిన్నదానా! ఇక్కడ దమయంతికి రెండవ స్వయంవరము జరుగునని సకలరాజులను భీమరాజు రప్పించెను. ఆ స్వయంవరమును ఋతుపర్ణుడు విని అయోధ్యాపట్టణమునుంచి ఒకదినమందే యిక్క డికివచ్చెను. ఇక్కడికి అయోధ్యాపట్టణము నూరామడ యున్నది. ఆ యయోధ్యనుండి ఋతుపర్ణుడు వచ్చుచుండగా వారివెంబడి నేనును వచ్చితిని. ఆఋతుపర్ణునకు నేను సారథిని. అని యిట్లు బాహుకుడు కేశితో జెప్పగా నాకేశి మరల యిట్లనెను. బాహుకా! మీరథ ముపై నెక్కివచ్చిన మూడవవాడెవరు అయియున్నాడో చెప్పుము. అని కేశి యడుగగా బాహుకు డామె కిట్లనెను.

కేశీ! వానిపేరు వార్ష్ణేయుడు. ఆతడు నలుని సారథి అని బాహుకుడు చెప్పగా కేశి మరల యిట్లు పలికెను. బాహుకా! ఆ వార్ష్ణేయుడు నలుని సారథియైనయెడల అనలుడు పోయినమార్గ మును వార్ష్ణేయు డెరుగునేమో చెప్పుము. అని బాహుకుని యడు గగా అతడు మరల యిట్లనెను. ఓచిన్నదానా! ఆ వార్ష్ణేయుడు నలుని పుత్రుని పుత్రికను దీసికొనివచ్చి భీమరాజున కప్పగించిపోయెను. నలుడు రాజ్యమును విడిచిన సమాచారమును దెలిసికొని ఆవార్ష్ణే యుడు అయోధ్యకు వెళ్ళి ఋతుపర్ణుని సేవింపుచుండెను. గనుక ఆ వార్ష్ణేయుడును నలునిజాడ యెరుగడు. నలుని వెంబడించిన దమ యంతి యొక్కతెమాత్రము నలుని జాడ యెరుంగును. నలుడు వెళ్ళిన పద్ధతిని నలుడే యెరుంగును. ఇతరు లాతని జాడ దెలియుట కవసరము

లేదు. అని బాహుకుడు చెప్పగా నామాటలను కేశిని విని బాహుకు నితో మరల నిట్లు పలికెను.

ఓ బాహుకుడా! ఆనలుడు పెద్దయడవిలో దమయంతి కట్టిన వస్త్రములో సగము చించుకొని దమయంతిని విడిచివెళ్ళెను. ఆ నలుడు నిర్దయుడు. ఇట్లు నలుడు అడవిలో విడిచివెళ్ళినపిమ్మట దమ యంతి యింతవరకును ఆసగమువస్త్రమునే కట్టుకొనియున్నది. ఆ వస్త్రము యిప్పుడు మురికిగలిగియున్నది. దమయంతి యొక్క దేహ మందును దుమ్ముచేత మురికి గలిగియున్నది. దమయంతియొక్క శిర మందలి వెంట్రుకలును ముంగురులును జడలు గలిగియున్నవి. దమ యంతి నలుని విడిచిన దినము మొదలు యింతవరకు నేలమీదనే పండుకొనుచు నలునే సర్వదా తలచుచు దుఃఖించుచున్నది. ఈరీతిగా దమయంతి పాతివ్రత్యధర్మమును నెరపుచు వ్రతనియమము గలిగి యున్నది. అని యీరీతిగా కేశి చెప్పగా నామాటలను బాహుకుడు విని కండ్లవెంట నీరు స్రవింప నాకన్నీరు కేశిని కగపడకుండునట్లు తల వంచుకొని తాను మరియొక వైపునకు జూచుచుండెను. పిమ్మట కేశి దమయంతివద్దకు బోయి బాహుకుని గురించియు, యతని వాక్యసర ణియు రూపవైఖరియు, యాకారవికారమును స్పష్టముగా నామెకు దెలియజెప్పెను. అంతట బాహుకుడు నలుడై యుండవచ్చునని దమ యంతి సంశయించి కేశితో యిట్లు చెప్పెను.

కేశీ! మరల నీవు ఆబాహుకుని యొద్దకు వెడలుము. బాహు కుడు ఋతుపర్ణునికి వంటపుట్టి యని నేను వినియున్నాను. బాహు కుడు వంట చేయునప్పుడు వానిసమాచారమును పూర్తిగా జూచి దెలిసికొనిరమ్ము అని యిట్లు దమయంతి కేశితో చెప్పిపంపెను. కేశి బాహునిదగ్గరకు బోయి వాడుచేసిన దైవమానుష కార్యములను ఆశ్చర్యముతో చూచివచ్చి దమయంతి కిట్లుచెప్పెను.

## కేశి యను చెలికత్తె దమయంతితో నలుని గుణములు చెప్పుట

దమయంతీ! ఆబాహుకుని చరిత్రమును చెప్పుటకు మనుష్యులకు సాధ్యముగాదు. బాహుకుడు చేసినకార్యములు ఆశ్చర్యమును గలిగింపుచున్నవి. అట్టికార్యములను యిదివరకు యెచ్చటను జూచి యుండలేదు. బాహుకుడు సాక్షాత్తుగా దైవమని చెప్పదగును. బాహుకుడు చేసిన యాశ్చర్యకార్యములను చెప్పెద నాలకింపుము. బాహుకుడు తనచేత గడ్డిపరకను తీసి పొయిలో వేయగా ఆ గడ్డిపరక యందే అగ్ని కలుగును. ఆ అగ్నివలన సకల పదార్థములును పచన మగును. అన్నాది సమస్తపదార్థములును వంటకములును తయారగు పర్యంతము పొయిలో కట్టెలు వేయకుండగనే అగ్నిహోత్రము మండుచుండును. బాహుకుడు మాంసములను కడుగదలచినప్పుడు జలములు, కుండలనిండ తమంతట తామే నిండి అక్షయములుగా నుండును. బాహుకుడు తలచిన క్షణమందే జలములు నిండి యుండును. పుష్పములు వాడినను బాహుకుని చేయి తగిలినతోడనే యెప్పటివలె సుగంధమును గలిగి వికసించి అప్పుడేకోసిన పుష్పముల వలె నుండును. బాహుకుడు దివ్యశక్తిని గలిగియుండును. అని యిట్లు కేశి దమయంతితో జెప్పెను. ఆమాటలను దమయంతి విని మరల కేశిని పంపించి బాహుకుడు వండినమాంసములను దెప్పించి తిని, బాహుకునియందు నలుని లక్షణములున్నవని గ్రహించెను. ఆ విధముగా యెరింగియు గూడ నమ్మజాలక కేశితో దమయంతి యిట్లు చెప్పెను.

కేశీ! నాకుమారుని కుమార్తెను తీసికొని బాహుకునిదగ్గరకు పొమ్ము. ఈ పిల్లలను జూచి బాహుకుడేమిచేయునో చూచి నాతో చెప్పుము. అనిదమయంతి కేశితో చెప్పి కూతురును, కుమారుని కేశి వెంట బాహుకునివద్దకు పంపెను. బాహుకుడా పిల్లలనుజూచి కన్నీరు

గార్చుచు సంతోషముతో తనతొడలమీద గూర్చుండబెట్టికొనెను. అట్లు కూర్చుండబెట్టుకుని తాను నలుడని స్పష్టముగా తెలియకుండుట కొరకు కేశితో యిట్లుచెప్పెను. చిన్నదానా! యీపిల్ల లిద్దరును నా కొడుకు, కూతురులను బోలియు నున్నట్లున్నారు. వీరిని జూడగానే నాకొడుకు కూతురులు జ్ఞాపకమునకు వచ్చిరి. అందువలన వీరినిద్దరిని యెత్తుకొని దుఃఖించితిని. అని యీరీతిగా నలుడు తనను యెరుగ కుండునట్లు చెప్పెను. మరియు బాహుకుడు కేశితో యిట్లుచెప్పెను.

ఓ చిన్నదానా! నీవు యిక్కడకు మాటిమాటికి వచ్చుచు బోవుచున్నావు. నీరాకపోకలను యితరులు జూచినయెడల తమ మనస్సులందు మరియొక విధముగా తలంతురు. గాన నీవు యిక్కడికి యికను రావద్దు. మేము దేశాంతరమునుండి వచ్చిన అతిథులము. మాతో నీకు పనిలేదు. అని బాహుకుడు కేశితో చెప్పెను. అంతట కేశి వేగముగా దమయంతిదగ్గరకు వచ్చి బాహుకుని సమాచార మంతయు దమయంతికి తెలియజెప్పెను. ఆమాటలకు సంతోషించి దమయంతి తల్లితో యిట్లుచెప్పెను.

తల్లీ! బాహుకుడు మహాత్ముడగు నలమహారాజు. నలుని యందు గల స్వభావగుణములన్నియు బాహుకునియందు గలవు. బాహుకుడు నాభర్తయగు నలుడే యగును. ఇందుకు సంశయము లేదు. అదియునుగాక యిప్పుడు నామనస్సున కానందము కలుగు చున్నది. బాహుకుని నాదగ్గరకు రప్పింపుము. లేనియెడల బాహు కునిదగ్గరకైనను నన్ను బంపింపుము. ఈ రెండువిధములలో నేదో యొకటి నిశ్చయపరచి చేయుము. అని దమయంతి తల్లితో చెప్పెను. వెంటనే దమయంతి తల్లి భీమరాజు అనుమతిని పొంది దమయంతి దగ్గరకు బాహుకుని రప్పించెను. బాహుకుడు వచ్చి దమయంతిని జూచెను, దమయంతి మిక్కిలి విచారముతో మురికిగల దేహముతో

శుష్కించి యుండెను. దీనముఖముగలదై కన్నీరు గార్చుచుండెను. దమయంతి నలుని వికారరూపమును జూచి యితరుడని తలంచక స్నేహలజ్జాభయములు అతిశయింప బుద్ధివశములేనిదై బాహుకుతో యిట్లనెను.

ఓ బాహుకా! నేను నలమహారాజు. భార్యను మంచివ్రత నియమముగలదానను. అగ్నిసాక్షిగా నన్ను నలుడు వివాహమాడెను. అతడు నిర్దయుడై జనశూన్యమైన అడవియందు నన్ను విడిచెను. అతని వంటి నిర్దయగల పురుషుడు లోకమునందులేడు. పూర్వము నాస్వయం వరమునకు దేవేంద్రాది దేవతలువచ్చిరి. ఆదేవతలను నేను వరింపక నలుని వరించితిని. నేను పుత్రవతిని. ఇట్టి నన్ను నలుడెందులకు విడచెనో తెలియలేదు. ఆనిర్దయుడగు నలునకు నేనేమి అపకారము చేసితినో తెలియకున్నది. నిన్ను విడువననియు, భయపడకుండుమనియు నలుడు నాతో జెప్పెను. ఆమాటలను అతడెందుకు మరచెనో తెలియ లేదు. అని దమయంతి బాహుకునితో జెప్పి దుఃఖించుచు కన్నీటిధారల చేత స్తనములు తడియునట్లుగా వెక్కి వెక్కి యేడ్చుచుండెను. ఆపద్ధతినిజూడగా దమయంతి తనమనస్సునందుగల దుఃఖాగ్నిని కన్నీటిచేత తడుపుచు చల్లార్చుచున్నట్లుండెను. అట్లు విచారించుచున్న దమయంతినిజూచి బాహుకుడను నలుడు మహాదుఃఖాగ్నితో దమయంతికిట్లనెను.

దమయంతీ! నాదేహమందు కలిపురుషుడు ప్రవేశించినందున ఆకలిపురుషునిచేత నేను మోహమునబడి కష్టవృత్తిచేత సకలకష్టములను పొందితిని. నాతపోబలమువలన సకలపాపకర్మలును యిప్పుడు నశించినవి. ఆ కలిపురుషుడు యీ దినమందే నన్ను వదలిపోయెను. నిన్ను జూడవలెనను అపేక్షతో నిప్పుడిచ్చటకువచ్చితిని. అదియటుండ నిమ్ము. నీయందు నేను అనురక్తిగలిగియుంటిని. ఇతరస్త్రీని పొంద

నని వ్రతముచుబూనితిని. నన్ను నీవు దలంచక యితరపురుషుని వరి రింప దలంచితివి. అందులకుగాను స్వాయంవరమును రచియింప జేసితివి. ఇట్లు చేయుట కులస్త్రీలకు ధర్మముగాదు. సకలరాజులను ఇప్పుడు నీ స్వాయంవరమునకు రప్పించిన ఋతుపర్ణుడు యిప్పుడు నీ స్వాయంవర మునకువచ్చెను. అని యిట్లు బాహుకుడను నలుడు దమయంతితో జెప్పెను. దయయంతి భయపడి రెండుచేతులను జోడించుకొని నలు నకు యిట్లనెను

నలమహారాజా! నిన్ను వెదకుటకు అనేక విప్రులను పెక్కు రాజసభలకు పంపించితిని. వారందరును సకలరాజ సభయందును నేనుచెప్పినరీతిని ప్రసంగముచేసిరి. ఆ బ్రాహ్మణులలో పర్ణాదుడను విప్రుడు అయోధ్యాపట్టణమునకు వచ్చి సభయందు ప్రసంగించెను. ఆ పర్ణాదునితో నీవు బదులు పల్కితివి. నీవుచెప్పిన బదులుమాట వలన నిన్ను నలునిగా ఆపర్ణాదుడు తెలుసుకొనివచ్చి నాతో చెప్పెను. నేను నిన్ను ఇక్కడకు రప్పింపదలచి స్వాయంయంవరమను ఉపాయమును కల్పించితిని. పిమ్మట సుదేవుడను విప్రుని ఋతుపర్ణునియొద్దకు పంపించి తిని. సుదేవుడు ఋతుపర్ణునియొద్దకువచ్చి రేపటిదినమందు దమయంతికి ద్వితీయస్వాయంవరమని ఋతుపర్ణునితో చెప్పెను. అయోధ్యాపట్టణము యిక్కడికి నూరామడదూరము కలదు, ఒకదినమందు నూరామడ దూరము గుఱ్ఱములను నడిపించువాడు నలుడుతప్ప మరియొకడు సమ ర్థుడు కాడని తలచి రేపే స్వాయంవరమని చెప్పితినేగాని మరియొకటి కాదు. నేను పాపబుద్ధి గలదానను గానని నీపాదములను అంటి ప్రమాణము చేయగలను. నేను అట్టి పాపబుద్ధిని కలిగియున్న యెడల సూర్యుడు, చంద్రుడు. అగ్నిహోత్రాది దేవతలందరును కోపించు కొని నన్ను యిదివరకే నశించి యుందురు. అని దమయంతి నలునితో చెప్పుచుండెను, ఆసమయమున సర్వభూతములలోగల వాయుదేవుడు

ఆకాశమందుండి అందరూ వినునట్లు యిట్లనెను. మహారాజా! నేను వాయుదేవుడను. ఈ దమయంతి నిర్మలమైన చరిత్రగలది; పతివ్రత. అటువంటి దమయంతినిగురించి యీరీతిగా మాటాడితివిగదా! సూర్య చంద్రులును, నేనును మూడుసంవత్సరములనుంచి యీ దమయంతి యొక్క స్వభావమును చూచుచున్నాము. ఈమె నీయందు అనురాగము గలిగియున్నది. దీనిని నీవు గ్రహింపుము. అని వాయుదేవుడు ఆకాశమందుండి ఆశ్చర్యము గలుగునట్లుగా చెప్పెను. ఆసమయమున పుష్పవృష్టి కురిసెను. ఆకాశమందు దేవవాద్యములు మ్రోగెను. మిక్కిలి అనుకూలములగు గాలులువీచెను. నలుడువిని పరమానందముగల చిత్తముగలవాడై ఆ క్షణమందే కర్కోటకుని తలంచెను. వెంటనే కర్కోటక నాగకుమారుడు నలునివస్త్రమును దెచ్చి యిచ్చెను. అప్పుడు ఆ వస్త్రమును నలుడు ధరించి వికారరూపమును విడిచి యెప్పటివలె నిజరూపమును ధరించెను.

## నలుడు నిజరూపముతో దమయంతిని గూడుట

ధర్మరాజా! నలుడు నిజరూపమును ధరించి పెద్దబాహువులు గలిగియుండెను. అపరంజివంటి దేహకాంతిగలిగి మన్మథునివంటి సౌందర్యముగలవాడయ్యెను. దేవేంద్రునివంటి దేహవైభవముగలిగి యుండెను. సూర్యునివంటి దివ్యమగు తేజస్సును గలిగియుండెను. అటువంటి నలమహారాజును దమయంతిచూచి పరమసంతోషమును పొందెను. స్నేహితులందరును పరమసంతోషమును పొందిరి. ఈ రీతిగా నలదమయంతులిద్దరును కలసిసుఖించుచుండిరి. వారి విరహతాపములు నశించినంతనే వారిదేహములయందలి మలినములు హరించెను. వారిద్దరును అన్యోన్యానురాగము గలవారై యుండునట్లే భూషణములుకూడ విరాజిల్లెను. నలదమయంతుల సుఖసమాగమ

సమాచారమును భీమరాజువినివచ్చి దమయంతినిజూచి సంతసించెను. అప్పుడు పైరువేయుటకై సిద్ధమైన భూమికి ఉదకసమృద్ధిచేత కాంతిగలిగినట్లు పరులకు తెలియరాని రూపసౌందర్యవంతుడైన భర్తనుపొంది దమయంతి పరమహర్షచిత్తయై యుండెను. చంద్రునితోగూడిన రాత్రి వలె దమయంతి నలునిగూడి సుఖింపుచుండెను. అటువంటి దమయంతినిజూచి భీమరాజు సంతోషించి, తన పురమంతయు అలంకారములతో నిండజేసి దేవగృహముల యందంతటను దేవతారాధనలు గావింపజేసెను. ఆమహోత్సవ విశేషములను ఋతుపర్ణుడెరింగి నలుని వద్దకువచ్చి యిట్లుచెప్పెను.

నలమహారాజా! నీవు సర్వలోక పూజ్యుడవయ్యును నాయొద్ద బాహుకుడను పేరుగలవాడవై పరులచేత తెలియబడక సంచరించితివి. నిన్ను నేను గమనించలేక నిన్ననేక నీచకార్యములందు నియోగించితిని. అందుకు నీవు క్షమింపవలయును. అని ఋతుపర్ణుడు నలునితో జెప్పి ప్రార్థించెను. అప్పుడు నలుడు ఋతుపర్ణుని గౌరవించి పూజించెను. ఋతుపర్ణుడు నలునివలన అశ్వహృదయమను విద్యనుగ్రహించి తనరాజధానియగు అయోధ్యా పట్టణమునకు బోయెను.

ధర్మరాజా! నలుడొక మాసమువరకు విదర్భాపురమందుండి పిమ్మట భీమరాజుతో జెప్పి దమయంతిని అక్కడనేయుంచి తాను నిషధపురికి వెళ్ళదలచెను. నలుడంతట ఒకరథమును తీసికొనెను. ఆరునూరులు కాల్బలము, పదియారు యేనుగులు, యేబదిగుర్రములు తీసికొనెను. ఈరీతిగా కొద్దిసైన్యమును తోడుగాతీసుకొని తనదగు నిషధపురికింజని పుష్కరునిజూచి యిట్లు పలికెను. ఓ పుష్కరుడా! దమయంతిని పందెముగాఒడ్డి నేను యిప్పుడు నీతో జూదమాడెదను. నీవుసకలరాజ్యమును పందెముగానాతో జూదమాడుము. నీవు గెలిచినయెడ నాభార్యయగు దమయంతిని నీవుతీసికొనుము. నేనుజూద

మందు గెలిచిన యెడల నీసకల భూరాజ్యమును నేను తీసికొనెదను. ఈరీతిగా జూదమాడుటకు నీకు సమ్మతమైన యెడల నాతో యిప్పుడు జూదమాడుము. నీకు యిష్టములేని యెడల మనమిద్దరము రథములెక్కి ఘోరయుద్ధము చేయుదము రమ్ము. అట్లు యుద్ధము చేయగా యుద్ధమందు నన్ను నీవు గెలిచిన యెడల యీసకలరాజ్యమును నీవే అనుభవింపుము. యుద్ధమందు నిన్ను నేను గెలిచిన యెడల యీ సకల రాజ్యమును నేను అనుభవించెదను. ఈ రెంటిలో నేదినీకు యిష్టమగునో అట్టి కార్యమును చేయుటకు రమ్ము. అని నలమహారాజు పుష్కరునితో చెప్పెను. యుద్ధము చేసిన యెడన పుష్కరుడు గెలువ జాలడు గాన పుష్కరు డప్పుడు తన మనస్సులో నిట్లని తలంచెను. ఈ నలుని యుద్ధమందు నేను గెలువజాలను. పూర్వమందే జూదమందు నలుని నేను గెలిచితిని. అట్లనే యిప్పుడును జూదమందు నలుని గెలిచి దమయంతిని తీసుకొని కృతార్థుడ నయ్యెదను. అని యిట్లు పుష్కరుడు మనస్సులో తలంచి సంతోషించి నలునితో యిట్లనెను.

నలుడా! మనమిద్దరము యిప్పుడు జూదమాడుదము. ఆజూదమందు నేను ఓడిన యెడల యీ సకల భూమీ రాజ్యమంతయు నీదే యగును. నీవు జూదమందు ఓడిన యెడల నీభార్యయగు దమయంతి నాదేయగును అని పుష్కరుడు నలునితో చెప్పి సకల భూరాజ్యములు పందెముగా ఒడ్డి నలునితో జూదమాడి నలునకు ఓడెను. ఈరీతిగా సమస్తజనులు చూచుచుండగా జూదమందు గెలిచి సకల భూరాజ్యమును పుష్కరుని వలన తీసికొనెను. యీవిధమున నలుడు పుష్కరుని ఓడించి సకల భూరాజ్యమును తీసికొని పుష్కరునితో యిట్లనెను.

పుష్కరుడా! పూర్వము నేను కలిపురుషుని చేత మోహింపబడి బుద్ధిబలము నశించి జూదమందు నీకు నేను ఓడితిని. అందులకు

నీవు గర్వించి నేను ఓడితిననియు నీవు బలవంతుడ వనియు తలచవద్దు. నీవు నాపినతండ్రి కుమారుడవు. అందువలన నిన్నేమి చేయుటకును నాకు బుద్ధిబలము చాలలేదు. గాన ప్రాణములతో వెడలుము. అని నలుడు పుష్కరునితో జెప్పి అతనిని విడిచెను. నలుడు సకలరాజ్యమును పొంది రాజకార్యములను విచారించుచుండెను. దమయంతి తన కుమారుని కుమార్తెను తీసికొని మహావిభవముతో నలుని దగ్గరకువచ్చెను. ధర్మరాజా! యీ విధమున నలుడు దమయంతితో గూడి సకలరాజ్య సుఖములను అనుభవించుచు శాస్త్రవిధిప్రకారము నూరు యజ్ఞములను చేసెను. దేవేంద్రునితో సమానమగు విభవైశ్వర్యములు గలిగియుండెను. సకల రత్నములతో గూడియున్న రత్నగర్భాధిరాజ్యమును నలుడు పరిపాలించెను. గాన నీవును జూదమందు ఓడితివని విచారింపకుము. నీవును దైవమానుష బలసంపన్నుడవై, శత్రువులను జయించి సమస్తమైన ధరణీరాజ్యమును పొందుదువు. అని యీవిధముగా బృహదశ్వమహాముని ధర్మరాజునకు నలోపాఖ్యానమును జెప్పి ఆ ధర్మరాజునకు అక్షయహృదయ మనువిద్యనుపదేశించి ధర్మరాజా! యీనలోపాఖ్యానమును వినినవారును, భక్తిపూర్వకముగా జదివినవారును, కలిదోషమువలన విడువబడుదురు. సకలపుణ్యఫలములను పొందుదురు. బహుపుత్రపౌత్ర ఆయురారోగ్య భోగభాగ్య ధనవంతులగుదురు. సకలవిషభయములు లేనివారై పాప కర్మాసక్తి లేకయుందురు. ధర్మబుద్ధి వంతులగుదురు. ఈ నలచరిత్రము లోకమందు మిక్కిలి ప్రసిద్ధిగలదగును. కర్కోటక నలదమయంతీ ఋతుపర్ణులను కీర్తించిన జనులకు సకల కలిభయములును తొలగిపోవుచున్నవి.

శ్లో. కర్కోటకస్య నాగస్య దమయంత్యానలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనం.

అని యిట్లు బృహదశ్వ మహాముని ధర్మరాజుతో జెప్పి వెడలెను.

## ధర్మరాజువద్దకు నారదముని వచ్చుట

ఓ జనమేజయమహారాజా! బృహదశ్వుడు వెళ్ళినతరువాత ధర్మరాజాదిపాండవులు అర్జునుని రాకను గోరుచు ఆతనిని జూచుట యందు అపేక్ష గలిగియుండిరి. అంతట నారదమహాముని ఆకాశ మార్గమునుండి ధర్మరాజుదగ్గరకు వచ్చెను. ఆనారదుని తేజస్సుచేత ఆకాశమంతయు ప్రకాశమానమైయుండెను. అప్పుడు ధర్మరాజ భీమ నకుల సహదేవులు నలుగురును నారదమహామునిని పూజించిరి. అంతట నారదమౌని ధర్మరాజునకు యిట్లు చెప్పెను.

ఓ ధర్మరాజా! నీ యుదారగుణ చరిత్రమును, నీ ధర్మబుద్ధిని జూచి నేను మిక్కిలి సంతోషించి తృప్తిబొందితిని. నీకు యిష్ట మేదియో దెల్పినయెడల నీ యిష్టమును నేను ఫలింపజేసెదను. నీ యిష్టమును జెప్పుము అని యిట్లు నారదమునీంద్రుడు చెప్పగా ధర్మ రాజు రెండుచేతులను జోడించుకొని భక్తిపూర్వకముగా యిట్లనెను. మహాత్మా! నారదమునీంద్రా! నీకు తృప్తిగలిగినయెడల మూడు లోకములకు తృప్తియగును. నిన్ను నేను జూచినందున కృతార్థుడ నైతిని. నాకు సర్వదా ఒక ధర్మసందేహము బాధింపుచున్నది. ఆ సందేహమును మీరు నివృత్తిజేసి నిర్ణయించి ఆనతివ్వ వలయును.

నారదమునీంద్రా! లోకమందు పుణ్యాత్ములు పుణ్యతీర్థములను సేవించుటకు భూమికి ప్రదక్షిణముగా తిరిగి పుణ్యతీర్థములను సేవింపు చుందురు. అటువంటి పుణ్యాత్ములు కృతార్థులై ఎటువంటి పుణ్య ఫలములనైనను పొందుదురు. గాన అనేకములగు పుణ్యతీర్థములను జెప్పుచు అందువలన గలిగెడి ఆయా పుణ్యఫలములను నాకు దెలియ

జేయుము అని యీరీతిగా ధర్మరాజు అడుగగా నారదుడిట్లు చెప్పెను. ధర్మరాజా! పూర్వము మీ తాతయగు భీష్ముడు తన పితృదేవతలకు మేలుగలుగునట్లు సర్వదా వేదాధ్యయనవ్రతమును ధరించి పుణ్య కర్మలను జేయుచు గంగాద్వారమం దుండెను. ఆ భీష్మునకు గల పితృదేవతాభక్తి, ధర్మకార్యాసక్తికి మెచ్చి భీష్ముని చూచుటకు పులస్త్యమహాముని గంగాద్వారమునకు వచ్చెను. అప్పుడు భీష్ముడు రెండుచేతులను జోడించుకొని యిట్లు పలికెను.

మహాత్మా! పులస్త్యమునీంద్రా! నీకునేను భక్తుడను. నీకు నేను దాసుడను అని భీష్ముడు చెప్పుచు నమస్కరింపుచు వినయముతో భక్తిపూర్వకముగా నిలిచియుండెను. అంత పులస్త్యమునీంద్రుడు భీష్మున కిట్లు చెప్పెను. భీష్మా! పితృదేవతాభక్తి, పుణ్యవ్రత చరిత్రమునందును అందరికంటె నీవేఅధికుడవు నీగుణములకు నేనుతృప్తిని బొందితిని. నేను పరబ్రహ్మవేత్తను. సర్వజ్ఞుడను. నీకిష్టమగున దేదికలదో దానిని నీవుచెప్పినయెడల నీకోరికను సఫలము గావింతును. అని యిట్లు పులస్త్యమునీంద్రుడు చెప్పగా ఆమాటలకు భీష్ముడు సంతోషించి యిట్లుపలికెను.

మహాత్మా! పులస్త్యమునీంద్రా! నాయందు మీకుఅనుగ్రహబుద్ధి గలిగినయెడల అనేకపుణ్యతీర్థములను కీర్తింపుచు వానిఫలములను జెప్పగునియడిగెను. ధర్మరాజా! ఇప్పుడు నీవునన్నడిగినట్లే భీష్ముడు పులస్త్యునియడుగగా పులస్త్యుడు భీష్మున కిట్లుచెప్పెను. ఓ భీష్మా! శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణేంద్రియము లైదును జ్ఞానేంద్రియములని చెప్పబడును. వాక్పాణి పాదపాయూపస్థలను అయిదింద్రియములును కర్మేంద్రియములని చెప్పబడును ఆ జ్ఞానేంద్రియ కర్మేంద్రియములయందు సర్వదా చిత్తములను నిల్పియుండువారు సర్వపుణ్యతీర్థ సర్వయజ్ఞఫలములను బొందుదురు. అహంకారపూర్వ

కముగా దానములనుపట్టక విషయభోగాపేక్ష లేనివారు సర్వపుణ్యతీర్థ సర్వయజ్ఞ ఫలములను పొందుదురు.

స్వల్పభోజనములు జేయుచు సర్వకర్మములను సన్యసించి సర్వదాసంతోష చిత్తులగుచు సర్వకామములను విడిచినవారు సర్వ తీర్థసర్వయజ్ఞ ఫలములను పొందుదురు. సత్యవ్రతులై మంచనడవడి గలిగిక్రోధములేని ధర్మాత్ములు సర్వపుణ్యతీర్థ సర్వయజ్ఞ ఫలములను బొందెదరు. ఈ చెప్పబడినవారు పరమార్థసేవకులని యెరుగవలెను. దౌర్భాగ్యులగువారు పరమార్థసేవను చేయజాలరు. భీష్మా! నువ్వు లను, గోవులను, బంగారమును దానములిచ్చుచున్నవారు పుణ్యా త్ములగుదురు. వ్రతోపవాసములను జేయువారు పుణ్యాత్ములగుదురు. దురహంకారయుచేత పాపాత్ములై యీ చెప్పబడిన దాన పుణ్య తీర్థ ములను జేయనివారు పాపాత్ములైన దరిద్రులగుదురు. పుణ్యతీర్థము లందు దానములను జేసినవారికి మహాపుణ్యము గలుగును. యజ్ఞఫల ములు గలుగువారికి పాపగతులు గలుగజాలవు. పుణ్యతీర్థములను సేవించుటచేత పాపాత్ములకైనను యజ్ఞఫలములు గలిగి పుణ్యగ తులు గలుగును. ఇది మునులమతము. తీర్థయాత్రఫలమే యజ్ఞఫల ములకు విశేషమగును. అదియెట్లనగా జెప్పెదవినుము. 1. నమితము 2. విరోధి 3. పుష్కరము అను మూడు పుణ్యతీర్థములును సర్వలోక ప్రసిద్ధములు. ఆమూడుపుణ్యతీర్థములును మునులు సిద్ధులు సర్వదా సం తోషముగా సేవింపుచుందురు. ఆమూడుతీర్థములయందును బ్రహ్మదే వుడు దేవసంఘములతోవచ్చి నివసించుచుండును. ఆమూడు తీర్థము లును త్రిపుష్కరములని చెప్పబడును. ఆమూడును సమానములే యగును. ఈ త్రిపుష్కరములను సర్వదా స్మరించుచున్నవారికి సకల పాపములు నశించును. ఆ త్రిపుష్కరములందనేకతీర్థములుండును. మహామునులును, దేవశ్రేష్ఠులును ఆ త్రిపుష్కర తీర్థములయందు

గొప్ప తపోయజ్ఞములను జేసి కృతార్థులైరి. ఆపుష్కరములయందు స్నానములు జేసి దేవ ఋషి పితృతర్పణములను జేసినవారికి పదిఅశ్వమేధయజ్ఞ ఫలములుగలుగును. కార్తికమాసమందు ఒకదినము పుష్కరతీర్థమును సేవించినయెడల నూరుసంవత్సరముల పర్యంతము అగ్నిహోత్రమందు హోమముచేసిన ఫలము గలుగును. భీష్మా! దేవ శ్రేష్ఠులలో విష్ణుదేవు డధికుడైనట్లు భూమియందుగల సర్వతీర్థములలో ఆ పుష్కరతీర్థము మిక్కిలి శ్రేష్ఠము. ఆతీర్థమందు పదిసంవత్సరముల పర్యంతము నివసించినవారికి, సర్వయజ్ఞ ఫలములుగలిగి బ్రహ్మలోకప్రాప్తి కలుగును.

భీష్మా! జంబూమార్గమనియు, బదరికాశ్రమ మనియు, అగస్త్యవనమనియు మూడుపుణ్యతీర్థములు గలవు. ఆమూడు తీర్థములలో దేనియందు స్నానముచేసినను ఒక అశ్వమేధయజ్ఞము చేసిన ఫలముగలుగును. కణ్వాశ్రమమనియు, ధర్మారణ్యమనియు యయాతిపథమనియు, మూడు పుణ్యతీర్థములుగలవు. ఆమూడు తీర్థములలోనే తీర్థముజూచినను సర్వపాపములు నశించును. మహాకాలమనియు, కోటితీర్థమనియు, భద్రవటమనియు, రుద్రస్థానమనియు, నాలుగు పుణ్యతీర్థములుకలవు. ఆనాలుగు పుణ్యతీర్థములలో రుద్రుని పూజించిన వానికి గణపతిత్వము కలుగును. నర్మదానదీస్నానము జేసినవారికిని దక్షిణసముద్రస్నానముచేసిన వారికిని, చర్మణ్వతీ తీర్థస్నానము చేసినవారికిని అగ్నిష్టోమయజ్ఞముల జేసినఫలములు గలుగును. భీష్మా! వసిష్ఠాశ్రమమను పుణ్యతీర్థమందు కందమూల ఫలశాకములను భక్షించి ఒకదినమున్నయెడల అట్టిజనులకు బహుధనసంపద గోసహస్రదాన ఫలములు గలుగును.

పింగళమను తీర్థమునుసేవించినవారికి నూరుస్త్రీకపిలగోవులను దానముచేసిన ఫలముగలుగును. ప్రభాసమనుతీర్థమందు అగ్నిదేవుడు ప్రత్యక్షమై యుండును. అటువంటి ప్రభాసతీర్థమున స్నానముచేసిన

వారికి, అగ్నిష్టోమ, అతిరాత్రఫలములు గలుగును. దుర్వాసమునీంద్రుడు విష్ణువునకు వరమిచ్చిన ప్రదేశముగుటవలన వరదానమను పుణ్యతీర్థము గలదు. ఆవరదాన తీర్థమందు స్నానముచేసినను, సరస్వతీ సాగరసంగమమందు స్నానముచేసినను, అట్టిజనులకు గోసహస్రదానఫలము గలుగును. ద్వారకా పట్టణమందు బృందారకమను పుణ్యతీర్థముగలదు. ఆతీర్థమందు కమలములు విశేషముగానుండును. బృందారక తీర్థమందు పరమేశ్వరుని పూజించినవారికి సకలపాపములును నశించును. సాగరసింధు సంగమమను పుణ్యతీర్థమందు స్నానముచేసినవారికి స్వర్గలోకప్రాప్తి గలుగును. శంఖకర్ణమనెడి పుణ్యతీర్థమందు ఈశ్వరుని పూజించినవారికి పదిఅశ్వమేధ యజ్ఞఫలములు గలుగును. వసుద్వారమను పుణ్యతీర్థమందు ఈశ్వరుని పూజించినవారికి పదిఅశ్వమేధ యజ్ఞఫలములు గలుగును. వసద్వారమనుపుణ్యతీర్థమందు వసుశరమను తీర్థమందును స్నానములు చేసినవారికి, పరిపూర్ణ ధనసమృద్ధి గలుగును. సింధూత్తమను తీర్థమందు స్నానము చేయుటవలన బహుసువర్ణ దానములుచేసిన ఫలముగలుగును. బ్రహ్మతుంగమను తీర్థమును సేవించుటవలన బ్రహ్మలోక ప్రాప్తికలుగును. శక్రకుమారీ పుణ్యతీర్థములను జూచుటవలన ఇంద్రలోక ప్రాప్తికలుగును. శ్రీకుంజరమను పుణ్యతీర్థమునందుగల జలములయందు బంగారువన్నెకల చేపలుకలవు. అక్కడబ్రహ్మదేవునికి నమస్కరించి స్నానము చేసినయెడల ఇంద్రసాయుజ్య ప్రాప్తికలుగును. మరియు మలహారమను పుణ్యతీర్థమందు అగ్నిదేవున కర్ఘ్యమిచ్చినయెడల ఆయర్ఘ్యము అక్షయమై పితృదేవతలకు తృప్తికలిగించును. ఆపుణ్యఫలము గోసహస్రదానఫలముకంటెను అశ్వమేధ సహస్రపుణ్యఫలము కంటెను అధికమైనది. దేవికయను పుణ్యతీర్థమందు దేవసమూహ సహితుడై రుద్రుడుండును. ఆ దేవికపుణ్యతీర్థమును సేవించినవారికి ధర్మార్థ

హ్రదమునకును మధ్యమందు గల పుణ్యభూమి బ్రహ్మదేవుని ఉత్తర వేది యని చెప్పబడును. కురుక్షేత్రమును త్రొక్కినవారికిని కురుక్షేత్ర మందు నివసించెదమని తలచినవారికిని సకలపాపములు నశించును. దైవతమను విష్ణుస్థానమందు విష్ణువును పూజించినయెడల అశ్వమేధ యజ్ఞము చేసినఫలము గలుగును. పృథివీతీర్థమందు స్నానముచేసిన వారికి గోసహస్రదానఫలము గలుగును. పారిప్లవమను పుణ్యతీర్థ మందు స్నానముచేసినయెడల అగ్నిష్టోమ ఫలముగలుగును. సాలో కిని యనుపుణ్యతీర్థమందు స్నానముచేసినయెడల పది అశ్వమేధయజ్ఞ ములు జేసినఫలము గలుగును.

సర్పతీర్థమందు స్నానముచేసినవారికి అగ్నిష్టోమ ఫలము గలు గును. మరియు. నక్కడగల ఉత్తరకుడను ద్వారపాలకుని జూడవల యును. వరాహతీర్థమున స్నానముజేసిన వారికి అగ్నిష్టోమ ఫలము గలుగును. పూర్వమచ్చట కృష్ణుడు ఆదివరాహా మయ్యెను. అందు వలన దానికి వరాహతీర్థమని పేరు అశ్వనీతీర్థమందుస్నానముచేసిన వారు మంచిరూపవంతులగుదురు. జయంతియందు సోమతీర్థస్నాన ములుచేసినవారికి రాజసూయ పౌండరీక యజ్ఞఫలములు గలుగును. అగ్నివటమందును, పంచవటమందును పుణ్యతీర్థములగుటచే యీశ్వ రుని పూజించినవారు యిష్టవరములను పొందుదురు. కురుక్షేత్రద్వార మును ప్రదక్షిణముగా చుట్టుతిరిగినవారికి పాపమునశించును. పూర్వము పరశురాముడు యుద్ధవీరుడై గండ్రగొడ్డలిని తీసికొని రౌద్రా కారుడై సకలరాజులను నరికివేసెను. అట్లు సకలరాజులను నరికి, ఆ రాజులరక్తములను అయిదుమడుగులయందు నిండించి ఆమడుగుల యందుగల రక్తములచే పితృతర్పణములను చేసెను. పితృదేవతలు పరశురామునకు ప్రత్యక్షమై నీకు యిష్టమగు వరమును వేడుమని చెప్పిరి. అప్పుడు పరశురాముడు పితృదేవతలకు యిట్లనెను

పితృదేవతలారా! నేను క్రూరబుద్ధిగలవాడను. సకలక్షత్రియులను చంపితిని. పాపము నశింపవలయును. నాకు పుణ్యగతి గలుగవలయును. మీకరుణవలన యీ మైదు నెత్తురుమడుగులును పుణ్యతీర్థములై ప్రసిద్ధిగానుండవలయును. అని యిట్లు పరశురాముడు పితృదేవతలను వరమడిగెను. ఆ అయిదుమడుగులును, రామహ్రదములని చెప్పబడును. ఆ రామహ్రదములందు స్నానముచేసినవారికి అశ్వమేధపలము గలుగును. కాయశౌచమను తీర్థమందు స్నానముచేసినవారు దేహపరిశుద్ధులగుదురు. లోకోద్ధారణమను పుణ్యతీర్థముగలదు. యీపుణ్యతీర్థమందుండిపూర్వముదిష్ణుదేవుడులోకములను ఉద్ధరించెను. అందుచేత తీర్థమునకు లోకోద్ధరణమని పేరుకలిగెను. ఆ పుణ్యతీర్థమందు స్నానముచేసినవారు కులమును వుద్ధరింతురు. శ్రీ తీర్థమందు స్నానముచేసినవారు శ్రీమంతులగుదురు. కపిలతీర్థమందు స్నానముచేసినవారు కపిలగోవుల సహస్రమును దానముచేసిన ఫలమును బొందుదురు. సూర్యతీర్థమందుస్నానముచేసి అక్కడనివసించినయెడల సూర్యలోకమును పొందుదురు. గోభవమున స్నానముచేసినవారికి గోసహస్ర సమృద్ధిగలుగును. శంఖినీతలద్వారమున నరకాంతకుడను ద్వారపాలకుని పూజించిన వారును, సరస్వతీ నదియందు స్నానము జేసినవారును అగ్నిష్టోమ యజ్ఞఫలమును బొందుదురు. మాతృతీర్థమును జూచుటచేత సంతానవృద్ధియగును.

బ్రహ్మావర్తనమనియు, శరవణమనియు, రెండుపుణ్యతీర్థములు గలవు. ఆ రెండు పుణ్యతీర్థములను జూచినవారికి సకలవ్యాధులును నశించును. లోమాపహమనెడి తీర్థమందు పదునొకండు పుణ్యతీర్థములుగలవు. ఆపుణ్యతీర్థములయందు ప్రాణాయామము జేసిన బ్రాహ్మణులకు మహామునులగు మానసహాయముకలదు. పూర్వము మెరుకలవాండ్రు నల్లనిమృగములను చంపుటకు ప్రయత్నించిరి. అప్పుడు ఆ

మృగములన్నియు నొక పుణ్యతీర్థమునకుబోయి మనుష్య రూపములను ధరించెను. అప్పటినుండి ఆ తీర్థము మానుషతీర్థమని చెప్పబడును. అట్టి మానుష తీర్థమందు స్నానము జేసినవారు సర్వపాపములను విడిచి దేవత్వమును బొందుదురు. ఆ మానుష తీర్థమందు తూర్పువైపున యొకస్థలమందు సురగయయను మహానదిలో పితృతర్పణము చేసి పితృదేవతల నుద్దేశించి యొక బ్రాహ్మణునకు భోజనము పెట్టిన యెడల కోటిబ్రాహ్మణులకు భోజనము పెట్టిన పుణ్యఫలము గలుగును. పితృదేవతలు తృప్తిబొందుదురు. బ్రహ్మోదుంబరమనియు, మహర్షి కుండమనియు, కేదారమనియు, మూడుపుణ్యతీర్థములుగలవు. ఆ మూడు తీర్థములను జూచినవారు, బ్రహ్మలోకమును బొందుదురు. కపిలాశ్వ కేదారములను పుణ్యతీర్థములను జూచినవారు సకలపాపములను విడిచి అదృశ్యులై పోదురు. సుకరమను పుణ్యతీర్థమందు స్నానము జేసి కృష్ణపక్ష చతుర్దశియందు యీశ్వరునిపూజించి సకలకామములను పొందుదురు. ఇంద్రస్యందనమను పుణ్యతీర్థమొకటి కలదు. ఆ తీర్థమందు మూడుకోట్ల కూపహ్రదములు గలవు. ఆ యింద్రస్యందన తీర్థమందు స్నానముజేసి పితృతర్పణములను జేసినవారికి వాజపేయ యజ్ఞఫలము గలుగును. జాప్యమను తీర్థమందు దానజపములు జేసిన అక్షయములగును. సభాపద్మమను నారదతీర్థమందు మృతిబొందిన వారు సర్వపుణ్యలోక సౌఖ్యములను పొందుదురు. శుక్ల పక్ష ఏకాదశి యందు పుండరీకమను తీర్థమందు స్నానముజేసినవారికి పౌండరీకయజ్ఞఫలము గలుగును. ఆ పుండరీకతీర్థమందుగల వైతరణీజలముల యందు స్నానముజేసి రుద్రునకు నమస్కరించిన యెడల సర్వపాపములు నశించును.

సవనమను ఒకపుణ్యతీర్థముగలదు. పూర్వము దేవతలు ఆ సవనతీర్థమందు అనేక సహస్రసంవత్సరములు తపస్సుచేసిరి. సవనతీర్థ

మందు స్నానము చేసినయెడల అగ్నిష్టోమ అతిరాత్ర యజ్ఞఫలములు గలుగును. వేదవ్యాసమునీంద్రుడు అనేకతీర్థములను మిశ్రీకరించుట చేత మిశ్రీకరమను పుణ్యతీర్థముకలదు. ఆ తీర్థమందు స్నానము చేసినవారికి సర్వతీర్థసేవన ఫలము కలుగును. వ్యాసవరమనియు, మనోజనమనియు, మధువటమనియు మూడుతీర్థములు గలవు. ఆ మూడుతీర్థములందు స్నానము జేసినవారికి, గోసహస్రదానఫలముగలుగును. కౌశికీశతధృతి సంగమమందు స్నానము జేసినవారికి, సర్వపాపములు నశించును. దర్భకూలమను పుణ్యతీర్థమందు ఘృతపృష్టదానము చేసినయెడల పితృఋణము తీరును. సూర్యతీర్థమందుస్నానము చేసినయెడల సూర్యలోక ప్రాప్తిగలుగును. భృగుతుంగమను తీర్థమందు గంగాస్నానము జేసి శివునిపూజించిన మహాత్ములు అశ్వమేధ యజ్ఞఫలములను పొందుదురు. వామనమను తీర్థమందు స్నానముజేసి వామనమూర్తిని పూజించినవారు విష్ణులోకమును పొందుదురు. పావనమను తీర్థమందు స్నానముజేసినవారు తమకులమును పరిశుద్ధిజేయుదురు. శ్రీకుంజమను పుణ్యతీర్థమందు సరస్వతీనదీస్నానముజేసి అగ్నిష్టోమ యజ్ఞఫలమును పొందుదురు. నైమిశకుండమను పుణ్యతీర్థమందు ఋషులుండు కురుక్షేత్రమునకు దారిగలదు. అట్టితీర్థమందు స్నానము జేసినవారు ఋషితృప్తిని కలిగింతురు. బ్రహ్మతీర్థమందు క్షత్రియ వైశ్య శూద్రులు స్నానముజేసినయెడల బ్రాహ్మణులై మరియొక జన్మమున బుట్టగలరు. ఆ తీర్థమందు స్నానముచేసి బ్రాహ్మణులు బ్రహ్మలోకప్రాప్తులగుదురు. భీష్మా! సప్తసారస్వతములనుఏడుపుణ్య తీర్థములు ఒక్కచోటనే యున్నవి. ఆ సప్తసారస్వత తీర్థములదగ్గిర శౌనకుడను బ్రహ్మర్షి యాశ్రమముండెను. ఆశౌనకమునీంద్రు డొక నాడు దర్భకఱ్ఱనుచీల్చుచుండగా అతనిచేయి చీలెను. ఆచీలిన స్థలమందు చేతిలోనుండి ఆకుపసరు కారుచుండెను. ఆ పసరునుజూచి

శౌనకమునీంద్రు డమితానందముతో నృత్యము జేయుచుండెను. ఆ నృత్యమునకు భయపడి సహింపజాలక దేవతలును మునులును శివుని దగ్గరకుబోయి యిట్లు ప్రార్థించిరి. పరమేశ్వరా! నీవు సకల దేవతలకును దేవుడవు. శౌనకమునీంద్రుడు నృత్యము చేయుచున్నాడు. ఆ నృత్యము యేవిధముగానివర్తించునో ఆవిధమును యోచించి చేయుము. ఆశౌనకమునీంద్రుని నృత్యమును మాన్పుము. అని యీరీతిగా దేవమునులు శివుని ప్రార్థించిరి. అంతట శివుడు తాపసిరూపధారియై శౌనకుని దగ్గరకువచ్చి యిట్లనెను.

శౌనకమునీంద్రా! నీవిప్పుడు యేకారణమువలన నృత్యము జేయుచున్నావో తెలియలేదు. ఏమి ఆశ్చర్యకార్యమును జూచితివో తెలియకున్నది. నీవు జూచినది నాకు జెప్పదగినదై యుండునెడల జెప్పుము. అని యిట్లు శివుడు అడుగగా శౌనకుం డిట్లనెను. నాచేతిలో నుండి ఆకురసముచచ్చుచున్నది. అందుకు నేను సంతోషించి ఆశ్చర్యమునుపొంది నృత్యమును చేయుచున్నాను. అని శౌనకమునీంద్రుడు శివునితో చెప్పగా శివుడిట్లనెను. శౌనకమునీంద్రా! నీ చేతిలోనుండి ఆకురసము కారుటకు ఆశ్చర్యమునుపొందితివి. ఇదియొక ఆశ్చర్యము గాదు. ఈ ఆశ్చర్యమును జూడుమని శివుడు జెప్పి తన బొట్టనవ్రేలి చేత యితరవ్రేలుల అంగుళములను గీరెను. అట్లు గీరగా ఆ శివుని బొట్టనవ్రేలిలోనుండి బంగారమువంటి భస్మము గారుచుండెను. ఆ యాశ్చర్యమును శౌనకుడుజూచి సిగ్గుపడి యిట్లనెను. ఓ మహాత్మా! నీవు పరమేశ్వరుడవు. మనుష్యమాత్రుడవుగావు. అని జెప్పి శౌనకుడు శివునకు నమస్కరించి వేదమంత్రములచేత స్తుతియించి మరల నిట్లనియెను. మహాత్మా! పరమేశ్వరా! నాయందు నీవు అనుగ్రహముంచుము. నీయనుగ్రహమువలన నాకు తపోవృద్ధి కాగలదు. నా యందు నీవు కరుణింపుము. అని శౌనకుడు శివునితో జెప్పి ప్రార్థిం

చెను. శివుడు శౌనకునియందు కరుణించి యిట్లు పలికెను. మునీంద్రా! నీకు తపస్సు వృద్ధియగును. నేను నీ యాశ్రమం దుందును, అని శివుడు శౌనకునితో జెప్పెను. సప్తసారస్వత తీర్థములయందు స్నానము జేసినవారికి సారస్వతసిద్ధి యగును. భీష్మా! ఔశీనర తీర్థమనియు, కపాలమోచనమనియు విశ్వామిత్రమనియు, కార్తికేయమనియు నాలుగు పుణ్యతీర్థములు గలవు. ఆ పుణ్యతీర్థములయందు స్నానములు జేసినవారు సకలపాపములను విడిచి బ్రహ్మలోకమును బొందుదురు. పృథూదక మను పుణ్యతీర్థమునకు దేవేంద్రాది దేవతలును, వేదవ్యాసాది మహాయోగీశ్వరులును వచ్చుచు సేవింపుచుందురు. అందువలన శ్రేష్ఠమగు తీర్థములలో పృథూదక తీర్థము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఈతీర్థమందు శరీరమును విడిచినవారికి సకల పాపములు నశించును. సురకన్యా సరస్వతీసంగమమందు స్నానము జేసినవారికి బ్రహ్మహత్యాది మహాపాపములు నశించును. యతికర్ణ ణమను మహాతీర్థమును అత్రిమహాముని నిర్మించెను. ఆ తీర్థమందు శూద్రులు స్నానము జేసిన యెడల జన్మాంతరమందు బ్రాహ్మణులగుదురు. మరియు బ్రాహ్మణులు స్నానము జేసిన యెడల పరమ సిద్ధులగుదురు. శతమను పుణ్యతీర్థమందు జపదాన ఉపవాసములు జేసిన యెడల నూరురెట్లు అధికముగా సిద్ధిగలుగును. సహస్రతీర్థమందు జప, దాన ఉపవాసములు జేసిన యెడల వేయిరెట్లు అధికముగా సిద్ధిగలుగును. ఔశీనరమను తీర్థమందు పూర్వము దేవతలందరును కుమారస్వామికి అభిషేకము చేసిరి. ఆ తీర్థమునకు తూర్పు తట్టున కురుతీర్థము కలదు. స్వర్గద్వారమను తీర్థమొకటి కలదు. ఈ మూడుతీర్థములును జూచినవారికి స్వర్గలోకప్రాప్తి కలుగును. రుద్రపత్నియను పుణ్యతీర్థమందు శివనారాయణులను బూజించిన యెడల సర్వదుఃఖములు నశించును. స్వస్తిపురమునకు ప్రదక్షిణముగా తిరిగిన యెడల గోసహస్రదానములు జేసిన ఫలముకలుగును.

గంగానదియందు గల మడుగులో ఒక బావియందు మూడు కోట్ల పుణ్యతీర్థములు చేరియుండును. ఆ బావియందు స్నానము జేసినవారికి సమస్తమైన పుణ్యతీర్థములయందు స్నానము జేసిన పుణ్యము కలుగును. బదరీవనమందు గల వసిష్ఠాశ్రమమందు మూడు రాత్రులుండి రేగుపండ్లను భక్షించుచున్న యెడల సర్వపాపములు నశించును. ఏకరాత్రమను తీర్థమందు ఒకరాత్రి ఉపవాసము చేసిన యెడల బ్రహ్మలోకప్రాప్తి కలుగును. ఆదిత్యాశ్రమ మను వన మందు ఆదిత్యుని బూజించినయెడల సూర్యలోకప్రాప్తి కలుగును. దధీచియను తీర్థమందు గల కణ్వాశ్రమమందు మూడురాత్రులులున్న యెడల అట్టి జనులకు స్వర్గలోకప్రాప్తి గలుగును. సన్నిహిత మను బుణ్యతీర్థమందు బ్రహ్మాది దేవశ్రేష్ఠులును, సిద్ధగరుడ సర్పాదులును, ప్రతిమాసమందును తప్పకవచ్చి విహరించి సేవింపుచుందురు. చంద్ర సూర్యగ్రహములయందు ఆ సన్నిహిత తీర్థమందు స్నానము జేసిన యెడల నూరు అశ్వమేధయజ్ఞములు చేసిన ఫలితము కలుగును. ధర్మతీర్థమను ప్రదేశమందు పూర్వము యమధర్మరాజు తపస్సు జేసెను. అందు స్నానము చేసినజనులు ధర్మాత్ములు. నరపావన మనియు, సౌగంధికమనియు పిలువంబడు రెండు పుణ్యతీర్థములయందు స్నానము జేసినను, చూచినను, సర్వపాపములు నశించును. దేవ శ్రవయను పేర సరస్వతీనదియందు ఒక సరస్సుకలదు. అందొక పుట్ట కలదు. ఆపుట్టలోనుండి స్రవించెడి జలములచేత స్నానముజేసి పితృ తర్పణములను చేసినయెడల అట్టిజనులు అశ్వమేధ యజ్ఞఫలమును బొందుదురనుటలో సందియము లేదు. సుగంధియనియు, శతకుంభ యనియు, పంచయజ్ఞ యనియు, త్రిశూలఘాతయనియు, నాలుగు తీర్థములు గలవు. ఆతీర్థములయందు స్నానము జేసినయెడల సకల దుర్గతులున్ను నశించును. శాకంభరి యను పుణ్యతీర్థమందు పూర్వము

పార్వతీదేవి ఆకులను ఆహారముగా దినుచు అనేక సహస్రదివ్య సంవత్సరముల పర్యంతము తపస్సుచేసెను. ఆ శాకంభరీ తీర్థమందు ఒక దినముండి ఆకులకు భక్షించి ఉపవాసము జేసినవారికి ఆకుల నాహారముగా గొని పండ్రెండు సంవత్సరములు తపమాచరించిన ఫలము కలుగును. స్వర్ణమను పుణ్యతీర్థమందు రుద్రుని బూజించినయెడల కైలాసలోకప్రాప్తి కలుగును. భూమవతి, రథవంతము, దారయని మూడు పుణ్యతీర్థములు కలవు. వానియందు స్నానము జేసినవారికి సకలదుఃఖములు నశించును. గంగాద్వారమను పుణ్యతీర్థమున స్నానముచేసిన మహాత్ములకు నూరుకోట్ల పుణ్యతీర్థములు సేవించిన ఫలితము కలుగును.

సప్తసాగరసంగమము, త్రిసంగమము, శక్రావర్తనము, గగన జలము, గంగాసరస్వతీ సంగమము మొదలగు అనేక పుణ్యతీర్థముల యందు స్నానము చేసినవారికి పుణ్యలోకప్రాప్తి కలుగును. భద్ర కర్ణేశ్వరము, రుద్రపూజ, అరుంధతీశపథము, సింధుప్రభవ, యమునా ప్రభవ, అను తీర్థములను సేవించినవారికి సర్వసిద్ధులు కలుగును. వేదిక, ఋషికుల్యము, కృత్తికామాఘము, విద్యాతీర్థము వేదశిఖ యను అయిదు పుణ్యతీర్థమును కలవు. ఆ అయిదు తీర్థములును జూచినవారికి సకలపాపములు నశించును. బ్రహ్మతీర్థమందు స్నానము చేసినవారికి పద్మవర్ణయానములచేత బ్రహ్మలోకప్రాప్తి కలుగును. నైమిశమను పుణ్యతీర్థమును జూచినమాత్రముననే సకలపాపములు నశించును. ఆ తీర్థమందు ఒక మాసము నివసించినయెడల అంతము లేని పుణ్యఫలము కలుగును. అనేక పుణ్యతీర్థములయందు స్నానమాడిన పుణ్యమంతయు నైమిశతీరమును సేవించుటవలన కలుగుచున్నది. ఒకదినమందు శుచియై ఉపవాసముచేసి ఆనైమిశతీర్థమును సేవించినయెడల అనేకతీర్థములు సేవించిన ఫలముకలుగును. నంది

ద్భవము, ఇందీవరము, గంగాద్వారము, దశాపతి యను పేరుగల తీర్థములయందు స్నానము చేసినవారికి వాజపేయయజ్ఞము చేసిన ఫలితము కలుగును. బాహుద యను తీర్థమందు స్నానము చేసిన యెడల అనేక సత్రయాగములు జేసిన ఫలము కలుగును.

దశరథరాముడు స్వర్గస్థుడైన సరయూనది ప్రవేశమందు గోదానము జేసినయెడల అశ్వమేధయజ్ఞఫలము కలుగును. గోమతి యను తీర్థమందు దేవతలకును ఋషులకును యజ్ఞభూమియైన తీర్థము లనేకములు గలవు. గోమతీతీర్థమందు స్నానము జేసినవారికి అశ్వమేధయజ్ఞఫలము గలుగును. భద్రతీర్థమందు కుమారస్వామిని పూజించినను, కాశీయందు రుద్రుని పూజించినను, కపిలసరస్సునందు స్నానము చేసినను రాజసూయ యజ్ఞఫలమును పొందుదురు. మార్కండేయతీర్థమైన గంగాగోమతీ సంగమమందు స్నానము జేసినను బ్రహ్మచేత కల్పించబడిన యజ్ఞస్తంభమునకు ప్రదక్షిణముగా తిరిగినను వాజపేయ యజ్ఞఫలమును పొందుదురు. గృహస్థులగువారు సంతానమును పొందవలెననియు, పుత్రులను కనవలెననియు కోరుదురు. ఆపుత్రులలో నొకరైనను గయకు వెళ్ళునని తలచుచుందురు. వారిలో నొకరైనను తెల్లని ఆబోతు నెద్దును విడువవలెనని తలచుచుందురు. వారిలో నొకడైనను అశ్వమేధ యజ్ఞమును జేయునని యోచించుచుందురు. అటువంటి గృహస్థులు గయకువెళ్ళి ఒక నెలవరకు నివసించియున్న యెడల మిక్కిలి పుణ్యాత్ములై రెండుపక్షములవారిని వుద్ధరింతురు. (ఒక నెల యనగా రెండు పక్షములు పూర్తిగా నుండవలెను.) ఆ గయయందు పిండము నొసంగినవారు పితృదేవతల దయవలన కృతార్థులగుదురు. గయాతీర్థమునందు ఫాల్గునమందు స్నానముచేసినవారికి పరమసిద్ధితో శుభము గలుగును. యక్షిణీ తీర్థమందు గల జలములను త్రాగినయెడల బ్రహ్మ

హత్యాది మహాపాపములు నశించును. మణినాగమను తీర్థమందు స్నానముజేసినవారికి సర్పభయముకలుగదు. గౌతమ వనమందు గల అహల్యాసరస్సునందు స్నానము చేసినను వుదపానమను తీర్థమందు స్నానమాచరించినను, అశ్వమేధయజ్ఞ ఫలములు గలుగును. రాజర్షియైన జనకతీర్థమందు స్నానముజేసినయెడల విష్ణులోకప్రాప్తి కలుగును. కంపనతీర్థమందైనను మహానది యను తీర్థమందైనను స్నానముజేసినవారు పౌండరీక యజ్ఞఫలమును పొందుదురు. దేవపుష్కరమనియు, మహేశ్వరస్థానద్వార మనియు, మానుషపథమనియు, మూడు పుణ్యతీర్థములు గలవు. ఆ మూటిలో దేనియందు స్నానముజేసినను, అశ్వమేధ యజ్ఞఫలముగలుగును. మహేశ్వర పథమను తీర్థమందు పూర్వము కూర్మరూపుడైన రాక్షసుడు కోటి పుణ్యతీర్థములను అపహరించెను. కోటిపుణ్యతీర్థములను విష్ణుదేవుడు తెచ్చి మహేశ్వరపథమను తీర్థమందు నిలిపెను. ఆ తీర్థమందుగాని, విష్ణుస్థానమైన సాలగ్రామమను తీర్థమందుగాని, స్నానముచేసి విష్ణువును పూజించినను, అచ్చట చేరియుండు చతుస్సముద్రమను బావియందు స్నానముచేసినను విష్ణులోకమును పొందుదురు. భరతాశ్రమమందు గల చంపకారణ్యమందు దేవసహితుడైన యీశ్వరుని పూజించినయెడల మిత్రావరుణలోకమును పొందుదురు. కన్యాసంవేశమను తీర్థమందు కన్యాదానము జేసినయెడల అక్షయఫలమును పొందుదురు. దేవకూటమను తీర్థమందు స్నానము చేసినవారికి బ్రహ్మలోకప్రాప్తి కలుగును.

విశ్వామిత్రుడు సిద్ధిబొందిన కౌశికహ్రదమను తీర్థమందు స్నానము జేసినను కుమారవీరాశ్రమమందు మాసము నివసించినను అశ్వమేధ యజ్ఞఫలమును పొందుదురు. అగ్నిధారయను పుణ్యతీర్థమందు బ్రహ్మదేవుని బాణమువలన పుట్టిన కుమారధారయను తీర్థ

మందు స్నానము జేసి మూడురాత్రులు వుపవాసము చేసినయెడల బ్రహ్మహత్యాది దోషములు నశించును. గౌరీశిఖర కుండమందు స్నానము జేసినను, నందినీరూపమను తీర్థమందు స్నానము జేసినను, అశ్వమేధయజ్ఞ ఫలము గలుగును. కౌశికాసంగమమునందు మూడు రాత్రులు వుపవాసము జేసినయెడల సర్వపాపములు నశించును. ఊర్వశీతీర్థమందు స్నానము చేసినయెడల సర్వవిధములచేతను పూజా యోగ్యులగుదురు. గోకర్ణమను తీర్థమందు స్నానము జేసిన జాతి స్మరత్వమును బొందుదురు. సర్వతీర్థమందు స్నానముచేసి వృషభ ద్వీపమందు కుమారస్వామిని పూజించినయెడల దేవవిమానమును పొందుదురు. నంద, నందాలక, ఖచరతోయము, గంగాసాగర సంగమము అను తీర్థములందు స్నానముచేసిన నూరు అశ్వమేధ యజ్ఞఫలములను బొందుదురు. శోణ, నర్మద, భవతీర్థమందును, బదరీతీర్థమందును స్నానముచేసిన ఆయుష్మంతు లగుదురు.

మహేంద్రతీర్థమందైనను, రామతీర్థమందైనను, మతంగ, కేదారతీర్థమందైనను, వంశగుల్మతీర్థమందైనను. స్నానము జేసిన యెడల అశ్వమేధఫలము గలుగును. శ్రీపర్వతము పరమతీర్థము, అందుగల దేవసరస్సునందు స్నానముజేసినను, శివుని పూజించినను యిష్టసిద్ధి గలిగి అశ్వమేధ యజ్ఞఫలము కలుగును. పూర్వము కృష్ణవేణీతీర్థమందు దేవేంద్రుడు నూరు యజ్ఞములు జేసెను. అందు గల దేవసరస్సున స్నాన మొనరించిన వారి సర్వపాపములు నశించును. పాండ్యపర్వతమందు గల కావేరీతీర్థమందైనను, తుంగభద్రా తీర్థమందైనను, సముద్రతీర్థము, కన్యాతీర్థము లందైనను. స్నానము జేసినవారికి అశ్వమేధ యజ్ఞఫలము గలుగును. గాయత్రీ తీర్థమను స్థానమందు మూడురాత్రులు గాయత్రీజపము చేసినవారికి జన్మదుఃఖములు కలుగవు. పెన్నయను మహానదియందు స్నానము చేసినవారు

నెమళ్ళు, హంసలు గల విమానవాహనములయందు సంచరింతురు. గోదావరినదియందు స్నానము చేయువారు పది యశ్వమేధయాగ ఫలములను బొందుదురు. పయోష్ణి, దండకారణ్యము, శరభంగాశ్రమము, జమదగ్ని మునీంద్రునిచే సేవింపబడిన శూర్పకము సప్త గోదావరి తీర్థములందు స్నానముచేసిన పుణ్యాత్ములు పుణ్యలోక ప్రాప్తిని బొందగలరు భీష్మా! వినుము. పూర్వము రాక్షసుల భయముచేత వేదములు ఓంకారరూపమును ధరించి అణగియుండెను. ఆంగిరసమునీంద్రుడు ఆ వేదముల నుద్ధరించి సారస్వతుడు మొదలగు వారిచేత తుంగకారణ్యమను పుణ్యతీర్థమందు చదివించెను. పూర్వము భృగుమునీంద్రుడు దేవతలచేత నియమింపబడి తుంగకారణ్యమందు అందరికిని గౌరవమును సంపాదించెను. అట్టి తుంగకారణ్యమును జూచినంతనే సకలపాపకర్మములు నశించును. కాపింజరమను పర్వతమందు గల దేవసరస్సున స్నానమాడిన వారికోరికలు ఫలించును. వాహీకమను తీర్థమందు స్నానము జేసిన ధారణాశక్తి గల బుద్ధిమంతులగుదురు.

చిత్రకూటపర్వతమందుగల మందాకినీ తీర్థమును సేవించినను, భద్రస్థానమందు కుమారస్వామిని పూజించి జ్యేష్ఠమాసమందు రుద్రుని పూజించి రామనివాసమందు శృంగిబేరపురములో గంగాస్నానముచేసి శివునిపూజించినను సకలపాపములు నశించును. నూరు యాగముల ఫలితముకంటె ప్రయాగయను తీర్థసేవనమువలన అధిక ఫలము కలుగును. అందుచేతనే దేవతలు మహాయోగులు, సిద్ధసాధ్యులు, నాగేంద్రులు సంతోషముగా ప్రయాగతీర్థమందే సర్వదా నివసించియుందురు. ఆ ప్రయాగతీర్థము బ్రహ్మదేవుని యజ్ఞవేదిక యగును. గనుకనే గంగానదియొడ్డున మూడుఅగ్నికుండములు సర్వదా కనబడుచుండును. గంగా యమునా సంగమమందు వేదములు, యజ్ఞ

ములు మూర్తివంతములై సేవింపుచుండును. అరువదికోట్ల పదివేలు పుణ్యతీర్థములు ఆ గంగా యమునా సంగమమందు చేరియుండును. అందుస్నానము చేసినయెడల రాజసూయ అశ్వమేధ యజ్ఞఫలములను బొందుదురు. సత్యవాదులగుదురు. నాలుగువేదములను చదివినవారై పుణ్యలోకమును బొందుదురు. గంగా యమునా సంగమస్థానమందు భోగవతి. వాసుకి హంసప్రతయను మూడుతీర్థములు గలవు. వానియందు స్నానమాడిన పదిఅశ్వమేధయాగముల ఫలముకలుగును. భీష్మా! శ్రేష్ఠములైన పుణ్యతీర్థములును, వానిని సేవించినందువలన గలుగు ఫలితములను జెప్పితిని. ఈపుణ్యతీర్థ కీర్తనమును వినినను, చదివినను, వ్రాసినను అట్టిపుణ్యాత్ములకు అభివృద్ధి కలుగును. సర్వతీర్థములు సేవించిన మహాపుణ్యము కలుగును. అనేక యజ్ఞములు చేసినఫలము కలుగును. అని పులస్త్య మహామునీంద్రుడు భీష్మునికి వివరించి చెప్పెను. భీష్మా! వ్రతనియమము లేనివారును, ఉపవాసము చేయుటయం దిచ్ఛలేనివారును చెడుబుద్ధిగలవారును, పరిశుద్ధిలేనివారును ఈపుణ్యతీర్థములను సేవింపజాలరు. నీవు మహాగుణవంతుడవు. సకలధర్మజ్ఞుడవు. నీవు సకలపుణ్యతీర్థములను క్రమముగా సేవింపుము. నీకు యిష్టసిద్ధియగును. అని సకలపుణ్యతీర్థములను గురించి పులస్త్యమహాముని భీష్మునికి చెప్పగా, పులస్త్యుని వాక్యప్రకారము భీష్ముడు సకలతీర్థములను సేవించి కృతార్థుడాయెను. అని నారదమునీంద్రుడు ధర్మరాజుతో జెప్పి, ధర్మరాజా! నీవును పుణ్యతీర్థములను సేవించి పూరు, పూరూరవ, భగీరథ. రఘుమహారాజులవలె కృతార్థుడవగుము. భూమినిపరిపాలించి రక్షింపుము. మహాగుణవంతుడవగుము. దేవలోకమునుండి రోమశుడను దేవర్షి యొకడు ఇక్కడకు వచ్చును. అతడు చెప్పినప్రకారము ధౌమ్యుని అనుమతినిబొంది పుణ్యతీర్థములను సేవింపుము. అని యిట్లునారదమునీంద్రుడు ధర్మరాజుతో

చెప్పి వెళ్ళెను. పిమ్మట ధర్మరాజు ధౌమ్యునితో నిట్లనెను. మహాత్మా! అర్జునుడు మాకందరికిని మిక్కిలి ప్రియుడు. మహాభుజబల పరాక్రమవంతుడు. దివ్యబాణములను పొందిరమ్మని అర్జునుని నొకనినే పంపితిని. అర్జునుడు యిక్కడకు రానందున నాకేమియు తోచలేదు. అతడు లేనందున ఈకామ్యకవనము మనోహరముగా తోచుటలేదు. వానకోయిలపక్షులు మేఘముల రాకకు ఎదురుచూచుచున్నట్లు మన మందరము అర్జునుని రాకకు ఎదురు చూచుచున్నాము. అర్జునుడును తాను పూనిన కార్యమును నిర్వహించుకొని వచ్చునేకాని ఊరక రాడు. అవశ్యముగా అర్జునుడు దివ్యాస్త్రములను పొందవచ్చును. అతడు వచ్చుపర్యంతము మనము పుణ్యతీర్థములను సేవించుచుందము అని ధర్మరాజు చెప్పగా ధౌమ్యుడు ధర్మరాజా! తీర్థములను సేవించుటవలన మిక్కిలిమేలు కలుగును గాన మనమట్లనే చేయుదము. అని చెప్పి సకలపుణ్యతీర్థ స్వరూపపద్ధతులను ధర్మరాజుతో క్రమముగా జెప్పుచుండెను.

## రోమశమహాముని ధర్మరాజునొద్దకు వచ్చుట

ఆ సమయమున మహాతేజోవంతుడగు రోమశమహామునీంద్రుడు ధర్మరాజువద్దకు వచ్చెను. ధర్మరాజు సోదరులతోను, విప్రులతోనుగూడినవాడై అధికభక్తిపూర్వకముగా రోమశుడను మహామునీంద్రుని బూజించి యిట్లనెను. మహాత్మా! యిప్పుడు మీరు ఎక్కడినుండి వచ్చితిరో సెలవిండు అని ధర్మరాజు అడుగగా రోమశుడిట్లనెను. ధర్మరాజా! నేను సర్వలోకములయందు తిరుగుచు స్వర్గలోకమునకు వెళ్ళితిని. దేవేంద్రునిచేత పూజింపబడితిని. నీతమ్ముడగు అర్జునుడు దేవేంద్రునితో ఏకసింహాసనమున కూర్చుండియున్నాడు. ఈశ్వరుడు మొదలగు సకలదేవతలును, అర్జునునకు సకల

దివ్యాస్త్రములనుయిచ్చి వరములనిచ్చిరి. అందువలన అతడు కృతార్థుడై యున్నాడు. అటువంటి అర్జునుని నేను జూచితిని. మహాబలవంతులగు భీష్మాదులను యుద్ధమందు అర్జునుడు గెలువగలడు. మరియు కర్ణుడు యుద్ధమందు అర్జునునికి పదారవభాగమునకైనను సమానము కాడు. ఏకసింహాసనమున నీతమ్ముడగు అర్జునుడు దేవేంద్రునితో కూడ కూర్చుండి రెండవదేవేంద్రునివలె ప్రకాశించుచున్నాడు. అతని విలాసమునుచూచి నేనాశ్చర్యమును బొందితిని. దేవేంద్రుడు అర్జునుని ప్రభావమును నాతోజెప్పి మరియు నిట్లనిపలికెను. మునీంద్రా! పాశుపతమను దివ్యాస్త్రము పూర్వము అమృతమందు బుట్టినది. శివునిచేత నాయస్త్రము నీయర్జునుడు బొందెను. యమ, వరుణ, కుబేరాదులచేత అర్జునుడు దివ్యాయుధములను బొందెను. దివ్యపురుషుడగు అర్జునుడు మనుష్యమాత్రుడుగాడు. అన్యులకు సాధ్యముగాని దేవతాకార్యములనీ యర్జునుడుతీర్చి ఆలస్యముచేయక వచ్చునని నీవు భూలోకమునకువెళ్ళి ధర్మరాజుతో చెప్పుమని దేవేంద్రుడు నాతోచెప్పి మరల నిట్లుపలికెను. మునీంద్రా! తీర్థసేవజేసిన వారికిని శాంతచిత్తులకును, తపస్సంపన్నులకును సాధ్యముగాని కార్యము లేదని పెద్దలుజెప్పిరి కాగా, నీవు ధర్మరాజువద్దకువెళ్ళి యాతని పుణ్యతీర్థములను సేవింపజేయుము. ఆతడుచేసెడి యాత్రలకు నీవు సహాయుడుగా నుండుము. అని దేవేంద్రుడు నాతోజెప్పి నన్ను నీదగ్గరకు పంపగా నిచ్చటకు వచ్చితిని. ఈకార్యముచేయుట అర్జునునకు సమ్మతము. అని రోమశుడు ధర్మరాజుతో యిట్లు జెప్పసాగెను. ధర్మజా! పుణ్యతీర్థములను సేవించనివారికిని కపిలగోవును, సువర్ణమును దానము చేయని వారికిని ఘోరతపస్సుచేయనివారికిని ఉభయలోకసౌఖ్యములు కలుగనేరవు. ఈ భూచక్రమందుండు సకలపుణ్యతీర్థములను పూర్వము నేను రెండుమార్లు చూచితిని, ఇప్పుడు దేవేంద్రుడు నియ్య

మించుటచేత నీ వెంబడివచ్చి సకలతీర్థములను మరల సేవించెదను. అని రోమశుడు ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజు రోమశునితో నిట్లనెను. మహాత్మా! దేవేంద్రుడు నన్నుద్దేశించి పుణ్యతీర్థములను సేవించునట్లు నిన్ను నియమించినట్లు నీవు చెప్పితివి గాన నేను కృతార్థుడ నైతిని. అదియునుగాక పుణ్యతీర్థములను సేవించుటకు నిన్ను సహాయునిగా బొందితిని. నీదయవలన సర్వపుణ్యతీర్థములను సేవించి పుణ్యాత్ముడనయ్యెదను. మరియు అర్జునుని కుశలవార్తను నీవలన వింటిని. అందువలన నామనసు పరమానందమును బొందినది. మీరు రాకమునుపు నారద ధౌమ్యులు చెప్పగా పుణ్యతీర్థములను సేవింప వలెనని తలచియున్నాను. ఇప్పుడు నీవలన పుణ్యతీర్థములను సేవించి కృతార్థుడనయ్యెదను. అని ధర్మరాజు రోమశునితో చెప్పి నిశ్చయించెను. రోమశుని వాక్యప్రకారము భిక్షాన్నభోజనులగు బ్రాహ్మణులను యతులను ధర్మరాజు నిలిపెను.

ధర్మరాజు ధౌమ్యుడు మొదలగు కొంతమంది బ్రాహ్మణులను సహాయముగా తీసికొని తానును తన తమ్ములగు భీమాదులును ద్రౌపదీసహితముగా తీర్థయాత్రలకు వెళ్ళుటకు ప్రయత్నించెను. ధర్మరాజు కామ్యకవనమందు మూడుదినములవరకు నివసించియుండి మార్గశీర్షమాసాంతమందు పుణ్యతీర్థములను సేవించుటకు ప్రయాణమాయెను. ఆ సమయమున అంతవరకును నిలిచియున్న బ్రాహ్మణులు ధర్మరాజున కిట్లనిరి. ధర్మరాజా! నీతమ్ములగు భీమార్జున నకులసహదేవులు నలుగురును ధనుర్బాణధరులు. మంచి చరిత్రము గలవారు. నిర్మల కీర్తివంతులు, వారు మమ్ములను రక్షింపుచుందురు. ఈ మహాత్ముడగు రోమశమహామునీంద్రుడు పుణ్యతీర్థములను అన్నిటిని చూపించును. మేమును మీ వెంటవచ్చి వాటిని సేవించెదము. మా పుణ్యవశమువలన నిన్ను వెంబడించివచ్చెదము. ఈ యడవులలో

రాక్షసపిశాచముల భయము మెండుగానుండును. ఆ కారణమున మేము అడవులలో ఒంటరిగా వెళ్ళి పుణ్యతీర్థములను సేవింపజాలము. గాన మేమును మీతోడవచ్చి పుణ్యతీర్థములను సేవించెదము. అని బ్రాహ్మణసమూహములు ధర్మరాజుతో జెప్పగా బ్రాహ్మణులు దన వెంబడివచ్చుటకు ధర్మరాజు సమ్మతించెను.

వేదవ్యాస పర్వత నారదు లను ముగ్గురును మహాత్ములైన పాండవులను చూచుటనిమిత్తము పరమసంతోషముతో వచ్చిరి. పాండవు లామునులను ముగ్గురిని పూజించిరి. మహాతపస్సంపన్నులగు పాండవులను ఆ మునులు ముగ్గురును కరుణించి యిట్లు చెప్పిరి. పాండవులారా! శరీరనియమములు మానుషవ్రతములని చెప్పబడును. మనోబుద్ధిశౌచములు దేవవ్రతము లనబడును. అటువంటి శాంతవ్రతవిశేషములను జరుపుచు సత్యమార్గమందు ప్రవర్తింపుచు పుణ్యతీర్థములను సేవింపుచు మహాభిష, నాభాగ, భరత, భగీరథ ముచికుంద, మాంధాతృ, సగర, సార్వభౌమ, అష్టక, రోమపాదమహారాజులవలె సకల శత్రువులను జయించి సర్వలోకసుఖములను బొందును. అని ఆమునులు ముగ్గురును ధర్మరాజాది పాండవులతో చెప్పి వెళ్ళిరి.

ఓ జనమేజయ మహారాజా! ధర్మరాజు రోమశునితో యిట్లు చెప్పెను. మహాత్మా! రోమశమునీంద్రా! భూమియందు ధర్మహీనులగు కుత్సితపురుషుల కభివృద్ధిగలుగుచున్నది. ధర్మాత్ములగు మనుష్యులకు హీనస్థితిగలుగుచున్నది. అట్లుజరుగరాదు. పర్వత నదీసరస్సులు అచేతన పదార్థములైనను, పుణ్యతీర్థములై జగత్తును పరిశుద్ధము జేయుచున్నవి. అని అట్లు జనులపాపములను బోగొట్టుటకు కారణమేమో తెలియజెప్పుము. అని ధర్మరాజు అడుగగా రోమశుడిట్లని చెప్పెను.

## రోమశుడు ధర్మరాజునకు విశేషములు చెప్పుట

ధర్మరాజా ! ధర్మాత్ములగు వారలకు ప్రారబ్ధకర్మవశమువలన కష్టములు గలిగినను ఆకష్టములు నిలువనేరవు. నిశ్చయముగా కొంత కాలమునకు నశింపగలవు. దుర్మార్గులగు వారికిపూర్వజన్మకర్మవశము వలన యిప్పుడు అభివృద్ధి కలిగియున్నను ఆ యభివృద్ధి స్థిరముగా నిలిచియుండదు. మేముచూచు చుండగా రాక్షసులు, దైత్యదానవులు పూర్వము అభివృద్ధి వంతులైయుండి అధర్మప్రవర్తిచేత అనేక సహస్ర సంఖ్యాకులు చచ్చిరి. దేవతలు ధర్మాత్ములైనందున అభివృద్ధిపొంది శాశ్వతలక్ష్మిని పొందియున్నారు. ధృతరాష్ట్రుని కుమారులగు దుర్యోధనాదులు అందరును అధర్మవంతులై వృద్ధిబొందియున్నను రాక్షసులవలెనే దైవముచేత నశింపబడుదురు. వారు నశించువిధమును జెప్పెదను వినుము. అధర్మవంతులకు గర్వముపుట్టును. గర్వము వలన అభిమాన రూపమైన దురహంకారము గలుగును. దానివలన క్రోధముజనించును. క్రోధమువలన సిగ్గు, సదాచారము నశించును. ఆనాశము కలిగినప్పుడు మనస్సున శాంతియు, లక్ష్మిప్రసన్నముగూడ నిలువవు. మీరు దేవతలతో సమానులు. పుణ్యాత్ములు, గొప్పబుద్ధి మంతులు. మీకు లక్ష్మివిభవములు గలుగును. మీరు యుద్ధభూమి యందు సకలశత్రువులను జయింపగలరు. ధర్మమార్గ ప్రవర్తకులగు దేవతలు, ఋషులు, తీర్థములను ఆశ్రయించిరి. తీర్థములు పరిశుద్ధిని కలిగించుచు, సర్వకామఫలముల నిచ్చుచుండును. కనుక తీర్థములను సేవించుటచేతను, యజ్ఞములు చేయుటచేతను, దానములనుచేయుట చేతను, బ్రాహ్మణుల దీవనలచేతను జనులకు సర్వదుఃఖములు నశించుటయేగాక శ్రేయఃప్రాప్తి కలుగుచున్నది. అని యిట్లు రోమశ మునీంద్రుడు ధర్మరాజుతో జెప్పెను. పాండవులు ఆ రోమశమునివలన మరికొన్ని ధర్మములను వినుచు వెళ్ళి నైమిశము వి అశ్వ

తీర్థము 3 గంగాఘోషము 4 నాగకన్యాతీర్థము 5 గోమతి 6 బాహుద 7 మహానది 8 దేవయజనమైన ప్రయాగ 9 గంగా యమునా సంగమములోనగు తీర్థములయందు స్నానములుజేసిరి. పాండవు లా పుణ్యతీర్థములను సేవించి బ్రాహ్మణులకు గోహిరణ్యా దానములను జేసిరి. పాండవులు ప్రయాగయందు కొన్నిదినములుండి వేదవేత్తలైన బ్రాహ్మణులవలన వేదార్థముల నెరుగుచుండిరి. పాండవులు వేదార్థములను యెరుగుచుపోయి అనేకనదులు పుట్టుటకు కారణస్థానమగు గయపర్వతమును సేవించిరి. రామశరము, బ్రహ్మశరము వైవస్వతతీర్థము యీ మూడుతీర్థములను పాండవులు సేవించిరి. పాండవులు గయయందుఅక్షయపటములో వార్షేయవిధానముచేత చాతుర్మాస్య క్రతువులుచేసి ఋషులవలన పుణ్యకథలు వినుచుండిరి. అసమయమున శమంతుడను మహాముని ధర్మరాజునకు యిట్లనెను.

ధర్మరాజా! పూర్వము ధూర్తరయుడను వానికి గయుడను కుమారుడు కలిగెను. ఆగయుడు రాజర్షి యగును. అతడు యీగయా తీర్థమందును బ్రహ్మశర తీర్థమందును పూర్వము అనేకయజ్ఞములందు సమస్తజనులు అన్నములు భుజించగా మిగిలిన అన్నరాశులు పర్వతములవలెనుండి యిరువదియైదు అంకెలుగల వరుసకుమించిన లెక్కను అతిక్రమించి యుండెను. ఆ యజ్ఞములయందు గయుడు బహువిధ దక్షిణల నిచ్చెను. ఇసుకరేణువుల సంఖ్యనైనను లెక్కింపవచ్చును గాని గయుడొసంగిన దక్షిణలను లెక్కించుటకు సాధ్యముగాదు. అట్టి గయుడను రాజర్షి పేర బరగినదగుటచేత యిదిగయ యనుపుణ్య తీర్థమై ప్రకాశింపుచున్నది. ఈ గయాతీర్థము పితృదేవతలకు హితమునుగలిగించుచుండును. ఇందు పిండప్రదానము చేసినయెడల యిష్టసిద్ధియగును. అని శమంతమునీంద్రుడు ధర్మరాజుతో జెప్పెను. పాండవులు శమంతమునివలన గయాతీర్థమహాత్మ్యమును విని అగస్త్యాశ్రమ

మునకు వెళ్ళిరి. అంతట ధర్మరాజు రోమశమునీంద్రునకు యిట్లు చెప్పెను. మహాత్మా! రోమశమునీంద్రా! అగస్త్యమునీంద్రుడు వాతాపియను రాక్షసుని యెట్లుచంపెనో చెప్పుము. ఆ యగస్త్యుడు మహాతేజోధికుడందురు. ఆ మునీంద్రుని చరిత్రమును వినుటయందు నాకు కోరికగలదు. ఈ యగస్త్యాశ్రమమందు అగస్త్యుని చరిత్రము వినవలెను గాన జెప్పుము. అని యిట్లు ధర్మరాజు అడుగగా రోమశుడు ప్రీతిపూర్వకముగా యిట్లనెను.

ధర్మరాజా! పూర్వము ఇల్వలుడనియు వాతాపియనియు యిరువురు రాక్షసులు మహాబలవంతులై యుండిరి. ఆయిల్వల వాతాపులిద్దరును మణిమతీపట్టణమందుండిరి. ఆయిద్దరు రాక్షసులును అన్నదమ్ములు. వారిద్దరిలో ఇల్వలుడు పెద్దవాడు. ఆయిల్వలుడు పూర్వము ఒక బ్రాహ్మణుని మిక్కిలి భక్తితో పూజించి యిట్లు అనెను. మహాత్మా! బ్రాహ్మణోత్తమా! నాకు సకలసిద్ధికరమైన ఒకమంత్రముపదేశింపుము. నాయందు కరుణింపుము. అని యిట్లు ఇల్వలుడు బ్రాహ్మణుని ప్రార్థించెను. వానిప్రార్థనను బ్రాహ్మణుడు అంగీకరింపక వానికిమంత్రోపదేశముచేయలేదు. అందుకు ఇల్వలుడు కోపించుకొనివెళ్ళెను. వానితమ్ముడగు వాతాపి కామరూపమును ధరించుటకు శక్తివంతుడగును. ఇల్వలుడు అవాతాపిని మేకరూపముగాజేసి ఆమేకనుచంపి ఆ మాంసమును చక్కగా వండించి ఆ మాంసము నా బ్రాహ్మణునకు భోజనముపెట్టించెను. ఆ బ్రాహ్మణు డామాంసమును భక్షించెను. బ్రాహ్మణుని కడుపులో మాంసరూపముగ నుండు వాతాపినిరమ్మని ఇల్వలుడు పిలిచెను. ఇల్వలుడు పిలిచిన వెంటనే వాతాపి ఎప్పటివలె ప్రాణములుగలవాడై బ్రాహ్మణుని కడుపును భేదించుకొని వెలుపటికివచ్చెను. అట్లు వెలుపలికి వచ్చినతోడనే బ్రాహ్మణుడు మృతినందెను. అంతట ఇల్వలుడు తనవద్దకువచ్చు

బ్రాహ్మణులనందరిని యీరీతిగా చంపుచుండెను. అంతట వాతాపి అగస్త్యునిచేత చచ్చినక్రమమును జెప్పెద వినుము.

ధర్మరాజా! అగస్త్య మునీంద్రుడు బ్రహ్మచర్యాశ్రమమందుండి బహుకాలమువరకు ఘోరతపస్సుచేయుచుండెను. అగస్త్యుడు తపస్సు చేయుచు తన వనమందు తిరుగుచుండెను. అక్కడ ఒక చోట ఒక సరస్సునకు దగ్గర అగస్త్యుని పితరులు తలక్రిందుగా వ్రేలాడు చుండిరి. ఆ పితరులను అగస్త్యుడుచూచి ఆ ప్రకారము మీరుండుటకు కారణమేమని యడిగెను. ఆ పితరు లిట్లనిరి. అగస్త్యుడా! మేము నీ పితరులము. నీవు బ్రహ్మచారివై అధికనిష్ఠతో తపమాచరించుచుంటివి. నీవు సంతానమును పొందుటకు అపేక్షింపకుంటివి. అందువలన మాకు ఊర్ధ్వగతిలేదు. ఇకనైనను నీవు వివాహము చేసికొని సంతానమును పొందిన యెడల మాకు పుణ్యగతి గలుగును. అని అగస్త్యునికి పితరులు చెప్పగా అట్లుచేయుదునని అగస్త్యుడు చెప్పెను.

విదర్భ రాజు పుత్రసంతానమును కోరుచుండెను. అగస్త్యుని తపశ్శక్తివలన విదర్భరాజునకు ఒక కూతురు కలిగెను. ఆ కూతురునకు లోపాముద్రయను పేరుగలదు. జలములయందు కమలమువలెను, నీతివంతులయందు లక్ష్మివలెను, శ్రద్ధగలవానియందు విద్యవలెను, లోపాముద్ర పెరిగి యౌవనమును ధరించి నూరుకన్యకలచేత సేవింపబడుచుండెను. రాజశ్రేష్ఠులందరును మన్మథబాధితులైనారు అగస్త్యుని భయముచే లోపాముద్రను వరింపకుండిరి. ఆ విదర్భరాజు, ఆ లోపాముద్రకు తగిన వరుని విచారింపుచుండెను. ధర్మరాజా! అంతట అగస్త్య మునీంద్రుడు విదర్భరాజు వద్దకు వచ్చి లోపాముద్రను తన

కిమ్మని యడిగెను. విదర్భరాజు తనమనస్సులో యిట్లని తలచి దుఃఖించెను. దైవమా! యీ యగస్త్యుడను బ్రాహ్మణుడు నారవస్త్రములను కట్టుకొని, కూరగాయలను భక్షించుచు ఘోరారణ్యమందు తపస్సు చేయుచు శుష్కించియున్నాడు. ఈతడు నాకూతును వివాహమాడి నా మెచేతకూడ నారచీరలను ధరింపజేసి కూరగాయలను దినిపించి ఘోరారణ్యమందు ఘోరతపస్సుకు బంపును. ఇందుకు సంశయముండ నేరదు. నాకూతురగు లోపాముద్ర సకలభోగములను అనుభవింప వలసియున్నది. అటువంటి నాకూతురును యెరింగియుండియు యీ బ్రాహ్మణునకు యెట్లు యిచ్చి పెండ్లి చేయగలుగుదును? ఈ విప్రునకు లోపాముద్రను యీయనియెడల అగస్త్యుడు నాకు శాపమిచ్చును, గానిసహించి యూరకుండు వాడు కాడు. ఇందులకిప్పుడు నేనేమి చేయవలెనో తెలియకున్నది. అని యీరీతిగా విదర్భరాజు, యాతని భార్యయు యోచించి దుఃఖించుచుండిరి. ఆ సమయమున లోపాముద్ర తలిదండ్రుల వద్దకువచ్చెను. మరియు నిట్లుపలికెను. తలిదండ్రులారా! మీరువిచారింపవలదు. అగస్త్యమహామునీంద్రునకు నన్ను ప్రీతిపూర్వకముగా యిచ్చి పెండ్లిగావింపుడు. ఇందులకు మీరు యోచింపవలదు అని లోపాముద్ర తలిదండ్రులకు ధైర్యమును బోధించెను, అందులకు లోపాముద్ర తలిదండ్రులగు విదర్భరాజు, భార్యయు మిక్కిలి సంతోషించి విధిపూర్వకముగా లోపాముద్రను అగస్త్యునకిచ్చి పెండ్లిగావించిరి.

## అగస్త్యుడు లోపాముద్రను వివాహమగుట

అంతట అగస్త్యమహాముని లోపాముద్రను పరిగ్రహించి ఆమెయొక్క [illegible] తొలగింపజేసి కృష్ణాజినములను ధరింపజేసెను. పిమ్మట అగస్త్యుడు లోపాముద్రను తీసికొని

పోయి గంగాద్వారమందు తపస్సుచేయుచుండెను. ఒకానొక దిన మందు అగస్త్యుడు లోపాముద్రను జూచి మన్మథవికారముగలవాడై యామెతో రమింపదలచెను. లోపాముద్ర యగస్త్యుని యభిప్రాయ మెరిగి సిగ్గుగలదై రెండుచేతులను జోడించికొని వినయపూర్వక ముగా నిట్లనెను. ప్రాణేశ్వరా! సంతానముకొరకు భార్యాభర్తలు కలియుట లోకప్రసిద్ధమైయున్నది. అయినను నాకు భూషణాలంకార ములు దయచేసి నన్ను కరుణించి యానందవతిగాజేసి నాతో రమిం పుట న్యాయసిద్ధము. నీవును గంధపుష్ప వస్త్రభూషణములచేత నలం కరించుకొని నాయొక్క యీ ఋతుదినములయందు నాతో తనివి దీర రమించి సుఖించి నాకు పుత్రసంతానమును కలిగింపుము. అని లోపాముద్ర యగస్త్యునితో జెప్పెను. అంతట అగస్త్యుడు యిట్లు పలికెను.

లోపాముద్రా ! నాకు తపోధన మున్నదేగాని మరియొక ధనములేదు. నీవు కోరిన రీతినెట్లు చేయగలను ? తపస్సువలన సర్వ మును పొందవచ్చును. అయినను తపస్సును వ్యయమొనర్చుటకు సమ్మతింపను. అని అగస్త్యుడు లోపాముద్రతో జెప్పి ధనాపేక్షచేత శ్రుతపర్వుడను రాజుదగ్గరకు బోయి వానివలన పూజలనంది యిట్లు పలికెను. ఓ శ్రుత పర్వ మహారాజా ! నేను ధనాపేక్షచేత నీ కడకు వచ్చితిని. నీవు పోషించు జనులకు విఘ్నము గాకుండునట్లు ధనము మిగిలియున్న యెడల నాకు యిమ్ము. అని అగస్త్యుడడుగగా శ్రుత పర్వరాజు యిట్లనెను. మహాత్మా! అగస్త్యమునీంద్రా! నాకు ఆదాయ వ్యయములు సమముగా నున్నవి. గనుక నాకుగల వ్యయ ముకంటె అధికమగు ధనము నాదగ్గిర లేదు. అని శ్రుతపర్వుడు అగ స్త్యునితో జెప్పెను. అంతట శ్రుతపర్వ అగస్త్యోద్దరును బృహదశ్వు డను రాజుదగ్గరకు వెళ్ళిరి. బృహదశ్వరాజు వారిద్దరిని పరమభక్తితో

పూజించెను. వచ్చినకార్యమేమని యడిగెను, అప్పుడు అగస్త్యశ్రుత పర్వులిద్దరును తామువచ్చిన కార్యమును బృహదశ్వునకు తెలిపిరి. బృహదశ్వునకును ఆదాయవ్యయములు సమముగానున్నట్లు తెలిసికొనిరి. అగస్త్యుడు ఆ శ్రుతపర్వ బృహదశ్వ రాజులనిద్దరను వెంటబెట్టుకొని ప్రాదశ్యుడను రాజుదగ్గరకు వెళ్ళెను. ప్రాదశ్యుడు భక్తిపూర్వకముగా వారిముగ్గురిని పూజించి వారువచ్చిన కార్యమును యెరిగి తనకును ఆదాయవ్యయములు సమముగానే యున్నవనిజెప్పి అగస్త్యునకుయిట్లనిచెప్పెను. మహాత్మా! అగస్త్యమునీంద్రా! రమణీమతీ పట్టణమందు ఇల్వలుడనియు, వాతాపియనియు, ఇద్దరురాక్షసులు గలరు. వారిద్దరును అన్నదమ్ములు, ఆ యిల్వలుడు పెద్దవాడు. ఆ యిల్వలునివద్ద మిక్కిలి అధికముగు ధనముకలదు. లోకమందుగల సకలరాజులకంటె ఆయిల్వలుడే అధికధనవంతుడై యున్నాడు. ఆ యిల్వలుడు మనకు ధనమిచ్చుటకు దగిన సమర్థుడు. అని యీరీతిగా ప్రాదశ్యరాజు అగస్త్యునితోజెప్పి ఆరాజర్షులు ముగ్గురును అగస్త్యుని వెంటబెట్టుకొని ఇల్వలుని దగ్గరకు బోయిరి. అప్పుడు ఇల్వలుడు వారినందరను శాస్త్రవిధిప్రకారము పూజించి వాతాపినిమేకనుగా జేసి యెప్పటివలె మాంసమును వండి అగస్త్యునికి భోజనముగా సమర్పించెను. ఆవిషయమును శ్రుతపర్వ బృహదశ్వ ప్రాదశ్యులను రాజర్షులు ముగ్గురును యెరింగి అగస్త్యునకు నమస్కరించి యిట్లు పల్కిరి. మహాత్మా! అగస్త్యమహామునీంద్రా! యీ ఇల్వలుని తమ్ముడగు వాతాపి మేకరూపమును ధరించి యుండును. ఆ మేకను ఇల్వలుడు చంపి వండించి బ్రాహ్మణులకు భోజనము పెట్టించును. ఆ మాంసమును బ్రాహ్మణులు తినినంతనే వారి కడుపులను భేదించుకొని వాతాపి జీవముతో బ్రతికి బయటికివచ్చును. యీరీతిగా వాతాపి అనేకమంది బ్రాహ్మణులను చంపియున్నాడు. గాన మన మీ

యిల్వలుని గృహమందు భోజనము చేయవద్దు. వీడు మనకు ధనమిచ్చిన యెడల వెంటనే తీసికొని వెళ్ళుదము. అని రాజర్షులు ముగ్గురును భోజనము చేయకమునుపే అగస్త్యునితో జెప్పిరి. వారిమాటలకు అగస్త్యుడు భయపడక ఆమాంససహిత అన్నమును కంఠపర్యంతము కడుపునిండా భోజనము చేసెను. పిమ్మట ఇల్వలుడు ఎప్పటివలెనే అగస్త్యుని కడుపులోనుండు వాతాపిని రమ్మని పిలిచెను. ఆసంగతిని అగస్త్యుడెరిగి తనకడుపు నిమురుకొనుచు జేవ్ అని పెద్దగా త్రేచెను. ఆక్షణమందే అగస్త్యునికడుపులోనుండు వాతాపిరాక్షసుడు జీర్ణమయ్యెను. అంతట అగస్త్యునిశక్తికి ఇల్వలుడు భయపడి విచారమగు మనస్సుగలవాడైనను సంతోషముగల ముఖముతో తన వంచనవిషయము ప్రకటనకురాకుండ నటించెను. ఇల్వలుడు అగస్త్యునకు సాగిలపడి నమస్కరించి వాడు వచ్చిన కారణమేమని యడిగెను. అగస్త్యమునీంద్రుడు ఇల్వలునితో యిట్లనెను. ఇల్వలా! నేను యీ ముగ్గురు రాజులతోడను ధనాపేక్షచేత నీదగ్గరకు వచ్చితిని. నీవు ధనవంతుడవని విని యున్నాను. అని అగస్త్యుడు చెప్పగా ఇల్వలుడువిని యిట్లనెను. అగస్త్యమునీంద్రా! మహాత్మా! మీకు ధనముకావలసిన యెడల, వలయునంత ధనము నిచ్చెదను. చెప్పుడు అని యిల్వలుడు చెప్పగా అగస్త్యుడు యిట్లుచెప్పెను. ఇల్వలా! ఈరాజులు ముగ్గురికిని ఒక్కొక్కనికి పదివేలగోవులను, పదివేల వరహాలను, యిమ్ము. నాకు యిరువదివేల వరహాలనిమ్ము. బంగారుమయమైన ఒకరథమును నాకిమ్ము. అని అగస్త్యమునీంద్రుడు ఇల్వలునితో చెప్పెను. ఇల్వలుడు ఆరాజులు ముగ్గురికిని ఒక్కొక్కనికి పదివేల గోవులను, పదివేల వరహాలను యిచ్చెను. అగస్త్యునకు ఇరువదివేల వరహాల నిచ్చెను. ఒకబంగారు మయమైన రథమునిచ్చెను. ఆ రథమునకు విరాజ, ఉపరాజులను గుఱ్ఱములు పూన్చబడి యుండెను. ఆరథము

మీద ఆ రాజులు ముగ్గురును అగస్త్యుడును కూర్చుండిరి. ఆగుఱ్ఱములు రథమును లాగుకొనిపోయి పరుగెత్తి అగస్త్యాశ్రమమునకు చేరెను. ఇల్వలుడిచ్చిన సకలగోవులును, ఆరాజుల సైన్యములును ఇల్వలుడిచ్చిన బంగారమును, ఆరథము వెంటనే అగస్త్యాశ్రమమునకు చేరెను. అంతట శ్రుతపర్వ బృహదశ్వ త్రాదశ్యులను రాజర్షులు ముగ్గురును అగస్త్యుని అనుమతినిబొంది తమతమ పట్టణములకు వెళ్ళిరి. అంతట అగస్త్యుడు లోపాముద్ర యిష్టప్రకారము సమస్త భూషణములచేతను ఆమెను అలంకరించెను. తానును అలంకరింప బడెను. అగస్త్యుడు లోపాముద్రతో నిట్లని పలికెను.

లోపాముద్రా! పదిమంది పుత్రులతో సమాన బలవంతులగు నూర్గురు పుత్రులు నీకు కావలెనేమో చెప్పుము. నీకు నూర్గురు పుత్రులతో సమాన బలవంతులగు పదిమంది పుత్రులు కావలెనేమో చెప్పుము. వేయిమంది పుత్రులు కావలెనేమో చెప్పుము. వేయిమంది పుత్రులతో సమానుడగు పుత్రు డొక్కడే చాలునేమో చెప్పుము. నీకు ఎంతమంది పుత్రులు కావలసియున్నను పుట్టించెదను. చెప్పుము. అని యీరీతిగా అగస్త్యుడు తనభార్యయగు లోపాముద్రను అడిగెను. అంతట లోపాముద్ర అగస్త్యునితో యిట్లనెను.

ప్రాణానాథా! అగస్త్యా! వేయిమందితో సమాన బలవంతుడగు ఒక్కపుత్రుడే నాకు చాలును. గుణహీనులగు వేయిమంది పుత్రులు కలిగినందువలన నాకు ప్రయోజనములేదు. అని లోపాముద్ర అగస్త్యునితో చెప్పెను. అగస్త్యుడు లోపాముద్రతో నీవు కోరిన ప్రకారము నీకు పుత్రుడుకలుగునని చెప్పి ఆమెకు గర్భాధానము చేసెను. పిమ్మట అగస్త్యుడు తపోవనమునకు పోయెను. లోపాముద్రయు సదేండ్లు పర్యంతము గర్భమును ధరించియుండెను. పిమ్మట లోపాముద్రకు దృఢస్యుడను పుత్రుడు పుట్టెను. ఆ దృఢస్యుడు

వేదములను రహస్యముగా జపముచేయుచు సూర్యునితో సమాన తేజోవంతుడై పుట్టెను. ఆదృశ్యునకు తేజస్వియను ఋషిపుట్టెను. అతడు అపరిమితమైన సమిధల బరువును మోయుటచే ఇధ్మవాహు డని చెప్పబడెను. అని రోమశ మునీంద్రుడు ధర్మరాజుతో చెప్పెను. మరియు ధర్మరాజా! యీరీతిగా అగస్త్య మహాముని పుత్రపౌత్ర వంతుడై తన పితరులకు పుణ్యలోకమును గలిగించెను. అని రోమ శుడు ధర్మరాజుతో జెప్పెను. అని వైశంపాయన మునీంద్రుడు జనమేజయ మహారాజుతో జెప్పెను.

ఇది శ్రీమహాభారతమందు అరణ్యపర్వమందు
ద్వి తీ యా శ్వా స ము.

---

## తృ తీ యా శ్వా స ము

ఓ దేవా! హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయు నకు యిట్లు పలికెను. జనమేజయా! రోమశమునీంద్రుడు అగస్త్యుని చరిత్రమును ధర్మరాజునకు జెప్పగా యింకను వారి చరిత్రమును జెప్పుమని ధర్మరాజు రోమసుని యడిగెను. రోమశుడు ధర్మరాజు నకు యిట్లు చెప్పసాగెను. ధర్మరాజా! కృతయుగమందు కాలకేయు లను రాక్షసులుండిరి. వారితో గూడి వృత్రాసురుడును జేరి గర్వించి దేవేంద్రాది దేవతలను బాధించుచుండెను. ఆ వృత్రాసురునకు దేవతలందరును భయపడి బ్రహ్మదేవుని దగ్గరకుబోయి యిట్లని ప్రార్థించిరి. ఓ మహాత్మా! బ్రహ్మదేవా! వృత్రాసురుడు మమ్ముల నందరను బాధింపుచున్నాడు. వానిజంపు నుపాయమును మూకాన

తిమ్ము. అని దేవతలు బ్రహ్మదేవునితో జెప్పి ప్రార్థించిరి. బ్రహ్మ దేవుడు యోచించి దేవతలకు యిట్లనెను. ఓ దేవతలారా! దధీచి యను మునీంద్రుడు సరస్వతీ తీరమున తపస్సును చేయుచున్నాడు. ఆతని దగ్గరకు మీరువెళ్ళి అతనిని ప్రార్థించి ఆ దధీచి దేహమందు గల యెముకలను మీరు తీసుకొనుడు, ఆ యెముకలు వజ్రాయుధము వలెదివ్యాయుధములై సకలరాక్షసులను జయించును. వానిలో వజ్రా యుధముచేత దేవేంద్రుడు వృత్రాసురుని సంహరించును. అని బ్రహ్మదేవుడు చెప్పెను. దేవతలందరును బ్రహ్మదేవుని యాజ్ఞా ప్రకారము దధీచి దగ్గరకుబోయి నమస్కరించి యిట్లనిరి. మహాత్మా! దేవతలందరును దేవేంద్రుని ముందుంచుకుని నీ దగ్గరకువచ్చి యున్నారు. నీ దేహమందుగల యెముకలను దేవతలకు యిచ్చిన యెడల వారికి మేలుకలుగును. నీకు మహాకీర్తి కలుగును. అని దేవతలందరును దధీచిని ప్రార్థించిరి. వారి మాటలను విని దధీచి సంతోషించి కృతార్థుడనైతినని తలచి దేవతలకు మేలుచేయ దలంచి ప్రాణములను విడిచెను. అంతట దేవతలందరును దధీచి యొక్క పెద్దవెన్నెముకను తీసికొని విశ్వకర్మ వేయి యంచులుగల వజ్రాయుధమును జేసెను. దానికి అగ్నిజ్వాలలతో నిండిన నాలు కలు గలవు. అట్టివజ్రాయుధమును విశ్వకర్మచేసి దేవేంద్రున కిచ్చుచు యిట్లుచెప్పెను. మహాత్మా! దేవేంద్రా! యీ వజ్రాయుధముచేత నీవు సకలరాక్షసులను జయింపుము అని చెప్పి విశ్వకర్మ వజ్రాయు ధమును దేవేంద్రునకిచ్చెను. దేవేంద్రుడు ఘోరయుద్ధము నొనరించి యీ వజ్రాయుధముచేత వృత్రాసురుని జంపెను. దేవేంద్రు డట్లు వృత్రాసురుని జంపినపిమ్మట కాలకేయాది రాక్షసులందరును దేవతలతో యుద్ధముచేయజాలక సముద్రజలములలోనికి పోయి దాగి యుండిరి. వారు పగలంతయు సముద్రములో దాగియుండి రాత్రి

కాలమందు వెలుపలికివచ్చి భూమియందుగల జనులను బాధింపు చుండిరి అట్లుచేయుచు కాలకేయాది రాక్షసులు తమలో తామిట్లను కొనిరి.

రాక్షసులారా! బ్రాహ్మణులు జ్ఞానతపోవంతులై ధర్మచరిత్రులై యుందురు. బ్రాహ్మణుల కారణమువలన జగత్తులు అపాయములేకయుండును. లోకములు సుఖముగానుండును. గాన అట్టి బ్రాహ్మణులను వెదకిచంపుదము. చంపినయెడల జగత్తునకు అపాయము కలుగును. అని రాక్షసులు తమలో తాము చెప్పుకొని వసిష్ఠాశ్రమమందు నూటతొంబదియేడుమంది బ్రాహ్మణులను చంపిరి. చ్యవనముని యాశ్రమమందు నూరుమంది బ్రాహ్మణులను చంపి భక్షించిరి. భరద్వాజముని యాశ్రమమందు యిరువదిమంది బ్రాహ్మణులను చంపిరి. యీరీతిగా అనేకమంది బ్రాహ్మణులను భక్షించిరి. ఇట్లు కాలకేయులు ప్రతినిత్యము మునులయాశ్రమములకుబోయి, బ్రాహ్మణులను దినుచు వారితపమునకు భంగముగలిగింపుచు, వారికిని, వారియాశ్రమములకును భంగముగలిగింపుచుండిరి. అంతట వారిదుష్టకార్యములకు భయపడి భూమియందలి జనులు యజ్ఞాది పుణ్యకర్మలు చేయకుండిరి. యజ్ఞాది పుణ్యకర్మలు లేనందు వలన దేవేంద్ర యమ వరుణ కుబేరాది దేవతలందరును యాగమువలన దమకుగలుగబోవు హవిర్భాగములను గోల్పోయిరి. అందువలన వారందరును భయపడి దేవేంద్రుని ముందు పెట్టుకొని వైకుంఠమునకు బోయిరి.

## దేవతలు వైకుంఠమునకుబోయి విష్ణునిస్తుతించుట

ధర్మరాజా! దేవతలందరును వైకుంఠమునకుబోయి విష్ణుదేవునకు భక్తిపూర్వకముగా నమస్కరించి యిట్లని స్తుతించిరి.

"మహానుభావా! నీవువరాహరూపమునుధరించి భూమినియెత్తితివి. నరసింహరూపమును ధరించి హిరణ్యకశిపుని జంపితివి. వామన మూర్తివై బలిచక్రవర్తిని త్రొక్కితివి. యజ్ఞమూర్తివైయజ్ఞములకు విఘ్నముకలిగించు యజ్ఞఘ్నుడనురాక్షసుని జంపితివి. నీవు అండజ, జరాయుజ, స్వేదజ, ఉద్భిజములను నాలుగువిధములగు భూతసమూహములను రక్షించుచున్న జగద్రక్షకుడవు. కనుక మేమందరము నీకు విన్నపమును జేసికొనెదము మావిన్నపమును చిత్తగింపుము. కాలకేయులనురాక్షసులు జగత్తులకు ఉపద్రవము చేయుచున్నారు. వారుగొప్పదేహముగలవారు. పగటియందు సముద్రజలమందు దాగి యుందురు. రాత్రియందు భూమిమీదకువచ్చి చెలరేగి మునీశ్వరుల ఆశ్రమములకువెళ్ళి బ్రాహ్మణోత్తములను ప్రతినిత్యము చంపుచున్నారు. ఇదివరకు యేయుగమందైనను యెంత పాపాత్ములైనను పనిబూని బ్రాహ్మణులను హింసింపలేదు. వీరు బ్రాహ్మణులను హింసింపుచున్నారు. సాధువులగు బ్రాహ్మణులకు బాధగలిగినప్పుడు సకలభూలోకమునకు బాధగలుగును. భూలోకమునకు గలిగినబాధ సకలలోకములను బాధించును. అదియెట్లనగా విన్నవించెదము చిత్తగింపుము. బ్రాహ్మణులు వేదములను ధరియించి, వేదోక్తములగు పుణ్యకర్మములనుచేయుచు చేయింపుచుందురు. అట్టిహవ్యకవ్యములచేత దేవతలును పితృదేవతలును తృప్తిబొందుదురు. అందువలన సర్వలోకములకు సుఖముచేకూరును. గాన నీవు బ్రాహ్మణులకు గల ఉపద్రవమును తొలగించి లోకములను రక్షింపుము అని దేవతలు ప్రార్థించగా విష్ణుమూర్తి వారికిట్లనిచెప్పెను.

'దేవతలారా! కాలకేయరాక్షసులు యమునితో సమానులు, గొప్పదేహము కలవారు. మహాసముద్రమందుండువారు. మహాబలపరాక్రమవంతులు. సముద్రములో జలముపూర్తిగా లేకున్న

యెడల ఆకాలకేయులను జంపవచ్చును. వేరువిధమునవారిని జంపుట సాధ్యముగాదు. మిత్రావరుణుని పుత్రుడగు అగస్త్యుడు మహాతపస్సంపన్నుడును, బలవంతుడుకూడనగును. ఆయగస్త్య మునీంద్రుడు తనతపోబలశక్తివలన సముద్రమందుగల జలములను త్రాగుటకు సమర్థుడగును. గనుక మీరందరును ఆయగస్త్యుని దగ్గరకు వెళ్ళుడు. ఆమహాత్ముని ప్రార్థింపుడు. అని భగవంతుడు దేవతలతో జెప్పెను. అప్పుడు దేవేంద్రాది దేవతలందరును అగస్త్యునివద్దకుపోయి వానిని స్తుతించి యిట్లు ప్రార్థించిరి.

మహాత్మా! అగస్త్యమునీంద్రా! ఇప్పుడు జగత్తునకు కీడు కలుగుచున్నది. నీవుఆకీడును పోగొట్టినయెడల సకలదేవతలకును మేలు చేసినవాడవగుదువు. పూర్వము వింధ్యపర్వతము లోకమునకు కీడు గలిగింపగా ఆకీడును నీవే పోగొట్టితివి. అని యిట్లు దేవతలందరును అగస్త్యుని స్తుతించిరని రోమశుడు ధర్మరాజుతో జెప్పగా ధర్మరాజు రోమశునకు యిట్లనెను మహాత్మా! రోమశమునీంద్రా! ఏమికారణమువలన వింధ్యపర్వతము పెరిగెనో చెప్పుము. ఆవింధ్యపర్వతము పెరుగకుండునట్లుగా అగస్త్యుడేవిధముగా నివారించెనో చెప్పుము అని ధర్మరాజు అడుగగా రోమశుడిట్లు చెప్పెను.

ధర్మరాజా! సూర్యుడు మేరుపర్వతమునకు ప్రదక్షిణముగా చుట్టును తిరుగుచుండెను. అట్టుతిరుగుచున్నందున వింధ్యపర్వతము మిక్కిలికోపించుకొని సూర్యునితో యిట్లుపలికెను. సూర్యుడా! నీవు మేరుపర్వతముచుట్టును తిరుగుచున్నావు. గాని నాచుట్టును ప్రదక్షిణముగా తిరుగుటకు మరచితివి. అందులకు కారణమేమో తెలియకున్నది. నన్ను నీవు సేవించుటకు బదులుగా ఆమేరువును సేవించుటకు గలకారణమేమి అని వింధ్యపర్వతము గర్వించి సూర్యుని యడుగగా సూర్యుడిట్లుపలికెను, వింధ్యపర్వతమా! దైవాధీనమువలన

సర్వదా నేను మేరుపర్వతమునకు ప్రదక్షిణముగా తిరుగుచున్నాను. నీయిష్టప్రకారము నీచుట్టునుతిరుగుటకు వలనుపడదు. అని సూర్యుడు వింధ్యపర్వతముతో చెప్పెను. ఆమాటలకు వింధ్యపర్వతము కోపించి ఆకసమువరకు పెరిగెను. అట్లుపెరుగుటచేత సూర్యచంద్రనక్షత్రాదులు సంచరించుటకు అవకాశము లేకపోయెను. అప్పుడు సూర్యచంద్రులకు గమనములులేక యుండెను. పగలనియు రాత్రియనియు, తెలియుటకు వీలులేక, సకల దేవఋషులును భ్రమించి చీకటియందుండిరి. లోకములన్నియు గ్రుడ్డివై గాఢాంధకారములో మునిగినట్లుండెను. వింధ్య పర్వతము మేరువునందుగల యీర్ష్యచేత పెరిగి రెండవ మేరుపర్వతమువలె నుండెను. దేవేంద్రాది దేవతలందరును వింధ్యపర్వతము దగ్గరకు వచ్చి దానిపెరుగుదలను నివారింపజాలక అగస్త్యుని దగ్గరకు వెళ్ళి యిట్లనిరి.

మహాత్మా! అగస్త్యమునీంద్రా! వింధ్యపర్వతము పెరిగి ఆకాశమందు మిక్కిలి అధికముగా వ్యాపించియున్నది. అందుచేత సూర్య చంద్ర నక్షత్రాదులు గతులుతప్పినవి. లోకవ్యవహారము తప్పిపోయెను. నీవు కరుణించి సూర్య చంద్ర నక్షత్రాది గతులు తప్పిపోకుండునట్లు చేయుము. అని దేవతలు అగస్త్యుని ప్రార్థించిరి. అంతట అగస్త్యమునీంద్రుడు తన భార్యయగు లోపాముద్రను దీసికొని వింధ్యపర్వత సమీపమునకు వచ్చెను. అప్పుడా వింధ్యపర్వతముతో యిట్లనెను. వింధ్యపర్వతమా! నేను దక్షిణమునకు వెళ్ళుచున్నాను. నాకు మార్గమిమ్ము. అని అగస్త్యుడు వింధ్యపర్వతముతో జెప్పెను. వింధ్యపర్వతము వినయపూర్వకముగా అట్లే చేయుదునని చెప్పి అగస్త్యుని విజయము చేయుమని భూమితో సమముగా అణగి యుండెను. అంతట అగస్త్యుడావింధ్య పర్వతముతో నిట్లనెను.

వింధ్యపర్వతమా! నేను మరల ఉత్తరదిక్కునకు వెళ్లు పర్యంతము నీవు యీ ప్రకారముగానే అణగియుండుము. నాతోడ స్నేహముచేయుము అని అగస్త్యమునీంద్రుడు వింధ్యపర్వతముతో జెప్పెను. మరియు నందులకు దానిని సమ్మతింపజేసి దక్షిణదిక్కునకు వెళ్లెను. అట్లు వెళ్ళిన అగస్త్యమునీంద్రుడు లోకములకు మేలుకలిగించు నిమిత్తము ఆదక్షిణ దిక్కునందే యిప్పటికి వసించియున్నాడు. ఆవింధ్యపర్వతము అగస్త్యుడు మరలివచ్చువరకు అట్లనే పెరుగుటకు భయపడి పడియుండెను. అని రోమశ మునీంద్రుడు అగస్త్యుని మహాత్మ్యము ధర్మరాజునకు జెప్పి మరల యిట్లుపలికెను. ధర్మరాజా! అట్లు దేవతలందరును విష్ణుదేవుని వాక్య ప్రకారము వచ్చి అగస్త్యుని ప్రార్థించగా అగస్త్యుడు దేవతలతో యిట్లనెను. దేవతలారా! మీరేమి కార్యమును గురించి వచ్చితిరో చెప్పుడు. మీ కార్యము నేను అనుకూలింప జేసెదను. అని ప్రీతిపూర్వకముగా అగస్త్యుడు దేవతలనడిగెను. దేవతలందరును అగస్త్యుని కిట్లనిరి. మహాత్మా! అగస్త్యమునీంద్రా! కాలకేయులను రాక్షసులు పగటివేళయందు సముద్రజలములందు దాగియుండి రాత్రికాలములయందు మునులయాశ్రమములందు జొరబడి బ్రాహ్మణులను జంపుచున్నారు. వారల భయముచేత భూమియందు యజ్ఞాది పుణ్యకర్మలను జేయుట లేదు. అందువలన సకల లోకములకును వుపద్రవము కలుగుచున్నది. గాన ఆకాలకేయుల భయము లేకుండునట్లు చేయుము. నీకు లోకసంరక్షణయందు చిత్తముగలిగిన యెడల మహాసముద్ర జలముల నన్నిటిని త్రాగుము, నీవు మహాసముద్రములను పానము జేసిన యెడల మామనస్సులకు పరమానందము గలుగును. నీవు సముద్రజలములను త్రాగినచో నాక్షణమందే దివ్యాస్త్రములచేత సముద్రములో దాగియుండు కాలకేయ రాక్షసులను చంపెదము. అని దేవతలందరును అగస్త్యునితో జెప్పి ప్రార్థించిరి.

## అగస్త్యుడు సముద్రోదకమును పానముచేయుట

అగస్త్యుడు అట్లనే జేసెదనని దేవతలతో జెప్పగా వారందఱును సంతోషించిరి. అప్పుడు అగస్త్యమునీంద్రుడు దేవతలకందరికిని సంతోషము కలుగునట్లు సముద్రము దగ్గరకు వచ్చెను. వారి వెంబడి సకలదేవగణములును మహామునీంద్ర గరుడ గంధర్వ సిద్ధసాధ్య విద్యాధర నాగేంద్ర కిన్నర కింపురుషాది గణములును మహాసముద్రము దగ్గరకువచ్చిరి. అప్పుడు ఆ మహాసముద్రము గొప్ప కరుళ్ళు గలిగి ఆ కరుళ్ళను కెరటములచేత చేతులతో ఆడుచున్నట్లుండెను. మహావాయువుయొక్క వేగముచేత కొట్టబడి వచ్చుచున్నదానివలె ఆ సముద్రము పర్వత గుహలలోనికి వ్యాపించెను. సముద్రమందు దట్టముగా నురుగుగలదు. ఆ నురుగును చూడగా సముద్రము నవ్వుచున్నట్లుండెను. ఆ మహాసముద్రమందు సర్పకులములు, మొసళ్ళు, క్రూర జంతువులు అనేకములుండును. ఆ క్రూరజంతువుల బాధను సహింపలేక ఘోషించుచున్న దానివలె సముద్రము ధ్వనిచేయుచుండెను. అటువంటి మహాసముద్రము దగ్గరకు సకలదేవ గరుడ గంధర్వాది గణములతో అగస్త్యుడు అందరు చూచుచుండగా మహాసముద్రమందు గల సకల జల సమూహములను నిశ్శేషముగా త్రాగెను. అందువలన ఆ సముద్రమందు జల బిందువులేక యెండిపోయిన విధమున గన్పట్టెను. అందులోనుండు గొప్పవగు చేపలు, తాబేళ్లు, మొండ్రకాయలు, సర్పసమూహములు, అందుండు కాలకేయ రాక్షస సమూహములును స్పష్టముగా కనబడిరి. దేవేంద్రాది దేవగణములందరును తమ బలపరాక్రమములచేత గర్వించి కాలకేయ రాక్షసులతో యుద్ధముజేసిరి. దేవతల దివ్యాయుధములచేత కాలకేయులు కొందరు చచ్చిరి. మరికొందరు దేవతలను జయించలేక భయపడి పాతాళలోకమునకు బోయిరి. ధర్మరాజా! దేవతలు

కాలకేయులను నిశ్శేషముగా జంపి జగత్తునకుగలిగిన వుపద్రవమును మాన్పిరి. అంతట దేవతలందరును అగస్త్యునిస్తుతించి యిట్లనెను. మునీంద్రా! నీ యనుగ్రహమువలన లోకములకు ఉపద్రవము తగ్గినది. సముద్రమందు ఒక్కజలబిందువైనను లేకుండ నీవు త్రాగితివి. గాన మరల యీ మహాసముద్రమును జలములతో నిండించి యెప్పటివలె జేయుము. ఈ కార్యము నీ వలననే కావలెను గాని యన్యులవలన గానేరదు. ఈ సముద్రమువలన ననేక జంతువులు జీవింపుచుండును. గాన యీ సముద్రము జలశూన్యమై యుండరాదు. గాన యెప్పటివలె నీటితో నింపింపుము. అని దేవతలు అగస్త్యుని ప్రార్థింపగా అగస్త్యుడిట్లనెను.

దేవతలారా! సముద్రమందుగల జలములను నేను నిశ్శేషముగా త్రాగితిని. ఆ జలములన్నియు యిదివరకే నాగర్భమందు జీర్ణమాయెను. గాన నేను జలములచేత సముద్రమును పూర్తిగానిండింపజాలను. అని అగస్త్యుడు దేవతలతో చెప్పెను. అంతట సకలదేవతలును మునులును బ్రహ్మదేవుని పాలికింజని యిట్లనిరి. బ్రహ్మదేవా! ఏ విధముచేత సముద్రమందు జలములునిండి యుండునో ఆ విధానమును మాకు తెల్పుము. అని దేవతలు చెప్పగా బ్రహ్మదేముడు చాలాసేపు యోచించి యిట్లు చెప్పెను. ముందుబహుకాలమునకు భగీరథుడను ఒకరాజు పుట్టగలడు. భగీరథుడు సముద్రమును జలములచేత నిండింపగలడు. అని బ్రహ్మదేవుడు దేవేంద్రాది దేవతలతో చెప్పెను. ఆ మాటలకు దేవతలును, మునులును, సంతోషించి వెళ్ళిరి. అని రోమశుడు ధర్మరాజుతో చెప్పగా విని రోమశునకు ధర్మరాజిట్లనెను. రోమశమునీంద్రా! ఏమికారణమున భగీరథుడు జలములను సముద్రమున నిండించెనో ఆ విషయమును నాకు చెప్పుము. అని ధర్మరాజు అడుగగా రోమశుడిట్లనెను.

ధర్మరాజా! పూర్వము ఇక్ష్వాకు వంశమందు సగరుడను రాజుండెను. ఆసగరుడు రాజులనందరును చంపి హైహయులచే బాలింపబడు సకల భూరాజ్యమును పరిపాలింపు చుండెను. సగరునకు పుత్ర సంతానము లేనందున అతడు తన యిద్దరు భార్యలను తీసికొని కైలాస పర్వతము మీదకు బోయెను. ఆసగరుని భార్యలిద్దరును వైదర్భియనియు, శైభ్యయనియుపిలువబడుచుండిరి. వారినిగూడి కైలాసపర్వతమునకు బోయి సగరుడు శివునిగురించి గొప్పతపస్సు చేసి ఆశివుని ప్రత్యక్షము చేసికొనెను. శివుడు సగరునకు ప్రత్యక్షమై వరముకోరుమనెను. సగరరాజు శివునితో యిట్లనెను. పరమేశ్వరా! నీవు సర్వలోక ప్రభుడవు. నీవు నాయందు కరుణించి నాకు సంతానముకలుగునట్లు వరమిమ్ము. నాకు సంతానాపేక్ష మిక్కుటముగా గలదు. అని సగరుడు శివునితో జెప్పుకొని వరమడిగెను. ఈశ్వరుడు సగరునియందు కరుణించి యిట్లుచెప్పెను.

సగరుడా! నీభార్యయగు వైదర్భియందు నీకరువదివేల మంది కొడుకులు పుట్టుదురు. రెండవభార్యయగు శైభ్యయందె నీకు ఒక కొడుకుపుట్టును. నీకొడుకు లరువదివేలమంది అధికగర్వము గలవారై ఏకకాలమందు మృతులగుదురు. నీ రెండవభార్య యందు బుట్టు కుమారుడొక్కడే వంశకర్త యగును. అని యీశ్వరుడు సగరునితో జెప్పి అంతర్థానుడాయెను. సగరుడనేకమంది పుత్రులను బొందునట్లు శివునివలన వరమును బొందియు, సంతసములేక, సంతానహీనుని బోలి తనయిరువురు భార్యలను వెంటనిడుకొని కైలాసమునుండి తన పట్టణమునకు బోయెను. అంతట కొంతకాలమునకు సగరునిభార్యలిద్దరును గర్భములనుధరించిరి. వారిలో వైదర్భిగర్భమందుసొరకాయ పుట్టెను. రెండవభార్యయగు శైభ్యగర్భమున అసమంజసుడనుకుమారుడు పుట్టెను. వైదర్భిగర్భమునుండి పుట్టిన సొరకాయనుజూచి జనులిట్లు చెప్పుకొనసాగిరి,

ఈశ్వరుడు వరములిచ్చువాడు. వారి వరమువలన వ్యర్థమగు సొరకాయ పుట్టినది. ఈశ్వరుని వరమెట్టిదో తెలియకున్నది. అని జనులనుకొనుచు సొరకాయనుపార వేయుటకు ప్రయత్నించిరి. ఆకాశవాణి సగరునుద్దేశించి 'రాజా! సాహసించి సొరకాయను పార వేయరాదు. అందుగల విత్తనములను నేతికుండలయందుంచి రక్షింపు చుండుము. అట్లు రక్షించితివేని యీశ్వరునివరమువలన నీకు అరువదివేలమంది కుమారులు పుట్టుదురు. అని బలికెను. సగరుడు ఆకాశవాణి వాక్య ప్రకారముగా సొరకాయయందు గల విత్తనములను తీసి నేతికుండలయందుబెట్టి చక్కగా రక్షించెను. కొన్ని దినములకు విత్తనములన్నియు అరువది వేలమంది పుత్రులైరి. అంతట వారందరు పెరిగి ఆకాశమందు సంచరించుచు స్వర్గలోకము మొదలగు లోకములన్నిటికి బాధలు కలిగించు చుండిరి. సగరుని కొడుకులు యీరీతిగా బలగర్వముల చేత మదించి సకలలోకములను బాధింపుచుండగా దేవతలందరును భయపడి ముని సంఘములతో గూడి బ్రహ్మదేవుని దగ్గరకు బోయిరి. బ్రహ్మదేవు డా దేవతలు వచ్చుటకు గల కారణమును యెరింగి యిట్లు పలికెను.

దేవతలారా! మీరు సగరుని కొడుకులకు భయపడనవసరము లేదు. సగరునికొడుకు లందరును దహింపబడుదురు. గర్వవంతుల ఆధిక్యత యెప్పటికిని స్థిరముగానుండదు. అని యిట్లు బ్రహ్మదేవుడు ఆనతిచ్చెను. దేవతలందరును. తమతమ నివాసములకు వెళ్ళి ఆసగర పుత్రుల నాశమును కోరుచుండిరి. సగరుడు అశ్వమేధయజ్ఞమును చేయదలచి దీక్షనువహించి అశ్వమును విడిచెను. ఆ యజ్ఞాశ్వమును రక్షించుటకు సగరుని పుత్రులందరును దాని వెంబడి వెళ్ళిరి. ఆగుఱ్ఱము భూమినంతను దిరిగి జనశూన్యమై సముద్రములోనికిబోయి కనబడ లేదు. సగరుని కొడుకులందరు యజ్ఞాశ్వము కనబడలేదని తండ్రికి దెలి

పిరి. సగరుడా గుఱ్ఱమును వెదకి తెమ్మని తనకొడుకులకు ఆజ్ఞాపించెను. అరువదివేలమంది కొడుకులును వెళ్ళి భూలోకమంతటను వెదకిరి. వెదకినను ఆగుఱ్ఱము కనబడలేదు. అంతట అరువదివేలమంది పాతాళమందు వెదకదలచి సముద్రముంగల బురదలోనూరి సముద్రమును ఒక్కపెట్టున త్రవ్విరి. అనేకఆయుధములతో సముద్రమును త్రవ్వగా ఆసముద్రభూమిలో యీశాన్య దిగ్భాగమున కపిలమహాముని యాశ్రమము కనబడెను. ఆయాశ్రమముదగ్గర గుఱ్ఱముకనబడగా సంతోషించి యిట్లనిచెప్పుకొనిరి.

అన్నదమ్ములారా! మనతండ్రియగు సగరమహారాజు అశ్వమేధయజ్ఞమును చేయదలచి యీగుఱ్ఱమునుపూజించి సకలదేశములందును సంచరించుటకు విడిచెను. ఈ గుఱ్ఱము నీ మునియపహరించి యీ సముద్రభూమిలో నిర్భయముగా నున్నాడు. అని అరువదివేలమంది చెప్పుకొని ఆశ్రమమందుండు కపిలమహామునిని అవమానించిరి.

## సగర సుతులు కపిలమహాముని కోపాగ్నిచే భస్మమగుట

కపిలమహామునీంద్రుడు కోపించుకొని నిప్పులతో మంటలు వ్యాపించిన మిక్కిలి ఘోరమైన దృష్టిచేత కండ్లు తెరచి చూచెను. అందువలన అగ్నిజ్వాలలు పుట్టెను. ఆ యగ్నిజ్వాలలవలన సగరుని యరువదివేలమంది పుత్రులు భస్మమైరి. వారందరును వీరులగుదురు. కాని కపిలమహాముని కోపాగ్నిజ్వాలలచేత ఘోరముగా దహింపబడిరి. ఈ సమాచారమంతయు నారదుడు జూచి వెళ్ళి సగరునకు తెలియ జెప్పెను. తన కొడుకు లరువదివేలమంది దహింపబడిరని సగరుడు మిగుల విచారము కలవాడై శివునివాక్యమును తలచుకొనెను. అట్లు తలంచి దుఃఖింపుచు తనపుత్రుడగు అసమంజసుని కొడుకగు అంశుమంతుని జూచి యిట్లనెను.

అంశుమంతా ! నీ పెదతండ్రులు అరువదివేలమందియు ఒక్కసారే కపిలుని కోపాగ్నిచేత భస్మమైరి. నీతండ్రియగుఅసమంజసుడు మిక్కిలి క్రూరచిత్తుడై యీపట్టణమందలి జనులను బాలులను నిష్కారణముగాజంపి మహానదిలో బారవేయుచుండెను. అందుకు పురజనులందరును దుఃఖించుచుండిరి. వారి దుఃఖములను, మొద్పులను నేను విని మిక్కిలి కోపముగలవాడనై వానినిదూషించి చంపించితిని. నేను నా కుమారుల చావునకు చింతింపుటలేదు. నేనుచేయ సంకల్పించిన అశ్వమేధయజ్ఞము ముగియనందుకు చాలా విచారించుచున్నాను. గాన నీ విప్పుడు నాయజ్ఞాశ్వమునుదెచ్చి నాయశ్వమేధ యజ్ఞమును పూర్తి చేయుము. అని సగరుడు తనమనుమడైనఅంశుమంతునితో జెప్పెను. ఆ క్షణమందే అంశుమంతుడువెళ్ళి అదివరకు సగరుని కొమరులు త్రవ్విన సముద్రద్వారములోదూరి లోపలికిపోయి కపిల మహామునిని జూచెను. అప్పుడు కపిలమహాముని వేయిమంది సూర్యుల కాంతితో ప్రకాశింపుచుండెను. కపిలుని అంశుమంతుడు జూచి నమస్కరించి తానువచ్చిన కార్యమును తెలిపెను. అంత కపిలుడు కరుణించి యజ్ఞాశ్వమును వానికిచ్చి అంశుమంతునితో యిట్లనెను. అంశుమంతా ! నీ వలన నాచేత భస్మము కాబడిన సగరుని కొమరులందరకును పుణ్యముకలుగును. సగరునకు పుత్రవంతులకు గలుగుపుణ్యగతి లభించును. నీచేతగొనిపోబడు యీసవనాశ్వము వలన సగరుడు అశ్వమేధయజ్ఞమునుజేసి కృతార్థుడు కాగలడు. నీకు భగీరథుడను మనుమడు పుట్టును. భగీరథుడు దేవగంగయగు గంగానదిని భూలోకమునకు తెచ్చును. ఆ గంగాజలములచేత సగరుని కుమారుల యొక్క నాచేదహింపబడిన యెముకలన్నియు తడుపబడును. అట్లుతడుపబడుట వలన అరువదివేలమందియు స్వర్గమును పొందుదురు. భగీరథునిచే తేబడిన గంగాజలము యీసముద్రమునంతను జలపరిపూర్ణము చేయు

చున్నది. అని కపిలుడు అంశుమంతునితో చెప్పెను. అంశుమంతుడు సంతోషించి కపిలుని కృపవలన గుర్రమునుదెచ్చి సగరునకిచ్చి కపిలునిమాటలను సగరునితోచెప్పెను. సగరుడును పుత్రదుఃఖమును వదలి అశ్వమేధయజ్ఞమును పూర్తిచేసెను. సగరుడు సముద్రుని తన కొడుకుగా భావించెను. అందుచేతనే అదిమొదలుకొని సముద్రమునకు సాగరమను పేరుగల్గినది.

ధర్మరాజా! యీరీతిగా సగరుడు బహుకాలమువరకు రాజ్యముచేసిన పిమ్మట తనరాజ్యమును అంశుమంతునకు సమర్పించి తపోవనమునకు పోయెను. అంశుమంతుడును తనతాతయగు సగరునివలెనే బహుకాలమువరకు రాజ్యమేలెను. అంశుమంతునకు దిలీపుడను పుత్రుడుపుట్టెను. దిలీపునియందు రాజ్యభారమును నిలిపి అంశుమంతుడు తపోవనమునకు పోయెను. దిలీపుడిట్లని తలంచెను. నాతాతలగు అరువదివేలమందికి పుణ్యగతి గలుగలేదు. దేవగంగను భూలోకమునకు తెచ్చి సముద్రమును నిండించినయెడల నాతాతలందరికిని పుణ్యగతి గలదు. అని యిట్లు దిలీపుడుదలచి దేవగంగను భూలోకమునకు దెచ్చునిమిత్తము ప్రయత్నముచేసియు అసమర్థుడైయుండెను. దిలీపునకు భగీరథుడను పుత్రుడుపుట్టెను. ఆ భగీరథుడు యుద్ధవీరుడు. మహాతేజోవంతుడు, మహాకీర్తివంతుడు. దిలీపుడు భగీరథునకు పట్టాభిషేకముజేసి తపోవనమునకు పోయెను. భగీరథుడు రాజ్యముజేయుచుతనమనస్సులో యిట్లనితలచెను – నాముత్తాతలగు సగరపుత్రులందరును కపిలుని కోపాగ్నిచేత దహింపబడిరి. అరువదివేలమందికిని పుణ్యగతిగలుగలేదు. వారికి నేను పుణ్యగతిని గలిగింపవలెను. దేవగంగను భూలోకమునకు దెచ్చినయెడల సగరపుత్రులకు పుణ్యగతి గలుగును. అని భగీరథుడుతలచి దేవగంగను భూలోకమునకు తేవలెనని నిశ్చయించి తపస్సునిమిత్తము హిమవత్పర్వతమునకు వెళ్లెను,

అందు అనేకధాతువులుగల గొప్పశిఖరములు గలవు. అచ్చటగల మంచుస్థలములమీద మేఘసమూహములు తిరుగగా నవినల్లగా కనుపించుచుండెను. రత్నమయములైన చరియలయందు సిద్ధవిద్యాధరగంధర్వ దేవతలు స్త్రీపురుష సమేతముగా విహరింపుచుందురు. చిలుకలు, పిట్టలు, పావురాయిలు, నెమళ్ళు, తుమ్మెదలు, మరియనేకవిధములైన పక్షులును శబ్దములను చేయుచు వనములయందుండెను. సింహములును, శరభమృగములును, పెద్దపులులును, యేనుగులు మొదలగు అనేకవిధములైన మృగసమూహములు గుహలయందు ధ్వనిచేయుచుండెను. హిమవత్పర్వతము మనోహరముగాను భయంకరముగాను తోచుచుండెను. హిమవత్పర్వతమునకు భగీరథుడు వెళ్ళి ఘోరతపస్సు చేయుచుండెను. భగీరథుడు సర్వదా ఉపవాసములు జేయుచు కందమూల ఫలములను కూరగాయలను భక్షింపుచుండెను. గొప్పవగు వ్రతనియమములను గలిగియుండెను. విశేషముగా దేవపూజలును అపరిమితమైన జపములు జేయుచుండెను. మహానిష్ఠగలిగి ఘోరతపస్సు జేయుచుండెను. దేవగంగను భూలోకమునకు తెచ్చు నిమిత్తమై గంగాదేవినిగూర్చి వేయి దివ్యసంవత్సరములు భగీరథుడు ఘోరతపస్సు చేసెను. అంతట భగీరథుని తపస్సునకు గంగాదేవి మెచ్చి ప్రత్యక్షమై నీయిష్టమును జెప్పుమని భగీరథుని యడిగెను. భగీరథుడు రెండుచేతులనుజోడించుకొని నమస్కరించుచు గంగాదేవితో యిట్లుచెప్పెను.

గంగాదేవీ! పూర్వము నాముత్తాతలు అరువదివేలమంది కపిలునికోపాగ్నిచేత భస్మమైరి. వారికి పుణ్యగతులు గలుగలేదు. నీపుణ్యజలముచేత వారి యెముకలను తడిపినయెడల వారందరును స్వర్గమును జేరుదురు. నీవు యీ దేవమార్గముద్వారా భూలోకమునకు రావలెను. అని భగీరథుడు గంగాదేవితో జెప్పెను. గంగాదేవి

భగీరథునిజూచి యిట్లుపలికెను. భగీరథుడా ! నేను ఆకాశమునుండి భూమికి వచ్చునప్పుడు నాజలప్రవాహమును ధరించుటకు శివుడు సమర్థుడు గాని మరియొకడు భరింపజాలడు. గనుక నన్ను ధరించు నిమిత్తమై ఆ శివుని యనుగ్రహమును పొందుము. అని గంగాదేవి భగీరథునితోజెప్పి వెళ్ళెను భగీరథుడు కైలాసపర్వతమునకు బోయి యీశ్వరుని గురించి బహుకాలమువరకు ఘోరతపస్సు చేసెను. శివుడు భగీరథునిదగ్గరకువచ్చి యిట్లనెను. భగీరథా ! నీవు భూలోకమునకు దేవగంగను రప్పింపుము. ఆ జలప్రవాహమును నేను భరింతును. అని బల్కిన భగీరథుడు గంగ నుద్దేశించి మరల తపస్సును జేసెను. గంగాదేవి భగీరథుని కరుణించి గొప్పతరంగ సమూహములతో నాకాశమార్గమునుండి భూమికి వచ్చుచున్నది. అప్పుడు ఆకాశమార్గమంతయు అన్నిదిక్కులును కప్పబడియుండెను. ఆగంగానదివలన పంచమహాభూతములకును సౌందర్యము కలిగినది. అంతట శివుడు తన జటాజూటమందా దివ్యగంగను ధరించెను. తామరకమలమును శిరస్సునందు ధరించినట్లుండెను. అప్పుడు దేవతలు, మునులు సిద్ధసాధ్యాదులందరును వచ్చి శివుని జటాజూటమందలి గంగనుజూచిరి. వారందరు జూచుచుండగా గంగ భూమిమీదకు వచ్చెను. గంగానది అట్లు వచ్చి హిమవత్పర్వతము మీదుగా ప్రవహించి సముద్రములో ప్రవేశించెను, సముద్రుడు భర్త. గంగానది స్త్రీ. గంగానది హంసవలె ఆకాశమునుండి భూమికివచ్చెను. అందుగల నురుగు గంగానది నవ్వినట్లుండెను. జలములయందు గల మత్స్యములు గంజమొక్క చూపులువలె నుండెను. గాలివలన లేచిన గంగానదీతరంగములు మ్రోయుచుండగా గంగాదేవి మాటలాడినటులుండెను. భగీరథుడను దూత ఆకాశమందుండు గంగను తీసికొనివచ్చి సముద్రుడను పురుషునకు సప్పగింతచేసెనను నట్లుండెను.

యీరీతిగా గంగ భూమియందు ప్రవహించి సముద్రములో కలిసెను. అగస్త్యుడు సముద్రజలములను త్రాగినందున శూన్యమైనసముద్రము గంగానదీ జలములచేత నిండెను. గంగాజలములచేత సగరుని పుత్రుల యొక్క యెముకలన్నియు తడుపబడినందున వారందరును పుణ్యగతులను పొందిరి. ఇట్లు గంగానది భగీరథునిచేత భూలోకమునకు వచ్చినందున భాగీరథియని చెప్పబడినది. అని రోమశమునీంద్రుడు భూమికి గంగ వచ్చినవిధమును భగీరథుని మాహాత్మ్యమును జెప్పెను. ధర్మరాజు యీ పుణ్యకథను విని తమ్ములతోగూడి నంద, ఉపనంద యను నదులయందు స్నానముజేసెను. ఋషభకూటమను పర్వతము అచ్చటగలదు అచ్చటగల ఒక సరస్సులో కలువలుండెను. ఆకలువలలో నుండి యగ్నిహోత్రములు లేచి మేఘములను పిలుచుచుండెను. ఆ పిలుపుకు మేఘములు హేమకూట పర్వతమునుండి యాఅగ్నిహోత్రముదగ్గరకు వచ్చుచుండెను. ఆమేఘములను అగ్నిహోత్రమును జూచి ధర్మరాజు రోమశునితో బలికెను. మునీంద్రా ! యీసరస్సున గల కలువలలోనుండి వచ్చు యగ్నిహోత్రము పిలువగా హేమకూట పర్వతమునుండి మేఘములు వచ్చుచున్నవి. ఇది చాల యాశ్చర్యకరమైన విషయము. దీనికి కారణమేమో జెప్పుము. అని యడిగిన ధర్మరాజునకు రోమశు డిట్లుచెప్పెను. ధర్మజా! ఇది ఋషభకూటమను పర్వతము. ఇందు ఋషభుడను ముని నివసించును. అతడు మిగుల కోపముగలవాడు. ఎవరైనను యీ సమీపమున మాటాడిన మాత్రమున అతడు కోపముగలవాడై యిందుగల కలువలమూలమున యగ్నిని ప్రసరింపజేసి మేఘములను పిలిపించును. అంత నామేఘములు వచ్చి యీమాటలాడువారిని వారించును. ఇంద్రియ, మనోనిగ్రహములు లేని జనులును, తపోదానధర్మగుణములు లేని జనులును. యిచ్చట వుండనేరరు. దేవతలును, వారిని జూచినవారు

మాత్రమే యీ మునిని జూడవత్తురు. పూర్వ మీ తీర్థమందు దేవ ఋషులు తపస్సుచేసిరి. యజ్ఞములు చేసిరి. దర్భలబోలు గరికిగడ్డి యిప్పుడును అచ్చట కనబడును యజ్ఞస్తంభములబోలు వృక్షము లును, కనబడును. అని రోమశమునీంద్రుడు ఋషభతీర్థముయొక్క మాహాత్మ్యమును ధర్మరాజుతో జెప్పెను. ధర్మరాజా తీర్థమందు స్నానము జేసి వెళ్లుచుండగా రోమశుడు ధర్మరాజునకుయిట్లు చెప్పెను. ధర్మరాజా! ఇది విశ్వామిత్రునితీర్థము. ఇది కౌశికీతీర్థమని చెప్పు దురు. అది ఋష్యశృంగమునియొక్క సరస్సుఅని చెప్పగా ధర్మరాజు మహాత్మా! ఋష్యశృంగుల జన్మవృత్తాంతచరిత్రమును నాకు చెప్పుము అని రోమశుని యడుగగా రోమశుడు ధర్మరాజుతో యిట్లుచెప్పెను.

## రోమశుడు ధర్మరాజునకు ఋష్యశృంగుని చరిత్రము చెప్పుట

ధర్మరాజా! పూర్వము కశ్యపమునికి విభాండకు డను పుత్రు డుండెను. అతడు అఖండమైన బ్రహ్మచర్యవ్రతము చేత తపస్సు జేయుచుండెను. ఒకనాడతడొక మడుగునందు స్నానము జేయుచుండెను. ఆసమయమున ఊర్వశియను దేవతాస్త్రీ విభాండమునికి కనబడెను. వెంటనే అతనికి కామము గలిగి ఇంద్రియస్ఖలనమయ్యెను. అట్లు స్ఖలనమైన వీర్యము ఆ మడుగునందుగల జలములతో కలిసియుండెను అంతలో నొక ఆడుజింకవచ్చి ఆ మడుగులోనీరు త్రాగుచుండగా నావీర్య మాజింక కడుపులోనికి పోయెను. అంతట ఆజింక గర్భము ధరించెను. ఆగర్భమున ఆముని వీర్యమువలన ఋష్యశృంగుడను మునికుమారుడు పుట్టెను. ఋష్యశృంగుడు తన తండ్రియైన విభాండ కుని యాశ్రమమందే చేరియుండెను. వేరొక స్థలమెరుగక యచటనే ఘోరతపస్సుజేయుచుండెను. ఆకాలమందు అంగదేశమును రోమ పాదుడను రాజు పాలించుచుండెను. రోమపాదుడు బలైశ్వర్యగర్వ

ములచేత మితిమీరి తన పురోహితుని అవమానించెను. బ్రాహ్మణు లందరును రోమపాదుని సేవింపక విడిచిరి. అంగదేశమున వర్షము కురియనందున కరువువచ్చెను. రోమపాదుడు భయపడి భక్తిచేత బ్రాహ్మణులను ఉపాసించెను. రోమపాదుడు బ్రాహ్మణులతో వినయభక్తిపూర్వకముగా యిట్లనెను. బ్రాహ్మణులారా! నాదేశ మందు వర్షము లేకుండుటకు కారణమేమి? ఏదోషము సంఘటిల్లినది? దానికి పరిహారమెద్ది? అని యడిగిన రోమపాదునకు బ్రాహ్మణులు కరుణించి ఇట్లు పలికిరి.

రోమపాదా! నీవు మిగులగర్వించి నీ పురోహితుని అవమా నించితివి. నీవుగర్వముకలవాడవనివిని బ్రాహ్మణులందరును సేవిం పక నిన్నువిడిచిరి, విప్రులువిడిచిన నిన్ను దేవతలుకూడ విడిచిరి. అందువలన నీ దేశమందు వర్షముకురియలేదు. ఇందుకుపరిహారముసు జెప్పెదవినుము. ఋష్యశృంగుడను పరమశాంతుడైన మునికలడు. ఆమునియుండు దేశమందు వర్షములు కురియునట్లు ఋష్యశృంగునకు దేవేంద్రుడు వరమియిచ్చెను. ఋష్యశృంగుడు వేదాంతశాస్త్రవేత్త. నీనేర్పరితనముజేత నాఋష్యశృంగుని యిక్కడకు రప్పించితివేని నీదేశమందు వర్షముకురియగలదు. అని బ్రాహ్మణులు రోమపాద రాజుతో జెప్పిరి. రోమపాదుడు తానుముందు విప్రులకుగావించిన అవమానమునకు తగిన ప్రాయశ్చిత్తముచేసెను. బ్రాహ్మణులు చెప్పినవాక్యమును బుద్ధిమంతులతో యోచించి రూపసౌందర్యయౌ వనచమత్కార సంతులగు వేశ్యారత్నములను రెప్పించి వారితో నిట్లనెను. వేశ్యామణులారా! మీనేర్పరితనముచేత ఋష్యశృంగ మునిని బోధించి యిచ్చటకు తీసికొనిరండు. త్వరగాపొండు అని చెప్పెను. అంత వేశ్యలు రుచిగల భక్ష్యములను, మంచిగంధపుష్ప మాలాది పరిమళ ద్రవ్యములను, దీసికొని ఋష్యశృంగుని యాశ్ర

మమున కేగిరి. ఋష్యశృంగుని తండ్రియగు విభాండకుడు కుమారా! నీవు ప్రతినిత్యమువలె అగ్నియందు హోమము జేయుచుండుము. నేను పండ్లు దెచ్చుటకై వనమున కేగెదను. కాలాతిక్రమణము జేయక సకాలమున అగ్నివిధులనాచరింపుము. అని చెప్పి వనమున కేగెను. ఆసమయమున వేశ్యకాంత, తనకూతురిని ఋష్యశృంగునియొద్దకు పంపెను. ఆమె యౌవనవంతురాలై మంచిరూపసౌందర్యములను గలిగియుండెను. ఆ వేశ్యకన్యను మునికుమారునిగాదలంచి ఋష్యశృంగు డధికసంతోషముగా నిట్లనెను.

## ఋష్యశృంగుడు వేశ్యను మునికుమారునిగా భావించుట

మునికుమారుడా! నీవు యెక్కడినుండివచ్చితివో తెలియలేదు. నీవంటి సుందరాకారుని యిటువరకెన్నడును నేను జూడలేదు. ఈ కృష్ణాజినదర్భాసనమందు కూర్చుండుము. అని ఋష్యశృంగుడు చెప్పి వేశ్యకాంత నర్ఘ్యపాద్యాదివిధులచేతను, వన్యఫలములచేతను అతిథి పూజలు చేయుటకు ప్రయత్నించెను. వేశ్య ఋష్యశృంగునకిట్లనెను. మునీంద్రా! ఇక్కడకు మాయాశ్రమము మూడామడదూరమున్నది. నేనచ్చటకు పోయెదను నీవును నావెంబడి రావలయును. నాతో ప్రేమగలిగి యుండుము. అట్లు నీవువచ్చునట్లయిన నీవుయిచ్చు వన్యఫలాదులను తీసికొనెదను. అని చెప్పిన వేశ్యకాంతకు ఋష్యశృంగుడిట్లుచెప్పెను. మునికుమారా! నీవు చెప్పినట్లుచేసెదను. నేజేయు నతిథిపూజలను గ్రహింపుము అనిచెప్పి విధిప్రకారము పూజించెను, వేశ్య దివ్యగంధపుష్పమాలలను ఋష్యశృంగునకిచ్చెను. మనోహరములైన భక్ష్యపానములను యిచ్చెను. విచిత్రములయిన వస్త్రములను యిచ్చెను. ఆమె యిచ్చిన పదార్థములను ఋష్యశృంగుడు ప్రీతిపూర్వకముగా దీసికొనెను. వేశ్య, మునియెదుట బంతినాడుచు

నృత్యముసేయుచు, మనోహరముగా సంగీతమును పాడుచు, తన నేర్పరితనమునుజూపెను. వేశ్య వెంటనే ఋష్యశృంగుని కౌగిలించు కొనెను. మునియందులకు సంతోషించెను. యిట్లుబోధించి మునియొద్ద నుండి వెడలెను. ఋష్యశృంగుడా వేశ్యయందు ప్రేమ జెందినవాడై యామె వెడలినదిక్కునకు జూచుచు నగ్నిహోత్రమునందు హోమము జేయక కాలాతిక్రమణము జేసెను. మరియు విపరీతమగు బుద్ధిగలవాడై యుండెను. ఇంతలో విభాండకుడు వనమునందున్న ఫలములనుగొని తెచ్చి కుమారునిజూచి "తనయా! నీవుమిగుల జింతనొందియున్నావు. అగ్నిహోత్రమునందు హోమము జేయక కాలాతిక్రమణము గావించితివి. ఇందుకు కారణమేమో తెలియుము అని విభాండకుడు అడుగగా ఋష్యశృంగు డిట్లనెను.

తండ్రీ! ఒకమునికుమారుడు నావద్దకువచ్చెను. వాడు బంగారము వంటి మేనిచాయగలిగియున్నాడు. మంచిరూపసౌందర్య వంతుడై యున్నాడు. వ్రేలాడు జడలు సువాసనలతో నిండియున్నవి. వానిరొమ్ము నందు గుండ్రముగానుండు రెండుపిండములున్నవి. వాడునడచు నప్పుడు నడుమువడకును. జపమాల వ్రేలాడుచుండును. నడచున ప్పుడు హంసధ్వనిగలిగియున్నది. అట్టిబ్రహ్మచారియగు నొకముని కుమారుడు నాదగ్గిరకు వచ్చిపోయెను. వాడు మాటలాడినప్పుడు సువా సనగలదు. మాధుర్యముగలదు. మాటలు కోకిలపక్షులకూతలవలె మనోహరములు. ఆతడు కట్టినవస్త్రములు మృదులములై మనో హరములై విచిత్రములై యున్నవి. వానికొక గొప్పజడగలదు. జడచివరిభాగమున బంగారుభూషణముగలదు. అదివ్రేలాడుచుండును. దేహామంతయు గంధమయము. గాలివలన వానిశరీరపరిమళ మపరి మితముగా ప్రకాశించుచున్నది. వానికుడిచేతియందు ఒకమెర్రని పండుగలదు. ఆపండునతడు చరచుచు నదిపైకెగయునప్పుడు దాని

వైపున కతడు వ్రాలును. అప్పుడతడు గాలిచేత వంగబడిన బాలవృక్షమువలె ప్రకాశించెను. వానియందు నాచిత్తము తగిలియున్నది. ఆతడు నన్ను కౌగిలించుకొని నాముఖమునకు తనముఖముచేర్చి మృదు శబ్దమును చేసెను. అదిమిక్కిలి మనోహరముగానున్నది. అట్టిశబ్దము నిదివరకు నేనెన్నడును వినియుండలేదు. ఆతనిముఖము పద్మముతో సమానముగా నుండెను. నేను వన్యఫలములకొాతనికివ్వబోగా నాతడు వానిని వారించి అమృతోపమానములగు పండ్లనునాకిచ్చెను. కమ్మని జలములను నాకు త్రావనిచ్చెను. ఆపండ్లను జలములను నేనుపయోగించితిని. బ్రహ్మచారి తన చేలియందలి పుష్పములను వెదజల్లగా వానియందు సువాసన చెలరేగెను. ఈ వనపుష్పములకుకూడ నంత పరిమళము గనుపింపదు. వానియాశ్రమమందు వానితోగూడి తపమాచరింపవలెనని నాకుయిష్టమగుచున్నది. అని చెప్పిన కుమారుని మాటలకు విభాండకుడాశ్చర్యమునుపొంది కుమారా! తపస్సు చేయువారికి తపోవిఘ్నముచేయుటకు మాయావంతులగు రాక్షసులు అనేకరూపములనుబొంది వనములో తిరుగుచుందురు. మాధుర్యరస వంతములగు జలములను తాపసులు త్రాగరాదు మిక్కిలి గంధ వంతములగు పుష్పములను మునులు వాసనజూడరాదు. అనిబోధించెను. మరునాడు విభాండకుడు యెప్పటివలె ఫలములను దెచ్చు నిమిత్తము వనమునకు బోయెను. ఆ సమయమున వేశ్య మరలవచ్చి ఋష్యశృంగునికి వికారము గలిగించెను. ధర్మరాజా! స్త్రీలతో సహవాససల్లాపము లున్నయెడల యెటువంటివారును మోహము జెందుదురు. గాన వారిసల్లాపములు బంధములేయగును. వేశ్యాంగన చేత మోహితుడై తండ్రితోజెప్పకనే తన యాశ్రమమును విడిచి ఋష్యశృంగుడా వేశ్యవెంటజనెను. అట్లువెళ్ళి క్రమముగా అంగదేశ మందు ప్రవేశించెను. అంగదేశపురాజగు రోమపాదుని ఆశ్ర

మమువద్ద రాజాశ్రమమను వనముకలదు. ఆవనమందు ఋష్యశృం గుని నివసింపజేసిరి. అతడావనమందుండుటచేత ఆకాశమంతయు మబ్బులుగ్రమ్మి అంగదేశమంతయు మహావర్షములుకురిసెను. ఆవర్షము వలన మహానదులును, చెరువులును, బావులును జలపూర్ణము లయ్యెను. ఆదేశమందలి జనులందరును పరమానందమును బొందిరి. మరియు ఋష్యశృంగుని అనుగ్రహముచేత కరువునివర్తించెను. అందుల కాదేశపురాజగు రోమపాదుడు సంతసించి తనకూతురగుశాంతయను కన్యకనిచ్చి ఋష్యశృంగునికి వివాహముచేసెను. రోమపాదుడు బహు విధములగు ధనరాసులను వారికొసగెను. అనేకవిధభూషణములను యిచ్చెను. అనేక దాసీజనులనుయిచ్చెను. బంగారుపీటలను మంచము లను మొదలగువాటిని బహూకరించెను. అందులకు ఋష్యశృం గుడు సంతోషించెను. రోమపాదుడామునికి అనేక సహస్రముల గోవులనుయిచ్చెను. తనదేశమంతయు గోశాలలు నిర్మించి వానియం దాఋష్యశృంగునకిచ్చిన గోవులనుండజేసి సర్వదా సత్కారములచేత నాతనికి ప్రీతిగలిగింపుచుండెను.

## విభాండకుడు ఋష్యశృంగుని వెదకుచు వచ్చుట

ధర్మరాజా! ఇక విభాండకుని వృత్తాంతమును జెప్పెదవినుము. విభాండకుడు అడవినుండి వన్యఫలపుష్పములను దెచ్చి తనయాశ్రమము నకువచ్చి చూడగా ఋష్యశృంగుడు కనబడలేదు. అంతట విభాండ కుడు తనకుమారునికై సర్వదేశములను వెదకుచు తిరిగితిరిగి అంగదేశ మునకు వచ్చెను. అచ్చటగల యొకగొల్లపల్లెకుం జనగా. ఆ గొల్ల లందరును విభాండకుని పూజించిరి. అచ్చట మిక్కిలిగా గోవులసందడి యుండెను. అచ్చట విభాండకముని ఒకదినముండి, యీ గొల్లపల్లె యెవరిదని గొల్లవాండ్రనడిగెను. వారందరును మునికిట్లనిరి. మునీంద్రా!

సీపుత్రుడగు ఋష్యశృంగ మునీంద్రునకు వివాహమాయెను. అంగదేశము రాజగు రోమపాదుడు తనకూతురగు శాంతనిచ్చి వివాహము జేసెను. ఈగొల్లపల్లె ఋష్యశృంగునిదే ఇట్టిపల్లెలనేకము లాతనికిగలవు. ఈపల్లెలలోని గోవులమందలన్నియు నీసుతునివే. అని పలికిన గొల్లలమాటలనువిని విభాండకుడు సంతసమంది కుమారుని గోశాలలన్నిటియందును విశ్రమించుచు, రోమపాదుని పురమునకు వచ్చెను. అచ్చట శాంతతోగూడిన ఋష్యశృంగునిజూచి విభాండకుడు మిగుల సంతోషించెను. పిమ్మట ముని వారిరువురిని వెంటనిడుకొని తనయాశ్రమమునకు వెళ్ళెను. వశిష్ఠునకు అరుంధతివలెను, అగస్త్యునకు లోపాముద్రవలెను, మౌద్గల్యునకు నాలాయినియైన ఇంద్రసేనవలెను, శాంతాదేవి ఋష్యశృంగునకు భక్తితో ఉపచారములు చేయుచుండెను. ఋష్యశృంగుడును ఆమెవలన ఉపచారములనుపొంది సుఖముగా నుండెను. అని ఋష్యశృంగునిచరిత్ర, రోమశమునీంద్రుడు ధర్మరాజుతో జెప్పెను అంతట ధర్మరాజు లోనగువారందరును కౌశికసరస్సునందు స్నానమాడిరి. ఆసమీపమున గంగాసాగర సంగమముండెను. అందు ఏడువందల మహానదులు సంగమించును. ఆ గంగాసాగరసంగమమును జూచుచు పాండవులు తూర్పుసముద్ర తీరమునకు వెళ్ళి కళింగదేశమందు వైతరణియను మహానదిని జూచిరి. అంతట రోమశుడు ధర్మరాజుతో యిట్లు పలికెను.

ధర్మరాజా! పూర్వము యీవైతరణీనదియొక్క ఉత్తరపుగట్టున మునులు, దేవశ్రేష్ఠులు యజ్ఞములనుజేసిరి. అందువలన యిది మిక్కిలి పుణ్యభూమి. ఈ తీర్థమందు దేవతలు, ఋషులు, ప్రసిద్ధమైన పశుభాగమును యజ్ఞమందు శివునికి కల్పించిరి. ఇందు స్నానమాడినవారు దేవయానగతులగుదురు. అని రోమశుడు జెప్పగా ధర్మరాజు, ద్రౌపదీసహితుడై నలుగురుతమ్ములతో నా వైతరణి

యందు స్నానమాడెను. పిమ్మట ధర్మరాజు రోమశునితో మునీంద్రా! మీయనుగ్రహామువలన నాకుయిప్పుడు సకలలోకములును కనుబడి నవి. వైఖానసుల వేదాధ్యయన శబ్దములు నాకు వినబడెను. అని చెప్పగా మునీంద్రు డాశ్చర్యమునుపొంది ధర్మరాజా! వైఖానసులు నివసించు ప్రదేశమిచ్చటకు ముప్పదివేల యోజనముల దూరమున్నది. ఆశబ్దము ను నీవువింటివి. నీవు దివ్యపురుషుడవుగాని మానవుడవు గానేరవు. అనిచెప్పుచు వెళ్ళి ఒకవనమునుజూచిరి. ఆవనమందు వృక్షములు సర్వదా ఫలములచేత అలంకరింపబడి యుండెను. అక్కడ ఒకఅరుగుండెను. రోమశుడు ధర్మజునితో 'పూర్వము యీవనమందు విశ్వకర్మయజ్ఞముచేసి, సముద్రమైదక్షిణభూభాగ మంతయు నా యజ్ఞమునకు దక్షిణగా కశ్యపునకు యిచ్చెను. అందుకు భూదేవికోపించి రసాతలమునకు బోయెను. అంతట కశ్యపు డాభూదేవి దయను పొందిఘోరతపస్సుచేసెను. భూదేవి కశ్యపునియందు కరుణించి నీటిలోనుండి బయలువెడలి అరుగురూపమున కశ్యపునికి తనరూపమును జూపెను ఆ అరుగే యీయరుగు, ఇందుపైన యెక్కినవారు మిగులు పరాక్రమ వంతులగుదురు గాన, యీ మంత్రమును జపముచేయుచు యీ అరుగును యెక్కుము. ఈ మంత్రజపము లేనివారీ యరుగును యెక్కినయెడల వెంటనే యీయరుగు సముద్రమున ప్రవేశించును' అని చెప్పెను. మరియు.

శ్లో. ఓం నమో విశ్వగుప్తాయ నమో విశ్వపరాయతే
సాన్నిధ్యం కురుదేవేశ సాగరే లవణాంభసి.

శ్లో. అగ్నిర్మిత్రో యోనిరాపోధ దేవ్యోవిష్ణోరేత స్త్వమృతస్యనాభిః
ఏవంబ్రువన్ పాండవసత్యవాక్యం వేదీమిమాంత్వంతరసాధిరోహ

శ్లో. అగ్నిశ్చతే యోనిరిడాచదేహో రేతోధావిష్ణోరమృతస్యనాభిః
ఏవంజపన్ పాండవసత్యవాక్యం తతోవగాహేతపతింనదీనామ్.

శ్లో. అవ్యథాపిహికురు[శేష్ఠ దేవయోనిరపాంపతిః
కుశాగ్రేణాపి కౌంతేయ నస్ప్రష్టవ్యోమహోదధిః.

అను నీమంత్రములను ఉపదేశించెను. రోమశుని ఆజ్ఞాప్రకారము ధర్మరాజును తమ్ములును, రోమశుని మంత్రములను జపము జేయుచు ఆ అరుగునుయెక్కిరి. అప్పుడు బ్రాహ్మణులందరును ధర్మరాజును, సోదరులను దీవించుచుండిరి. పాండవులు సకలబ్రాహ్మణ మునులచేత సేవింపబడుచు మహేంద్రపర్వతమునకు వెళ్ళిరి. మహేంద్రపర్వతమందు దేవతలు నివసించి యుందురు. మహేంద్రపర్వతమందుగల మహాతపస్సంపన్నులగు మునులకునమస్కరించి పాండవాగ్రజుడు సంతోషముతో వారితో నిట్లనెను.

మునులారా! యీపర్వతమందు మహాత్ముడైన పరశురాముడుండును. మీరు పరశురాముని సర్వదాచూచుచుందురు. మీరు జూచునప్పుడు నాకును దర్శనముకాగలదు అని మునులను అడిగెను. వారిలో పరశురామునివద్దనుండు మునియొకడు గలడు. అతనిపేరు కృతప్రవణుడు, అతడాధర్మజునిమాటనువిని ధర్మరాజా! మీరాకను పరశురాము డిదివరకే దివ్యదృష్టివలన యెరుగును. రేపటిదినము చతుర్దశియగును. ఆమునులందరును రేపటిదినమందా పరశురాముని జూతురు. నీవును యీదినమంతయు యిక్కడనేయుండి రేపటిదినమందు పరశురాముని జూడుము. అనియిట్లు కృతప్రవణమునీంద్రుడు ధర్మరాజుతో జెప్పెను. ధర్మరాజు ఆమహేంద్రపర్వతమందు ఆరాత్రి నివసించియుండెను. ధర్మరాజు మునీంద్రునితో యిట్లనెను.

మహాత్మా! మహాత్ముడైన పరశురాముడు సర్వలోకపూజ్యుడు. వారిచరిత్రమును చెప్పుము అని ధర్మరాజు అడుగగా కృతప్రవణమునీంద్రు డిట్లనెను.

## కృతశ్రవణుడు ధర్మరాజునకు పరశురాముని మహిమ జెప్పుట

ధర్మరాజా! పూర్వము కన్యాకుబ్జమందు గాధియను రాజుండెను. గాధిరాజునకు సత్యవతియను కూతురుండెను. భృగుముని పుత్రుడైన ఋచికుడను మహామునీంద్రుడు సత్యవతిని వివాహ మాడ దలచి గాధిరాజు నడిగెను. గాధిరాజు యిట్లనెను. మహాత్మా! నా కూతురికి వోలిగా వేయిగుఱ్ఱములను నీవు యిచ్చినయెడల, నీవీమెను బెండ్లాడగలవు. ఆ గుఱ్ఱములు రాజహంసలబోలె తెల్లని కాంతిగలిగి యుండవలయును. ఆ గుఱ్ఱములకు ఒక చెవిమాత్రము నల్లగానుండవల యును. అటువంటి వేయిగుఱ్ఱములను నీవు యివ్వవలయును. వోలి తీసు కొనుట మాకు ధర్మమైయున్నది. అని గాధిరాజు పలుకగా ఋచికుడు సత్యవతిని వివాహమాడు వేడుకగలవాడై వరుణదేవునివద్దకు వెళ్ళి వరుణుని కరుణచే వేయిగుఱ్ఱములను తెచ్చెను. ఆ గుఱ్ఱములు వరుణుని కృపవలన గంగానదియొడ్డున గల కన్యాకుబ్జమను పురమందు పుట్టినవి. అప్పటినుండి కన్యాకుబ్జము అశ్వతీర్థమని చెప్పబడును. ఋచికుడు వేయిగుఱ్ఱములను తీసుకొనివెళ్ళి గాధిరాజునకిచ్చి, సత్యవతిని విధిప్రకారము పెండ్లాడెను. పిమ్మట ఋచికుడు సత్యవతిని గూడి కన్యాకుబ్జపురమందు సుఖముగా నుండెను.

ఒకనాడు ఋచికుని తండ్రియగు భృగుమహాముని కన్యాకుబ్జమునకు వచ్చి తనకొడుకును, కోడలిని జూచి వారిచేత పూజింపబడెను. ఒకనాడు భృగుమహాముని కోడలినిజూచి సంతోషముతో సత్యవతీ! నీగుణములకు నేను సంతోషించితిని. నీకిష్టమగు వరమును అడుగుము నేను యిచ్చెదను. అని పలుకగా సత్యవతి సంతోషముతో! మామగారూ! నీ యనుగ్రహమువలన ఒక కుమారుడు నాకును, ఒక కుమారుడు నాతల్లికిని పుట్టవలయును. ఈ వరమును నాకు దయచేయుము. అని యడుగగా భృగువు కరుణించి కోడలా!

నీవు కోరినట్లు నీకును, నీతల్లికిని గూడ యొక్కొక్క పుత్రుడు గలుగును. నీవు ఋతుకాలమందు పరిశుద్ధస్నానముచేసి అత్తిచెట్టును కౌగిలించుకొనుము. నీతల్లియు ఋతుకాలమున పరిశుద్ధస్నానము చేసినప్పుడు రావిచెట్టును కౌగిలించుకొనుమని చెప్పుము. అనిపలికెను. ఋతుకాలములయందు పరిశుద్ధస్నానములు చేసి భృగువు చెప్పినమాట మరచి, తాను రావిచెట్టును, తల్లి అత్తిచెట్టును కౌగిలించుకొనిరి. ఈ విషయమును భృగువెరింగి సత్యవతితో కోడలా! నేను నిన్ను అత్తిచెట్టును, నీతల్లిని రావిచెట్టును కౌగిలించుకొనుడని జెప్పియుండగా, నామాటకు భిన్నముగా నీవు రావిచెట్టును, నీతల్లి యత్తిచెట్టును, కౌగిలించుకొనిరి. అందువలన నీకు కలుగు పుత్రుడు బ్రాహ్మణులచేత పూజింపబడినను భయంకరమగు క్షత్రియధర్మములను చేయును. సకలరాజులను యుద్ధమందు చంపును. నీతల్లికి బుట్టు కుమారుడు క్షత్రియుడైనను మహాతపస్సంపన్నుడగును. బ్రాహ్మణత్వమును పొందును. అని బల్కిన సత్యవతి నమస్కరించి భృగువుతో యిట్లనెను మునీంద్రా! నాపుత్రునకు క్షత్రియగుణములు కలుగకుండనుండవలయును. నామనుమనికి క్షత్రియగుణములు గలుగునట్లుగా వరమిమ్మని అని సత్యవతి భృగువును ప్రార్థించి వరమును బడసెను. కొంతకాలమునకు సత్యవతి గర్భవతియయ్యెను. సత్యవతికి జమదగ్నిమునీంద్రుడు పుట్టెను. అతడు నాలుగువేదముల యందును, ధనుర్వేదమందును కూడ సమర్థుడు. ఆ కాలమున ప్రసేనచిత్తుడను రాజుండెను. ఆరాజునకు రేణుకయను కూతురుండెను. ఆ రేణుకను జమదగ్ని పెండ్లియాడెను.

జమదగ్నికి రేణుకయందు, రుమతి, ఉత్సాహుడు, విశ్వావసుడు, పరశురాముడు అను పేర్లుగల నలుగురు కుమారులు కలిగిరి. జమదగ్ని వనములో తపమాచరించుచుండె. ఒకనాడు నలుగురు

కుమారులును ఫలములను దెచ్చునిమిత్త మడవికి బోవుచుండగా తల్లియగు రేణుక వారిని వెంబడించెను. ఆమార్గమున ఒక సరస్సులో చిత్రసేనుడను రాజు భార్యాసహితముగా జలక్రీడలాడుచుండెను. అతడు అంగదేశపురాజు. అటువంటి జలక్రీడావినోదమున దేలియాడు చున్న చిత్రసేనుని జూచి రేణుక కామమోహపీడితయై యాతనిజేరి వానింగలసి వ్యభిచరించెను. ఆ దుష్కర్మమును జమదగ్ని తెలిసికొని మహాకోపముగలవాడై రేణుకను చంపుడని తన మొదటి ముగ్గురు కుమారులను ఆజ్ఞాపించెను తల్లిని చంపుట మహాపాపమని తలచి వారు ముగ్గురును జమదగ్ని యాజ్ఞాప్రకారము చేయలేదు. జమదగ్ని మహాకోపముతో వారినిజూచి కుమారులారా! మీరు నా యాజ్ఞా ప్రకారము చేయలేదు. గాన మీరు ముగ్గురును భయంకరారణ్యా మందు మృగములు, పక్షులువలెనే అజ్ఞానులై మందబుద్ధిగలవారలై యుండుడు. అని శపియించి నాలుగవకుమారుడైన పరశురామునితో ఓరీ! పరశురామా! నీతల్లి యగు యీ రేణుకను చంపుము. అని యాజ్ఞాపించెను. తండ్రియాజ్ఞాప్రకారము పరశురాము డాక్షణమందే రేణుకను చంపెను. జమదగ్ని పరశురాముని సాహసమునకును, తన యాజ్ఞను పాలించినందుకును మిగుల సంతసించి పరశురామునితో ప్రియపుత్రా! పరశురామా! నీవు నామాటప్రకారము మిక్కిలి సాహసమును జేసితివి. గాన నీకిష్టమగు కోరికలను యిచ్చెదను. వరములను వేడుము అని చెప్పగా పరశురాముడు సంతసించి యిట్లు పలికెను. తండ్రీ! జమదగ్నిమునీంద్రా! నాతల్లియగు రేణుక దోషము లేనిదై జీవింపవలయును. నాయన్నలు ముగ్గురును శాపవిముక్తులై యెప్పటివలె నుండవలెను. యుద్ధములందు నాకు మిక్కిలి శక్తిగలిగి యుండవలయును. దీర్ఘాయుష్య ముండవలయును. ఈ నాలుగు వరములను నాకు ప్రసాదింపుము. అని పరశురాముడడుగగా జమ

దగ్ని నాలుగువరములకు యిచ్చెను. జమదగ్ని పరశురాము రేణుకాదులు యెన్నియో సుఖముగానుండిరి కొంతకాలమునకు హైహయవంశరాజగు కార్తవీర్యార్జునుడు ఆ వనమునకు వేటాడునిమిత్తమై వచ్చెను. కార్తవీర్యార్జునకు వేయిచేతులుండెను ఆతడు వేటాడి వచ్చినందున మిక్కిలి శ్రమజెందుటచే, సైన్యసమేతముగా నడవిలో నున్న జమదగ్ని యాశ్రమమున విడిసెను. జమదగ్ని కార్తవీర్యార్జునుని పూజించి ఆదరించెను. గాని కార్తవీర్యార్జును డాపూజలను మెచ్చక, ఆశ్రమమందుండు వారి నవమానపరచి, రాజ్యమదముచేత నచ్చట గల ఫలపుష్పవృక్షముల నన్నిటిని విరచి నాశన మొనర్చెను. మరియు కార్తవీర్యార్జునుడు జమదగ్నియొక్క గోవును, దాని దూడను కూడతీసికొనిపోయెను. అంతట పరశురాముడు అడవిలో నుంచి ఫలదర్భపుష్పాదులను కోసికొని తన యాశ్రమమునకువచ్చెను. అంతట జమదగ్ని పరశురామునితో కుమారా! కార్తవీర్యార్జునుడు మన హోమధేనువును పట్టుకొని వెళ్ళెను. మనమేమి చేయగలమో చెప్పుము. నీవు వెళ్ళి కార్తవీర్యుని చంపిరమ్ము. అని జమదగ్ని పరశురామునితో జెప్పెను. వెంటనే పరశురాముడు వెళ్ళి కార్తవీర్యుని సైన్యములను తన క్రూరబాణములచేత చంపెను.

## పరశురాముడు కార్తవీర్యుని చంపుట

ధర్మరాజా! కార్తవీర్యార్జునుడు, అద్భుతమైన బలపరాక్రమవంతుడు. అటువంటి కార్తవీర్యార్జునునివేయిచేతులను వజ్రాయుధములవంటి క్రూరబాణములచేత పరశురాముడు ఘోరయుద్ధము జేసి నరికివేసెను. ఆసమయమున పరశురామునిజూచి సకలజనులను మహాభయమును పొందిరి. అంతట కార్తవీర్యార్జునుని పుత్రులందరును పరశురామునియందు అధికమగు వైరమును, కోపమును బూనిన వారలై

పరశురాముడు లేనప్పుడు జమదగ్ని ఆశ్రమమునకు వచ్చిరి. మరియు మునులను తిట్టుచుండిరి. పుష్పవృక్షములనుపడగొట్టు చుండిరి. వారందరును క్రూరులై జమదగ్నిని పట్టుకొనిరి. జమదగ్ని హారామా! హారామా! యని దుఃఖమున యరచుచుండగా వానింబట్టి వధించిరి. మునులందరును దుఃఖించిరి. ఈ రీతిగా మహాపాపాత్ములైన కార్తవీర్యుని పుత్రులందరును మహాధార్మికుడైన జమదగ్ని మహామునిని జంపి వెళ్ళిరి, పరశురాముడు వనమునుండి వచ్చి చూచెను. పరశురాముడు మిగుల దుఃఖమును జెందెను. తల్లియగు రేణుకాదేవి విలపించుచుండుట పరశురాముడు చూచెను. జమదగ్ని చచ్చి పడియుండెను.. తండ్రి చచ్చిన విధమంతయు పరశురాముడు తెలిసికొని అధిక కోపము గలవాడై యిట్లని ప్రతిజ్ఞ చేసెను. మునులారా! నాతండ్రియగు జమదగ్ని పుణ్యాత్ముడు, నిర్దోషి, కృపాసముద్రము వంటి చిత్తముగలవాడు, పరమశాంత చిత్తుడు. ఇటువంటి నాతండ్రిని క్షత్రియ హీనులు చంపిపోయిరి. సకల క్షత్రియులును దుర్జనులగుదురు. నేను సకల క్షత్రియులను చంపెదను. అని భయంకరమైన ప్రతిజ్ఞ చేసెను.

పరశురాముడట్లు ప్రతిజ్ఞచేసి ఒక ముహూర్తకాలమైనను సహించి యుండజాలక వెళ్ళి క్షత్రియులనందరను క్రమముగా చంపెను. మొదట కార్తవీర్యుని కొడుకులందరిని జంపి పిమ్మట క్రమముగా భూమియందుగల సకల క్షత్రియులను చంపివేసెను. ఇట్లు పరశురాముడు సకలరాజ వంశములను నిశ్శేషముగా చంపి సకల భూమీచక్రమును సాధించి తీసికొనెను. పిమ్మట పరశురాముడు శాస్త్రవిధి ననుసరించి యజ్ఞముచేసి సకల భూచక్రమును ఆయజ్ఞమందు దక్షిణగా కశ్యపమునీంద్రునకు యిచ్చెను. మహాత్ముడగు

పరశురాముడు నిస్సంగుడై యీమహేంద్ర పర్వతమందుండి సర్వదా తపస్సు చేయుచున్నాడు. అని కృతవ్రణ మునీంద్రుడు పరశురాముని చరిత్రమును ధర్మరాజునకు జెప్పెను. ధర్మరాజు తనసహోదరులతో, బ్రాహ్మణులతో కలిసియుండి అక్కడి మునులు చెప్పిన ప్రకారం చతుర్దశినాడు పరశురాముని జూచెను. ధర్మరాజు పరమ భక్తిపూర్వకముగా పరశురాముని పూజించెను. పరశురాముడును ప్రీతిపూర్వకముగా ధర్మరాజును పూజించి వెళ్లెను. ధర్మరాజు మహేంద్రపర్వతము విడిచి దక్షిణదిక్కునకు వచ్చి గోదావరీనదిని జూచెను. మూడులోకములను పరిశుద్ధిజేసెడి పుణ్యనదియగును. శివునివలన పుట్టినది. గాన దక్షిణ గంగానది యని చెప్పబడును.

పాండవులా గోదావరీనదిని జూచిరి. ధర్మరాజు గో బ్రాహ్మణ దేవతలయందు పరమభక్తి గలవాడై గోదావరి నదియందు స్నానముజేసెను. అనేక గోహిరణ్యరత్న దానములను జేసెను. విశేషదానములచేత బ్రాహ్మణులను పూజించెను. ధర్మరాజు పిమ్మట బ్రాహ్మణులతోడను సహోదరులతోడను గలిసి ద్రవిడదేశమునకు బోయి అగస్త్య తీర్థమందు స్నానము చేసెను. పూర్వము అర్జునుడు తీర్థయాత్రకు వెడలినప్పుడు అగస్త్యతీర్థమందు అనేక గోసహస్ర నానావిధ దానములను చేసెనని ధర్మరాజువిని అర్జునుని పొగడుచు, ఆతీర్థమును స్తుతించుచు వెళ్ళెను. ధర్మరాజు శూర్పాకారమను తీర్థమందు గల పర్వతోత్సేధమైన పరశురామ వేదిని జూచెను. ధర్మరాజాదులందరును పశ్చిమ సముద్ర తీరమునకు బోయిరి. అచ్చటగల ప్రభాసతీర్థమందు ధర్మరాజు పంద్రెండుదినము లుండి వాయు జలములను భక్షించుచు పంచాగ్ని మధ్యమందు తపస్సు జేసెను. ధర్మరాజు ప్రభాసతీర్థమందు తపస్సుచేయుట కృష్ణబలరాములెరిగి సకలయాదవశ్రేష్ఠులను వెంటబెట్టుకొని ప్రభాస

తీర్థమునకు వచ్చిరి. ప్రభాసతీర్థము ద్వారకాపట్టణసమీపమందు గలదు. పాండవులాకృష్ణ బలరామాది యాదవులనుజూచిరి. సకల పుణ్యతీర్థమార్గ శ్రమలచేతను ఉపవాసాదులచేతను, పాండవులు శుష్కించి యుండిరి. పాండవులును ద్రౌపదియును నారచీరలనుధరించి కృష్ణాజినములను కప్పుకొనిరి. మహాతపస్సంపన్నులైన నిర్వికారచిత్తులై యుండిరి. మహాకీర్తివంతులై యుండిరి. పాండవులనుజూచి బలరామాది యాదవులందరును దుఃఖించి ద్రౌపదిని మృదుమధుర వాక్యములచేత ఊరడించిరి. ధర్మరాజు వారినందరను గౌరవించి యిట్లనెను, యాదవులారా! మేము వనవాసముచేత మిగుల శ్రమ పడుచున్నాము. దేవతలవలన దివ్యాస్త్రములను పొందుటకు అర్జునుని పంపితిమి. అర్జునుడు, ఈశ్వరుడు మొదలగు దేవతలవలన దివ్యాస్త్రములను పొందెను. అర్జునుడు దేవేంద్రుని దగ్గరనున్నాడు. అని ధర్మరాజు యాదవులతో చెప్పెను.

బలరాముడామాటవిని కృష్ణసాత్యక్యాదులతో యిట్లనెను. కృష్ణసాత్యక్యాదులారా! ధృతరాష్ట్రుడు బుద్ధిహీనుడు, కొడుకులగు దుర్యోధనాదుల మాటలువిని మహాత్ములగు పాండవుల రాజ్యమును అపహరించెను. పాండవులను అరణ్యములకు పంపించెను. ఇది ధర్మము గాదు. భీష్మాదులు జెప్పినను ధృతరాష్ట్రుడు వారిమాటలను వినక పాండవులకు కష్టములుకలిగించెను. పాండవులు దృఢసత్యవ్రతులు, దివ్యపురుషులు, వారికి దుర్యోధనాదినీచులు కీడుగలిగించిరి. అట్టి వారికి దైవము అభివృద్ధి గలిగించెను. పాండవులకు దైవము హీన స్థితికలిగించెను. ఇది దైవమునకు ధర్మముగాదు. మనము ధృతరాష్ట్రుని కొడుకులనందరను నిశ్శేషముగాజంపి మహాత్ముడగు ధర్మరాజునకు సకలరాజ్యాభిషేకము చేయుదము. అట్లుచేయకుండుట మనకుధర్మము గాదు, అని బలరాముడు చెప్పగా సాత్యకి బలరామునితో నిట్లనెను.

బలరామా ! నీవును, కృష్ణుడును, సాంబుడును సాత్యకియును ప్రద్యు మ్నుడును అపరిమిత బలపరాక్రమ శౌర్యవంతులగుదురు. మనమింత బలవంతులమై యుండగా పాండవులు దుర్యోధనాదులవలన యింత హీనస్థితిని పొందరాదు పాండవులు దుర్యోధనుని కపటోపాయము వలన రాజ్యమును బోగొట్టుకొనిరి. కందమూలఫలములను భక్షించు చుండిరి. మనము బ్రతికియుండగా పాండవులకిట్టి నీచస్థితి గలుగరాదు. గాన మనమును మనయాదవసైన్యమును తీసికొని యిప్పుడేపోయి దుర్యోధనుని సైన్యమంతయును జంపుదము. జగత్తంతయు మ్రోగు నట్లు మనయాదవసైన్యములను నడిపింతము మనసైన్యములయందు భేరీధ్వనులను భయంకరముగా మ్రోగింతము, మనయాదవసైన్యము లనుజూచి దుర్యోధనుని వీరభటులందరును భయపడుదురు. నీవు నీ నాగలిని ఆయుధముగా గ్రహింపుము. కృష్ణుడు శార్ఙ్గమనుధనుస్సుచే క్రూరబాణములనుగుప్పును. ప్రద్యుమ్నుడు దివ్యబాణములను ప్రయో గించును. అనిరుద్ధుడు తనధనుర్విద్యాసమర్థతను జూపును. నాయస్త్ర విద్యాచమత్కారమును నేను జూపెదను. మనమందరము యుద్ధము నకు వెళ్ళినయెడల యుద్ధమందు ధృతరాష్ట్రుని కుమారులందరిని సునాయాసముగా జంపగలము.

కృష్ణుని యాజ్ఞవలన కేకయ, సృంజయ, పాంచాల, వృష్ణి, భోజ, అంధక, వీరులందరును యుద్ధమందు ధృతరాష్ట్రుని కుమారు లందరిని చంపగలరు. భీష్మ ద్రోణకర్ణాదివీరులనందరిని చంపగలరు. ధర్మరాజు తనయేర్పాటుప్రకారము పదమూడు వత్సరములను జరిపి తమ్ములును తానును పిమ్మటవచ్చి రాజ్యాభిషిక్తుడగును. అంతవరకు అతిరథుడైన అభిమన్యుడు రాజ్యమును రక్షించుచు పరిపాలింపగలడు గాన మనమిప్పుడు పోయి కౌరవులనుచంపి అభిమన్యుని రాజ్యరక్షకు నిగా జేయుదము. అని పలికిన సాత్యకిపలుకులకు అనుకూలముగా కృష్ణుడు ధర్మజుతో యిట్లు చెప్పెను.

ధర్మరాజా! సాత్యకి బలరామాదులందరును యుద్ధమున దక్షులు. సాత్యకి జెప్పినట్లు యీయాదవులు నీశత్రువులను చంపగలరు. మీకు సమస్తరాజ్యమును లభింపగలదు. ఇదిసత్యము. అనికృష్ణుడు పలుకగా ధర్మరాజుయిట్లనెను. కృష్ణా! మీదయ మాకున్న యెడల మేము శత్రువులను జయించుట యొకగొప్పకార్యముగాదు. ఆభీష్మద్రోణవిదురాదులందరును సత్యధర్మబుద్ధి మంతులగుదురు. మహాకీర్తివంతులగు వారియెదుట పదమూడ సంవత్సరము లరణ్యవాసాజ్ఞాతవాసములను జేయుటకు సమ్మతించి చెప్పివచ్చితిని. ఆమాటతప్పరాదు గానమీరు కోపము వహింపకుడు అని చెప్పి ధర్మరాజువారికోపములను మాన్పెను. పిమ్మట బలరామాది యాదవులందరును పాండవులతో చెప్పి ద్వారకాపట్టణమునకు వెళ్ళిరి. పాండవులు సోమశ్రవసమ్మితమైన పయోష్ణితీర్థమందు స్నానమాడిరి. అంత రోమశుడు ధర్మరాజునకు యిట్లు చెప్పెను.

ధర్మజా! పూర్వము పయోష్ణితీర్థతీరమందు భృగుడనురాజు యజ్ఞముజేసెను. దేవేంద్రుడు తృప్తిహొంది ఘోరాస్త్రములచేత రాక్షసులనుచంపెను. ఇందు మహాకీర్తివంతుడగుగయుడు బంగారుమయములగు సాధనములచేత, దేవతలచేత స్థాపితమైన స్తంభములచేత, యేనూరశ్వమేధయజ్ఞములను జేసెను. ఆయజ్ఞమందు లెక్కలేనంతమంది బ్రాహ్మణులను పూజించెను. బాంగారుమయములగు గోవులను బ్రాహ్మణులకు దానమిచ్చెను. గయుడు యేనూరు అశ్వమేధయజ్ఞములనుచేసి అక్షయమగు యింద్రలోక సుఖములను పొందెను. ఇందుస్నానముచేసినవారు యింద్రసాయుజ్యమును పొందుదురు. అని యీరీతిగా రోమశుడు పయోష్ణితీర్థ మహాత్మ్యమును ధర్మరాజుతో జెప్పుచుపోయెను. పిమ్మట ధర్మరాజు నర్మదానదిస్నానముచేసి వైడూర్యపర్వతమును చూచెను. రోమశుడు ధర్మరాజునకిట్లనెను.

ధర్మరాజా! పూర్వము త్రేతాద్వాపరయుగముల సంధికాల మందు యీ సరస్సుతీరమున సంయాతియనురాజు యజ్ఞముజేసెను. భృగుముని పుత్రుడైన చ్యవనముని సంయాతిరాజు కూతురగు సుకన్యయనుదానిని యిక్కడ వివాహంమాడెను. సంయాతి యజ్ఞమందు చ్యవనమునీంద్రుడు దేవేంద్రుని యాదరింపక అశ్వినీ దేవతలకు సోమమునుయిప్పించి వారిచేత సోమపానమును జేయించెను. అనిరోమశుడు చెప్పగా దానిని వివరింపుమని ధర్మరాజు అడిగెను. అప్పుడు సౌకన్యాఖ్యానమును సవిస్తరముగా జెప్పదలచి రోమశుడు ధర్మరాజునకు యిట్లుచెప్పెను.

## రోమశుడు ధర్మరాజునకు సౌకన్యాఖ్యానము జెప్పుట

ధర్మరాజా! పూర్వము భృగుమహాముని పుత్రుడగు చ్యవన మహాముని యీ సరస్సునకు సమీపమున అనేక సహస్రసంవత్సరములు తపస్సుచేసెను. చ్యవనుడు పరమనియమవంతుడై అధికాశ్చర్యముతో ననేకవేల సంవత్సరములు తపస్సుచేసెను. అప్పుడు చ్యవనుని దేహము పుట్టచేత కప్పబడియుండెను. అనేకములగు తీగెలును పొదలును చ్యవనుని దేహమందును పుట్టయందును ప్రాకి అల్లుకొనియుండెను. అయినను చ్యవనుడా వనభూమియందుగల ప్రేమచేత నాస్థలమును విడువకుండెను. చాలాకాలమునకు సంయాతి యను రాజొకడు ఆ సరస్సునందు విహరించుటకు వచ్చెను. ఆ రాజునకు నాలుగువేలమంది భార్యలు గలరు. ఆ భార్యలందరును సరస్సునందు విహరించుటకు సంయాతి వెంబడి వచ్చిరి. సంయాతిరాజునకు సుకన్య యను ఒక కూతురుగలదు. సుకన్య తన చెలికత్తెలతోగూడి యీ వనమందు తిరుగుచుండెను. ఆ పుట్టయందు చ్యవనుని నేత్రములు మాత్రము కనబడుచు తక్కిన దేహమంతయు పుట్టచేత వ్యాపించ

బడియుండెను. ఆ పుట్టయందు చ్యవనుని నేత్రములను సుకన్య జూచి సూర్యుని కాంతులేమోయని తలచి పుట్టను త్రవ్వించెను. చ్యవను డందులకు కోపించి కండ్లు మూసికొని సంయాతిసైన్యముల కన్నిటికిని మూత్రపురీషములు రాకుండునట్లు నిరోధించెను. సంయాతి తన సైన్యములనందరిని కారణమును గూర్చి యడిగెను. ఆతడు తన సైనికులయందపరాధముగలదని తలంచెను. గాని వారివలన యప రాధ మున్నట్లు తెలియలేదు. అందువలన సంయాతి మిగులచింతను గలిగియుండెను. అంత కూతురగు సుకన్య తండ్రిదగ్గరకువచ్చి యిట్లు చెప్పెను.

తండ్రీ! ఒకపుట్టలో అగ్నికణములబోలు రెండు ప్రకాశవస్తువులు నాకుకనబడెను. నేనెరుగక ఆపుట్టనుత్రవ్వించితిని. అట్లుత్రవ్వించగా నారెండును ఉపల కనబడలేదు. అంత నా పుట్టను త్రవ్వుట మాని యాశ్చర్యమును పొందితిని. సైన్యనిరోధమున కదికారణమై యుండునేమో తెలియదు. అని సుకన్య చెప్పగా సంయాతి పుట్టవద్దకు వచ్చి చూడగా నచ్చట నొకముని కనబడెను. ఆ మునియొక్క దేహము తపోభారముచేత శుష్కించియుండెను. అతడు ముసలివాడు. అట్టి చ్యవనునిజూచి సంయాతి యిట్లనెను. మునీంద్రా! నాకూతు రగు సుకన్య మీతపోమహిమను యెరుగక యీ పుట్టను త్రవ్వించి మీకుఅపరాధము చేసెను. దీనినిమీరు సహింపవలెను. నా సైన్యము నకు గలిగిన మూత్రపురీష నిరోధమును తగ్గింపుము. నాయందు దయ జూపుము. స్త్రీలు అజ్ఞానలుగదా! అని యిట్లు సంయాతి చ్యవను నికి నమస్కరించిచెప్పి ప్రార్థించెను. అంత చ్యవనుడు కరుణించి యిట్లు చెప్పెను.

ఓ సంయాతిమహారాజా! యీ కన్యక అధికరూపసౌందర్య యౌవనములచేత గర్వించియున్నది. ఈ కన్యకను నా కిచ్చితివేని

యీతప్పిదమును సహింతును అని చ్యవనుడు చెప్పగా సంయాతి తన కూతురగు సుకన్యను చ్యవనునకిచ్చి తన సైన్యములకు గలిగిన బాధను పోగొట్టుకొని వెళ్ళెను. సుకన్య తనభర్తయగు చ్యవనునియం దధికభక్తిగలదై యుపచరించుచుండెను. అంత అశ్వినీ దేవతలిద్దరును సుకన్యవద్దకువచ్చి సుకన్యా! మేమిద్దరమును అశ్వినీదేవతలము. నీవు యెవరికుమార్తెవు ? యెవరిభార్యవు ? మాకు చెప్పుము అని యడుగగా సుకన్య యిట్లు చెప్పెను.

అశ్వినీదేవతలారా ! నేను సంయాతిరాజుయొక్క కూతురను. భృగుమహాముని పుత్రుడగు చ్యవనమహామునికి భార్యను అని సుకన్య చెప్పగా అశ్వినీదేవతలు నవ్వి చిన్నదానా ! నీవు మహారూప యౌవన సౌందర్యవంతురాలవు. చ్యవనుడు మిక్కిలి ముసలివాడై నందున కామభోగముల ననుభవించి నిన్నుతృప్తిపరచుటకు యోగ్యుడు గాడు. అట్టిచ్యవనుని వరించి నీయౌవనమును వ్యర్థముగావించుచుంటివి. నీయౌవన రూపమునకు దగినవరుని మేము తెచ్చెదము. ఇకమీదనైన వానినివరియింపుము. అనిపలికిన నామాటలను సహింపజాలక సుకన్యవారితో నిట్లనెను. మహాత్ములారా ! మహానుభావుడగు చ్యవనునియందు నాకెక్కువగా మక్కువగలదు. మీరు చెప్పినది ధర్మము గాదు అని వారితోబలికి, పిమ్మట నామాటలనన్నిటిని చ్యవనుని కడకు జని నివేదించెను. చ్యవనుడు సుకన్య పాతివ్రత్య భావమునకు సంతసించి అశ్వినీదేవతలమాటలకు సమ్మతింపుమని సుకన్యను పంపించెను. చ్యవనుని యాజ్ఞమేరకు సుకన్యవెళ్ళి అశ్వినీదేవతలతో యిట్లనెను.

దేవతలారా ! నాభర్తయగు చ్యవనునకు యౌవనమును బ్రసాదింపుడు అని సుకన్య చెప్పగా నాయశ్వినీదేవత లిరువురును యీ సరస్సున బ్రవేశించిరి. చ్యవనుడుకూడ వారితోడనే నాసరస్సున

ప్రవేశించెను. వెంటనే నాముగ్గురును యౌవనవంతులై బయటికి వచ్చిరి. అట్లువచ్చి సుకన్యతో సుకన్యా ! మాముగ్గురిలో నీయిష్టము వచ్చినవారిని వరింపుము అని అశ్వినీదేవతలు పలికిరి. కాని సుకన్య తనభర్తయగు చ్యవనమహామునినే వరించెను. ధర్మరాజా ! యీరీతిగా అశ్వినీదేవతలవలన చ్యవనుడు యౌవనవంతుడై పరమసంతోషముతో వారలతో నిట్లనెను.

## చ్యవనుం డశ్వినుల సోమపీథులను జేయుట

అశ్వినీదేవతలారా ! మీవలన నేనుయౌవనమును పొందితిని. నేనిప్పుడు సంయాతిరాజుచేత యజ్ఞమును చేయించెదను. ఆయజ్ఞమందు దేవేంద్రుడు జూచుచుండగా మీకుసోమమును యిచ్చి మీచేత సోమపానము జేయించెదను. అని చ్యవనమునీంద్రుడు చెప్పగా అశ్వినీదేవతలు సంతోషించి వెళ్ళిరి. చ్యవనునకు యౌవనముకలిగినదని సంయాతిరాజు వినెను. సంయాతి సంతోషించి అల్లుని, కూతును జూచుటకువచ్చి వారిని జూచెను. చ్యవనుడు తనమామయగు సంయాతిరాజును పూజించి యిట్లనెను.

రాజా ! నీచేత నేను యజ్ఞముచేయించెదను. నీవుయజ్ఞముచేయుము. అందుకు తగిన వస్తుసంభారములను సమగ్రముగా చేకూర్పుము. యజ్ఞముచేయుటవలన మేలుకలుగును. అని చెప్పగా చ్యవనునిమాట ప్రకారము సంయాతిరాజు విధి ప్రయోగయుక్తముగా యిక్కడ యజ్ఞముచేసెను. అందు చ్యవనుడు అశ్వినీదేవతలకు సోమమునిచ్చుటకు ప్రయత్నించెను. అంత దేవేంద్రుడు చ్యవనునియందు కోపముగలవాడై మునీంద్రా! అశ్వినులిద్దరును దేవతలకు వైద్యులు. వీరు యజ్ఞసోమమునకు అర్హులుకారు. వీరు దేవవైద్యులేకాని దేవతలుకారు. దేవతలుకానివారికి యజ్ఞసోమమును యిచ్చెడి పిచ్చివాం

ద్రుడు యెక్కడను కనబడరు గనుక నీఅశ్వినులకిద్దరికిని సోమమునియ్య వద్దు అనిపలికెను. దేవేంద్రుని మాటలను చ్యవనుడు లెక్కచేయక అశ్వనీదేవతలకు సోమమునిచ్చి పానముచేయించెను. దేవేంద్రుడం దులకు మిగులకోపించి విజృంభించి వజ్రాయుధమును యెత్తెను. చ్యవనమునీంద్రుడు స్తంభనవిద్యచేత దేవేంద్రుని రెండుచేతులను స్తంభింపజేసెను. ఆవిద్యాప్రభావమువలన దేవేంద్రుని రెండుచేతు లును బంధింపబడినరీతిని కదలకయుండెను. వజ్రాయుధముకూడ నిల బడియుండెను. అంతచ్యవనుడు మిగులకోపముగలవాడై రౌద్రముతో దేవేంద్రుని చంపదలచి వేదమంత్రములచేత అగ్నిహోత్రమందు హోమము గావించెను. వెంటనే మధుడను రాక్షసుడు పుట్టెను. అతడపారబలవంతుడు. మహావేగవంతుడు నగుటచే సకలదేవతల కును భయమును కలిగింపుచుండెను. ఆరాక్షసుని చేతులు పదివేల ఆమడల పొడుగుండెను. వానికి నూరామడల పొడవుగల నాలుగు ప్రక్కకోరలుండెను. పదియామడల పొడవుగల పళ్ళుండెను. సూర్య చంద్రమండలములవంటి రెండునేత్రము లుండెను. వానిశరీరము సకల దిక్కులను భూమ్యాకాశములును వ్యాపించియుండెను. ఇటువంటి మధురాక్షసుడు తననోటిని తెరచియుండగా భూమియందు క్రిందపెద వియు, స్వర్గమందు పై పెదవియు గలవు. వానినిజూడగా సకలలోక ములను మ్రింగదలచిన వానివలెనుండెను. మధురాక్షసుడు నాలుక చేత క్రిందపెదవిని నాకుచుండెను. మరియు అతిభయంకరముగా సింహనాదము జేసెను. ఆధ్వనివలన దిక్కులుపగిలినట్లుండెను. ఈరీ తిగా మధురాక్షసుడు దేవేంద్రునిమీదికివచ్చెను. దేవేంద్రుడు వానిని జూచి భయపడి తనరెండుచేతులు బంధింపబడి యున్నందున రాక్షసు నేమియుచేయజాలక చ్యవనునిదగ్గరకువచ్చి నమస్కరించి యిట్లుచెప్పెను.

మునీంద్రా! నీకు నమస్కరింపుచున్నాను. నీతపోవీర్య మహా శక్తి మిథ్యకానేరదు. ఈ దినము మొదలుకొని అశ్వినులు సోమము నకు అర్హులగుదురు. నీవునాయందు కరుణించి నన్ను రక్షింపుము. నా తప్పిదమును క్షమింపుము అని చ్యవనుని ప్రార్థించెను. ఆప్రార్థనవలన చ్యవనుని కోపమంతటనే యంతరించెను. వెంటనే దేవేంద్రుని చేతులు స్తంభనమునుండి ముక్తమయ్యెను. దేవేంద్రుడు చ్యవనుని యనుజ్ఞనుపొంది తనపట్టణమునకు వెళ్ళెను. అంతట మధురాక్షసుడు చ్యవనుని యాజ్ఞాప్రకారము కల్లుయందును, స్త్రీలయందును, వేట యందును, జూదమందాడుసొగటాల కాయలయందును ఆశ్రయించి యుండెను. అశ్వినీదేవతలు యజ్ఞమందు సోమపానముజేసి స్వర్గము నకువెళ్ళిరి. ధర్మరాజా! యీప్రకారము భృగుమహాముని పుత్రు డగు చ్యవనమునీంద్రుడు తనతపోమహాత్మ్యమువలన యిక్కడ ప్రకా శించెను. అప్పటినుండి ఆవైడూర్య పర్వతము అర్చికపర్వతమని చెప్పబడుచున్నది. అని రోమశుడు ధర్మరాజుతో జెప్పెను. ధర్మ రాజా పుణ్యసరస్సునందు స్నానముచేసెను. వారితో భీమాదులంద రునుస్నానముజేసిరి. పాండవులు శాంతక శౌనక నరనారాయణ విధా తృలకు తపోస్థానమైన సైంధవారణ్యమునకు బోయిరి. ఆయరణ్యము దేవఋషులకు నివాసభూమి. అచ్చట చంద్రసరస్సు కలదు అనిరోమ శుడు చెప్పగా పాండవు లాసరస్సున స్నానమాడి అతిథులను పూజిం చివెళ్ళి యమునానదిని జూచిరి. అంతట పాండవులకు రోమశు డిట్లుజెప్పెను.

## మాంధాతృచరిత్రము

పాండవులారా! ఇది యమునానది. ఇది గంగానదితో సమ మగు పుణ్యనది. ఇచ్చట పూర్వము మాంధాతృడను మహారాజు

అనేకయజ్ఞములను అనేకసంవత్సరముల పర్యంతము తన సంపదల చేత చేసెనని రోమశుడు చెప్పగా ధర్మరాజు మునీంద్రా! వారిజన్మ చరిత్రము వినగోరెదము చెప్పుమని యడుగ రోమశు డిట్లని చెప్ప సాగెను. ధర్మరాజా! ఆ మహారాజు యిక్ష్వాకువంశమున పుట్టిన పుణ్యాత్ముడు. వేయి అశ్వమేధయజ్ఞములను చేసిన పుణ్యపురుషుడు. మహాబలవంతుడు, మితిలేని కీర్తివంతుడు. మిగుల జ్ఞానవంతుడు. వాని జన్మక్రమంబును చెప్పెదవినుము. యువనాశ్వుడను యిక్ష్వాకు వంశపురాజు కలడు. అతడు పుత్రసంతానము లేక మిగుల దుఃఖిం చెను. యువనాశ్వుడు తన రాజ్యభారమును మంత్రులయం దుంచి భృగుమహర్షి యాశ్రమమునకు పోయి పుత్రసంతానాపేక్షతో బహు కాలము వారి నుపాసించుచుండెను. భృగుమహాముని వారిని కరు ణించి పుత్రకామేష్టియజ్ఞమును చేసెను. ఆయజ్ఞమందు మంత్రముల చేత పవిత్రము కాబడిన జలములచేత నిండియున్న బంగారుకుండ భృగువునకు లభించెను. భృగుమునీంద్రుడు తన ఋత్విజులతో అయ్యా లారా! మీరీ బంగారుకుండయందు గల జలములను రక్షింపుచుండ వలెను. జాగ్రతతో నుండుడని చెప్పి కుండను వారికి వప్పరించెను. అంత ఋత్విజులగు బ్రాహ్మణులు రాత్రియందు నిద్రలేనందున శ్రమచే నిద్రించిరి. యువనాశ్వుడు అప్పుడు దప్పిగలవాడై మంత్ర కలశములయందు గల జలముల నన్నిటిని త్రాగెను. భృగువది యెఱింగి యువనాశ్వుని జూచి రాజా! నా తపోబలశక్తివలన ఈ మంత్రజలకలశమును పొందితిని. నీకు పుత్రసంతానము కలిగించుటకై యిది సంపాదించితిని. ఈ మంత్రజలములను నీభార్యకు యివ్వదలచి తిని. నీ వధిక దప్పికచే యీ జలములను త్రాగితివి. చేయరాని కార్యమును చేసితివి. దైవనిర్మితమును ఎవరికిని తప్పింప సాధ్యము కాదు. ఈ మంత్రజలములను నీవు త్రాగినందువలన నీగర్భమందు

దేవేంద్రునితో సమానుడగు పుత్రుడు పుట్టును. అని చెప్పగా విని యువనాశ్వుడు తన పట్టణమునకు వెళ్ళెను. నూరుసంవత్సరములకు పిమ్మట యువనాశ్వుని గర్భగోళమందు యెడమభాగమును భేదించుకొని ఒక పుత్రుడు వెలువడెను. ఆతడు బాలసూర్యుని పగిది ప్రకాశించుచుండెను. ఆబాలుని జూచుచుటకు దేవేంద్రుడు వచ్చి వానినోటియందు తన బొట్టనవ్రేలును బెట్టి అమృతమయమగు దాని నాస్వాదించుమనెను. బాలుడు దేవేంద్రుని రెండవవ్రేలునందుగల అమృతమును కుడిచెను. దేవేంద్రుని యాజ్ఞవలన దేవతలందరును ఆ కుమారునకు మాంధాతృడను పేరుపెట్టిరి. మాంధాతృడు దేవేంద్రునివలన అభివృద్ధిపొంది పెరిగెను. ఆతడు ధ్యానించిన మాత్రముననే సకల వేదములును, శాస్త్రములును, ధనుర్వేదమును, సకల దివ్యాస్త్రప్రయోగములును వానిని పొందెను. దేవేంద్రుడంతట సకలభూరాజ్యమునకు మాంధాతృని చక్రవర్తిగా అభిషిక్తుని జేసెను. మాంధాతృడు చక్రవర్తియై దేవేంద్రుని యర్ధసింహాసనమున గూర్చుండెను. అజగరమను ధనుస్సును. సకల దివ్యాస్త్రములను. అభేద్యకవచమును ధరించిమాంధాతృడు సర్వలోకములను జయించెను. సంపూర్ణ దక్షిణలచేత అనేకయజ్ఞములను చేసి పద్మసంఖ్యగల గోదానములను చేసెను. బ్రాహ్మణులకు తృప్తికలిగించి తన యజ్ఞయందు సకల ప్రజలను నిలిపెను. ఒకప్పుడు వర్షము కురియక కరువువచ్చెను. అందుకు మాంధాతృడు దేవేంద్రునిపై కోపమూని వానితో ఘోరయుద్ధముచేసెను. అప్పుడు భూమియందు తీక్ష్ణణములచేత ఏనుగులను కొట్టినట్లు మాంధాతృడు ఆకసమున గల మేఘములను కొట్టి భూమియందు వర్షము కురిపించెను. ఇది మాంధాతృని జన్మదేశము అని రోమశుడు ధర్మరాజునకు మాంధాతృచరిత్రమును చెప్పెను. పిమ్మట రోమశుడు ధర్మరాజుతో ధర్మజా! ఈ కురుక్షేత్రమందు

సరస్వతీనదీతీరములో సోమకుడను రాజర్షి యజ్ఞముచేసి నూరుమంది కుమారులను పొందెను. అని చెప్పిన ధర్మరాజు అదియెట్లని అడిగెను. రోమశుడు ధర్మజునకు యిట్లని చెప్పెను.

## సోమకుడను రాజర్షి చరిత్రము

రాజా! పూర్వము సోమకుడను రాజు సరస్వతీ నదీతీరమున మహాయజ్ఞమును చేసి జంతువుడను ఒక కుమారుని పొందెను. సోమకునకుగల నూరుగురు భార్యలును ఆ పుత్రునియందు అధికప్రేమ గలవారై ఎవరికివారే తమపుత్రునిగా భావించి పెంచుచుండిరి. లోకమందలి జనులందరును ఆశ్చర్యమును పొందుచుండిరి. ఒకనాడు ఆ బాలుని తొడయందు చీమకుట్టెను. ఆ నొప్పిని సహించలేక ఆ బాలుడు ఏడ్చుచుండెను. అంత తల్లులందరును వచ్చి పిల్లవానిదగ్గర ఏడ్చిరి. ఆ ఏడ్పులధ్వని విని సోమకుడు అంతఃపురమునకు వెళ్ళి కొడుకు నూరార్చి సభకువచ్చి మంత్రిబుుత్విగ్జనులతో ఆర్యులారా! నాకొకడే కుమారుడు. అతడు బ్రతుకునని నమ్మికతో నే నుండుట లగ్గుగాదు. నాకు నూరుమంది భార్యలుండిరి. సంతానము మిక్కిలి స్వల్పము. దీనిని యోచింపక ఉండరాదు. అని చెప్పగా ఒక బుుత్విజుడు యిట్లనెను. రాజా! నీనూర్గురు భార్యలయందును నూర్గురు పుత్రులను పొందునట్లు యజ్ఞమొకటి నేజెప్పినరీతిని చేయవలయును. నీవు నామాట కాదనరాదు. క్రమమును గూడ చెప్పెదవినుము. నీ కుమారుడగు జంతువును యజ్ఞపశువుగా నేర్పరచి వధించవలయును. ఆ పశుహవ్యములచేత హోమముచేసి హోత్రునకు తృప్తికలిగించిన యెడల నీ నూర్గురుభార్యలకును నూరుమంది పుత్రులు పుట్టుదురు. వారిలో పెద్దవాడు ఈ జంతువేయగును. ఆజంతువునకు రెండుప్రక్కలను బంగారుమయములైన సకలశుభ లక్షణములును గలిగియుం

డును. ఇతడే మరల ఆ నూరుగురిలో మొదటివాడుగా పుట్టగలడు. అని ఋత్విగ్జనులు సోమకునితో జెప్పిరి. సోమకుడందుల కంగీకరించెను. ఋత్విజుడు సోమకుని యనుజ్ఞను పొంది జంతువను రాజకుమారుని వధించి వానివపను తీసి అగ్నియందు హోమముచేసెను. అప్పుడు సోమకునిభార్యలు మిగులవిచారించిరి. ఆ హోమముయొక్క పొగను సోమకునిభార్యలు నూర్గురును పీల్చినందున వారందరును గర్భవతులైరి. నవమాసపూర్తియైనపిమ్మట ఆ నూరుమందికిని జంతువు మొదలుగా నూరుగురు పుత్రులు పుట్టిరి. మునుపటివలెనే జంతువునందు నూర్గురు తల్లులకు ప్రేమభావము సమముగానే యుండెను. నూరుమంది కుమారులు పెరిగి సర్వసమర్థులై యుండిరి. కొంతకాలమున కా ఋత్విజుడు చచ్చి భయంకరమైన నరకాగ్నియందుండి నరకము ననుభవింపుచుండెను. మరి కొంతకాలమునకు సోమక మహారాజు దేహమును విడచి దేవలోకమును జేరెను. మార్గమున నరకాగ్నింబడి ద్రుగ్గుచున్న ఋత్విజునిజూచి అయ్యా! నీ విట్లు ఘోర నరకప్రాప్తినందుటకు గల కారణమేమియని యడుగగా ఋత్విజుడిట్లు చెప్పెను.

రాజా! నేను ఋత్విజుడనై నీ పుత్రుని చంపి యజ్ఞము చేయించి యీ నరకాగ్ని యందు పడితిని నీ పుణ్యావశమువలన నీకు పుణ్యాలోకములుకలిగినవి. నాయందుకరుణించి నన్నురక్షింపుము అని ప్రార్థించిన ఋత్విజునిజూచి యమధర్మ రాజువద్దకు బోయి సోమకుడతని యాజ్ఞనుపొంది పుణ్యాలోకములకు బోవుచు యమధర్మరాజా! నానిమిత్తమై ఋత్విజుడొకడు నరకాగ్నియందు బడి పరితపించుచున్నాడు. వానిని తీసుకొని పుణ్యాలోకమునకు వెళ్ళెదను అని చెప్పి యాఋత్విజుని వెంటనిడుకొని స్వర్గమున కేగెను. ధర్మరాజా! యీరీతిగా యజ్ఞకర్తయయిన సోమకుడు తన తపోయజ్ఞ ఫలముచేత ఋత్వి

జుని నరకమును పోగొట్టి తనతోఁగూడ పుణ్యలోకమునకు తీసికొని పోయెను. పూర్వము యిచ్చట బ్రహ్మదేవుడు వేయిసంవత్సరముల పర్యంతము యజ్ఞమాచరించి సత్రయాగమును జేసెను. నాభాగ, అంబరీషు లను రాజులును కూడ యిక్కడ యజ్ఞములుచేసి పరమ సిద్ధికిబోయిరి. ఇది నహుషుని యజ్ఞ దేశము. నహుషు డిచ్చట పది పద్మసంఖ్యలుగల ధనరాసులను విప్రులకు సదస్యులకు యిచ్చి పూజించెను. యీ పుణ్యతీర్థము భౌముడను రాజుయొక్క యజ్ఞవాటిక. ఇదిగో యిది రామసరస్సు, ఇదే నరనారాయణుల తపోవనము. ఇదే దక్షిణావతరణమను పుణ్యభూమి. ఇదే యమునా తీర్థము. ఇచ్చటనే దేవతలు, మునులును, సారస్వత యాగమును జేసిరి. ఈ పుణ్యతీర్థము దేవఋషియైన సంవర్తునిచేత రక్షింపబడుచున్నది. ఇక్కడ భరతరాజు అనేక యజ్ఞములను చేసి సమస్తలోకములను జూచెను. గాన నీ విచ్చట స్నానముచేసి సర్వలోకములను చూడుము. అని రోమశుడు చెప్పగా ధర్మరాజదివిని తమ్ములతో నాతీర్థమందు స్నానమాడెను. మరియు రోమశునితో యిట్లనెను.

మునీంద్రా! ఇచ్చట స్నానము జేసినంతనే సకలదేవ ఋషి విప్ర రాజలోకములను చూడగలిగితిని. దేవేంద్రుని వద్దనున్న నా తమ్ముడగు అర్జునునిగూడ చూచితిని. సూర్యలోకమును జూచితిని. అర్జునుడు గాండీవమును ధరించి కాంతివంతుడై యున్నాడు. అని చెప్పిన ధర్మరాజుమాటలకు రోమశుడిట్లనెను, రాజా! ఇదిగో యిది దక్షుని యజ్ఞభూమి. ఇది సరస్వతియను మహానది. బ్రహ్మదేవుడీ తీరమందు సకలదేవతలనుగూడి అనేక యజ్ఞములను జేసెను. ఇది బ్రహ్మదేవుని యజ్ఞవేదిక. ఇది పదామడ పొడుగు గలదు. ఇక్కడ దేహమును వదలిన జనులు దేవత్వమును పొందుదురు. ఇక్కడి పూర్వము సరస్వతీనది నిషధదేశమందు ప్రవేశించి మనో

భేదమందు కనబడెను. ఇది సిద్ధతీర్థము. ఇచ్చట పూర్వము అగ స్త్యుడు లోపాముద్రను భార్యనుగా బడసెను. ఇది విష్ణుస్థానము. ఇది విపాశము. ఇది కాశ్మీరమండలము. ఇది నిరస్తమను పుణ్యతీర్థము ఇది మానస ద్వారము. పూర్వమిచ్చట పరశురాముడు హంసవధ జేసెను. యీ సరస్సునందు చైత్రమాసములో మహామునులు శివుని పూజింతురు. శివుడు పార్వతీ సహితముగా మహామునులకు ప్రత్యక్షమగును. ఇందు వసిష్ఠమునీంద్రు డరుంధతీ సహితుడై నివ సించెను. ఇదే భృగుతుంగ మనుపర్వతము. ఇందు ఔశీనరుడగు శిబియను రాజు పూర్వము యజ్ఞముచేసెను.

## శిబియను రాజర్షి చరిత్రను రోమశుడు ధర్మరాజునకు జెప్పుట

శిబియనురాజు ఔశీనరుడు, మిక్కిలి కీర్తిగలవాడు, బహు ధర్మాత్ముడు సత్యధురీణుడు, ఒకప్పుడతడు యజ్ఞము చేసెను. దేవేంద్రుడు, అగ్ని దేవులిద్దరును శిబియొక్క మహాగుణములను యెరుంగదలంచి దేవేంద్రుడు, డేగ స్వరూపమును, అగ్ని దేవుడు పావురాపిట్టగాను మారు రూపములను పొందిరి. పావురాపిట్ట డేగకు భయపడి పరుగెత్తుచువచ్చి శిబిమహారాజు యొక్క చాటునకు పోయెను. డేగ పావురాపిట్టను తరుముకొని వచ్చి శిబిరాజుతో యిట్లనెను. మహారాజా! నీవు సత్యవంతుడవు. నీవు పరమధర్మాత్ము వని వినియున్నాను. నేనిప్పుడు మిక్కిలి ఆకలి గలిగియున్నాను. ఈ పావురాపిట్టను తినుటకు తరుముకొని వచ్చితిని. పావురాపిట్ట నీమరుగు చొచ్చెను, దీనిని నాకు ఆహారముగానిమ్ము. నా ఆహారమునకు నీవు విఘ్నము కలిగింపరాదు. సకల భూతములను ఆహారము చేసినే జీవించి వర్తింపుచున్నవి. ఈ పావురాపిట్టను నేను భక్షింపనియెడల

ఆకలి బాధచేత ఇప్పుడే నాప్రాణములు పోవును. నేను ప్రాణములను విడిచినయెడల నా భార్యాపుత్రులు జీవింపజాలరు. నీవు ఒక్క పావురా పిట్టను రక్షించి అనేక జీవులకు హింసగలిగించుట ధర్మముగాదు. నీకు బాధను కలిగించు ధర్మమును ధర్మమని పెద్దలు తలంపరు. సర్వజనులకును మేలుకలిగించు నదియే ధర్మమగును. ఈ పావురా పిట్ట నాకు వేదసమ్మతమైన ఆహారము. "శ్యేనాః కపోతాన్ ఖాదంతి" అని వేదవాక్యము గలదు. అనగా డేగలకు పావురాపిట్టలు ఆహారమని యర్థము. గాన యీ పావురాపిట్ట నాకు ఆహారము. దీనిని నాకిమ్ము అని డేగ చెప్పగా శిబి యిట్లనెను. డేగా! ప్రాణ భయమువలన పావురాపిట్ట నన్నాశ్రయించెను. ఎటువంటి నీచుడై నను ఆశ్రయించిన వానిని విడువడు. కాన నేనీ పావురమును విడు వను. ఆశ్రితులను విడుచుట ధర్మముగాదు. నీవు పక్షివైనను ధర్మము నెరింగినట్లు జెప్పితివి. శరణాగతులను విడుచుటకంటె వేరే అధర్మము లేదు. నీయాకలి మరియొక యాహారమువలన నుపశమింప గలదు. యీ పావురమును తినుటవలననే నీయాకలి తేరుననియు, యితరాహారమువలన తీరదనియు చెప్పుట న్యాయముకాదు. నీవాహా రము కొరకు ప్రయత్నించినయెడల యీవనమందుగల అనేక జంతు వుల మాంసమును యింతకంటె యధికముగా బెట్టెదను. ఈ పావు రమునందు నీకు గల యాగ్రహమును విడువుము. నే నీ పిట్టను రక్షించెదనే గాని విడువను. అని శిబిరాజు డేగతో చెప్పగా డేగ యిట్లనెను.

రాజా! పావురము నాకు శాస్త్రసమ్మతమైన యాహారము. ఈ పిట్టను నీవు పనిబూని రక్షింపదలచిన యెడల నీవు కదలకనే నీ పావురమునకు సమముగ తూచి యాహారమును నాకుయిమ్ము. ఆలస్యము చేయరాదు. అని చెప్పిన డేగమాటలను శిబిమహారాజు విని డేగతో "డేగా! నాయందు నీవు అనుగ్రహించితివి. అనిచెప్పి

కత్తిచేత తన శరీరమునుకోసి తనదేహమందుగల మాంసమును పెట్టి తూచెను. అట్లు తూచగా ఆమాంసముకంటె పావురాపిట్ట అధిక మగు బరువుగలిగి యుండెను. శిబి ఆశ్చర్యపడి రక్తముకారుచుండ గానే ఆత్రాసునందు తానుకూర్చుండెను. అంత దేవేంద్ర అగ్ని దేవు లిద్దరును, వాని మహాగుణములకు సంతోషించి డేగ పావురముల రూపములను వదలి ప్రత్యక్షమైరి. దేవేంద్రఅగ్నిదేవు లిద్దరును తమ నిజరూపములను జూపి యిట్లనిరి.

మహారాజా! నీధైర్య శౌర్యాది గుణములకు మెచ్చితిమి. గాన సూర్యచంద్రు లుండు పర్యంతము నీకీర్తి శాశ్వతముగానుం డును. అని దేవేంద్ర అగ్నిదేవులిద్దరును శిబిచక్రవర్తికి వరమిచ్చి వెళ్ళిరి. అట్టి మహాపురుషుడైన శిబియొక్క స్థానము. అని రోమశుడు ధర్మరాజుతో జెప్పెను. ధర్మరాజా! అదిగో ఒక తపోవనము కని పించుచున్నది. చూడుము. అందుగల వృక్షములయందు సర్వదా ఫలములు గలిగియుండును. అది శ్వేతకేతువుయొక్క తపస్థానము. ఆశ్వేత కేతు మునీంద్రుడు ఉద్దాలక మునీంద్రుని పుత్రుడు. ఆ తపో వనమందు పూర్వము సరస్వతీనది మనుష్యస్త్రీరూపమును ధరించి శ్వేతకేతువును సేవించెను. మేనమామ మేనల్లుండ్రగు అష్టావక్ర శ్వేత కేతులిద్దరును పూర్వ మీతపోవనమందు ఘోరతపస్సుచేసిరి. అని పల్కిన రోమశునకు ధర్మరాజు 'మునీంద్రా! ఆ యిద్దరిలో అష్టావక్ర మునీంద్రుని మాహాత్మ్యమును వినవలెనని నాకు ఇష్టము గలిగి యున్నది. చెప్పుమని యడుగగా రోమశు డిట్లు చెప్ప సాగెను.

## రోమశుడు ధర్మరాజునకు అష్టావక్రుని చరిత్రము చెప్పుట.

ధర్మరాజా! పూర్వము ఏకపాదుడను మునీంద్రుడు గలడు. ఆఏకపాదుడు తన విద్యాతిశయముచేత సుజాతయను కన్యకను

బెండ్లాడి వనమందు ఘోరతపస్సు చేయుచు సర్వదా శిష్యులచేత వేదములను జదివించుచుండెను. అంతట బహుకాలమునకు సుజాత గర్భవతి యయ్యెను. దానిగర్భ మందున్న బాలుడు ఒకనాడు తండ్రితో యిట్లనియె. తండ్రీ! ఏకపాదమునీంద్రా! నీవు సర్వదా నీశిష్యులచేత రాత్రింబవళ్లు వేదములను చదివించుచున్నావు. అందు వలన శిష్యులందరు నిద్రలేనివారై జడబుద్ధిగలిగి తప్పులు చదువుచు న్నారు. గాన సర్వదా శిష్యులచేత వేదములను జదివింపరాదు. అని గర్భమందున్న బాలుడు ఏకపాదుని ఆక్షేపించెను. ఆమాటలకు ఏక. పాదుడు నవ్వి ఆ బాలుని యిట్లని శపించెను.

పుత్రుడా! నీవు అధ్యయనమునకు వంకరగా పలికితివి. గనుక నీవు యెనిమిది వంకలు గల శరీరముతో జన్మింపుము. అని ఏక పాదుడు తనకొడుకును శపించెను. ఆ బాలుడు సుజాత గర్భమందు అగ్నిహోత్రునితో సమానుడై పెరుగుచుండెను. సుజాత ప్రసవ వేదనగలదై బాధనుభరింపలేక తనభర్తతో యిట్లనెను. నాథా! లోకమందు బీదవాండ్రైనను పురిటికి కావలసిన నేయిని, నూనెను, ఆముదమును, ధాన్యమును సంపాదించుకొని సిద్ధముగా పెట్టుకొని యుందురు. మనకు ధనములేనందున పురిటికి కావలసిన పదార్థములు లేవు. నేనేమి చేయుదునో తెలియకున్నది. అని సుజాత చెప్పిన, ఏకపాదుడు ధనమును సంపాదించు నిమిత్తము జనకరాజువద్దకు పోయెను. ఆ సమయమున జనకరాజు యజ్ఞము చేయుచుండెను. ఆ యజ్ఞమందు వరుణపుత్రుడైన వందియుండెను. ఆ వందితో ఏక పాదుడు వివాదమాడి వోడెను. ఏకపాదుడు సిగ్గుచే నక్కడనే యుండెను. ఇంతలో సుజాత ప్రసవించి అష్టావక్రుడను పుత్రుని గనెను. అతని శరీరమందు యెనిమిది వంకర లున్నందున అష్టావక్రు డని చెప్పబడెను. ఆకాలమున ఉద్దాలక మునీంద్రుని భార్య శ్వేత

కేతువును కనెను. ఈ రీతిగా మేనమామ, యల్లుడు అగు అష్టావక్ర శ్వేతకేతువు లిద్దరు పుట్టి సమవయస్కులై పెరిగిపండ్రెండేండ్లు ఉద్దాలకునియొద్ద వేదశాస్త్రములను చదివిరి. అష్టావక్రుడు ఉద్దాలకుడు తన తండ్రియనియు, శ్వేతకేతుడు సహోదరుడనియు తలచెను గాని నిజస్థితి నెరుంగడు. ఒకదినమందు అష్టావక్రుడు ఉద్దాలకుని తొడయందు కూర్చుండెను. అందుకు శ్వేతకేతువు సహింపలేక అష్టావక్రునితో యిట్లనియెను.

అష్టావక్రుడా! మా తండ్రితొడమీద నీవిట్లుకూర్చుండుటకు కారణమేమి నీవు పోయి మీ తండ్రితొడమీద కూర్చుండుము. అని పలికి అష్టావక్రుని చేయిపట్టుకొని యీడ్చెను. అంత అష్టావక్రుడు యేడ్చుచు తన తల్లిదగ్గరకు వెళ్ళి అమ్మా! మా తండ్రి యెవరో జెప్పుము. ఎక్కడికి వెళ్ళెనో చెప్పుము. అని అడిగెను. అష్టావక్రుడు మేనమామయగు శ్వేతకేతువును తీసికొని, తండ్రి సంగతి తల్లివలన తెలిసికొని జనకుని యజ్ఞమునకు వెళ్లెను. వీరిని జనకమహారాజు యొక్క ద్వారపాలకులు లోనికి బోనివ్వలేదు. వారిద్దరును ద్వారపాలకునితో యిట్లనిరి, ద్వారపాలకుడా! చెవిటివారు, మూగవారు, కుంటివారు, స్త్రీలు, విప్రులు, నిరాటంకముగా రాజద్వారముగుండా లోనికి ప్రవేశింతురు. మేము విద్వాంసులము, బ్రాహ్మణులము. మమ్ములను లోపలకి పోనివ్వక ఆపుటకుగల కారణమేమి? అని అడిగిన వారికా ద్వారపాలకు డిట్లనెను. విప్రులారా ఈ యజ్ఞసభకు పెద్దలగు వృద్ధ విద్వాంసులను, మహాయాజ్ఞికులును రావలయును. మీరు చిన్నవారు గాన ఈసభకు రాగూడదు. వెళ్ళుడు. అని పలికిన ద్వారపాలకునకు వారిద్ద రిట్లనిరి. విశేషవయస్సుచేత వెంట్రుకలు నెరసినవారు వృద్ధులు కాజాలరు. బాలుడైనను జ్ఞానవంతుడగు వాడు వృద్ధుడు. చాలాకాలమువరకు జీవించుట, వెంట్రుకలు నెరయుట

వృద్ధలక్షణములు కావు. బాలుడైనను, వేదము చదువుకొని ఆచారపరు డైన యెడల సర్వజనులచేతను పూజింపబడును. మేము బాలురమని నీవు అవమానింపరాదు. ఈ జనకమహారాజు సభయందు గర్వించి యుండు విద్వాంసులతో వాదము చేయుటకు ప్రయత్నించి వచ్చితిమి. అని వారు చెప్పగా ద్వారపాలకుడు జనకుని యనుమతిని పొంది వా రిద్దరిని లోని కంపించెను. జనకరాజు అనేక ప్రశ్నలను వేసెను. వానికన్నింటికి అష్టావక్రుడు ఉత్తరములు చెప్పెను. ఆసభయందు బ్రాహ్మణ మధ్యమున గల వరుణపుత్రుడైన వందియను వానితో అష్టావక్రుడు వాదము చేసి గెలిచెను. అందువలన వందిచేత గెలువబడి ఒదిగియున్న విద్వాంసుల నందరిని అష్టావక్రుడు విడిపించెను. వారితో పాటు ఏకపాదుడుకూడ విడువబడెను. జనకమహారాజు మిక్కిలి పూజ నీయుడు. అటువంటి జనకమహారాజుచేత అష్టావక్రుడు పూజింప బడెను. పూర్వము వందిచేత ఓడింపబడి ఒదిగియున్న ఏకపాదుడు తన కుమారుడగు అష్టావక్రునివలన విడిపింపబడి తన ఆశ్రమమునకు వెళ్ళెను. ఈరీతిగా రోమశుడు అష్టావక్రుని చరిత్రమును ధర్మరాజుతో చెప్పెను.

ధర్మరాజా ! సమంజస యను పుణ్యానది యిదియే! యిక్కడ పూర్వము భరతమహారాజు రాజ్యాభిషిక్తు డయ్యెను. ఈ నదీజలము లను త్రాగుటచేత పూర్వము దేవేంద్రుడు లక్ష్మీవిభవు డయ్యెను. ఇదియే మైనాకకుక్షి. ఇక్కడ పూర్వము అదితి పుత్రసంతానము కొరకు తపస్సు చేసెను. అదితి అనగా కశ్యపముని భార్యయే. ఇదిగో యిది కనకశిలాపర్వతము. దీనియం దనేకమంది ఋషులును, దేవత లును నివసించి యుందురు. ఇక్కడ సనత్కుమారుడు యోగజ్ఞాన సిద్ధిని బొందెను. ఇదిగదా తూష్ణీసంగమము. ఈ తీర్థమున స్నాన మాడినవారు కృతార్థులు. ఇది శైబ్యాశ్రమము. ఇది భరద్వాజా

శ్రమము. ఇక్కడ పూర్వము భరద్వాజమునీంద్రుని పుత్రుడగు అవక్రీతుడు తపోవిద్యా గర్వముచేత చచ్చెను. అని రోమశుడు ధర్మరాజుతో చెప్పగా అది యెట్లని ధర్మరా జడుగగా రోమశుడు ధర్మరాజుతో యిట్లనెను.

## రోమశుడు ధర్మరాజునకు అవక్రీతు చరిత్రము చెప్పుట.

ధర్మరాజా! పూర్వము రైభ్యుడనియు, భరద్వాజు డనియు యిద్దరు మునులు గలరు. వారు తపోనిర్మల బుద్ధిమంతులై, స్నేహితులై యుండిరి. వారిద్దరును ఈ ఆశ్రమమందు తపస్సుచేయుచుండిరి. రైభ్యునకు అర్ధావశుడనియు, పరావశుడనియు యిద్దరు పుత్రులు కలరు. వారు వేదములను చదువుకొని సకలవిద్యా ధురీణులై యుండిరి. రైభ్యుడు విద్వాంసులచేత పూజింపబడుచుండెను. అతనిని చూచి సహింపలేక భరద్వాజుని పుత్రుడగు అవక్రీతుడు యిట్లని తలంచెను. రైభ్యుడును, అతని కుమారులును సకల వేదశాస్త్ర విద్యలయందును సమర్థులై యున్నారు. నేను భరద్వాజుని పుత్రుడనై యుండి విద్యాహీనుడనైతిని. గాన నేను తపస్సుచేసి తపోబలమువలన సకలవిద్యలను పొందెదను. అని తలంచి ప్రజ్వలింపుచున్న అగ్నియందు వేదమంత్రములచేత బుద్ధినుంచుచు ఘోరతపస్సు చేయుచుండెను.

అవక్రీతుని తపస్సును దేవేంద్రుడు సహింపలేక వానిదగ్గరకు వచ్చి యిట్లనెను. అవక్రీతుడా! నీవు ఘోరతపస్సు చేయుటకు కారణమేమి అని దేవేంద్రుడడుగగా అవక్రీతుడు దేవేంద్రా! నేను చదువకనే సర్వవేదశాస్త్రములను పొందవలెనని తపస్సుచేయుచున్నాను. నాకార్యసిద్ధియగువరకు ఈతపస్సును మానను. అని పల్కిన దేవేంద్రుడు ఓయీ! గురువు నుపాసించుచు గురువువలన సకలవిద్యలను

అభ్యసింపవలయును. తపస్సువలన విద్యలను పొందినయెడల ఎంతసాధువులకైనను మదమాత్సర్యములుకలుగును. గనుక విద్యలను సంపాదించుటకు యీతపస్సు ఉపాయముగాదు. కాన తపస్సునుమానుము. అని దేవేంద్రుడు అవక్రీతునితో చెప్పివెళ్ళెను. అవక్రీతుడు దేవేంద్రుని మాటలను లెక్కచేయక తపోనిష్ఠను విడువక ఎప్పటివలెనే తపస్సుచేయుచుండెను. ఆ ఘోరతపస్సుచేత దేవేంద్రునకు పరితాపము హెచ్చి బలహీనుడై శుష్కించిన శరీరముగల ముసలిబ్రాహ్మణ రూపమునుధరించి వచ్చెను. అట్టిబ్రాహ్మణుడు పిడికిలిచేత యిసుకను దెచ్చి గంగలో వైచుచు సేతువునుకట్ట సంకల్పించెను. వానింజూచి బ్రాహ్మణుడా! నీవు నూరువత్సరముల వయస్సుగల ముసలివాడవు. నీదేహము మిక్కిలి శుష్కించి బలహీనమై యున్నది. నీవు యిసుకనుదెచ్చి గంగకుసేతువు కట్టదలచితివి. ఇది నీకు సాధ్యముకానిపని. అసాధ్యమగు కార్యమును చేయదలచినవానిని పిచ్చివాడని తలంతురు. ఈసేతువు ఎప్పటికి పూర్తియగునో తెలియజాలదు. అని అవక్రీతుడు వృద్ధవిప్రునితో చెప్పెను. ఆమాటలకు బ్రాహ్మణరూపమున నున్న దేవేంద్రుడిట్లని పలికెను. ఓయీ! నీవును, నీకుసాధ్యముకాని కార్యమునుదలంచి ఘోరమగుతపస్సును చేయుచున్నావు. నీవలెనే నేనును జేయప్రయత్నించితిని. అని చెప్పి దేవేంద్రుడు తన నిజరూపమును చెప్పెను. మరియు అవక్రీతుడా! నీవువృథాగా ప్రయాసపడి తపస్సుచేయుచున్నావు. దీనివలన ప్రయోజనములేదు. మానుకొనుము. అని దేవేంద్రుడు చెప్పగా అవక్రీతుడు దేవేంద్రా! నేను నీవెంతచెప్పినను తపస్సును మానను. నాకోరికను ఫలింపజేయుము. అనియడుగగా దేవేంద్రు డాతనికి సకలవేదశాస్త్రములను వచ్చునట్లుగా వరమిచ్చి వెళ్ళెను. ఈ వరమునుబొందిన విధానమంతయు, అవక్రీతుడు భరద్వాజమునీంద్రునితో చెప్పెను. భరద్వాజుడు తన

కొడుకుగర్వమును సహింపజాలక వేదగీతలైన గాథలయొక్క అర్థ
మును చెప్పదలంచి కుమారా! పూర్వము బాలాధియను మునీం
ద్రుడు పుత్రశోకముకలవాడై తపస్సుచేయగా దేవతలకృపవలన చిర
కాలజీవియగు మేధావియను ఒకపుత్రుడు గలిగెను. ఆ కుమారుడు
గర్వముచేత మునీంద్రులనుమెచ్చక తనకుదీర్ఘాయుర్దాయము గలదను
తలంపుచే ధవళాత్ముడను మహామునియొద్దకుపోయి పోతరించి మాట
లాడెను అందులకు మునీంద్రుడు కోపించుకొని వానినిచంపెను. కాన
ఎంతగొప్పవారికైనను గర్వమువలన చేటుకలుగును. ఆ క్షణమందే
గర్వమువలన నాశముకలుగును. గనుక నీవును, గర్వమును విడిచి
బ్రతుకుము. గర్వమును విడిచినవాడే ఉత్తముడు. నీవు గర్వమును
విడచి కోపములేనివాడవై పరమశాంతులగు రైభ్యుని కుమారులతో
మాత్సర్యములేక కలిసిమెలసియుండుము. అనిపల్కిన భరద్వాజుని
వాక్యములకు అవక్రీతుడు తండ్రీ! నీవు చెప్పినట్లు చేసెదను నాకు
రైభ్యుడు నీతోసమానుడు. అనిపల్కి తనవిద్యాప్రభావమును ముని
సభలయందు విస్తరించెను. ఒకానొక దినమందు రైభ్యుని ఆశ్రమ
మునకు అవక్రీతుడు వెళ్ళెను. అక్కడ ఉద్యానవనమందు రైభ్యుని
కోడలగు పరావసుని భార్యయగు కృష్ణయనుపేరుగలదానినిచూచెను.
ఆమె చిలుకవంటి సౌందర్యముగలదై, తామరకమలములవంటిపాదము
లుగలిగి, కోకిలవంటి మాధుర్యస్వరముగలదై, ఆమెవికసించిన పుష్ప
ములుగల ఉద్యానవనమందుండగా అవక్రీతుడుచూచి మన్మథునిచేత
ప్రేరేపింపబడి తనయభిప్రాయమును నామెతో చెప్పెను. ఆ కృష్ణయు
శాపభయమువలన అవక్రీతుని యిష్టమునకు సమ్మతించినట్లు చెప్పి
త్వరితగమనమున నచటినుండివెడలి తనమామతో మునీంద్రా! నేను
మనఉద్యానవనములో నుండగా అవక్రీతుడు నావద్దకువచ్చి నన్ను కా
మించి తనయభిప్రాయమును నాకుదెలిపెను. నేనును శాపభయమున

నాతనికోరికను సమ్మతించినరీతిని బల్కి వచ్చితిని అనిచెప్పి కోపము గలవాడై కన్నీరుగార్చుచు తలవంచుకొని యుండెను. రైభ్యుడవక్రీతునియందు కోపించి తనశిరస్సునందుగల ఒకజెడను పెరికి అగ్నిహోత్రమందు హోమముచేసి ఒక స్త్రీని పుట్టించెను. ఆమె రైభ్యుని కోడలికంటె మిక్కిలిరూపసౌందర్య కాంతివంతురాలై యుండెను. మరియొక జెడనుపెరికి హోమముసేయగా వికారమైన యాకారమును కోరలునుగల దుష్టరాక్షసుడొకడు జన్మించెను. శూలాయుధధారియైయున్న యారాక్షసుడును, సౌందర్య విలాసములతోనున్న యాకామినియు రైభ్యమునీంద్రుని తపోబలమువలన జన్మించి మునీంద్రునకు నమస్కరింపుచు తమపనులను నియమించుకొని పలికిరి. రైభ్యుడు వారి కిట్లనెను.

ఓయీ! అవక్రీతుడవివేకి గాన మీరిరువురు వెళ్ళి వానింజంపుడు అని రైభ్యుడు పంపినకాంత ముందుగా వెళ్ళి మన్మథబాధితుడైయున్న అవక్రీతునికి బోధించి అతని జలపాత్రను అపహరించెను. అందువలన అవక్రీతుడపరిశుద్ధుడై తనతపశ్శక్తిని పోగొట్టుకొనెను. పిమ్మట రాక్షసుడు నిర్భయముగా వెళ్ళి వానినెదిరింపగా రాక్షసునకు భయపడి అవక్రీతుడు సరస్సులయందును, నదులయందును, ప్రవేశించెను. అందువలన ఆనదీ సరస్సులయందుగల జలము లెండిపోయెను. అవక్రీతుడు తండ్రియగు భరద్వాజుని అగ్నిహోత్రమున ప్రవేశింపగా రాక్షసుడు వానింబట్టుకొనివచ్చి తన శూలాయుధముచేత చంపెను. వెంటనే రాక్షసుడును స్త్రీయునుగూడ రైభ్యుని దగ్గరకు వెళ్ళి ఆస్త్రీ కృత్తియను పేరబరగుటచే మునీంద్రుడు ఆమెనురాక్షసునికి భార్యగా నిచ్చెను. భరద్వాజుడు వనములోనుండి ఆశ్రమమునకువచ్చు నప్పుడు అదివరలోవలె అతని కెదురురాక అగ్నిహోత్రములు అణగియుండెను. భరద్వాజుడందుల కాశ్చర్యమంది తనగృహమునకు కావలియుండు

శూద్రునివలన అవక్రీతుని మరణవృత్తాంతము తెలిసికొని మిగుల దుఃఖించి, కుమారా రైభ్యుడధిక కోపవంతుడని వానియాశ్రమము నకు పోవద్దని చెప్పిన మాటలను వినక గర్వముగలవాడవై నామాట లను లక్ష్యపెట్టక యిట్లు చచ్చిపడియుంటివి. అని ఏడ్చి ఆశవమును దహించెను. పుత్రదుఃఖమును భరింపలేక ఆయగ్నియందే తానును పడి ప్రాణములను విడిచెను. ఆసమయమున బృహద్ద్యుమ్నుడనురాజు సత్రయాగమును చేయుచుండెను. రైభ్యునికుమారులను ఋత్విజుల నుగా ఆరాజువరించెను. వీరిద్దరును తండ్రియనుమతినిపొంది వెళ్ళి బృహ ద్ద్యుమ్నుని యాగమును నడపుచుండిరి. రైభ్యుని కుమారులలో రెండవవాడగు పరావసుడు ఆశ్రమమునకై వచ్చుచుండగా తండ్రి ఎదురుపడెను. చీకటిమిక్కుటమైనందున రైభ్యుని మృగమనితలంచి ప్రాణభయముచేత పరావసుడు చంపెను. పిమ్మట తండ్రియని తెలిసికొని మిగుల దుఃఖించెను. పిమ్మట తండ్రికిపరలోక క్రియలనుచేసెను. పరా వసుడు బృహద్ద్యుమ్నుని సత్రయాగమునకువచ్చి అక్కడనుండు అన్నతో అన్నా! నేను రాత్రిమనఆశ్రమమునకు వెళ్ళుచుండగా మన తండ్రియగు రైభ్యుడెదురుపడగా మృగమని తలంచి నేను వానింజంపి తిని. అందువలన నాకు బ్రహ్మహత్యా దోషముగలదు. నేనక్కడలేని యెడల నీ వొక్కడవే యీ సత్రయాగమును చేయింపజాలవు. నేను ఒక్కడనైనను యీ యాగమును పరిసమాప్తి చేయించ గలను. గాన నా బ్రహ్మహత్యా దోషనివారణకై నీవు బ్రహ్మ హత్యాదోష వ్రతమును ధరింపుము. అని పరావసుడు తన యన్న యగు అర్వావసునితో చెప్పగా అర్వావసుడు యిట్లనెను.

తమ్ముడా! నీవు చెప్పినట్లు సమ్మతించితిని. నీ బ్రహ్మహత్యా దోషము నశించు ప్రాయశ్చిత్తములను చేసెదను, అని అర్వావసుడు చెప్పి బ్రహ్మహత్యానివారణకై వ్రతములను జరుపుచుండెను. పరా

వశుఁడు ఒక్కఁడే బృహద్యుమ్న రాజుయొక్క సత్రయాగమును జరుపుచుండెను. అర్థావశుఁడు బ్రహ్మహత్యాదోషనివారణకై ప్రాయశ్చిత్తములను జేసి సత్రయాగమునకు వచ్చెను. అంత పరావశుఁడు అర్థావశునిజూచి బృహద్యుమ్న రాజుతో రాజా! యితఁడు బ్రహ్మహత్యా వ్రతములను జరుపుచున్నాఁడు. గాన యితఁడు యీ యజ్ఞభూమికి వచ్చుట కెంతమాత్రము సర్హుఁడు కాఁడు అని చెప్పెను. అదివిని రాజు తన పరిచారకులచేత అర్థావసుని వెడలజేసెను. అంత నాతఁడు రాజుతో మహారాజా! పరావశుఁడే బ్రహ్మహత్య చేసెను. నేను పాతకుడనుగాను. వానిదోషము నశించుటకొరకు నేను వ్రతములను జరిపి అపాయము చేత విడువబడితిని. అని వాస్తవమును అర్థావశుఁడు బృహద్యుమ్నునితో చెప్పెను. అతఁడు బల్కిన నిజవాక్యములకు అగ్నిదేవుఁడు మొదలగు దేవతలు మెచ్చి అగ్నిహోత్రుని ముందుంచుకొని వచ్చి అర్థావశునితో యిట్లనిరి.

## దేవత లర్థావసునకు మెచ్చి కోరినవరముల నిచ్చుట

అర్థావశువా! నీ తమ్ముఁడగు పరావశువుచేసిన పాపమును పోఁగొట్టునిమిత్తము నీ వ్రతములను జరిపితివి. నీ ధర్మబుద్ధికి నేము మెచ్చితిమి. నీయిష్టవరముల నిచ్చెదము అడుగుము. అప్పుఁడు అర్థావశుఁడు దేవతలతో యిట్లనెను. దేవతలారా! నా తండ్రియగు రైభ్యుఁడును, భరద్వాజుడును వాని కుమారుఁడగు అవక్రీతుఁడును యెప్పటి వలె జీవించియుండవలెను. రైభ్యుఁడు పరావశుచేత చచ్చినవిధమును మీరు సత్రయాగసభయందు ప్రకటింపవలయును అని అర్థావసుఁడు దేవతలతో చెప్పెను. దేవతలు వారి ముగ్గురిని యెప్పటివలె బ్రతికించెను. అప్పుడు అవక్రీతుఁడు దేవతలతో యిట్లనెను. దేవతలారా! నేను వేదశాస్త్రార్థముల నెరిగితిని. సకల వ్రతములను జరిపితిని.

రైభ్యునిచేత చంపబడితివి. రైభ్యున కట్టి తపోశక్తి కలుగుటకు కారణమేమి? అని యడుగ దేవత లిట్లనిరి. అవక్రీతుడా! గురు శుశ్రూషలు చేయుచు అధికశ్రమచేత పొందబడిన విద్యలు మిక్కిలి ప్రకాశస్ఫురణము గలిగియుండును. గురుముఖమువలన పొందబడని విద్యలు ప్రకాశింపజాలవు. నీవు వేరువిధముగా విద్యలను పొందితివి. అందువలన నీ యధ్యయనవ్రతములు బలహీనములాయెను. రైభ్యుడు గురువును సంతోషపరచి బ్రహ్మజ్ఞానముపొందెను. గనుక రైభ్యు డింతశక్తిని పొందెను. అని దేవతలు అవక్రీతునితో జెప్పి స్వర్గమునకు వెళ్ళిరి. అని రోమశుడు ధర్మరాజుతో జెప్పసాగెను. ధర్మరాజా! ఇది అవక్రీతుని నివాసస్థలము. ఇక్కడ నివసించినవారు సర్వపాప విముక్తులగుదురు ఇది కాలపర్వతము. ఇది ఏడునూర్ల విధములగు గంగయగును. ఇది మనుష్యులకు కనబడదు. ఈ స్థలమందు ఎనుబది యెనిమిదివేల గంధర్వులును కిన్నరులును కింపురుషులును, దేవత లును, దేవేంద్రుని సేవించి పోవుదురు. ఇక్కడికి ఆరునూర్ల ఆమడల దూరమందు కైలాసపర్వతమున్నది. ఆకైలాసపర్వతమందు కుబేరు డుండును. పాండవులు కూర్చుండి సమాధియోపమైన బుద్ధిచేత రోమ శుడు జెప్పినస్థలముల నన్నిటిని జూచిరి. అంతట ధర్మరాజు భీమునితో తమ్ముడా! యీ పర్వతవనమార్గములయందు మనము రథములచేత నడువజాలము. గాన ఇంద్రసేనాదులగు మనభటులతో నీవును సహ దేవుడును యిచ్చటినుండి వెనుకకు మరలుడు. యీవిప్రులనందరను, ధౌమ్యుని మీవద్దనే యుంచుకొనుడు ద్రౌపదిని మీవద్దనే యుండ నిండు. నేనును నకులుడును వెళ్ళి రోమశుడు చెప్పినరీతిని సకల తీర్థ ములను సేవించి వచ్చెదము. మేము మరల వచ్చు పర్యంతము మీరు అధికప్రయత్నముగా ద్రౌపదిని రక్షించుచుండవలయును అని చెప్పగా భీము డిట్లనెను.

ధర్మరాజా ! యీ వనములో రాక్షసులు మెండుగా నుందురు. యిచ్చట ఒక నిమిషమైనను నిన్ను విడువ రాదు. అర్జునుని విడచియున్నందుకే మనము చింతాక్రాంతుల మైతిమి. ఇట్టి సమయమున మేము నిన్ను విడచిన మనకు మిక్కిలి పరితాపము గలుగును. అది భరింపజాలము. మనకు పరస్పరభేద ముండరాదు. మీరు వనభూములందు శ్రమజెంది నడువజాలనప్పుడు మిమ్ములనందరను యెత్తుకొని సునాయాసముగా నడువగలను. యీ రథములతో వెళ్ళజాలనప్పుడు ఇంద్రసేనాదుల నీరథములతో నెచ్చ టనైననుంచి వెళ్ళుదము. అని భీముడు ధర్మరాజుతో జెప్పెను. అప్పుడు లోమశుడు ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! మన మందరము గంధమాదనపర్వతమునకు వెళ్ళుదము. అక్కడ మీ రందరు అర్జునుని జూడగలరు. అని చెప్పగా ధర్మరాజాదులందరును సంతోషించి గంధమాదన పర్వతమునకు వెళ్ళుచుండిరి. దారిలో పుళిందాధిపతి యగు సుబాహుని పట్టణము కనబడెను. ఆ పట్టణ మందు గుర్రములు, ఏనుగులు, రథములు అనేకములుండెను. మరియు ననేక సహస్రసంఖ్యలు గల యెరుకలవాండ్రుండిరి. పాండవులచటకు వెళ్ళగా సుబాహుడు వారిని పూజించెను. పాండవులు తమ రథ ముల నన్నిటిని వానివద్ద నుంచిరి. తమ సారథుల నందరిని అచ్చట నిలిపిరి. తమ గుర్రములను ఏనుగులను అచ్చట నిలిపిరి. ఇంద్రసేనాది భృత్యవర్గము నెల్ల నచటనే యుంచిరి. ధర్మరాజాది పాండవులు పాదచారులై ద్రౌపదిని విప్రులను రక్షించుకొనుచు గంధమాదన పర్వతమునకు పోవుచుండిరి. అంతట ధర్మరాజు భీమునితో యిట్లనెను.

భీమా ! మన తమ్ముడగు అర్జునుడు కోపించినయెడల యుద్ధ మందు దేవేంద్రునైనను గెలువగలడు. అతి భయంకరమగు వీరు డగుటచే వేగమందు వాయుదేవునితోడను, తేజస్సునందు సూర్యుని

తోడను సమానుడు. దివ్యాస్త్ర సంపన్నుడు, ధనుర్ధరులందరిలోను శ్రేష్ఠుడు. సర్వదా పరమశాంతమూర్తి. అట్టి అర్జునుని జూచు పర్యంతము నాచిత్తము పరితపించుచున్నది. అర్జునుడు మహాగుణవంతుడు. మన మెవ్వడాతనితో కలిసియుందువెూ తెలియకున్నది. ఇన్ని సంవత్సరముల వరకాతడు రాకుండుటకు కారణమేమైయుండును. అని ధర్మరాజు భీమునితో జెప్పుచు అర్జునుని చూడవలెనని తలచుచు వెళ్ళుచుండెను. పాండవులు వెళ్ళి గంధమాదన పర్వతమునుజూచిరి. అందనేక శిఖరములుండెను. నానావిధ వర్ణములు గల శిలలుండెను అనేక విధములగు పక్షులు. మృగములు సింహశార్దూలాది క్రూర మృగములుండెను. అందుగల స్ఫటికశిలలందు సెలయేటి జలములు ప్రవహించుచుండెను పాండవులా పర్వతమును ప్రవేశించునప్పుడు పెద్దగాలికొట్టెను. ఆ గాలివలన దుమ్ములేచి బ్రహ్మాండమంతయు వ్యాపించి సూర్యమండలమును కప్పెను. అక్కడ చెట్లకొమ్మలు విరిగి పడునప్పుడు గొప్ప ధ్వనికలిగెను. ఆ ధ్వనివిని ధర్మరాజాదు లందరును బెదరి యిట్లని తలంచిరి. యీధ్వని వినగా ఆకసము బ్రద్దలయి నేల మీదపడునట్లు తోచుచున్నది. అని తలంచి దుమ్ముచేత ఎక్కడికిని పోజాలకుండిరి. ఒకరి కొకరు కనుపడకుండిరి. చిత్త చలనము గలిగియుండిరి. ఆ దుమ్మువలన అంధకారమయముగానుండెను. కండ్లకెదురుగనుండు వస్తుజాలము కనుపించుటలేదు. పాండవులు పొదలను, తీగలను, చెట్లను చేతులచేత త్రోవను గనుగొనుచు గొప్ప వృక్షమూలములను ఆశ్రయించిరి. అప్పుడు ధర్మరాజ ధౌమ్య సహదేవు లగ్నిహోత్రములను రక్షించుచు ఒకచోట గూర్చుండిరి. భీముడు ధనుర్బాణ గదలను ధరించి ద్రౌపదీ సహితుడై యొకచోట గూర్చుండెను. రోమశ నకుల విప్రులందరును యొకచోట గూర్చుండిరి. దుమ్ము వలన కనబడక యీరీతిగా వేరు వేరుగా నుండిరి.

ఆ గాలియందే గొప్ప వర్షము కురిసెను. మేఘము లతిభయాకరముగా వ్యాపించెను. ఉరుములు మెరుపులు మిక్కుటముగానుండెను. ఆ వర్షముచేత సకలనదులు, సరస్సులు, చెరువులుగూడ నిండినవి. ఆ వర్షపు గాలిచే, పెక్కువృక్షము లూడిపడెను. చాలసేపు మహావాయువుతో కూడిన పెద్ద వర్షముకురిసెను. వర్షము నిలిచిన పిమ్మట వారందరొకచో జేరి కలసి మరల గంధమాదన పర్వతమందు నడచుచుండిరి. మార్గము మిగుల దుర్గమముగా నుండెను. బండలు ముండ్లు, వనములధికముగా గలవు. ఆ మార్గమున ద్రౌపది నడువ జాలక శ్రమచేత మూర్ఛిల్లి పడెను. భీముడు ద్రౌపదిని యెత్తికొని కృష్ణాజినమందుంచి అరటి యాకులచేత విసరుచుండెను. ఆయుధాభ్యాసము వలన నకుల సహదేవు లందరచేతులందు కాయలు కాచి యుండెను. ఆ యరచేతులచేత వారా ద్రౌపది పాదములను ఒత్తుచుండిరి ఆ సమయమున ద్రౌపదిని ధర్మరాజు జూచి యిట్లు దుఃఖించెను.

భీమా! ద్రౌపది పాదములు తామరాకులవలె మృదువులుగా నున్నవి. అట్టి పాదములు కఠిన శిలాప్రదేశములయందు నడచుటచేత యెఱ్ఱగా నగుచున్నవి. నా నిమిత్తమువలన యీ ద్రౌపది మిక్కిలి కష్టములను పొందు చున్నది. మెత్తని పరుపులయందు పండుకొను ద్రౌపది యిప్పుడు కఠిన శిలాప్రదేశము లందు పండుకొని దుఃఖించుచున్నది. ద్రుపదుడు మనకు భార్యయై సుఖపడునని తలచియుండును. అని ధర్మరాజు భీమునితో చెప్పుచు దుఃఖించుచుండెను. ధౌమ్యుడు మొదలగు వారందరును ధర్మరాజు నూరడించిరి. ద్రౌపదియు చల్లగాలిచే సేదదేరి మూర్ఛదెలిసి లేచెను. ధర్మరాజు ద్రౌపదిని ఊరడించి భీమునితో యిట్లు చెప్పెను.

భీమా! మనము ద్రౌపదిని వెంటబెట్టుకొని యీ భయంకర పర్వత వనభూములయందు నడువజాలము. ద్రౌపది వనపర్వత ప్రదే

శముఁలందు నడువజాలరు. అని ధర్మరాజు భీమునితో చెప్పెను. భీముఁడు ధర్మరాజు అనుమతినిబొంది తన పెద్దకొడుకగు ఘటోత్కచుని తలచెను. వెంటనే ఘటోత్కచుఁడు తనరాక్షస సైన్యములతో పాండవుల దగ్గరకు వచ్చెను. అతఁడు గొప్పవీరుఁడు. ధనుర్బాణములను ధరించెను. రాక్షసులతోకూడి యుండెను. అట్టివాఁడు తండ్రులకు నమస్కరించి పిమ్మట బ్రాహ్మణులకు నమస్కరించెను. ఘటోత్కచుఁడు భక్తిపూర్వకముగా నాతో పనియేమో ఆనతిండని పాండవుల నడిగెను. భీముఁడు ఘటోత్కచుని కౌగిలించుకొని కుమారా! యీ ద్రౌపది నీకు తల్లియగును. ఇప్పుఁడు ఆమె మిక్కిలి శ్రమచెంది బలహీనురాలై యున్నది. సర్వదా నడచుటవలన మూర్ఛించుచున్నది. గాన నీవామె నెత్తుకొని మా వెంట రావలయును. అని పల్కిన భీముని మాటలకు ఘటోత్కచుఁడు తండ్రీ! యీ మార్గము మిక్కిలి కఠినశిలా ప్రదేశములచేత విషమమై యున్నది. పాదచారులగు వారు యీమార్గమందు నడువజాలరు. గాన మిమ్మందరిని యెత్తుకొని అనాయాసముగా నేను ఆకాశమార్గమందు నడువగలను. అని చెప్పి ఘటోత్కచుఁడు ధర్మరాజ, భీమ, నకుల, సహదేవ, ద్రౌపది ధౌమ్యుల నెత్తుకొనెను. సకల బ్రాహ్మణులను ఎత్తుకొనుటకు తన రాక్షస బలములను ఘటోత్కచుఁడు పంపించెను. అందరును వారందరిని యెత్తుకొని ఆకాశమార్గమందు నడుచుచుండిరి. లోమశుఁడు సిద్ధగతిచేత ఆకాశమార్గమందు పాండవుల వెంబడి వెళ్ళుచుండెను. అందరును గంధమాదన పర్వతమందు ఆకాశమార్గమున వెళ్ళి గంగానదీ తీరము చూచిరి గంగాతీరమందు బదరీవనముండెను. బదరీవనమందు నరనారాయణు లాశ్రమముండెను. పాండవులును, విప్రులును, రాక్షసులమీదనుండి క్రిందకు దిగిరి. పాండవాదు లందరును అక్కడగల రేగుఫలములను చూచి మిక్కిలి యాశ్చర్యమును పొందిరి. దేవ

సిద్ధులు సేవించు గంగానదియందు వారందరును స్నానముచేసిరి. పాండవు లందరును నియమవ్రతములు జరుపుచు సమాధియోగము చేత మైనాకపర్వత హిరణ్య శిఖర బిందు సరస్సులను జూచిరి. పాండవులు బదరీవనమందు గల నరనారాయణ ఆశ్రమమందు ఆరు దినములుండిరి. అంతట ఒకానొక దినమున ద్రౌపదీ భీము లిరువు రును ఆగంధమాదన పర్వతచరియలలో రత్నఖచితములగు వేదికలపై విహరించుచుండిరి. ఆసమయమున ఒక సౌంగధిక పద్మము గాలిచేత విరిగి యెగిరివచ్చి భీమ ద్రౌపదుల ముందరపడెను ఆకమలము మిగుల మనోహరము, సుందరము, పరిమళముగలిగి సకలపుష్పములకంటె అధి కమై యుండెను. ద్రౌపది దానిని చూచి ప్రీతిగలదై సంతోషించి భీమునితో భీమా! యీ సౌగంధిక కమలము ఒక్కటి అయినను మనో నేత్రముల కపూర్వమైన ఆనందమును గలిగించుచున్నది. యిటు వంటి పుష్పములను యిక్కడకు సమీపమందున్న యెడల అనేకము లుగా నాకు తెచ్చి యిచ్చి నాకు ప్రీతిని గలిగింపుము. అని ద్రౌపది చెప్పెను. ద్రౌపది ఆపుష్పమును ధర్మరాజుదగ్గరకు తీసుకొని పోయెను.

## భీముడు సౌగంధిక పుష్పము దెచ్చుటకు పోవుట

ఓ జనమేజయ మహారాజా! భీముడు ద్రౌపదిని సంతోష పెట్టు నిమిత్తము సౌగంధిక పుష్పమును దెచ్చుటకై బంగారు పిడిగల గొప్ప ధనస్సును ధరించి సర్పములవంటి బాణములను గ్రహించి ధనుర్బాణధరుడై ఆసౌగంధిక పుష్పరాజము వచ్చిన గాలివైపు పోవుచుండెను. వెళ్లుచు గంధమాదన పర్వతమందుగల రత్నమయ ములగు అరుగులను చూచుచు, తాకుచు తుమ్మెదలధ్వనులను వినుచు, కోకిల మొదలగు పక్షుల కూతల నాలకించుచు, సకలపుష్ప ముల సువాసననాఘ్రాణించుచు, మిక్కిలి మాధుర్యములైన పండ్లను

దినుచు పరమ సంతోష ఉల్లాసములు గలుగ భీముడు వెళ్ళుచుం డెను. మార్గమున తనకు యెదురుగావచ్చు మృగములను చంపుచుండెను. ఏనుగులను నెత్తి ఏనుగులమీదను, సింహములనెత్తి సింహములమీదను కొట్టుచుండెను. అల్పమృగములను తన అరచేతితో కొట్టిచంపుచుండెను. భీముడు పుష్పమునకై పర్వతమునందు వెళ్ళుచుండగా అతని గమన వేగమునకు చెట్లును, పొదలును కదలుచుండెను. దేవ, గరుడ, గంధర్వ, కిన్నర, కింపురుష స్త్రీలందరును గుహాలయందు అణగియుండి భీముని చూచుచు కనబడకుండిరి. భీముడు మ్రాకులను విరుచుచు, తీగలను పెరుకుచు, పర్వతమందుగల ఉన్నతప్రదేశములను యెక్కుచు వెళ్లుచుండెను. భీముని సింహనాదమునకు భయపడి పక్షులన్నియు పరుగెత్తసాగెను. కొన్ని పక్షుల రెక్కలు తడిసి యుండుటజూచి భీముడా! యెదుట ఒక కొలను గలదని తెలిసికొని వెళ్ళివెళ్ళి చల్లని నీటితో నిండిన ఒక సరస్సును జూచెను. ఆసరస్సున అనేక విధములగు వృక్షములుండెను. అచ్చట భీముడు స్నానముచేసి బయటికి వచ్చెను. అచ్చటనే ఒక అరటి తోట కలదు. అది మనోహరముగా నుండెను. అనేకమగు ఆమడల పొడవు వెడల్పు గలిగి యుండెను. అట్టివనమందు భీముడు ప్రవేశించి పిడుగువలె భయంకరముగా నుండునటుల అన్నిదిక్కులయందును ఆకాశమునందు వ్యాపించి నిండియుండునటుల భయంకరమైన శంఖధ్వనిని చేసెను.

ఆ గంధమాదన పర్వతమందు ఒక గుహలో హనుమంతుడు అను వానరుడు పండుకొని యుండెను. ఆ భీముని శంఖధ్వనిని హనుమంతుడు విని బెదరి లేచి యిట్లని తలంచెను. ఈ మహాధ్వని ఎక్కడిదో తెలియలేదు. ఇది వినినతోడనే నామనస్సున కుల్లాసము కలుగుచున్నది. ఇది నాతమ్ముని శంఖధ్వనియై యుండవలయునని

తలంచి సంతోషించెను. హనుమంతుడు భీముని మార్గమునకు అడ్డముగా మహావృక్షములనువేసి మార్గమున కడ్డముగా పండుకొని తన తోకను చలింపజేసెను. హనుమంతుని తోక కదలుటచే మహా భయంకరమైన ధ్వని కలిగెను. ఆధ్వని విని సమస్తమృగజాతులును భయపడి పరుగులెత్తి గుహలలో ప్రవేశించి యడగియుండెను. ఆ ధ్వనిని విని భీము డాశ్చర్యపడి చూడ నా అరటివనమధ్యమందు ఒక పెద్ద బండయు దానివెనుక నొక విశాలమగు మహాశిలయందు హనుమంతుని చూచెను. హనుమంతుడు పొట్టిదైన బలిసిన కంఠమును దృఢములగు బుగ్గలును చపలస్వభావుడై సన్నని నడుమును గుండ్రములగు పిరుదులును, అగ్నికణములవలె ఎఱ్ఱని పెదవులును, శుష్కించిన దంతనఖములును, పసుపువన్నె నేత్రములును కలిగి యుండెను. అతడు ఎత్తుగా విశాలముగానుండు రొమ్మును, గొప్ప భుజములను గూడ కలిగియుండెను. అతని తోక పైకి ఎత్తబడి టెక్కెమువలె ప్రకాశించుచుండెను. అతడు ఏకాంతముగా యోగ నిద్రగలిగి నిర్మల ధర్మవంతుడై యుండెను. అట్టి హనుమంతుని భీముడు చూచి వానికి నిద్రాభంగము గలిగింపదలచి హనుమంతుని దగ్గరకు పోయి తన శక్తికొలది సింహనాదమును గావించెను. హనుమంతుడు మెల్లమెల్లగా మేల్కొని కన్నీరుతో నిర్లక్ష్యముగా భీముని జూచి అయ్యా! నేను ముసలివాడను. రోగములచే పీడింపబడుచు శ్రమచెందియున్నాను. నీ సహోదరుడను. నేను సుఖముగా నిద్రింపుచుంటిని. నీవు ఎరిగియు నాకు నిద్రాభంగమును కలిగించితివి. పశుపక్షి మృగాదులైన తిర్యగ్జంతువులు ధర్మము నెరుంగజాలవు. సర్వభూతదయాస్వరూపమగు ధర్మమును మనుష్యులెరుంగుదురు. నీవు మనుష్యుడవై పుట్టి పెద్దలను సేవింపక ఏధర్మమును ఎరుగక నిర్దయుడవై మాబోటి పెద్దమృగములకు భయము కలుగునట్లు సింహనాద

ముకు జేసిన నీ వెవఁడవో జెప్పుము, ఈ వనము మనుష్యులకు గోచ
రము కాదు. ఇచ్చటి కెందుకు వచ్చితివి? సిద్ధగతి లేనివారీ మార్గమందు
రాజాలరు గాన యిందుగల కందమూలఫలములను అమృతసమాన
ములగుటచే భక్షించి వెనుకకు మరలిపొమ్ము. నీయందు నేనధిక
స్నేహము కలిగియున్నాను. అందువలన నీకు బుద్ధిచెప్పితిని. నా
మాటలను విని నేను చెప్పినట్లు చేయుము. అని హనుమంతుఁడు
భీమునితో చెప్పగా భీముఁ డిట్లు పలికెను. వానరశ్రేష్ఠా! నేను
క్షత్రియశ్రేష్ఠుఁడను, లోకప్రసిద్ధముగు బలవంతుఁడను. పాండురాజు
కుమారుఁడను. వాయుదేవుని వరమువలన కుంతీదేవి గర్భమందు
బుట్టినవాఁడను. జనులందరును నన్ను భీముఁడందురు. ఇప్పుడు నేనొక
కార్యార్థినై వెళ్ళుచున్నాను. నాకు నీవు మార్గ మివ్వనియెడల
పూర్వము హనుమంతుఁడు సముద్రముదాటి లంకకు బోయినట్లు
యిప్పుడు నిన్నును, యీపర్వతమును గూడ దాటివెళ్ళెదను. అని
చెప్పగా హనుమంతుఁడు భీమా! ఏ కారణమువలన హనుమంతుఁడు
సముద్రమును దాటెనో నీ వెరిగినయెడల ఆ విషయమును నాకు
చెప్పుము. అనిహనుమంతుఁడడుగా భీముఁడిట్లనియెను. వానరశ్రేష్ఠా!
పూర్వము యిక్ష్వాకుకులమందు మహావీరుడైన శ్రీరాముఁడుపుట్టెను.
అతఁడు తండ్రియగు దశరథుని యాజ్ఞవలన వనమునకు బోయెను.
ఆవనమందున్నప్పుడు శ్రీరాముని భార్యయగు సీతాదేవిని రావణా
సురుఁడపహరించెను. సీతను వెదకుటకై వానరు లందరును వెళ్ళి
సంపాతియను పక్షివలన సీతావృత్తాంతము నంతయు తెలిసికొనిరి.
అంతట వానరు లందరును సముద్రమును దాటజాలకుండిరి, అప్పుడు
మహావీరుడైన హనుమంతుఁడు సముద్రమునుదాటి లంకకువెళ్ళెనని
వినియున్నాను. నేనును ఆ హనుమంతునివంటి బలపరాక్రమవంతుఁ
డను. నాపౌరుషమును నీకు జూపెదను. అని భీముఁడు హనుమంతు

నితో జెప్పెను. అందులకు హనుమంతుడు భీమునకు తెలియకుండ నవ్వుకొనుచు భీమా! నేను ముసలివాడను. లేవజాలను. నీవు యీ మార్గమున వెళ్ళదలంచినచో నాతోకను తొలగించి వెళ్ళవచ్చును. అని భీమునితో పలికెను. భీముడు గర్వముతో తన యెడమచేతితో నాతోకను యెత్తుటకు ప్రయత్నింపగా ఆ తోక కదలలేదు. అంతట భీముడు తన రెండు చేతులతో నాతోకను యెత్తుటకు ప్రయత్నించినను ఆ తోక కదలలేదు. భీముడు తన శక్తికొలది ఆతోకను యెత్తదలచి వంగి శ్రమచేత ప్రయత్నించినను దేహమందు చెమటబిందువులు కలిగెనేగాని తోకను కదలింపజాలక గర్వమును బోనాడి సిగ్గుచే తలవంచికొని మిక్కిలి చింతాక్రాంతుడై హనుమంతునకు సాష్టాంగ నమస్కారము చేసి యిట్లనెను.

మహాత్మా! వానరశ్రేష్ఠా! నిన్ను నే నెరుగక పలికిన మాటలను నీవు క్షమింపవలయును. నీవు సిద్ధుడవో, గంధర్వుడవో, కోతిరూపమును ధరించి వచ్చిన మరియెవ్వరవో నాకు దెలుపుము. అని ప్రార్థించగా హనుమంతుడు భీముని జూచి నవ్వుచు యిట్లనెను. భీమా! నేను కేసరిక్షేత్రమందు వాయుదేవునకు బుట్టినవాడను. నీవు నాకు తమ్ముడవు. పూర్వము రఘువంశమందు బుట్టిన రాముడు అడవియందుండగా అతని భార్యయగు సీతాదేవిని రావణాసురుడు అపహరించి తీసికొని లంకకుబోయెను. అంతట ఆరాముడు సుగ్రీవాది వానరకోట్లను తనకు సహాయముచేసుకొని సేతువుచేత సముద్రమును బంధించెను. అంతట ఆసేతు మార్గముద్వారా సముద్రమును దాటి రాముడు రావణాసురుని సంహరించెను. ఆయుద్ధమందు నాబలపరాక్రమములకు రాముడు మెచ్చి నాకు వరమిచ్చెను. హనుమంతుడా! లోకమందు నాకీర్తి ఎంతవరకుండునో అంతవరకు నీవు నిత్యుడవై యుండుము. అని రాముడు నాకు వరమిచ్చి సకలభూమిని

పదునొకండు వేల సంవత్సరములు పరిపాలించి స్వర్గమునకుబోయెను. ఆ హనుమంతుడను నేనే సుమీ. అని చెప్పగా భీముడు వానిని హనుమంతునిగా తెలిసికొని సంతోషించి నమస్కరించి మహాత్మా! నిన్ను జూచుటవలన నేను కృతార్థుడను. నీవు మహాబలవంతుడవు. పూర్వము సముద్రమును దాటినప్పుడు నీకు గల రూపమును జూచు వలెనని నాకపేక్ష కలదు. నాయందు నీకు దయ యున్న యెడల అప్పటి రూపమును నాకిప్పుడు జూపవేడెదను అని యడుగగా హనుమంతు డిట్లనెను. భీమా! ఆ కాలమందలి రూపమును యీ కాలమందు జూపుట సాధ్యమా! కాలము ఒక్కరీతిగానుండక అనేక రీతులుగా మారుచుండును. అందువలన కృత, త్రేతా, ద్వాపర, కలి యుగములను నాలుగుయుగములయొక్క సంఖ్య వేరువేరుగా నున్నవి. ఆకాలభేదము ననుసరించి ఆయా యుగముల యందలి స్వరూప స్వభావములు భిన్నముగా నుండును. అని హనుమంతుడు భీమునితో చెప్పగా భీముడు హనుమంతుడా! ఆయుగముల యందు గల ఆచారములను నాకు తెలియునట్లు చెప్పవలయునని యడుగగా హనుమంతుడిట్లు చెప్పసాగెను.

## భీమునకు హనుమంతుడు చతుర్యుగాచార వర్తనములను జెప్పుట

భీమా! కృతయుగమందు ధర్మము నాలుగుపాదములను సంపూర్ణముగా నడచెను. విష్ణుదేవుడు తెల్లనిరూపమును ధరించి ప్రజలను రక్షింపుచుండును. కృతయుగము ధర్మస్వరూపమగుటచే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ఏక వేదక్రియా కర్మసంయోగము వలన పుణ్యలోకములను పొందుదురు. జనులకు అసూయాగుణముండదు. పరులను హింసింపరు. గర్వముండదు. లుబ్ధత్వముగలిగి యుండరు, నీచగుణము లేదు. కలహము, క్రోధము, మత్సరము, భయము.

దుఃఖము, వ్యాధి, ప్రజాక్షయము లోనగునవి లేవు. త్రేతాయుగ మందు మూడు పాదముల ధర్మము నడచినది. జనులు సర్వదా సత్య వర్తనులు. యజ్ఞతపోదానాది క్రియలను చేయుచుండిరి. ఆయుగమున విష్ణువు ఎఱ్ఱనిశరీరము గలవాడై ప్రజలను రక్షింపుచుండెను. ద్వాపర యుగమందు ధర్మము రెండుపాదముల నడచెను. వేదములు నాలుగుగా వర్తించెను. ఋగ్వేదము. యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము అనబడినవి. ఈవేదభేదము కృత త్రేతా యుగముల యందు లేదు. ఆయుగములయందు వేదమంతయు నొక్కటే ద్వాపరమున వేదశాస్త్రములు, ధర్మకామములు ప్రవర్తింపుచు భూమి యందు ప్రకాశించెను. కొందరు అసత్యప్రవర్తకులై యుండిరి. కామ ఫలములను గోరుచు అనేకయజ్ఞములను చేసిరి. విష్ణుదేవుడు యీ యుగమందు నల్లనిదేహము కలవాడై ప్రజలను రక్షించెను. కలియుగమందు ధర్మము క్షయమై ఒకపాలుమాత్రమే నడువగలదు. విష్ణు దేవుడు కలియుగమందు పచ్చనిదేహము గలవాడై జనులను రక్షించును. జనులు అధర్మపరులై తమోగుణవంతులై కామక్రోధాది దోషగుణములకు తమ్ముతామెరుగక బొల్పడి పాపకర్ములగుదురు. ఆయుగమందు జేసినతపోదానధర్మములు మిక్కిలిఫలవంతములగును. అని యీరీతిగా హనుమంతుడు యుగప్రవర్త ప్రమాణములు భీమునితో చెప్పి నీకిష్టసిద్ధియగును, వెళ్ళుమని పంపెను.

## హనుమంతుడు భీమునకు దనపూర్వరూపమును జూపుట

అప్పుడు భీముడు హనుమంతునితో యిట్లనెను. అన్నా! నీ పూర్వరూపమును జూడకుండ నేను వెళ్ళువాడనుగాను. అవశ్యముగ నీపూర్వరూపమును నాకుజూపవలయును, అనిఅడుగగా హనుమంతుడు తనపూర్వరూపమును భీమునకు జూపెను. ఆహనుమంతుని శరీరము

రెండవ మేరుపర్వతమువలె నుండెను. దేహమును పెంచి చూపగా ఆకాశమందు వ్యాపించి రెండవబంగారు కొండవలె ప్రకాశించెను. లోక దిక్కుల యందు వ్యాపించెను. ఆ రూపమును భీముడు చూచి మిగులభయపడి రెండుకండ్లను మూసికొని అధికాశ్చర్య భయంబులతో అన్నా! నీరూపము మిగులభయమును కలిగించుచున్నది. అధికాశ్చర్యమును బుట్టించుచున్నది. భూమ్యాకాశ మధ్యమునవ్యాపించి యున్నది. యికచాలును. ఈరూపమునువిడచి యెప్పటిశరీరముగలవాడవై యుండుము. అని ప్రార్థించగా హనుమంతుడు ఆరూపమును విడిచి ఎప్పటిశరీరముతో భీమునితో యిట్లనెను. భీమా! నేను శత్రు సైన్యమును జూచునపుడు నారూపము యింతవరకు రెండింతలు అధికముగా నుండును. అని చెప్పిన భీముడిట్లనియె. మహాత్మా! నీవుమహాబలపరాక్రమ వంతుడవు. నీవొక్కడవే మహాబలవంతుడవగు రావణాసురుని చంపగలవు. ఇట్టి నిన్ను ఆరాముడు సహాయము చేసికొని రాక్షసులను చంపుటలో నాశ్చర్యము లేదు. అని భీముడు పలుకగా హనుమంతుడు సంతోషించి యిట్లనెను. భీమా! నీవు సౌగంధిక పుష్పములుండు సౌగంధిక సరస్సునకు వెళ్ళుచున్నావు. అక్కడ నీవు సాహసముచేయరాదు. ఆ సరస్సును యక్షరాక్షసులు రక్షింపుదురు. అది దేవతలకుపయోగము. బలిహోమ నమస్కారములచేతను, భక్తి వలనను, దేవతలు వశ్యులగుదురు. కాని సాహసక్రియలచేత వశ్యులుగారు. నీవు క్షత్రియధర్మ మందున్నను పరమధర్మములను యెరుగవలయును. ఎక్కడనైనను బుద్ధిహీనులు మోహమునపడుదురు. అట్టి ధర్మాధర్మ విచారణకలిగినప్పుడు శాస్త్రజ్ఞులగు విద్వాంసులను ఉపాసించి ధర్మాధర్మములను యెరింగి శుభాచారుడవు గావలయును. మంచిఆచారమువలన ధర్మబుద్ధియు, ధర్మమువలన వేదార్థజ్ఞానమును దానివలన యజ్ఞప్రవర్తనలును, వానివలన దేవతాతృప్తియు, తనుష్యుల

మున బుద్ధిమంతులు కార్యసిద్ధినిబొంది దేశకాలములనెరిగి సాహస మునువిడిచి పరిధారణ సామదాన భేద దండోపాయములచే కార్య సాధకమును గావించుదురు. ఆలోచనపూర్వకముగా సర్వకార్యములు ఫలింపగలవు. కాన గొప్పబుద్ధిగల విద్వాంసులతో కార్యాలోచనము చేయవలయునేకాని బాలకులతోడను అధికలక్ష్మీగర్వవంతులతోడను, బలహీనులగు అల్పులతోడను కార్యాలోచన చేయరాదు. రాజుయొక్క ఆజ్ఞననుసరించి జనులు ప్రవర్తించి తమమర్యాదలను విడువకుందురు. నీవు నిగ్రహానుగ్రహములను జేయుటకు సమర్థుడవు గాన నీకందరును వశ్యులగుదురు. నిన్నుజూచుటవలన నానేత్రములు కృతార్థతనందినవి. నీయిష్టమగు కార్యమునేదియో దెల్పినయెడల నేజేసెదను. మీకు కీడుగలిగించిన ధృతరాష్ట్రుని కుమారులగు దుర్యోధనాదులందరిని ఒక్కసారే యుద్ధమందు శత్రుసైన్యములతోబాటు చంపి నీకు సంతోషమును కలిగించెదను. హస్తినాపట్టణమును పడ గొట్టి అడవిపాలుజేసి సకలభూరాజ్యమును మీకుయిచ్చెదను. అని పల్కిన హనుమంతునకు భీముడిట్లనెను.

అన్నా! యిప్పుడు నీవుచెప్పినట్లుచేయుట నీకొకగొప్ప విష యముకాదు. మహాయుద్ధమందు మాశత్రువులను మేమేచంపగలము. మీదయచేత మమ్ములనుగెలుచు శత్రువులులేరు అనగా హనుమం తుడిట్లనిపలికెను. భీమా! నీవుయుద్ధభూమియందు నన్నుతలచుకొ నుము. నాకు నీయందుగల మక్కువచేత అతిరథుడైన అర్జునుని రథ కేతువందు యుద్ధభూమిలో నేనుండెదను. అట్లుండి ఆమహాయుద్ధ మున మీబలపరాక్రమములను నేనుచూచెదను, అని హనుమం తుడుపల్కి భీముని కౌగిలించుకొనెను. పిమ్మట సౌగంధికసరస్సునకు పోవుమార్గమునుజూపి హనుమంతుడంతర్ధానమైపోయెను. ఆహనుమం తుని కౌగిలింతవలన భీమునకు శ్రమదీరి మహావేగబల శక్తికలిగెను.

పిమ్మట భీముడు మహావేగముతో సౌగంధికసరస్సువద్దకు హనుమంతుడు చెప్పినమార్గముద్వారా వెళ్ళుచుండెను. ఆపర్వత శిఖరముల యందు మేఘములును. ఏనుగులగుంపులును గలవు. అచ్చట సర్వదా వర్షించుచుండును. ఏనుగులశిరస్సులలోనుండి మదజలధారలు కారుచుండును మేఘములయందు మెరుపులు ప్రకాశించుచుండును. ఏనుగుల దంతములచేత పరిసరమంతయు ప్రకాశించుచుండెను. పిడుగులవలె ఉరుములు ధ్వనించుచుండెను. ఏనుగుల ఘీంకారధ్వనులు మేఘముల యురుములు రెండు నొక్కటేరీతిగా నున్నందున పరస్పరము విడదీయుటకు వీలుగాకుండెను. అట్టివానినిజూచి భీముడు ఆశ్చర్యముచు బొందుచు వెళ్ళుచుండగా కైలాసపర్వత సమీపమందు ఒకమనోహరమైన వనభూమినిచూచెను. ఆవనము కుబేరునిది. ఆవనమందుగల సౌగంధిక కమలములను భీముడుచూచెను. అప్పుడు చల్లని గాలివీచెను. భీముని మనస్సునకు ఆనందము కలిగెను. వాయుదేవుడు తనకుమారునకు ఆనందము కలిగించెనో యన్నట్లు తోచుచుండెను. అప్పుడు భీముడు గొప్పగదాయుధమును ధరించియుండెను. ధనుర్బాణములు గలిగియుండెను. ఆసౌగంధిక సరస్సును పదివేలమంది రాక్షసవీరులు రక్షించుచు కావలిగాయుచుండురు. ఆరాక్షసవీరులందరును భీమునిజూచి తమలోతామిట్లు చెప్పుకొనసాగిరి. రాక్షసులారా! వీడె వడో ధనుర్బాణధరుడై యీసౌగంధిక పుష్పములను తీసికొనిపోవుటకు వచ్చెను. వీడు మహాబలవంతుడు. గొప్పఆయుధములను ధరించి కృష్ణాజినములను కట్టుకొని అధికతేజస్వియై, మునివేషధారియై యున్న మహావీరపురుషుడు అని చెప్పుకొని రాక్షసులు ఆక్షణమందే విచిత్రములైన ఆయుధములను ధరించివచ్చిరి. ఆరాక్షసులందరును భీమునిజూచి ఆశ్చర్యమునుబొంది వానిదగ్గరకువచ్చి నరపుంగవా! యిది కుబేరుని వనము. యిక్కడికి మానవులు రాజాలరు. నీవిచ్చటి

కేలవచ్చితివో, తెలియజెప్పుము. మిక్కిలిపొరబాటున వచ్చియుంచ వచ్చును. మహాత్ముడగు కుబేరుడును, అతని భార్యలును యిక్కడ క్రీడింపుచుందురు. ఈ సరస్సుయొక్క గట్టునందు దేవతలు దేవతా ర్చన సలుపుచుందురు. ఇందుగల జలములు అమృతసమానములు. ఈసరస్సున బంగారు కమలములు గలవు. ఆ బంగారు కమలములకు వైడూర్య నాళములుగలవు. వానికి అపూర్వమైన పరిమళముగలదు. అందువలన యక్షరాక్షస అక్షౌహిణీ సైన్యముచేత యీసరస్సు రక్షింపబడుచున్నది. దీని మహిమ నెరుగక యింతదూరమువచ్చినవీరు డెవ్వడునూ లేడు. నీవెవ్వడవో తెలియకున్నది. ఏమి కారణమువలన యిక్కడకు వచ్చితివో తెలియజెప్పుము. అని రాక్షసులందరును అడుగగా వారికి భీముడు యిట్లని చెప్పెను.

ఓ యక్షరాక్షసులారా! నేను పాండురాజు కుమారుడను. నా పేరు భీముడు. మహాతేజోవంతుడను. ధర్మరాజు తమ్ముడను. నాకు భార్యయగు ద్రౌపదికలదు. ఆమెరు సంతోష పడుపదలచి యీ సౌగంధిక పుష్పములను తీసికొని పోవుటకు వచ్చితిని. దేవతా వీరు లడ్డుపడినను నేనీ పుష్పములను అవశ్యము తీసికొని పోగలను. అని భీముడు యక్షరాక్షసులతో చెప్పెను. అంత వారిట్లనిరి. రాజశ్రేష్ఠా! నీవు దివ్యపురుషుడవు. ఈ కమలములను తీసికొని వెళ్ళుపద్ధతిని కుబేరునకు దెలిపి అతని యనుమతి బొంది తీసుకొనుము. నీవు ధర్మ రాజునకు తమ్ముడవైనందున ధర్మమార్గమును తప్పరాదు. అని రాక్షసులు చెప్పగా భీముడు కటాక్ష దృష్టితో రాక్షసులను జూచి రాక్షసులారా! పర్వతములయందుగల సెలయేరుల వలన యీ సౌగంధిక వనము పుట్టెను. ఈ వనము సర్వజనులకును సొత్తుఅగును గాని ఒక్క పురుషుని సొత్తుగాదు. కుబేరుడు మొట్టమొదట దీనిని సృష్టించెనో, లేక క్రయమునకు కొనెనో చెప్పుడు. యీ వనము

కుబేరుని సొత్తగుటకు కారణమేమి? నేను ఉత్తమక్షత్రియుడను. ఉత్తమ క్షత్రియుడు యితరులను అడిగి ప్రార్థింపరాదు. మరియు భుజాబలము వలన అన్యధనములను సంపాదించి యాచకులకు యీయవలయును. తన కీర్తిని దిక్కులయందు ప్రకాశింపజేయవలయును. నిమ్ములనుగాని, మీ కుబేరునిగాని నేను ప్రార్థించవలసిన పనిలేదు. నేనే యీ సరస్సులోనికి పోయి పూవులను తీసికొనరాదా? అని భీముడు రాక్షసులతో చెప్పెను. మరియు వారి నాదరింపక భీముడు సౌగంధిక సరస్సులోనికి పోయి బంగారు కమలములను తీసికొని సరస్సునందుగల జలములు మిక్కిలి శక్తి ప్రదములగుటంజేసి వాటిని భీముడు త్రాగి మిక్కిలి బలవంతుడై యుండెను.

## భీముడు యక్షరాక్షసులతో యుద్ధము చేయుట.

ఆ యక్షరాక్షసులందరును భీముని చూచి కోపించి ఆయుధములనెత్తి వానితో యుద్ధము చేయుటకు వచ్చిరి. భీముడును అతి భయంకరాకారుడై యక్షరాక్షసుల గుంపుతో యుద్ధము చేసెను. అప్పుడు రాక్షసులందరును భీమునిమీద నానావిధ ఆయుధములను ప్రయోగించిరి. ఆ ఆయుధములన్నిటిని భీముడు తనగదాయుధము చేత నిలిపి రాక్షసులను పడగొట్టెను. భీముని గద దెబ్బలకు రాక్షసులలో కొంతమంది చచ్చిరి. తక్కిన యక్షరాక్షసులందరును బాధనొంది భీముని బలపరాక్రమములను గురించి కుబేరునితో తెలియజెప్పుటకు వెళ్ళిరి. అప్పుడు కుబేరుడు భీముని బలపరాక్రమములను విని మెచ్చుకొని ద్రౌపదికి సంతోషము కలిగించుటకు పుష్పముల నిమిత్తమై వచ్చెనని ఉపేక్షించి ఊరకుండెను. భీముడు రాక్షససైన్యమును ఓడించి సౌగంధిక కమలములను తీసికొని ఆసరస్సునొక్క

పరిసర మందలి పుష్పవనములో విహరింపు చుండెను. అంతలో నర నారాయణాశ్రమ మందుండు ధర్మరాజు దగ్గర పిడుగులుపడెను. పర్వతము కంపించెను. దుమ్ముతో గూడిన వర్షము కురిసెను. దిక్కులన్నియు మిక్కిలి ఎఱ్ఱగా నుండెను. చీకటిచేత సూర్యుడు కప్పబడి యుండెను. ఇటువంటి మహోత్పాతములను ధర్మరాజు చూచి ఆశ్చర్యమునుపొంది యివి భీముని యుద్ధవిషయమును సూచింపు చున్నవి గనుక నేను ఏమరకుండవలయును. అని ధర్మరాజు తలచి నాలుగు దిక్కులను చూచెను. ధర్మరాజు భీముని గానక తన సమీప మందుండు ద్రౌపదితో యిట్లనెను. ద్రౌపదీ! భీముడు సాహసుడు నిర్భయుడు. అతడెక్కడికి బోయెనో తెలియలేదు. ఈ గంధమాదన పర్వతమందు అనేకమంది రాక్షసులు, అనేకమంది గంధర్వులు నుందురు. భీముడొంటరిగా ఎక్కడికి వెళ్లెనో తెలియకున్నది. భీముడు తనంతట తానే వెళ్ళెనో లేక నీవు ఎక్కడకైనను పంపించితి వేమో చెప్పుము. అని ధర్మరాజడుగగా ద్రౌపది యిట్లనెను. నాథా! నీకు నేను బంగారుకమలమును యిచ్చితినిగదా ఆకమలము పెద్దగాలి వలన వచ్చి నాముందట పడెను. ఆ కమలమును, నేనును, భీముడును జూచితిమి. అప్పుడు నేను భీమునితో భీమా! యిట్టి పుష్పములు దొరకుట దుర్లభము. యీ పుష్పములు యిక్కడికి సమీపమం దున్న యెడల నాకు తెచ్చియిమ్ము అని చెప్పగా భీముడు ఈశాన్య దిక్కునకు పోయెను. అని ద్రౌపది ధర్మరాజుతో చెప్పెను. అంత ధర్మజుడు యిట్లనెను.

ద్రౌపది! అట్లైనయెడల మనమందరము ఆభీముడు వెళ్ళిన దిక్కునకు వెళ్ళుదము. అని చెప్పగా ఎప్పటివలె ఘటోత్కచుడు మొదలగు రాక్షససైన్యములు అందరును ఆకాశమార్గమున వెళ్ళి సౌగంధిక సరస్సునకు పోయిరి. అచ్చట గదాయుధ ధారియై

భీభత్సాకారమున నున్న భీమునిజూచిరి. భీమునిచే చచ్చిపడియున్న యక్షరాక్షస సమూహములను చూచి ధర్మరాజు ధౌమ్యుడు, లోమ శుడు, ద్రౌపది తక్కుంగల విప్రసంఘములందరును ఆశ్చర్యమును పొందిరి. భీముడు వారందరికి నమస్కరించి నకుల సహదేవులను కౌగ లించుకొనెను. వైడూర్య నాళముగల బంగారు కమలములను భీముడు ద్రౌపదికిచ్చెను. అంతట ధర్మరాజు భీమునిజూచి యిట్లనెను. భీమా! నీవు యిట్టి సాహసకార్యములు చేయరాదు. అందరి కంటె నీవు బుద్ధిమంతుడవు నాయందు నీకుప్రేమకలిగియున్న యెడల యిక మీదట యిట్టి సాహసకార్యములను చేయకుండుము. అని ధర్మ రాజు భీమునకు బోధించి అందరును ఆకుబేరుని ఉద్యానవనమందు విహరింపు చుండిరి. అంతట ఆవనరక్షకులగు యక్షులు వచ్చి ధర్మ రాజును జూచిరి. ధర్మరాజు దేవేంద్రునివలె నుండెను. లోమశుడు మహాత్ముడైన దేవఋషి సకల విప్రులును ధర్మరాజును సేవింపు చుండిరి. వారందరిని యక్షులు చూచి భక్తి వినయ పూర్వకముగా యిట్లనిరి. మహాత్ములారా! యీ వనము కుబేరుని ఉద్యానవనము. మీరిక్కడ నివసింపగూడదు. ఇచ్చట యక్షరాక్షసులు తిరుగు చుందురు. ఇచ్చట మీరున్న వారివలన భయముకలుగును. అని చెప్పగా పాండవులు ఆ సమీపమందు నివాసమేర్పరచుకొనిరి. ధర్మ రాజు రాక్షస బలముతో ఘటోత్కచుని వెనుకకు పంపించెను. ఘటోత్కచుడును తన రాక్షస బలమును తీసికొని వెనుకకుమరలెను. అంత జటాసురుడను రాక్షసుడు విప్రవేషమును ధరించి వచ్చి ధర్మ రాజుతో రాజా! నేను బ్రాహ్మణుడను. వేదవేత్తను. ధనుర్వేద విదుడగు పరశురాముని శిష్యుడ నని చెప్పెను. మరియు జటా సురుడు పాండవుల దగ్గరయుండి వారిని సేవింపుచుండెను.

ఒకానొక దినమందు భీముడు వేటాడునిమిత్తము అడవికి వెళ్ళెను. ఆసమయమున జటాసురుడు తనరాక్షసరూపమును ధరించి

వచ్చి ద్రౌపది, ధర్మరాజ నకులులను ముగ్గురిని ఒకేసారిగా యెత్తు కొని మహావేగముగ ఆకాశమార్గమున పరుగెత్తుచుండెను. మరియు వారి ఆయుధముల నన్నిటిని తీసికొనిపోయెను. విప్రులందరును, భయపడి చూచుచుండిరి. సహదేవుడు భీముని పిలుచుచు అడవి లోనికి బోయెను. అంత ధర్మరాజు జటాసురునిమీదనుండి వానితో రాక్షసుడా! ఈ యడవియందు సకల దేవరాక్షసులు నివసించి జీవింపుచుందురు. మేము మానవులకు సౌఖ్యములను కలిగించుచు వారిని రక్షింపుచుందుము. ఇటువంటి మాకు నీ వపకారమును చేయ దలచితివి. ఇందువలన నీకు మేలుకలుగదు. నీవు ధర్మము నెరుగవు. నమ్మినవారికిని తన కన్నముపెట్టి పోషించిన వారికిని కీడుచేయుట మిక్కిలి పాపము. నీవు మాయావంతుడవు. మా ఆయుధములను మాకిచ్చి యిప్పుడు మాతో యుద్ధము చేయుము. ఈరీతిగా మమ్ము లను యెత్తుకొని వెళ్ళరాదు. అని ధర్మరాజు జటాసురునితో చెప్పుచు తన రెండుచేతులతో జటాసురుని అదిమెను. అట్లు చేయుటవలన ఆభారమును మోయజాలక జటాసురుడు తిన్నగా నడచుచు ఆకాశ మార్గమున వెళ్ళుచుండెను. సహదేవుడు వెంటనేజటాసురుని కడ్డము వచ్చి ఓరీ జటాసురా! నీవు నన్నెరుగవేమో తెలియకున్నది. నేను పాండురాజు కుమారుడను. మహాకీర్తి బలములుగలవాడను. నాపేరు సహదేవుడు. నాశక్తిచేత యుద్ధమందు గెల్చెదను. గాన నాయెదుట నిలిచి యుద్ధముచేయుము.

## భీముడు జటాసురునితో యుద్ధము చేయుట.

సహదేవుడీరీతిగా జటాసురునితో చెప్పుచున్న సమయమున భీము డతి వేగముగా వచ్చెను. అప్పు డాకాశమందు జటాసు రుడు ఉండెను. ద్రౌపది ధర్మరాజ నకులులు ముగ్గురను జటాసు

రుసిమీదనుండిరి. భూమిమీద సహదేవు డుండెను. ఆసమయమున భీముడు వారందరిని చూచి జటాసురునిగూర్చి ఓరీ! నీవు బ్రాహ్మణ రూపమున అతిథివై మాసగ్గరకువచ్చితివి. మేము నీకు అన్నముపెట్టి పోషించితిమి. నీవు యిప్పుడు రాక్షసుడవై మమ్ములను బాధింప రాదు. ఎంత దుర్మార్గులైనను అన్నముపెట్టిన వారికి కీడు కలిగిం పరు. నీవు బుద్ధిగలవాడవైనచో యీముగ్గురిని విడిచి నీప్రాణములను రక్షించుకొనుము. అట్లు చేయనియెడల బక, హిడింబ, కిమ్మీర రాక్షసులను చంపినట్లు యిప్పుడే నిన్ను సునాయాసముగా చంపెదను. అని భీముడు జటాసురునితో చెప్పెను. ఆమాటలను విని జటాసురుడు ద్రౌపది, ధర్మరాజ నకులులను క్రిందికి దించి భీమున కెదురుగా వచ్చి భీమా! నీవు బక, హిడింబ, కిమ్మీర రాక్షసులను చంపినట్లు చెప్పితివి. ఇప్పుడు నేను నిన్ను యుద్ధమందుజంపి నీరక్తముచేతఆరాక్షసుల ముగ్గురికిని ఉదకక్రియలను జేసెదను. అని జటాసురుడు భీమునితో జెప్పుచు మిక్కిలి కోపవంతుడై యుద్ధముచేయుటకు వచ్చెను. అప్పుడు నకుల సహదేవు లిద్దరును జటాసురునిమీదికి బోయిరి. కాని భీముడు వారిని వారించి తానే జటాసురునిమీదికి బోయెను. భీమ జటాసురు లిద్దరికిని ఘోరయుద్ధము జరిగెను. వారిద్దరి తొడలు తగులుటచేత అక్కడ వృక్షములు విరిగి పడెను. వారిద్దరి పాదఘాతములచేత పర్వతభూమి అదరుచుండెను. వారిద్దరును వృక్షములను పెరికి కొంతసేపటివరకు మహాయుద్ధము చేసిరి. ఆసమీపమందువృక్షములు నశించినపిమ్మట పెద్ద బండరాళ్ళతో యుద్ధముచేసిరి. పిమ్మట వారిద్దరును ఒకరి నొకరు పట్టుకొని వాలిసుగ్రీవులవలె అతి భయంకరముగా యుద్ధముచేసిరి. అంతట ఒకరి నొకరు గ్రుద్దుచు ముష్టి యుద్ధముచేసిరి. ఆపిమ్మట పిడికిలిదెబ్బలచేత పెద్ద ధ్వనిగలిగించిరి. ఆమహాధ్వని విని ఆ అడవియందుగల మృగపక్షులన్నియు మిక్కిలి

భయమందెను. భీముడు యమధర్మరాజువంటి ఆకారముగలవాడై జటాసురుని మెడమీద పొడిచెను. అదెబ్బకు మెడవిరిగి జటాసురుడు క్రిందపడెను. వజ్రాయుధముచేత నీలపర్వత శిఖరము విరిగిపడినట్లు భీముని పిడికిటిపోటుచేత జటాసురుడు క్రిందబడెను. భీముడు వాని కళేబరమెత్తి విశాలమైన పెద్ద రాతిమీద విసరికొట్టి వాని ప్రాణములను పోగొట్టెను. అప్పుడు రోమశధౌమ్యాది విప్రులందరు భీముని బలపరాక్రమములను వర్ణించిరి. అని వైశంపాయన మునీంద్రుడు జనమేజయ మహారాజుతో చెప్పినట్లు సూతుడు శౌనకాది మహా మునులతో చెప్పెను.

ఇది శ్రీ మహాభారతమందలి అరణ్యపర్వమందలి
తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము



దేవా! హరిహరనాథా! వైశంపాయనమునీంద్రుడు జనమేజయ మహారాజును జూచి యిట్లనెను. ఓ జనమేజయమహారాజా! భీముడు జటాసురుని చంపినపిమ్మట పాండవులు విప్రసమేతముగా నరనారాయణాశ్రమమునకు వెళ్ళి కొన్నిదినములుండిరి. అంతట ఒక నాడు ధర్మరాజు తన తమ్ములతో యిట్లనెను. ఓ భీమనకులసహదేవులారా! అర్జునుడు మనలను విడిచివెళ్ళినది మొదలు యిప్పటికి అయిదు వత్సరములైనది. ఇంతవరకు అర్జునుడు మనదగ్గిరకు రాలేదు. అర్జునుడు దేవతలవలన దివ్యాస్త్రములను పొంది మనదగ్గరకు వచ్చును. అర్జునుడు గొప్ప భుజబలముగలవాడు అర్జునుని గంధమాదనపర్వత ప్రాంతమున నెప్పుడు జూతుమో తెలియకున్నది. అని ధర్మరాజు భీమాదులతో జెప్పి సకలవిప్రులను తీసికొని ఉత్తరదిక్కునకు వెళ్లెను.

ఓ జనమేజయమహారాజా! ఈప్రకారము గంధమాదనపర్వత మందుగల పుణ్యతీర్థములను చూచుటకొఱకు పాండవు లుత్తరదిక్కునకు వెళ్ళిన పదియేడవ దినమందు వృషపర్వుడను రాజర్షి యొక్క ఆశ్రమమును చూచిరి. వృషపర్వుడు పాండవులను మిక్కిలి ప్రీతి పూర్వకముగా పూజించెను. పాండవు లేడుదినము లాయాశ్రమమం దుండిరి. విప్రులందరిని వృషపర్వుని యాశ్రమమం దుంచి వారు చెప్పినమార్గముగుండా గంధమాదనపర్వతమందు గల పుణ్యతీర్థము లను సేవించుటకు పాండవులు వెళ్ళిరి. వారివెంబడి ధౌమ్యుడు, లోమశుడు, లోనుగాగల కొందరు విప్రులువెళ్ళిరి. పాండవులు యెనిమిదవ దినమందు శ్వేతపర్వతమందుగల స్ఫటిక ప్రదేశములను చూచుచు బంగారుమయము లైన చరియలను చూచుచు వెళ్ళుచుండిరి. అంతట పాండవులు మాల్యవంతపర్వతమును జూచిరి.

పాండవులు శ్వేతపర్వత మాల్యవంతపర్వతములను చూచుచు ఆపర్వతవనభూములయందు వెళ్ళుచుండిరి. ఆ వనమందు పక్షులు మొదలైనవి మధురముగా పాడుచుండెను. మామిడిచెట్లు మొదలగు నవి ఫలములు గలిగియుండెను. కొన్ని వృక్షములు పుష్పభరితమైయుండెను. అవి కలిసియున్న మనోహరప్రదేశములయందు పాండవులు విశ్రమించుచుండిరి. ఆ సమీపమున శ్వేతకి యను పుణ్యనదిగలదు. ఆ నదియందు బంగారు మయములగు పంచవర్ణములుగల పుష్పము లుండెను. ఆ పుష్పములయందు దివ్యమైన మనోహర పరిమళము గలదు. ఒకనాడు విధివశమువలన పెద్దగాలిచే ఆ పుష్పములు వచ్చి పాండవులయెదుట పడెను. ఆ పుష్పములను అందరును జూచి యాశ్చర్యమును బొందిరి. భీముడు ఆసమయమున నొంటరిగా చంద్రకాంత శిలాప్రదేశమం దుండెను. భీమునితో ద్రౌపది ఇట్లనెను. భీమా! పూర్వము నీవు సౌగంధికమను బంగారుకమలములను దెచ్చి నాకిచ్చి

తివి. వానికంటె ఈ పంచవర్ణములు గల పుష్పములు మిక్కిలి శ్రేష్ఠములై దివ్యపరిమళమును గలిగియున్నవి. వీనిని నేనెప్పుడును చూడలేదు. గాన ఈపుష్పములను దెచ్చి యిచ్చి నామనస్సునకు ఆనందమును జేకూర్పుము. అని ద్రౌపది భీమునితో జెప్పెను.

## భీముడు ద్రౌపదిగోరిన పుష్పములు తేబోవుట

భీముడా ద్రౌపదిమాటలను విని ఆక్షణమందే గిరిశృంగము నెక్కి జూచెను. ఆ గిరిశృంగమందు కుబేరుని నివాసగృహము కనబడెను. ఆగృహముచుట్టును రత్నఖచితములైన మనోహరములగు ప్రాకారములుండెను. అంతట భీముడు తనశంఖమును పూరించెను. వెంటనే ఆశంఖధ్వని విని కుబేరుని పరిచారకులగు యక్షరాక్షసులందరును నానావిధాయుధములను ధరించివచ్చి భీముని చుట్టుముట్టుకొనిరి. భీముడు మిక్కిలి క్రూరబాణములను ప్రయోగించి ఆ యక్షరాక్షస సైనికుల ననేకకులను జంపెను. వారిదేహమునుండి ప్రవహించిన రక్తమునదులవలె నుండెను. భీముని బాణములయెదుట సైన్యము నిలువజాలక పారిపోయెను.

అప్పుడు మణిమంతుడను రాక్షసుడువచ్చి, భీముని యెదిరించి ఘోరయుద్ధము జేసెను. మణిమంతుడు కుబేరునకు స్నేహితుడు; భీముడు మణిమంతుని బాణములచేత కట్టెను. మణిమంతుడు గదాయుధమును భీమునిమీద విసరెను. గదాయుధము దేదీప్యమానముగా పదిదిక్కులను ప్రకాశింపజేయుచుండెను. భీముడు కోపముతో తన క్రూరబాణములచేత గదాయుధమును బ్రద్దలుబ్రద్దలుగా నరికివేసెను. అక్కడ గల యక్షరాక్షససైన్యము లన్నియు భీమునిజూచి భయపడెను. మణిమంతుడు బంగారువికారమైన ఒకశక్తి యాయుధమును భీమునిమీద వేసెను. అది భీముని భుజపార్శ్వమును దాకి

క్రిందపడెను. భీముడు ప్రళయకాలమందలి యమధర్మరాజువలె మండి పడుచు తన గదాయుధమును తీసికొని మణిమంతుని బెదరించుచు కోపముతో నిలిచియుండెను. మణిమంతుడు త్రిశూలాయుధమును త్రిప్పి భీమునిమీద విసరివేసెను. ఆ త్రిశూలము నిప్పుమంటలను గ్రక్కుచు భీమునిమీదకు వచ్చెను. భీముడు తన గదచే నా త్రిశూలమును ఖండించెను. ఈరీతిగా శక్త్యాయుధ శూలాయుధములు చెడి పోయినపిమ్మట మణిమంతుడు బలహీనుడై ఆకాశమున కెగసెను. భీముడు మణిమంతుని పోవద్దనివారించుచు గదాయుధమును విసరెను. ఆగదదెబ్బవలన మణిమంతుడు చచ్చి క్రిందబడెను. వెంటనే మణిమంతుని సైనికులు భయపడి తూర్పుదిక్కునకు పారిపోయిరి. ధర్మరాజు భీముసిగానక భీముడు వెళ్ళినదిక్కును ద్రౌపదివలన తెలుసుకొని ధౌమ్యుడు మొదలగు విప్రులను పార్ష్ణిసేనుడను మునియొక్క ఆశ్రమమందుంచెను. పిమ్మట రోమశ నకులసహదేవులను వెంట బెట్టుకొని ధర్మరాజు గిరిశృంగము నెక్కెను. అచ్చట కుబేరుని గృహము కనబడెను. ఆ గృహసమీపమందు మణిమంతుడు మొదలగు రాక్షసులందరును చచ్చిపడియుండిరి. ఆ శవములమధ్య భీముడుండెను. ఆభీమునివద్దకు ధర్మరాజాదులు వెళ్ళియుండిరి. భీమునిచేత చావగా మిగిలిన రాక్షసులు మణిమంతుడు చచ్చినవిధానమంతయు కుబేరునకు జెప్పిరి. కుబేరు డావృత్తాంతమును విని యాశ్చర్యమొంది తనమనస్సులో భీముడు ఇదివరకు సౌగంధికపుష్పములను తీసికొనెను. ఇప్పుడు గర్వముచే పంచవర్ణపుష్పములను దీసికొనెను. మరియు మణిమంతుడు మొదలగు అనేకరాక్షసులను జంపెను. ఈతడెంత బలవంతుడో తెలియుటలేదు. అని తలంచి, కేనగంధర్వగరుడ యక్ష రాక్షససమేతముగా వచ్చి పాండవులను [illegible]. వారితో భీముడు ధనుర్బాణగదాద్యాయుధములను ధరించి యుద్ధము కోరుచుండెను.

ఆ భీమునిజూచి కుబేరుడు పరమసంతోష చిత్తుడయ్యెను. పాండవు లందరును కుబేరునకు నమస్కరించిరి. కుబేరుడు దయగలవాడై ధర్మ రాజును జూచి రాజా! నాస్నేహితుడగు మణిమంతుని నీ తమ్ముడగు భీముడు జంపెను. అందువలన నాకపకారము జరిగెనని నీవు సిగ్గు పడవలదు. మణిమంతుడు అగస్త్యమునియొక్క శాపమువలన చచ్చెను. అనిచెప్పి భీమునిపిలిచి భీమా! నీవు సాహసముతో మణి మంతుని చంపితివి. అందువలన నాకుపకారము గలిగెను. గనుక నేను మెచ్చితినని చెప్పెను. ధర్మరాజు కుబేరునకు నమస్కరించి దేవా! అగస్త్యుడు మణిమంతుని కిట్టిశాపము నెందుకు నిచ్చెనో చెప్పుము అని యడిగెను.

## కుబేరుడు ధర్మరాజుతో మణిమంతుని శాపముగూర్చి చెప్పుట

ధర్మరాజా! పూర్వము దేవతలందరును కుశావతియను పుణ్య నదీతీరమందు సత్రయాగము చేయుచు, నన్ను రప్పించిరి. నేను పుష్పక విమానమునెక్కి శతమహాపద్మసంఖ్యలుగల యక్షరాక్షస బలములతో ఆకాశమార్గమున యచ్చటికి వెళ్ళుచుంటిని. ఆ సమయ మున, యమునానదీతీరమున అగస్త్యుడు రెండుచేతులను పైకెత్తి తపస్సు చేయుచుండెను. నా స్నేహితుడగు మణిమంతుడు, ఎరుగక ఉమ్మివేసెను. ఆ ఉమ్మి అగస్త్యమునీంద్రునిమీద పడెను. అందుల కగస్త్యుడు కోపించి కుబేరా! నీవు చూచుచుండగా నీ స్నేహితుడగు మణిమంతుడు అహంకార మదముచేత నన్నెరుగక నామీద ఉమ్మి వేసెను. ఈ దురహంకారి అగు మణిమంతుడు ఒక మనుష్యునిచేత చచ్చును. వానిచేతనే నీ యక్షరాక్షస బలములుగూడ నశించును. వానిని చూచుట వలన నీ పాపము నశించును. అని అగస్త్యుడు

నాతో చెప్పెను. గాన ధర్మరాజా అగస్త్యుని శాపక్రమమునకు నీ తమ్ముడగు భీముడు, నిమిత్తమయ్యెను. మరియు ధైర్యము, దాక్షిణ్యము, దేశకాలములు, పరాక్రమము, కార్యాలోచన. ఈ అయిదింటిని ఎరుగవలయును. అట్లెరింగి, ప్రవర్తించు, క్షత్రియుడు, ధర్మవేత్తయై సకల భూచక్రమును, చక్కగా రక్షింపగలడు. పిమ్మట పుణ్యలోకములను బొందగలడు. క్షత్రియుడగువాడు, ధర్మవిశేషముల నెరుగక వ్యర్థముగ పనులు చేసి, సాహసమును జూపిన, నిశ్చయముగ పాపమును పొందును. గాన భీముడు కేవల సాహసవర్తియై ప్రవర్తింప కుండునట్లు నీ నిర్మల జ్ఞాన ధర్మబుద్ధిచేత శిక్షింపవలెను. నిన్నును నీతమ్ములను, మీా జన్మకారకులు రక్షించునట్లుగా నేనును సర్వదా మిమ్ములను రక్షించుచుండెదను. నీవుపార్షిణసేనాశ్రమమందు పదిహేనుదినములు, నివసించియుండుము. నాయాజ్ఞ వలన.నాపరిచారకులు నీకు ప్రతినిత్యము అన్నపానాదులను దెచ్చియిచ్చు చుందురు. నీ తమ్ముడగు అర్జునుడు, సకలదేవతలచేత దివ్యాస్త్రములను పొందెను. ఇప్పుడు దేవేంద్రునికడ యున్నాడు. అతడు దేవేంద్రున కుపకారముచేసెను. నీతండ్రికి తాతయగు శంతన మహారాజు ఏడు అశ్వమేధయజ్ఞములను చేసెను. శంతనుడు పుణ్యపురుషుడు. నీకు పితృపితామహుడగును. శంతనుడు అర్జునునిచేత తృప్తిని బొందెను. శంతనుడు మీా కులము నడిగెను. అర్జునుడిక మీాకడకురాగలడు. మీాకిష్టసిద్ధియగును. యీామాటనిశ్చయము అనిబలికి కుబేరుడు ధర్మరాజుతో చెప్పి తన యక్షగణ సమేతముగా వెళ్ళెను. ధర్మరాజు కుబేరుని అజ్ఞాప్రకారము పార్షిణసేనుని యాశ్రమమందుండెను. ఒకనాడు ధౌమ్యుము తన వ్రేళ్ళచేత ధర్మరాజునకు ఉత్తరదిక్కును జూపుచు యిట్లనెను.

ధర్మరాజా! అల్లదిగో అది మందరపర్వతము. అల్లదిగో అచ్చట మేరుపర్వతమున్నది. మేరుపర్వతమున కెనిమిది దిక్కుల

యందును, దేవేంద్రుడు మొదలగు అష్టదిక్పాలకులు నివసించి యుందురు. ఆపర్వతమునకు ప్రదక్షిణముగా సూర్య చంద్ర నక్షత్రగణములు సర్వదా తిరుగుచుండును. సప్తమహా మునిమండలములును మేరుపర్వతముచుట్టును సర్వదా తిరుగుచుండును. మేరుపర్వత శిఖరాగ్రమందు బ్రహ్మ విష్ణు మహేశ్వరు లుందురు. సకల దేవగణములును త్రిమూర్తులను గొలుచుచుందురు. అని ధౌమ్యుడు ధర్మరాజుతో జెప్పెను. ఈ రీతిగా పాండవు లా ార్ష్టిసేనుని యాశ్రమమందొక మాసమువర కుండిరి. అర్జునుడు దివ్యరథమెక్కి స్వర్గలోకమునుండి పాండవులదగ్గరకు వచ్చెను. మాతలిరథమును తోలుకొని వచ్చెను. ఆరథము బంగారుమయమై కాంతి సమూహములచేత ఆకాశమంతయు ప్రకాశింప జొచ్చెను. దేవేంద్రుని సారథియగు మాతలి రథముపై సూర్యతేజోవంతుడగు అర్జునుని తీసుకువచ్చెను. అర్జునుడు రోమశధౌమ్య ధర్మరాజ భీముల పాదములకు అధికభక్తి పూర్వకముగా నమస్కరించెను. నకుల సహదేవులు వినయ విధేయులై అర్జునునకు నమస్కరింప అతడు వారినెత్తికొనెను. ద్రౌపది యొక్క మనోనేత్రములకు ఆనందమును కలిగించెను. అర్జునుని చూచి ధర్మరాజాదు లందరును సంతోషించి అధిక ప్రీతిపూర్వకముగా మాతలిని పూజించిరి. మాతలి ఆ దివ్యరథమును తీసుకొని దేవలోకమునకు బోయెను. సూర్యుడస్తమించెను. చంద్రు డుదయించెను. వెన్నెల వచ్చెను. ఆరాత్రి అర్జునుడు తన అన్నదమ్ములను నలుగురను దగ్గరగా నుంచుకొని యిష్టకథలను జెప్పుచు పండుకొనెను. ఆ మర్నాటి సూర్యోదయ కాలమందు సిద్ధ మునిగణ రోమశ ధౌమ్య భీమార్జున నకుల సహదేవులతోడ ధర్మరాజు సుఖముగా కూర్చుండి యుండెను.

## ఇంద్రుడు పాండవులయొద్దకు వచ్చుట

ఆసమయమందు పాండవులను చూడవలె నను అపేక్షచేత దేవేంద్రుడు గంధమాదన పర్వతమునకు వచ్చెను. దేవేంద్రుని సేవింపుచు దేవగణము లందరును వచ్చిరి. ఘోరన దేవవాద్యములు మ్రోగుచుండెను. ఆ దేవేంద్రుని యెదుట కిన్నరులు గంధర్వులు సంగీతములు పాడుచుండిరి. దేవగణములు విమానములతో ఆకాశమున నుండగా వేయిమంది సూర్యులుదయించినట్లుండెను. అంతట పాండవు లైదుగురును లేచి దేవేంద్రుని పాదకమలములకు భక్తి పూర్వకముగా నమస్కరించిరి. ధర్మరాజు శాస్త్ర విధిప్రకారము దేవేంద్రునిపూజించెను. దేవేంద్రుడు పరమప్రీతికరమగు వాక్యముల చేత వారిని సంతోష పరచుచు మహాతపస్సంపన్నుడగు అర్జునుని జూచి ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! యీఅర్జునుడు నా వలన సకలదివ్యాస్త్ర ప్రయోగోపసంహార రహస్యములను అన్నిటిని నేర్చుకొనెను. సకలదేవతల వలనను యీ అర్జునుడు సకల దివ్యాస్త్రములను పొందెను. అర్జునుడు నివాతకవచులను రాక్షసులను యుద్ధమందు జంపి సకలదేవతలకు ప్రీతిని గలిగించెను. అర్జునుడు తన పరాక్రమముచేత నీశత్రువుల నందరిని చంపి యీ భూమండలరాజ్యమంతయు నీకు యిచ్చును. అర్జునుడు మహాతేజోవంతుడు. ఎవ్వరైనను గూడ నీ యర్జునుని యుద్ధమందు గెలువజాలరు. అని దేవేంద్రుడు ధర్మరాజుతో చెప్పి దేవగణములతోకూడ దేవలోకమందుగల తన అమరావతిపట్టణమునకు వెళ్ళెను. దేవేంద్రుని జూచినందుకు పాండవులు సంతోషింపుచుండిరి. జనమేజయా! యీ ఇంద్రపాండవసమాగమ కథను, బ్రహ్మచర్యవ్రత నియమముగలిగి ఒక సంవత్సర పర్యంతము ప్రతినిత్యము చదివినను, వినినను అట్టి జనులకు నూరు సంవత్సరములు ఆయుస్సుకలుగును. అధిక తేజోవంతులై యుందురు,

దేవేంద్రుడు వెళ్ళినపిమ్మట ధర్మరాజు అర్జునుని చూచి పరమానంద మును పొంది యిట్లనెను.

అర్జునా! శివుడు మొదలగు దేవతలచేత నీవు దివ్యాస్త్రము లను పొంది దేవతలకు ఉపకారముచేసినట్లు దేవేంద్రుడు నాతో చెప్పెను. నీకు దివ్యాస్త్రలాభ మెట్లు కలిగెనో నాకు చెప్పుము. నీవు దేవేంద్రునకు ప్రీతిగా దేవతలకు ఉపకారముజేసిన విధమును నాకు చెప్పుము. అది వినవలెనని వేడుక గలిగి యున్నది. అని ధర్మరాజు అడుగగా ధౌమ్య రోమశ భీమ నకుల సహదేవులయెదుట ధర్మరాజు నకు అర్జునుడు తన వృత్తాంతము నిట్లు చెప్పసాగెను.

అన్నా! ధర్మరాజా! నీవు పూర్వము నాకు ప్రతిస్మృతియను విద్యనుపదేశించితివి. ఆ విద్యా ప్రభావమువలన నేనధిక తపస్సంప న్నుండనై హిమవత్పర్వతమునకు వెళ్ళితిని. అక్కడ దేవేంద్రుడొక వృద్ధ బ్రాహ్మణరూపముతో నాకు కనబడెను. దేవేంద్రుని వుపదేశ ప్రకారము నేను యీశ్వరుని గురించి ఘోరతపస్సుచేసితిని. ఈశ్వ రుడు యెరుకలవాని రూపమును ధరించి వచ్చి నాతో అతిఘోర యుద్ధముచేసెను. ఈశ్వరుడు నాయందు కృపగలవాడై తన నిజ రూప మును నాకు జూపి పాశుపత దివ్యాస్త్రమును అనుగ్రహించెను. ఆ పాశుపత దివ్యాస్త్రము నాకు లభించిన పిమ్మట ఇంద్రాది దేవశ్రేష్ఠుల వలన ఐంద్ర, ఆగ్నేయ, యామ్య రాక్షస వరుణ వాయవ్య కుబేర గాంధర్వ పైశాచ బ్రాహ్మ్యములనెడి దివ్యాస్త్రములను, వాని ప్రయోగములతోటి పొందితిని. దేవేంద్రుని యనుగ్రహమువలన మాతలి తోడుకొనివచ్చిన దివ్యరథము మీదనెక్కి యీ శరీరము తోడనే దేవలోకమందలి అమరావతీపట్టణమునకు వెళ్ళితిని ఆ దేవ లోకమందు దేవేంద్రుని యాచార్యునిగా వరియించితిని. దేవేంద్రుని కృపవలన సకల దివ్యాస్త్రప్రయోగ ఉపసంహార నివర్తన ప్రాయ

శ్చిత్త ప్రతి ఘాతములను నేర్చితిని. దేవేంద్రుడు సంతోషించి నాతో యిట్లనెను. పుత్రా! అర్జునా! నీవు సకల దివ్యాస్త్ర వేత్తవగుదువు గనుక నిన్ను యుద్ధమందు యెవ్వరును గెలువజాలరు. నీవు దేవతల కును, బ్రాహ్మణులకును మేలుకలిగింపుము. ఇందువలన నీకు మిక్కిలి సిద్ధియగును. నాకు గురుదక్షిణ కొరకు నేను చెప్పిన పనిని చేయుము. అట్లు చేసితివేని దేవతలకు హితమగును. నేను చెప్పుపని బుద్ధియం దుంచుకొని నీ భుజాబలశక్తి వలన జేయవలయును. ఆపనిని చెప్పెద వినుము. సముద్రకుక్షి లోపల నివాతకవచులను మూడుకోట్లమంది రాక్షసు లున్నారు. వారు మహాబలవంతులై దేవతలకు బాధకలి గించుచున్నారు. నీచేత ఆ నివాతకవచ రాక్షసులు చచ్చెదరు, గనుక నీవు వెళ్ళి ఆ నివాతకవచులను చంపుము. అని దేవేంద్రుడు నాతో చెప్పి తాను ధరించిన దివ్య భూషణములను నాకుయిచ్చెను. దేవేంద్రుడు నన్ను భూషణములచేత అలంకరించి స్వర్ణరూపమైన అభేద్యకవచమును నాకు యిచ్చెను. సర్పముతో సమానమైన యీ వింటి నారిని యీ గాండీవమందు దేవేంద్రుడు కూర్చెను. దేవేం ద్రుడు నాతో యిట్లనెను.

కుమారా! నాదివ్య రథమునకు పదివేల గుర్రములు పూన్చ బడి యుండును. వానిలో కొన్ని గుర్రములు హంసవంటి తెల్లని కర్ణ ములు గలిగియున్నవి. మరికొన్ని నెమళ్ళవంటి వర్ణముకలిగియున్నవి. ఆ దివ్యరథమునకు మాతలి సారథియగును. ఆ దివ్యరథముపై నీవు యెక్కి నివాతకవచులను జంపుటకు వెళ్ళుము. అని దేవేంద్రుడు నాతో చెప్పి యాజ్ఞాపించెను. నేను దేవేంద్రుని యనుమతినిపొంది దివ్యరథమునెక్కి వెళ్లుచుంటిని. అప్పుడు దేవతలు నాతో యిట్లనిరి. అర్జునా! పూర్వము దేవేంద్రుడు యీ దివ్యరథమెక్కి అనేక సహస్ర సంఖ్యలుగల రాక్షసులను జంపెను. వృత్రాసుర శంబర బలి

మొదలగు రాక్షసులనందరిని దేవేంద్రుడు జయించెను. నీవును మహా బలవంతుడవై ఆ నివాతకవచ రాక్షసులను జంపుము. వారు భయంకర మాయావంతులు. అని దేవతలందరు నాతో జెప్పి నాకు దేవదత్తమను శంఖము నిచ్చిరి.

## అర్జునుడు నివాతకవచు లను రాక్షసులను జయించుట.

అన్నా! ధర్మరాజా! అంతట నేనును మాతలియు ఆదివ్య మహారథము నెక్కి అతి త్వరితముగా నివాతకవచ రాక్షసులుండు మహాసముద్రము దగ్గరకు పోతిమి. ఆమహాసముద్రము నురుగులతో గూడిన అలలు గలిగియుండెను. నానావిధములైన చేపలును, తాబేళ్ళును, మొసళ్ళను, ఆమహాసముద్రమందు గలిగియుండెను. ఆ సముద్రములో ఒక పట్టణముండెను. ఆ పట్టణ ద్వారములమీద విశాలములైన యుద్ధ గృహములుండెను. రథములు పరుగెత్తు వీధులుండెను. ఇటువంటి విషయములచేత ఆ పట్టణము అలంకరింపబడియుండెను. ఆ మహాసముద్రములోని పట్టణమును నేనును మాతలియు జూచితిమి. నేనా పట్టణద్వారమందు దివ్యశంఖమును ధ్వనింపజేసితిని. ఆ ధ్వనివలన పర్వత గుహలన్నియు ప్రతిధ్వనించుచుండెను. ఆ శంఖధ్వని పట్టణమందలి రాక్షసులు విని కోపించుకొని నానావిధాయుధములను ధరించి యుద్ధసన్నద్ధులై వచ్చి నారథమును చుట్టుకొనిరి. వారిదేహములు నల్లగానుండెను. వారిదేహకాంతుల వలన అక్కడగల భూమ్యాకాశములు నల్లగా నుండెను. ఆ నివాతకవచ రాక్షసు లందరును నామీద గొప్ప బాణవర్షమును కురిపించిరి.

నేనును అతి శీఘ్రముగా ఆరాక్షసులకు భయము కలుగునట్లు ఒకొక్కని మీద పదేసి బాణములను వేసితిని. అప్పుడా రాక్షసులు క్రూర బాణ సమూహ పరంపరలను ప్రయోగించి నా

రథము కదల కుండునట్లు కప్పిరి. అందుకు దేవతలును ఋషులును జూచి ఆశ్చర్యమును బొందిరి. అప్పుడు మాతలి మిక్కిలి భయపడి బుద్ధివశము లేనివాడై రథమునడపుటయం దసమర్థుడై యుండెను. అంతట నేనే రథమును నడుపుచు ఆరాక్షసులమీద బాణములను వేసితిని. నాక్రూర బాణసమూహములచేత ఆ రాక్షసుల దేహముల నుండి రక్తప్రవాహములు ఆకాశమునందుండి ప్రవహించు చుండెను. ఆరక్త ప్రవాహములను జూడగా పర్వతశిఖరములయందుండి క్రిందికి ప్రవహించెడి జల ప్రవాహములవలె నుండెను.

అన్నా ధర్మరాజా! ఇట్లు నివాతకవచులలో అనేకులు నాక్రూరబాణముల వలన చచ్చిరి, అంతట తక్కిన రాక్షసులంద రును నాతోటి మాయాయుద్ధము చేయదలచి నామీద వర్షాస్త్ర మును ప్రయోగించిరి. అట్లుప్రయోగించగా నాచుట్టును జలమయమై యుండెను. అప్పుడే నేనును నాకు దేవేంద్రుడిచ్చిన శోషణాస్త్రమును ప్రయోగించితిని. శోషణాస్త్రముచేత వర్షాస్త్రము నశించెను. అందు వలన గలిగిన జలప్రవాహము లన్నియు యెండిపోయెను. అంతట రాక్షసులు నామీద భయంకరమైన శిలావర్షమును కురిపించిరి. నేను వజ్రాస్త్రమును ప్రయోగించి ఆశిలలనన్నిటిని దుమ్ము దుమ్ముగా జేసితిని. ఆ వెంటనే నివాతకవచ రాక్షసులు నామీద ఆగ్నేయాస్త్ర మును ప్రయోగించిరి. అప్పుడు గాలితోగూడిన అగ్నికణములు నన్ను చుట్టుకొనెను. ఆవెంటనే నేనును జలాస్త్రమును ప్రయోగించి ఆగ్నేయాస్త్రమును అణగించితిని; అంతట ఆ నివాతకవచ రాక్షసులు నామీద అతిభయంకరముగా అంధకారాస్త్రమును ప్రయోగించిరి. ఆయంధకార బాణముచేత దిక్కులన్నియు గాఢాంధకార మయము లాయెను. ఆగాఢాంధకారముచేత మాతలి భయపడి తెలివితప్పెను. అప్పుడు గుఱ్ఱములు నడువనేరక రథమును మోయజాలక వ్యథ

ములై యుండెను. ఆగాఢాంధకారమున నన్ను మాతలి గానక నన్ను ఉద్దేశించి యిట్లనెను.

అర్జునా! నీవుయెక్కడికిపోతివో పలుకుము. ఈ గాఢాంధకారమున నాకు మిక్కిలి భయముకలుగుచున్నది. పూర్వము అమృతము నిమిత్తమై దేవరాక్షసులకు మహాఘోరయుద్ధము జరిగెను. ఆ దేవాసుర యుద్ధము ఇంతభయమును కలిగింపలేదు. ఈ నివాతకవచ రాక్షసులు అపరిమితమగు బలశక్తివంతులగుటవలన నీతో ఇంతభయంకర యుద్ధమును జేయుచున్నారు. ఆ బ్రహ్మదేవుని యేర్పాటు ప్రకారము యిప్పుడు జగత్ప్రళయముకలుగునట్లుగా తోచుచున్నది. అని మాతలి మిక్కిలి భయపడి నన్నుద్దేశించి చెప్పెను. నేను విని మాతలితో యిట్లంటిని.

మాతలీ! నీవు యుద్ధమందు చలింపక నా భుజాబలమును జూచుచుండుము. నీవు భయపడవద్దు అని నేను మాతలిని వూరడించి సూర్యునిదలచి దేవేంద్రుడిచ్చిన సూర్యబాణమును ప్రయోగించితిని. అట్లు ప్రయోగించినతోడనే ఆసూర్యాస్త్ర ప్రభావమువలన గాఢాంధకారమంతయు నశించి దిక్కులన్నియు యెప్పటివలె ప్రకాశించెను. దేవేంద్రుడు మొదలగు దేవతలందరును పరమానందమును పొందిరి. భయంకర రాక్షసులందరును యుద్ధమందు భయపడిరి. అప్పుడు నన్ను మాతలి మెచ్చుకొని సింహనాదముచేసెను. ఆ గాండీవమువలన విడువబడిన పిడుగులవంటి క్రూర బాణములచేత ఆనివాతకవచ రాక్షసులందరును కొండలు కొండలుగాచచ్చిపడిరి. రాక్షసుల దేహములు నరుకబడెను. ఆరాక్షసులు చచ్చిపడునప్పుడు భూమి అదరెను. అన్నా ధర్మరాజా! యీ ప్రకారము నాక్రూరాస్త్రములచేత ఆనివాతకవచ రాక్షసులందరును చచ్చిపడిరి. అంతట సముద్రమందుగల పట్టణము లోనుండు రాక్షసుల భార్యలందరును ఒక్కపెట్టున పెద్దగా ఏడ్చిరి

ఆయేడ్పులధ్వనులు ఆకాశమునకు మొగసెను. ఆ రాక్షసుల పట్టణము దేవేంద్రుని పట్టణమగు అమరావతికంటె మిక్కిలి సుందరముగా నుండెను. ఆ పట్టణమునుచూచి నేను మాతలితో యిట్లంటిని.

మాతలీ! ఈనివాతకవచ రాక్షసులపట్టణమునందు రత్నమయములైన శ్రేష్ఠములగు గృహములున్నవి. ఇచ్చట ఉన్న యెడల మిక్కిలి సౌఖ్యముగానుండును. దేవేంద్రుడు యిందుండక మరియొక పట్టణ మందుండుటకు కారణమేమి? అని యడుగగా మాతలి యిట్లనియె. అర్జునా! రాక్షసులవలన భయము కలిగినప్పుడు దేవతలను యీ పట్టణమందుంచుటకు దేవేంద్రుడు యీ మహాసముద్రములో పట్టణమును నిర్మించెను. ఈ నివాతకవచులు బ్రహ్మదేవుని గురించి మహాతపస్సుచేసి యీపట్టణమునకు వచ్చియుండిరి. అంతట దేవేంద్రాది దేవతలందరును నివాతకవచులతో యుద్ధముచేసిరి. దేవతలు యీ రాక్షసులనుగెలువజాలక వెళ్ళిరి. అంతట దేవేంద్రుడు కోపించి నివాతకవచులను చంపుటకు యిప్పుడు నిన్ను పంపించెను. దేవతలకు సాధ్యులుకాని యీ రాక్షసులను నీవు ఒక్కడవే చంపితివి. అని మాతలి నాతోచెప్పుచు నన్నుస్తుతించెను. మరియు నారథమును వెనుకకు మరలించి తోలుకొని వెళ్ళుచుండెను.

అన్నా ధర్మరాజా! నేనిట్లు నివాకతవచ రాక్షసులసందరిని జంపి వచ్చుచుండగా నాయెదుట ఒకతపోవనము కనబడెను. ఆ తపోవనమందు అతివిచిత్రమైన పట్టణముండెను. ఆపట్టణమునుజూచి యిదియెవ్వరిపట్టణమని మాతలి నడిగితిని. అప్పుడు మాతలి నాతో యిట్లనెను. అర్జునా! పూర్వము పులోమయనియు, కాళికయనియు యిద్దరురాక్షస స్త్రీలుకలరు. ఆయిద్దరును అనేక దివ్యసంవత్సరములు గొప్పనిష్ఠచేత బ్రహ్మదేవుని గురించి తపస్సుచేసిరి. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమాయెను. అప్పు డా రాక్షస స్త్రీలిద్దరును బ్రహ్మదేవునితో

యిట్లనిరి. మహాత్మా! మాకొంశకులు నివసించుటకు బంగారు మయమైన పట్టణముకావలయును. మా పుత్రులగు రాక్షసులను యుద్ధమందు దేవతలు గెలువకుండవలయును. అని వరమడుగగా ఆ వరమును బ్రహ్మదేవుడిచ్చి వెళ్ళిపోయెను. కనుక యిది హిరణ్మయమనుపట్టణము. పౌలోమ కాలకేయులను రాక్షసులు అరువదివేలమంది యీ పట్టణమందు నివసింతురు. వారు దేవతలచేత చావరు. అని మాతలి నాతో చెప్పెను. అంత నేను మాతలితో యిట్లంటిని. మాతలీ! అట్లైనయెడల హిరణ్మయపట్టణము చూదకు నెళ్ళుదము. మనరథ మా పట్టణము మీదికితోలుము అని నేను మాతలితో చెప్పితిని. మాతలి నాదివ్యరథమును హిరణ్మయపట్టణ ప్రాకారముమీదికి తోలెను. రాక్షసులందరును నన్ను దేవేంద్రునిగా తలంచి అరువదివేల రథముల నెక్కి నామీద యుద్ధమునకువచ్చిరి. అంతట నేను అనేకదివ్యాస్త్రములను ప్రయోగించితిని. ఆ యస్త్రములచేత యనేకవృక్షములు శిలలుపుట్టి వారిరథమార్గముల కడ్డముగా నుండెను. అందువలన వారిరథములు కదలజాలకుండెను. ఆరాక్షసులు నాతో మాయాయుద్ధముచేయదలచి వారిపట్టణముతోకూడ ఒకేసారి ఆకసమున కెగసిరి. నేనప్పుడు ఆకాశమందు దట్టముగా బాణములను కప్పితిని. నా దివ్యబాణమహిమచేత ఆకాశమందు రాక్షసులకు అడ్డగింపబడెను. అంతట నాయరువదివేల రాక్షసులను వారి రథపట్టణములతో క్రిందబడిరి. వీరిని మరియొకవిధముగా గెలువరాదనితలచి శివునిపాశుపత దివ్యాస్త్రమును సంధించి ప్రయోగించితిని. అందులకు మాతలి నన్నుజూచి మెచ్చుకొనెను.

ఆ పాశుపతాస్త్ర మహిమవలన సింహములు, శరభశార్దూలమృగములు, ఏనుగులు, బట్టగొడ్డులు, ఎద్దులు, యక్షరాక్షసపిశాచ, సర్ప, గంధర్వులు అనేక సహస్ర సంఖ్యలు పుట్టిరి. ఆ జంతువు

లన్నియు యీ యరువదివేల రాక్షసులను నిమిషములో చంపెను. ధర్మరాజా! యీప్రకారము పాశుపతాస్త్రమును ప్రయోగించి రాక్షసులను చంపి వారి మాయల నన్నిటిని పోగొట్టితిని. పిమ్మట పౌలోమ, కాలకేయ రాక్షసులగు అరువదివేలమందిని చంపి వచ్చి దేవేంద్రునకు నమస్కరించితిని. నేను నివాతకవచపౌలోమ కాలకేయ రాక్షసులను చంపిన పద్ధతినంతయు మాతలివలన దేవేంద్రుడు విని సంతోషించి నాతో అర్జునా! నీవీ రాక్షసులందరిని నిశ్శేషముగా జంపి దేవతలకు మేలుచేసితివి. యిక నీవు భూలోకమునకు వెళ్లుము. నీ సహోదరులందరును నిన్ను జూచుట కపేక్షించి యున్నారు. యుద్ధమందు నిన్నెవ్వరును గెలువజాలరు. నీతో ఎదిరించి ఎవ్వరును యుద్ధము చేయజాలరు. ద్రోణాచార్య అశ్వత్థామ కృపాచార్య భీష్మ, కర్ణాది యోధులందరును అవశ్యముగా నీచేత గెలువబడుదురు. అని దేవేంద్రుడు నాకు చెప్పెను. అంతట నేను దేవేంద్రుని యనుమతినిబొంది యిక్కడకు వచ్చితిని. అని అర్జునుడు తాను దేవలోకమందు చేసినవిధమును అంతయు అందరువినుచుండగా ధర్మరాజుతో చెప్పెను. ధర్మరాజు తమ్ముడుచేసిన మహాకార్యమును విని తనకు సకలభూచక్రము లభించినంత సంతోషమును బొందెను. ధర్మరాజు సంతోషముతో అర్జునునితో సోదరా! నీవుపొందిన దివ్యాస్త్రములనన్నిటిని మాకుచూపుము. ఆ దివ్యాస్త్ర ప్రయోగపద్ధతులను గూడ మాకుచూపుము. అని ధర్మరాజడుగగా అర్జునుడు వేరు వేరుగా తనకు దేవతలిచ్చిన దివ్యాస్త్ర ప్రయోగములను ధర్మరాజునకు చూపెను.

జనమేజయమహారాజా! అర్జునుడు దివ్యాస్త్రములను ధర్మరాజు ప్రయోగపూర్వకముగా జూపుటకు ప్రారంభించినప్పుడు భూమి దద్దరిల్లెను. సముద్రములు కల్లోలములాయెను. అష్టదిగ్గజములును

బలహీనములాయెను. సూర్యుడు తేజోహీనుడాయెను. అగ్నిజ్వాల లణగిపోయెను. వాయువు చలింపకుండెను. ఈశ్వర, బ్రహ్మ దేవేంద్రాది దేవతలందరును వచ్చి ఆకాశమునందు నిలిచిరి. నారదుడు బ్రహ్మమలచే పంపబడి అర్జునుని దగ్గరకువచ్చి అర్జునా! శత్రువులు ఎదుటలేనప్పుడు దివ్యాస్త్రములను ప్రయోగించుట ధర్మముకాదు. శత్రువులు లేనప్పుడు వ్యర్థముగా దివ్యాస్త్రములను ప్రయోగించిన యెడల మూడులోకములను దహించును. ఇది నిశ్చయము అనిచెప్పి అర్జునుని వారించి వెళ్ళెను. బ్రహ్మరుద్రాది దేవతలందరును తమతమ నివాసమునకు వెళ్ళిరి. పాండవులు గంధమాదన పర్వతమందు పది మాసములుండిరి. అంతట ఒకానొక దినమందు దేవకన్యకలువచ్చి అర్జున కిట్లనిరి.

అర్జునా! మీరు పండ్రెండు వత్సరముల పర్యంతము నిర్విఘ్నముగా వనవాసమును జరుపుదురు. పిమ్మట ఒక సంవత్సరము అజ్ఞాతవాసమును గూడ జరుపుదురు. తరువాత యుద్ధమందు శత్రువులను జయింతురు. నీపరాక్రమబలమువలన ధర్మరాజు సకల భూరాజ్యభారమును వహింపగలడు. రఘుకులమందు పుట్టిన శ్రీరామచంద్రుని కీర్తివలె మీకీర్తి మూడులోకములయందును వ్యాపించి స్థిరముగా నుండును. అని దేవకన్యకలు అర్జునునితో చెప్పి వెళ్ళిరి. దేవఋషియయిన రోమశుడు ధర్మరాజునకు ధర్మమార్గరహస్యములను జెప్పి స్వర్గమునకు వెళ్లెను. పాండవులు గంధమాదనపర్వతమునుండిఎప్పటివలె ఘటోత్కచునితో కూడుకొని మరలి వృషపర్వుని నివాసమును చూచుచు బదరీవనమునకు వచ్చిరి. ఆవనమందు ఒకరాత్రి నివసించి యుండిరి. పాండవులు ఘటోత్కచుడు మొదలగు రాక్షసులమీద నెక్కి ఆకాశమార్గమున సుబాహునిపట్టణమునకు వచ్చిరి. పాండవులు సుబాహుని పట్టణముచేరి ఘటోత్కచుని పంపించిరి. ఘటో

త్కచుడును తన రాక్షసబలములను తీసికొని తన నివాసస్థలమునకు వెళ్లెను. పాండవులు సుబాహుని పట్టణమందుగల తన పరిచారకులగు యింద్రసేనాదులను తీసికొని తమరథముల నెక్కిరి. మరియు హిమవత్పర్వతమునకు వచ్చిరి. అచ్చటగల దేవర్షి బ్రహ్మర్షి యజ్ఞ ప్రదేశములను అనేకవిధములైన యజ్ఞస్తంభములను జూచుచుండిరి. అట్లొక సంవత్సరమునరకు పాండవులు హిమవత్పర్వతమునం దుండిరి.

## అ జ గ రో పా ఖ్యా న ము

ఓ జనమేజయమహారాజా ! హిమవత్పర్వతమందు పాండవులున్నప్పుడు భీముడు వేటాడునిమిత్తము వనమునకు వెళ్లెను. అప్పుడు భీముడొకసర్పముచేత పట్టుబడెను. ధర్మరాజుచేత విడిపింపబడెను. అని వైశంపాయనమునీంద్రుడు చెప్పగా జనమేజయుడిట్లనెను. మునీంద్రా! భీముడు పదివేల మదపుటేనుగుల బలము గలవాడు. గంధమాదన పర్వతమందు కుబేరుని సైన్యములతో యుద్ధముచేసి కుబేరుని గెల్చిన మేటి మొనగాడు. ఒక్కడే కుబేరుని యక్షరాక్షస గణములను గెలిచెను. అటువంటి భీముడు ఒక సర్పముచేత పట్టుబడుటకు కారణ మేమో జెప్పుము. అని జనమేజయుడడుగగా వైశంపాయను డిట్లనెను.

మహారాజా! ఒకనాడు భీముడు హిమవత్పర్వతము యొక్క పెద్ద శిఖరమునకు సమీపమునగల వనములో మృగములను వేటాడి తిరిగి శ్రమ జెందియుండెను. అచ్చట భీమున కొక మహాసర్పముగనబడెను. అది యాహారము కొఱకు నోరు తెఱచుకొనియుండెను. యమునినవలె నుండు నాసర్పముయొక్క నిశ్వాసములవలన పొగలును అగ్నిజ్వాలలును ఎగయుచుండును. ఆ జ్వాలలచేత అక్కడ గల వృక్షములు, పొదలు కమలిపసుపువర్ణముగలిగి వేడిమూపులు గలిగి

యుండెను. ఈ మహాసర్పమును భీముడు జూడగా దానికి అర్ధచంద్రము నిభోలు నాలుగు ప్రక్కలపంక్తులుండెను. ఆ మహాసర్పము ఆహారము కొఱకు భీముని పట్టుకొని రెండు చేతులను తననోటిచేత పట్టుకొని తన శరీరముచే భీముని దేహమును బంధించి చిక్కపట్టెను. భీముడు పది వేల ఏనుగుల బలము గలవాడైనను, సర్పదేహసంబంధము చేత బల హీనుడై కదలలేకుండెను. భీము డాసర్పముయొక్క బలవీర్యములకు ఆశ్చర్యమును పొంది తన మనస్సులో ఇట్లని తలంచెను. ఇది సాధారణ సర్పముగాదు. ఇదియొక యద్భుతరూపము. అని యోచించుచు భీము డాసర్పముతో యిట్లనెను. ఓ సర్పరాజమా! నాపేరు భీముడు. నేను పాండురాజునకు పుత్రుడను, ధర్మరాజునకు, తమ్ముడను, మహాతేజో వంతుడను బలవంతుడను. సకల పిశాచ నాగేంద్ర యక్షరాక్షస వీర్యులను యుద్ధమునందు అనాయాసముగ గెలువగలను. సింహ శార్దూల మత్తేభాది మృగములను బట్టుకొని చీల్చి, చంపుటకు తగిన బలవంతుడను. ఇటువంటి నన్ను నీవు ఈ ప్రకారముగా బంధించితివి. ఈశక్తి నీకు సహజమో లేక వరప్రసాదమో చెప్పుమని భీముడు ఆ మహాసర్పము నడిగెను. అదియు తిర్యగ్జాతి యయినను, తన పూర్వజన్మజ్ఞాన ముండునట్లు వరమును పొందినందున మనుష్య భాషచేత యిట్లనెను. భీమా! ఈశక్తి నాకు వరమువలన కలిగినది. ఎంతబలవంతులైనను నన్నెదిరించి బలహీనులగుదురు. నాకెదుట బడిన సింహశరభశార్దూల మత్తేభాది మృగసమూహము లన్నిటిని నేను తినుచుందును. ఇప్పుడు నాకు నీవు ఆహారమైతివి. నేను పూర్వజన్మమందు దేవేంద్రపదవిని బొంది బ్రాహ్మణోత్తములకు అవ మానము చేసితిని. ఆమదముచేత ఇట్లు సర్పాకారమును పొంది యున్నాను. ఒక మునీంద్రుని శాపమువలన దేవశక్తిని విడిచి, సర్ప మునైతిని. అని భీమునితో జెప్పి దుఃఖించెను. భీముడిట్లనెను. సర్ప

మా! కర్మవశమువలన దుఃఖముగలుగునపుడు తనను నిందించుకొని దుఃఖింపరాదు. సుఖదుఃఖములు గలుగునపుడు మనస్సు ఏకాకారముగా యుండవలెను. అట్లుండుటయే పురుషునకు పురుషార్థమగును. దైవాధీనమువలన లభించునకష్టములను, పురుషప్రయత్నముచేతప్పించుకొనుట కెవ్వరికిని సాధ్యముగాదు. నేను మహాభుజబలవంతుడనైనను నీచేత పట్టుబడి ఇట్టిదురవస్థను బొందియున్నాను. నాప్రాణములు విడుచుటకు నేను భయపడను. నాఅన్నదమ్ములందరును రాజ్యభోగములను విడిచి భయంకరమైన హిమవత్పర్వతమునకు వచ్చియున్నారు. నేను కనబడనియెడల నా అన్నదమ్ము లెంతదుఃఖించెదరో యని విచారించుచున్నాను. అని భీముడు ఆ మహాసర్పముతో చెప్పుచుండెను.

## ధర్మరాజు, భీమసేనుని వెదకబోవుట

ధర్మరాజు భయంకరములగు నక్కకూతలను విని, మిగుల చింతాక్రాంతుడయ్యెను. వెంటనే ధర్మరాజునకు కుడిభుజ నదరెను. అందువలన ముందుకీడు వెనుకమేలుకలుగునని ధర్మరాజుతలచెను. తమ్ములమధ్యమందు భీముని గానక, ధర్మరాజు అర్జునాదులతో తమ్ములారా! మన భీము డెచటికి వెళ్ళెనో తెలియలేదు. నక్కకూతలు నాకు వినబడుచున్నవి గాన భీముని వెదకుటకు నేను వెళ్ళెదను. మీరు ద్రౌపదిని రక్షించుచు యిక్కడనే యుండుడు. అని చెప్పి ధౌమ్యుడు మొదలగు బ్రాహ్మణులను వెంటబెట్టుకొని, భీముని వెదకుచు వనమునకు వెళ్ళెను. మార్గమందు దుమ్ములో భీముడు వెళ్ళిన అడుగులజాడ గనబడెను. ఆయడుగులయందు నాగేలురేఖలును వజ్రరేఖలును కలశాది చిహ్నములును, కనబడుచుండెను. ఆ గుర్తుల వలన ధర్మరాజు వెళ్ళి భీముడు మహాసర్పముచేత బంధింపబడి కదలక

యుండుట గాంచెను. ధర్మరాజు తన మనస్సులో భీముడు మహాబల వంతుడు. ఒక సర్పముచేత పట్టుబడి నిశ్చేష్టితుడై యున్నాడు. సాధారణ మనుష్యునివలె నుండుట ఆశ్చర్యముగా యున్నదని తలంచెను. ధర్మరాజు భీముని జూచి విచారించి యా సర్పముతో సర్పమా! నీవు సర్పరూపధారివగు రాక్షసుడవో దేవుడవో తెలియలేదు. నా పేరు ధర్మరాజు. ఇప్పుడు నిన్ను నేను ప్రార్థించుచున్నాను. ఈ భీముడు నా తమ్ముడు. ఇతనిని యాహారమును కోరుకు పట్టితివి. నీయాకలితీరునంత మృగమాంసము నేను పెట్టెదను. ఈభీముని నీవు విడువుము. అని చెప్పిన ధర్మరాజునకు సర్పమిట్లనెను. ధర్మరాజా! నేను చెప్పుమాటలను వినుము. నేను నహుషుడను రాజును. మీపూర్వీకులగు తాతతాలకు పూర్వీకుడను గనుక నేను మీవంశస్థుడను. నేను దేవేంద్రునితో సమానుడను. ఐశ్వర్యగర్వముచేత మంచిస్వభావమును విడిచి బ్రాహ్మణులకు అవమానము జేసితిని. అది ఎట్లనగా జెప్పెద వినుము! నేను స్వర్గలోకమందు దేవేంద్రునికి బదులుగా దేవేంద్రుడనై యుంటిని. అట్టి దేవేంద్రుడనై యుండి వేయిమంది బ్రహ్మఋషులు మోయు బ్రహ్మరథముమీదఎక్కి బ్రహ్మఋషులకు గొప్ప అవమానమును గలిగించితిని. అందుకు అగస్త్యుడు కోపించి భయంకర సర్పరూపమును ధరియింపుడని నాకు శాపమిచ్చెను. అగస్త్యమునీంద్రుడు శాపమిచ్చినకాలము మొదలుకొని ఈప్రకారముగా సర్పమునై యుందుచున్నాను. దైవముయొక్క నేర్పరితనమును, నే నేమని జెప్పుదును. నేను సకల వేదములను చదివితిని. నూరుమహాయజ్ఞములను జేసితిని. దేవేంద్రపదవిని బొందితిని. తుదకు పెద్దపామునై అధిక దుఃఖమును పొందితిని. ప్రాణుల సుఖదుఃఖములను కలిగించు విషయమున దైవమునకు భారములేదు. అగస్త్యునిచేత శాపమునుబొంది దేవేంద్రసింహాసనమును విడిచి, వచ్చుటకువచ్చుచుండుమని ప్రార్థిం

చితిని. మహాత్మా! నాకు పూర్వజన్మ జ్ఞానము చెడకుండునట్లు గ్రహింపుము మరియు బలవంతులను బట్టినప్పుడు వారుబలహీనులగు నట్లు కరుణింపుము, నాకు శాపము నశించుడుపాయము అనుగ్రహింపుము. అని నే నగస్త్యునితో చెప్పుకొని ప్రార్థింపగా నాయందు కరుణించి, వారు నే కోరినవరములనిచ్చి నాతో నిట్లనిరి. నహుషుడా! నీవు సర్పముగా యున్నప్పుడు నీవడిగిన ప్రశ్నములకు ప్రత్యుత్తరములు క్రమముగా నీకు చెప్పువానివలన నీశాపమునశించును. అయినను నీ శాపము బహుకాలమునకు నశించునుగాని శీఘ్రముగా నశింపదు. అని అగస్త్యము నీంద్రుడు నాతో జెప్పెను. అంతట నేనును అగస్త్యుని వాక్యముల నవలంబించి నామాటలనే తలంచుచు ఈయడవిని బహుకాలమునుండి సర్పముసై యుంటిని. నీతమ్ముడగు భీముడు. నాకు కాలవశమువలన ఆహారమాయెను. నీవు సమర్థుడవైన యెడల, నా ప్రశ్నముల కుత్తరములిచ్చి భీముని విడిపించుకొనుము. అని సర్పము జెప్పగా ధర్మరాజు యిట్లనెను. మహాత్మా నహుషా! నీవడుగు ప్రశ్నములకు బుద్ధిమంతులగు బ్రాహ్మణులు ప్రత్యుత్తరములు జెప్పవలెను. ఇతరులు, మహాబుద్ధిమంతులైనను నీప్రశ్నలకు ప్రత్యుత్తరము లీయజాలరు. అయినను నేను నేర్చిన విధిప్రకారము జెప్పెదను అడుగుము. అని ధర్మరాజు చెప్పగా సర్పరూపముతోనున్న నహుషుడిట్లనెను.

## ధర్మరాజు నహుషుని ప్రశ్నములకు ప్రత్యుత్తరము లిచ్చుట

ధర్మరాజా! ఏగుణముగలవాడు బ్రాహ్మణుడగునో జెప్పుము. ఆబ్రాహ్మణుడు ఎరుగదగినవస్తువు ఏదియో జెప్పుము. అని నహుషుడడుగగా, ధర్మరాజు ఇట్లనెను. ఓసర్పరూపివగు నహుషుడా! సత్యము, ఓర్పు, ఇంద్రియనిగ్రహము, శౌచము, దయ, తపస్సు, దానబుద్ధి ఈఏడుగుణములును ఏపురుషునియందుండునో అట్టివాడు బ్రాహ్మ

ణుడు. అట్టి బ్రాహ్మణుడు సుఖదుఃఖములు గలిగినపుడు మోహమును పొందకుండుటయే బ్రాహ్మణునకు శ్రేష్ఠవిద్య. అని ధర్మరాజు చెప్పగా నహుషు డిట్లనెను. ధర్మరాజా! నీవు చెప్పిన ఏడుగుణములు శూద్రునియం దున్న యెడల శూద్రుడు ఉత్తముడు బ్రాహ్మణుడగునేమో తెలియ జెప్పుము అట్టిశూద్రుడు ఉత్తమ బ్రాహ్మణుడైన యెడల, బ్రాహ్మణాది వర్ణవిభాగము గలుగజాలదు. హీనులగు శూద్రులయందు బ్రాహ్మణబుద్ధి గలుగజాలదుగదా! శూద్రుని బ్రాహ్మణుడని చెప్పిన యెడల జనులు యెగయళిగా నవ్వుదురు. అని నహుషుడు చెప్పగా ధర్మరాజు యిట్లనెను. నహుషుడా! పొరబాటువలన వర్ణసంకరమైన యెడల వర్ణములను పరీక్షించునిమిత్తము బ్రాహ్మణగుణములను ప్రత్యేకముగా స్వాయంభువమనువు చెప్పియున్నాడు సత్యము మొదలగు గుణములు శూద్రునియందు గల్గియున్న యెడల శూద్రుడు శూద్రశ్రేష్ఠుడగునేగాని బ్రాహ్మణుడు కాజాలడు. అసత్యాది గుణములు బ్రాహ్మణునియందు లేనియెడల బ్రాహ్మణుడు శూద్రుడేయగును. గుణములే శ్రేష్ఠములగునుగాని జాతివలన శ్రేష్ఠత్వము లేదు. మంచిగుణవంతుడు నానావిధ గతులచేత మిక్కిలిఅధికనుగు గుణకీర్తివంతుడగును. గుణహీనుడగువాడు హీనకులవంతుడగును. కనుక ద్రవ్యరక్షణకంటె గుణరక్షణము శ్రేష్ఠము అని ధర్మరాజు చెప్పగా సర్పమిట్లనెను. ధర్మరాజా! అప్రియమును చేసినను, అసత్యవాదియై ననుహింసచేయని పురుషుడు పుణ్యగతికి పోవునని పెద్దలు చెప్పుదురు. అహింసాధర్మము ఇంతశ్రేష్ఠమైన దెట్లయ్యెనని సర్పమడుగగా ధర్మరాజిట్లనెను. మహాత్మా! దానముచేయుట, ప్రియకార్యముచేయుట, సత్యముచెప్పుట, ప్రాణినిహింసింపకుండుటయు, నాలుగుధర్మములు సమానములు. వానిలో అహింసాధర్మము విశేషమైనది. అది వివరించెదవినుము. దేవమనుష్యతిర్యగ్యోనులను మూడుగతులు గలవు.

మనుజుడు దానాదిగుణములుగలిగిఅహింసాధర్మపరుడైన యెడల అట్టి పురుషుడు దేవగతిని పొందును. అందుకు విపరీతముగా ప్రవర్తించిన యెడల తిర్యగ్యోనులగు అశ్వాదిజన్మమును పొందును. అని ధర్మ రాజు చెప్పెను. తాను అడిగిన ప్రశ్నలకు ధర్మరాజు ప్రత్యుత్తర మును జెప్పగా అనహుషుడు పరమసంతోషమును పొందెను. సర్పము భీముని విడిచి అగస్త్యుని శాపము బాసి దివ్యపురుషుడై యుండెను. ఆదివ్యపురుష రూపధరుడైన నహుషునివలన వేదాంతరహస్యము లను ధర్మరాజు వినెను.

ధర్మరాజు భీముని వెంట బెట్టుకొని దైతయాశ్రమమునకు వచ్చెను. ఎండాకాలమైనందున సూర్యకిరణముల వేడిమిచేత వనభూములు కార్చిచ్చువలె సహింపబడెను. వనభూములు వృద్ధియగునట్లు వర్షా కాలము వచ్చెను. వర్షాకాలమున మేఘములు దట్టముగా వ్యాపించి మహావర్షము కురిసెను. వర్షమందు గొప్పగాలియుండెను. ఆవర్షముల వలన హిమవత్పర్వతమందుగల సరస్సులు, నదులు, దొరువులు, చెరువులు అన్నియు జలపూర్ణములై యుండెను. వర్షాకాలమందు మేఘములు దట్టముగా వ్యాపించియున్నందున చీకటిగానుండెను. చీక టియందు జనులకు వస్తుజ్ఞానము లేకుండెను. మెరుపులు తేజస్సుచేత ఒక్కసారి వస్తుపరిశీలన తెలియుచుండెను. మేఘములందు ఉరుములు మిక్కిలిఅధికముగా నుండెను. పల్లపుభూములయందు నీటిలో కప్పల ధ్వనులధికముగా నుండెను. వృక్షములయందు నెమళ్ళధ్వనులు మనో హరముగా నుండెను. వనమందుగల పుష్పములగుత్తులు ఉయ్యాలల వలెనుండెను. ఆగుత్తులనుండు తుమ్మెదలు స్త్రీపురుషాదులవలె నుండెను. గుత్తులనూచెడిగాలి ఉయ్యాలనూచు సఖివలె నుండెను. కాని పరిమళపుష్పములపై వీచుచు చల్లగానుండెను. ఆ పుష్పములగుత్తుల యందుండు తుమ్మెదలు సంగీతమును పాడు జనులవలె నుండెను. మరియు మనోహర ధ్వనులను జేయుచుండెను.

వర్షకాలమందు ఇంద్రధనుస్సుల కాంతిచేత ఆకాశము విచిత్ర కాంతిని గలిగియుండెను. భూమియు అతివిచిత్రముగా ప్రకాశించెను. భూమియొక స్త్రీవలెనుండెను వర్షాకాలమునకు పిమ్మట శరత్కాలము వచ్చెను. (ఆశ్వీయుజ కార్తీకమాసములు శరత్కాల మనబడును) శరత్కాలమునందుకూడ ఆకాశము భూమి మిక్కిలి కాంతిగలిగి యుండెను. సకలజంతువులకును సంతోషము గలిగియుండెను. సరస్వతీ నదియందు జలములు తెల్లగానుండెను. రాజహంసలను జనులుసే వించునట్లు మహర్షులందరును సరస్వతీ నదీజలములను సేవించుచుం డిరి. అందుగలపద్మము లానదికి ఆసనములవలె నుండెను. పద్మాస నుడగు బ్రహ్మదేవుని మహర్షులు సేవించునట్లుగా మహర్షులందరును శరత్కాలమందా సరస్వతీనదిని సేవింతురు శరత్కాల రాత్రులందు నక్షత్రము లాకాశమున మిక్కిలిగా ప్రకాశించును. నల్లకలువలు విక సించియుండును. మంచిసుగంధ యుక్తమగుగాలి వీచుచుండును. చంద్రునికాంతులు కర్పూర పరాగమువలె మిక్కిలి స్వచ్ఛముగా నుండును. సూర్యకిరణములు వెుఱపులేకయుండెను. మేఘములులేక ఆకాశము నిర్మలముగా నుండెను. పద్మములు కాంతిగలవై ప్రకా శించుచుండెను హంసపక్షులు, సారసపక్షులు, తుమ్మెదలు, మిక్కిలి గాధ్వనిచేయు చుండెను. శరత్కాలమందు మేఘములు ఆకాశము నుండి క్రిందికిదిగినట్లు యేనుగులు పర్వతములమీాదనుండిదిగి వనముల యందు తిరుగుచుండెను. కోకిలలు మొదలగు పక్షులన్నియు మనో హరముగా కూయుచుండెను. నరటివనములయందును. పుష్పవనముల యందును రాజహంసలు నివసించి మనోహరముగా కూయుచుం డెను. శరత్కాల మేఘములచేత ఆకాశమును, పచ్చని పుష్పించిన గడ్డిచేత సరస్సులను, ప్రకాశించుచుండెను. సరస్వతీ నదీతీరమందలి యిసుకతిన్నెలందు మునులుండిరి. అట్టిసరస్వతీ నదియందు పాండ

వులు ప్రతినిత్యము స్నానపానాదులను జేయుచుండిరి. పాండవు లాపర్వతభూమియందు కొన్నిదినములు నివసించిరి. పాండవులు ధౌమ్యాది బ్రాహ్మణులను తీసికొని ఇంద్రసేనాది భృత్యులతో బయలుదేరి కామ్యకవనమునకు వచ్చిరి. అచ్చటగల మునులందరును పాండవులను పూజించిరి. అర్జునుని మిత్రుడగు విప్రుడొకడువచ్చి సభయందుండు ధర్మరాజునుజూచి ప్రీతిపూర్వకముగా యిట్లనెను. ధర్మరాజా! నీవును నీతమ్ములును యీ కామ్యకవనమం దున్నారని కృష్ణుడెరిగి మిమ్ములను జూచుటకు యిక్కడికివచ్చుచున్నాడు. కృష్ణుడు సర్వదా మీమేలు కోరుచుండును. మార్కండేయ మునీంద్రుడు అనేకమహా యుగ సహస్రములు పర్యంతము జీవించును. మిక్కిలి ప్రభావము గలిగి యుండును. సాధువులకు స్వాధీనుడై తపంబును చేయుచుండును. అట్టి మార్కండేయమునీంద్రుడు మిమ్ములను జూచుటకు యీ వేళ మందే యిక్కడికివచ్చును. అనియిట్లు బ్రాహ్మణుడు ధర్మరాజుతో జెప్పెను.

## శ్రీకృష్ణుడు సత్యభామతో పాండవులయొద్దకు వచ్చుట

ఆ ముహూర్తకాలమందే కృష్ణుడు సత్యభామను తీసికొని తన దివ్యరథముమీద నెక్కి పాండవులదగ్గరకు వచ్చెను. కృష్ణుని దివ్యరథమునకు శైబ్యసుగ్రీవాదులగు గుర్రములను పూన్చిరి. ఆగుర్రములు మహావేగముగలవి. ఆదివ్యరథము అనేకవిధ రత్నప్రభావములచేత ప్రకాశించుచుండెను. ఆకృష్ణుని రథమునకు గరుడచిహ్నమైన టెక్కెముగలిగియుండెను. ఆగరుడధ్వజకాంతులు వ్యాపించి ఆకాశము నలంకరించెను. ఆ దివ్యరథముమీాద కృష్ణ సత్యభామ లిద్దరును. కూర్చుండి మేఘసమీపమందు కూర్చున్న దేవేంద్ర శచీదేవులవలె ప్రకాశించుచుండిరి. ఆ దివ్యరథమువచ్చునపుడు మహాధ్వని గలి

గెను. కామ్యకవనమందు నెమళ్ళు అరచుచుండెను కోయిళ్ళ కమ్మని కూతలధ్వనులు వినుచు కృష్ణుడు పాండవులదగ్గరకు వచ్చెను. కృష్ణుడు రథముదిగి ధర్మరాజునకు నమస్కరించి భీమార్జున నకుల సహదేవులను కౌగిలించుకొని ద్రౌపదిని గౌరవించెను. ధౌమ్యాది బ్రాహ్మణులందరును కృష్ణునిజూచి సంతోషించి పూజించిరి. ధర్మరాజు అర్ఘ్యాది విధులచేత కృష్ణుని పూజించెను. ధర్మరాజు తమ్ములను బ్రాహ్మణులను గూడుకొని కృష్ణుని చుట్టుకొని కూర్చుండెను. కృష్ణుడు అర్జునుని తనవద్ద నుంచుకొనెను. బహుకాలముగా జూడని యర్జునుని యాకారమును కృష్ణు డధికాదరముతో చూచుచుండెను. కృష్ణుడు అర్జునుని జూచుచు ధర్మరాజుతో యిట్లనెను. ధర్మరాజా! అర్జునుడు శివుడు మొదలగు దేవతలచేత సకలదివ్యాస్త్రములను పొందివచ్చెను. నీ భాగ్యవశమువలన అతనికి దివ్యాస్త్రలాభము కలిగెను. అందువలన నీవు కృతార్థుడవైతివి. నీయొక్క ధర్మము, బుద్ధి, చరిత్ర, తపస్సులు సకలశుభములకును కారణములుసుమా! రాజ్యముకంటె నీకు ధర్మమన్న ప్రీతి యెక్కువ. నీకు సర్వదా ధర్మమందే బుద్ధియుండును. నీవు వేదశాస్త్రవేత్తవై యున్నావు. నానావిధయజ్ఞములను జేసితివి. ధనుర్వేదమందు సమర్థుడవు. సకలభూమిని పరిపాలించు రాజధర్మము నీకు మిక్కిలి సులభముగదా! నీకు యిహపరలోకసుఖము లనాయాసములు. ఇంద్రియనిగ్రహము, సత్యము, ధైర్యము, నిత్యతృప్తి శాంతరూపమగు మనోనిగ్రహము యీ గుణములైదును నీయందు నిత్యముగలవు. జ్ఞానవశమువలన నీకు కామలోభగుణములు గలుగవు. అందువలన నీవు ధర్మరాజను పేర సకలపూజ్యుడవై మహిమగలవాడగుదువు. అని కృష్ణుడు ధర్మరాజుతో చెప్పెను. పాపాత్ముడైన దుర్యోధనుడు జూదమను నెపముచేత నిండుసభలో మిమ్ములను అవమానించెను. నీవు మహాధైర్యవంతుడవై ఆ యవమానమును సహిం

చితివి. అట్లు చేయుట నీకే చెల్లునుగాని యితరులకు చెల్లదు. నీవంటి ధర్మబుద్ధిగలవా డెవ్వడును లేడు. నీవు సర్వదా ధర్మబుద్ధి గలిగి యుండుటవలనను కోపించుకొనకవిహాడ నగుటవలనను నీచులగు దుర్యోధనాదుల చేష్టలు చెల్లెను. నీతమ్ముల పరాక్రమములనుగూర్చి చెప్పవలసిన పనిలేదు. నీ మనస్సున కోపము జనించిన శత్రువులంద రను వెంటనే నశింపగలరు. నీ తమ్ముల పరాక్రమము సముద్రము వంటిది. నీ యాజ్ఞ చెలియలికట్టవంటిది. నీయాసతివలన నీ తమ్ములు పరాక్రమింపలేదు. వారు పరాక్రమించిన సర్వలోకములను జయింప గలరు. అంధక వృష్ణి భోజయాదవవంశీకులగు రాజులందరును నీయెడ ప్రేమగలిగియున్నారు. వారందరును నీయందు వినయభక్తియుక్తులై నీ మనోదుఃఖమును బోగొట్ట దలచియున్నారు. దుర్యోధనాదులు యాదవులు మొదలగువారితో యుద్ధము చేయజాలరు.

నాలుగు సముద్రములమధ్యనుండు భూమికి నీవే ప్రభుడవు. నీ వపరిమిత మహిమగలవాడవు. నీమనసున తలచిన కార్యమేదియును నసాధ్యము కానేరదు అని కృష్ణుడు ధర్మరాజుతో జెప్పగా ధర్మ రాజు కృష్ణునితో నిట్లనెను. మేము యీ ప్రకారమే మిగిలియున్న వనవాసవత్సరములు గడిపి, పిమ్మట అజ్ఞాతవాసము గూడ గడిపె దము. పిమ్మట లోకవిరుద్ధముగాని విధమున శత్రువులను జయింప దలచితిమి. ఈ కార్యము కొనసాగు భారము నీయది. మేము నీ శరణుజొచ్చియున్నాము. మాకునీవలన సర్వకార్యములు సిద్ధించును. ఇది నిశ్చయము అని ధర్మరాజు కృష్ణునితో జెప్పగా సమీపమున దున్న ద్రౌపదిని జూచి కృష్ణుడిట్లు పలికెను. ద్రౌపదీ! నీ కుమారు లైదుగురును యిప్పుడు యదుకుమారులతో స్నేహముగలవారై ఏనుగులమీదను గుర్రములమీదను యెక్కుచు నానావిధ శస్త్రాస్త్ర విద్యల నభ్యసించుచున్నారు. ఇతరవిషయములను మరచియున్నారు.

ప్రద్యుమ్నుడు దివ్యాస్త్రములను నీకొడుకుల కతి ప్రియముగా నిచ్చెను. నీ కుమారులయందు సుభద్ర కభిమన్యునికంటె అతిప్రేమ కలదు. నీ కుమారులకై నీవు చింతింపవలదు. మీకు రాజ్యలక్ష్మి వచ్చు కాలము సమీపించినది అని కృష్ణుడు ద్రౌపదిని ఊరడించుచుండెను.

## మార్కండేయుడను ముని పాండవుల దగ్గరకు వచ్చుట

జనమేజయమహారాజా! ఆసమయమున మహాతపస్సంపన్నుడగు మార్కండేయ మహామునీంద్రుడు పాండవులదగ్గరకు వచ్చెను. కృష్ణపాండవు లామార్కండేయున కెదురుగా వెళ్ళి శాస్త్రవిధుల ప్రకారము పూజించిరి. మార్కండేయమునీంద్రుడు ప్రత్యేకముగా అందరిని కుశలమడిగెను. పిమ్మట అందరును మార్కండేయుని సేవించుచు కూర్చుండిరి. పాండవులమేలు కోరు కృష్ణుడు మార్కండేయున కిట్లనెను. మునీంద్రా! నేనును పాండవులును, విప్రులును, మేమందరము నీమాధుర్యవాక్యములను వినదలచితిమి. మా యిష్టమును దీర్పుము. ఇది నీకు తగును. గాన దేవతలప్రభావములను జెప్పుము. రాజులప్రతిభల నుగ్గడింపుము. బ్రాహ్మణుల ప్రతాపములను బలుకుము. స్త్రీల సౌకుమార్యములను సంప్రతింపుము. క్రమముగా వీని నన్నిటిని దెలియబలుకుము. అని కృష్ణుడు మార్కండేయునితో చెప్పుసమయమున నారదమునీంద్రుడు వచ్చెను. అందరును నారదున కెదురుగావెళ్ళి నమస్కరించిరి. అంతట తగు నాసనమందు నారదున గూర్చుండజేసి తగినరీతిని సత్కరించి పూజించి అతనికి సంతోషమును గలిగించిరి. నారదమునీంద్రుడు మార్కండేయుని జూచి మునీంద్రా! కృష్ణపాండవులకు హితముగా పుణ్యకథను యెరిగింపుము. అని నారదుడు పలికి వారి యనుమతిబొంది వెళ్ళెను. ధర్మరాజు మార్కండేయున కిట్లు పలికెను. మునీంద్రా! మేము ధర్మమందు

ప్రవర్తింపవలెనని దలచి బహుదుఃఖములను పొందుచున్నాము. ధృతరాష్ట్రుని కొడుకులగు దుర్యోధనాదులు సర్వదా పాపబుద్ధిగలిగి పాపములను జేయుచున్నారు. దుర్యోధనాదులందరును పరమసౌఖ్యములను అనుభవించుచున్నారు. ఇది చాల విపరీతముగా నున్నది. మనుష్యుడు యీజన్మమందు చేసిన కర్మఫలములను యీజన్మమందే పొందునో పరలోకమందు పొందునో లేక రెండింటియందును పొందునో తెలియకున్నది. ఈ లోకమున పురుషుడు చేసిన కర్మఫలము విశ్వకర్త యగు యీశ్వరుని పొందనేరదు. పురుషుడు చేసిన కర్మఫలము దేహముగు నశించినప్పుడు నశించునేమో తెలియదు. యీ విషయమును నేను యాలోచించుచుందును. ఇది నాకు తెలుపవలయును. ఇందులకు నీవే తగుదువు అని ధర్మరాజు మార్కండేయు నడుగగా మార్కండేయుడు ధర్మరాజున కిట్లు చెప్పెను.

ధర్మరాజా! పూర్వము బ్రహ్మదేవుడు ప్రథమకల్పమందు మనుష్య శరీరములను సృష్టించెను. (బ్రహ్మదేవుని ఒక దినము మనువులకు ఒక కల్పమగును.) అట్లు ప్రథమ సృష్టినందిన మానవశరీరములతిపవిత్రములై, నిర్మలములై, ధర్మస్వరూపులై బలవంతులై యుండెను. సత్యవాదులై సత్యసంకల్పులై బ్రహ్మజ్ఞానవంతులై తమకు యిష్టమగు నంతవరకు జీవింపగల సమర్థతగలిగి నరులు జీవించుచుండిరి. వారు దేవవిమానములమీద విహరింపుచు అనాయాసముగా అధికమగు కార్య ఫలసిద్ధులను గాంచుచు సర్వజ్ఞులై మాత్సర్యము లేక యుండిరి. వారనేక సహస్ర సంవత్సరములు ఆయుర్దాయము గలిగి యుండిరి. కొంతకాలమునకు కామక్రోధాది గుణములు మనుష్యులకు కలిగెను. ఆదుర్గుణవంతులగు మనుజులు మాయావంతులై దేవతలచేత విడువబడి అల్పాయుర్దాయవంతులైరి. స్వల్పబలశరీరులైరి. దరిద్రులై, నిష్ఫలకర్ములై, బహురోగపీడితులై, నాస్తికులైరి.

నాలోకరినొకరు మెచ్చక పాపములుజేయుచు పశ్వాదియోనులయందు పుట్టుచు నరకాగ్నులయందు పడుచు పుణ్యపాపముల ననుభవింపుచు సంసారచక్రమందు తిరుగుచుందురు. యీ సంసారచక్ర మందున్న మనుష్యుడు పుణ్యపాపములను చేయుచుండును. తుదకు దేహమును విడిచి వెళ్ళునప్పుడు నీడవలె అతని పుణ్యపాపము లతని వెనువెంటనే వెళ్లుచుండును. అట్టి కర్మములలో పుణ్యకర్మలవలన పుణ్యమును సుఖమును గలుగును. పాపకర్మలవలన పాపమును, దైన్య దుఃఖములును గలుగును.

ఈ పుణ్యపాపములు రెండును మనుష్యునకు పరలోకమందు సుఖదుఃఖములను కలిగించుచు, మరల ఆ కర్మములే జన్మమును కలిగించును. ఎవరుచేసిన పుణ్య పాపకర్మలు వారు అనుభవింపకతప్పదు. మనుజునకు దేహము నశించునుగాని తాను చేసిన కర్మములు చెడిపో జాలవు. మరియొక విశేషము గలదు. వినుము. కొందరు మనుష్యులు తమ కర్మవశమువలన యీ మనుష్యలోక మందే సుఖమును గల్గి యుందురుగాని పరలోకమున సుఖమును పొందజాలరు. మరికొందరు యీలోకమున సుఖమునెరుగక పరలోకమునందే సుఖమును పొంద గలరు. కొందరు యిహపరముల రెండింటియందును సుఖమును పొంద గలరు. మరికొందరు రెండులోకములందునుగూడ సౌఖ్యమును పొంద జాలరు. అదియెట్లనగా జెప్పెదవినుము. ధనవంతులయినవారు సర్వదా యింద్రియసుఖముల ననుభవింపుచు పుణ్యమార్గమును తెలచక పుణ్య కర్మలను చేయకుందురు. ధనమదాంధులగువారు సర్వదా కామక్రోధ లోభాదులను గలిగియుందురు. వారికి పరలోకసౌఖ్యము కలుగదు. వారి కిచ్చటగల విషయ సుఖములే మేలుగాదోచును. గాన అట్టివారికి పరలోకమున సుఖముండ నేరదు. కొంద రుపవాసము చేయుచు సర్వదా వ్రతనియమముల నాచరింపుచు అధ్యయనము చేయుచు

పుణ్యతీర్థములను సేవించుచుందురు. అట్టి పుణ్యాత్ములకు యీమనుష్య లోకము దుఃఖమయమైయుండును. వారు తుదకు పరలోకమందు మహాసుఖమును పొందుదురు. కొందరు సంసారమునందు వర్తింపుచు ధర్మమును జెప్పుచు ధర్మమార్గముచేత ధనముసంపాదించి వివాహమాడి పుత్రులను పొంది యజ్ఞాది పుణ్యకర్మలను జేయుదురు. అటువంటి పుణ్యాత్ములగు మనుష్యులు యిహపరములు రెండింటి యందును సౌఖ్యములు పొందుదురు. మరికొందరు శాంత సత్యపరిశుద్ధి లేనివారై నాస్తికబుద్ధిగలిగి పాపకర్మములను జేయుచుందురు. అట్టి జనులు యిహపరలోక సౌఖ్యములను పొందకయే చచ్చి పశ్వాది హీనజన్మములను పొందుదురు. ఈ రీతిగా మనుష్యులకు కర్మవశము వలన పుణ్య పాపకర్మ ఫలములు గలుగుచుండును. ధర్మరాజా! మీరు దివ్యపురుషులు. దేవతలకు మేలుచేయుటకై మీరు మనుష్యులై పుట్టితిరి. మీరు ప్రసిద్ధమైన పరాక్రమముచేత యుకమీరటట సకల శత్రువులను చంపుదురు సకలరాజ్యలక్ష్మిని పొందుదురు. అనేక యజ్ఞములు జేయుదురు. దేవభావములను పొందుదురు. అని యిట్లు మార్కండేయుడు ధర్మరాజుతో జెప్పగా, ధర్మరాజు మహాత్మా! మునీంద్రా! బ్రాహ్మణ ప్రభావమును వినగోరెదను జెప్పుము అని యడుగగా మార్కండేయు డిట్లు చెప్పసాగెను.

## మార్కండేయుడు ధర్మరాజునకు బ్రాహ్మణ ప్రభావమును జెప్పుట

ధర్మరాజా! పూర్వము హైహయవంశమందు పరిపురంజయుడను పేరుగల రాజకుమారుడు డుండెను. అతడు వేటాడుటయందు ఆసక్తిగలవాడై వనమందు తిరుగుచుండెను. ఆసమయమందు ఒకచోట

గడ్డియు తీగలుగల ఒక పొద దూరముగా నుండెను. ఆపొదమధ్య మందొక బ్రాహ్మణుడు కృష్ణాజినమును వస్త్రముగా ధరించి యుండెను. అత డా బ్రాహ్మణుని మృగమని దలచి బాణమును సంధించి వేసెను. దుంధుమారుడు బాణము వేసి వానిదగ్గరకు పోయెను. బ్రాహ్మణుడు బాణము తగులుటచేత చచ్చెను. దుందుమారు డా బ్రాహ్మణుని జూచి మిగులదుఃఖముగలవాడై తన పురమునకు బోయి తన వంశమందుగల వృద్ధులకు యీ వృత్తాంతమును తెలిపెను. దుందుమారుడు తన వంశస్థుల నందరను వనమునకు బిలిచి బ్రాహ్మణ శరీరమును జూపెను. వారందరును మిగుల దుఃఖించి అసమీప మందొక యాశ్రమమును జూచిరి. ఆ యాశ్రమము తార్క్ష్యుడను మునీశ్వరునిది. వైహయులందరును ఆయాశ్రమమునకు వెళ్ళి మునిని జూచి నమస్కరించిరి. ఆమునీంద్రుడు వారందరిని దీవించి వారిని పూజించుటకు తన శిష్యుల నేర్పరచెను. అంతట వారందరును మునీంద్రునకు సాష్టాంగ నమస్కారములు చేసిరి. మునీంద్రా! మా కుమారుడగు వీడు, దుందుమారుడని చెప్పబడును. ఇతడు వేటాడుటకువచ్చి యింతకుముందు యీ వనములో మృగమని తలచి ఒక బ్రాహ్మణుని జంపెను. గాన మేము మహాపాపులము. మీరు చేయు పూజలకు మేము అనర్హులము. ఇందుకు తగిన ప్రాయశ్చిత్త మేది యైన జెప్పుము అని రాజులు మునీంద్రునితో జెప్పియడిగిరి. అందుల కామునీంద్రుడు నవ్వి రాజులారా! నేనుజెప్పు మాటలను వినుడు. మాయాశ్రమభూమియందు భయవ్యాధి మరణాది దోషదుఃఖములు గలుగవు. మీ కుమారుని చేత నొకవిప్రుడు మరణ మొందెనని చెప్పుచున్నారు. యీమాట ఆశ్చర్యమును కలిగింపుచున్నది. అని తార్క్ష్య మునీంద్రుడు రాజులతో జెప్పి వారికి తన పుత్రునిజూపి, రాజులారా! మీకుమారుడగు దుందుమారుని బాణముచేత చచ్చినవాడు యిత

డగునేమో జూడుము. అని యడుగగా రాజులందరును మునికుమా రుని జూచి మిక్కిలి యాశ్చర్యమును బొంది యిట్లనిరి. మహాత్మా! యితడే మందుమారునిచేత చచ్చి మరల బ్రతికెను. ఇతడు చచ్చి పడి యుండగా మేమందరమును చూచితిమి. ఇతడు చచ్చి మరల బ్రతుకు టకు కారణమేమో తెలియజెప్పుము మాయందు దయగలిగి యింత మహిమకు కారణమెద్దియో మాకు నానతిమ్ము అని యడుగగా మునీంద్రు డిట్లనెను. రాజులారా! ఇంత ప్రభావము మాకు కలుగుటకు కారణ మును జెప్పెదను వినుము. చేయతగిన కార్యమును గురించి మేము సోమరితనమును గలిగియుండము. సర్వదా ఆహారమునకు ప్రయత్నిం చినట్లు పరిశుద్ధిని గలిగి నిత్యపరిశుద్ధినే ఆహారముగా తలంతుము. ప్రతినిత్యము చేయవలసిన కర్మలను యేమరకుందుము. అతిథులను సర్వదా పూజించుచుందుము. సత్యమునే చెప్పుచుందుము. మరియు పరమశాంత చిత్తులమై బ్రహ్మచర్యవ్రతములను ధరింతుము. యీగుణ ములను గలిగియుండుట చేత ఏకాలమందైనను మేము మరణ రోగ భయాదులను పొందకున్నాము. మా ప్రభావమునకిది ముఖ్యకార ణము. మీరు పాపమునకు భయపడవద్దు వెళ్ళుడు. అని మునీంద్రుడు రాజులతో జెప్పెను. రాజులందరును మునీంద్రుని యాజ్ఞను పొంది తమ నివాసములకు వెళ్ళిరి. అని మార్కండేయ మునీంద్రుడు ధర్మ రాజుతో చెప్పెను.

ధర్మరాజా! బ్రాహ్మణ ప్రభావ మిటువంటిది యగును. బ్రాహ్మణ క్షత్రియస్వరూపమును తెలిసికొనుటకు దృష్టాంతముగా ఒక యితిహాసము జెప్పెదను వినుము. ధర్మరాజా! అత్రియను మునీంద్రుడొకడుకలడు. ఆమునీంద్రుడు తపస్సుచేయుటకై వనమునకు వెళ్ళుచుండి తన భార్యతో యిట్లనెను. కాంతా! నేను తపస్సు జేయుటకు వనమునకు యిప్పుడే వెళ్ళుచున్నాను. నీవు నా వెంబడి

వనమునకు వచ్చెదవో లేక పుత్రులదగ్గర యిక్కడనే వుండెదవో చెప్పుము. అని యడుగగా అత్రిమునిభార్య ప్రాణేశ్వరా! మహాత్మా! నీవు గృహస్థాశ్రమమును విడిచి వానప్రస్థాశ్రమమునకు బోదలచితివి. కుటుంబమందుగల పుత్రాదులకు స్థిరమైన జీవన మేర్పరచినగాని మరియొక ఆశ్రమమునకు వెళ్ళరాదు. వైన్యరాజు యాచకులకు అధికధనములను ఇచ్చుచున్నాడు. నీవువెళ్ళిఆ వైన్యరాజును యాచించి ధనమును తెమ్ము. అని చెప్పెను. అత్రిమునీంద్రుడు కొంతసేపు యోచించి తన భార్యమాట అతి ధర్మయుక్తములని తలచి సంతోషించెను. వెంటనే అత్రిమహామునీంద్రుడు వైన్యమహారాజును జూచెను. అతడు అశ్వమేధయజ్ఞమును జేయుచు దీక్షగలవాడై బ్రాహ్మణులకు అపరిమిత ధనము లిచ్చుచుండెను. అట్టి వైన్యునకు ఆశీర్వాద పూర్వకముగా అత్రిమునీంద్రుడు యిట్లు పలికెను.

మహారాజా! నీవే బ్రహ్మవు. నీవే దేవేంద్రుడవు నీవే యీశ్వరుడవు. నీవే సర్వసత్మ స్వరూపుడవు నీవే సర్వధర్మముల నెరిగినవాడవు. యీభూలోకమందు నీతో సమానులెవ్వరును లేరు. మహాత్ములగు మునులందరును నిన్ను సర్వదా సేవింపుచు పొగడుచుందురు. అని అత్రి వైన్యుని పొగడెను. ఆసభయందు గౌతముడను మునియుండి అత్రి పొగడిన విధమునంతను విని కలుషబుద్ధిగలవాడై అత్రితో! విప్రుడా! నీనోరు అడుగునట్లుగా అరచితివి. ఈ వైన్యరాజు బ్రహ్మయగునా? దేవేంద్రుడగునా? ఈశ్వరుడగునా? నీవు ధనాపేక్షచేత శంకింపక యిట్లు ప్రేలుచున్నావు. ఒక మనుష్యుని యిట్లు స్తుతింపరాదు. అని గౌతముడు అత్రితో చెప్పగా అత్రి యిట్లు పలికెను.

## అత్రి గౌతముల పరస్పర సంవాదము

గౌతమా! నీవు వ్యర్థముగా అధిక ప్రసంగమును జేయుచున్నావు. యుక్తాయుక్తములను నీవు యెరుగజాలవు. ఈ వైన్య

మహారాజు రాజనీతి పరాక్రమముల చేత సర్వలోకములను పరిపాలించుచున్నాడు. సర్వధర్మములకును రాజగువాడు ప్రకాశించుచుండును. కనుక అట్టి అధారభూతుడగు వైన్యరాజును నేనీరీతిగా స్తుతింప వచ్చును అని బలికి గౌతముని యాక్షేపించెను. అంత గౌతముడు మరల యిట్లనెను. అత్రిమునీంద్రా! నీవు వెంట్రుకలు నెరసిన మాత్ర మున నీవు జ్ఞానవంతుడవుగావు. జ్ఞానవృద్ధుడైన వాని మాటలు సభ యందు పెద్దలకు సమ్మతములగును. అని జెప్పెను. ఈ రీతిగా అత్రి గౌతము లిద్దరును వాదముచేయుటకు ప్రారంభించి గొప్ప ధ్వని గలుగునట్లు వాదము చేయుచుండిరి. అప్పుడు కాశ్యపుడను మునీం ద్రుడు ఆ సభయందుగల మునులనుజూచి యిట్లు పలికెను. ముని లారా! యీ అత్రిగౌతముల వివాదమును మనము తీర్పజాలము. సనత్కుమారుడను మునీంద్రుడు సకలధర్మములను తెలిసినవాడు. అతని నడిగిన యెడల ఆయన న్యాయమును జెప్పగలడు. అని కాశ్యప మునీంద్రుడు చెప్పగా అప్పు డందరును సనత్కుమారునియొద్దకు వెళ్ళిరి. అత్రి గౌతముల వివాద విధానమును మునులందరును సన త్కుమారున కెరింగించిరి. అంత సనత్కుమారుడు మునులతో యిట్లనెను. మునులారా! అత్రి మునీంద్రుడు నిశ్చయము చెప్పెను. ఆతనిమాటలు ధర్మయుక్తములు. ఈ సకల భూమిని క్షత్రియుడు పరిపాలించుచున్నాడు. క్షత్రియుడు సకలజనులను రక్షించుటకును. కాచుటకును. సమర్థుడు. అట్టి క్షత్రియుడు, బ్రహ్మయనియు దేవేంద్రు డనియు యీశ్వరుడనియు చెప్పవచ్చును.

మరియు ప్రజలను పరిపాలించు క్షత్రియుడు సకలజనులచేత పూజ్యుడగును. రాజుయొక్క ఆజ్ఞాప్రకారము సకలజనులు మునులు వర్తింపుచుందురు. రాజాజ్ఞను ఎవడును అతిక్రమింపరాదు. క్షత్రి యుని ప్రభావమును జెప్పుటకు సాధ్యముగాదు. పరాట్టు, సామ్రాట్టు,

యుధాజిత్తు, సత్యమన్యుడు, సత్యజీవుడు, సత్యధర్ముడు, అను ఆరు పేర్లు రాజునకు గలిగి రాజును పొగడుదురు. పూర్వము బ్రాహ్మణు లందరును అధర్మమునకు భయపడి తమ తేజోబలములను క్షత్రియుల యందు నిలిపిరి. బ్రాహ్మణ కులము క్షత్రియుల కులము ప్రవర్తిల్లు చున్నది. బ్రాహ్మణ క్షత్రియ కులము లన్నియు ఒకదాని నొకటి ఆశ్రయించి అభివృద్ధి పొందుచున్నవి గాని ప్రత్యేకముగా ప్రకాశింప జాలవు. క్షత్రియుడు బ్రాహ్మణులను సేవించుటవలన తేజోవంతుడై సూర్యుడు చీకట్లను నశింపజేసినట్లు సకలజనుల పాపములను నశింప జేయును. క్షత్రియుడు వంశమువలన సర్వాధికుడు నిశ్చయము అని సన త్కుమారుడు మునులతో జెప్పెను, మునులందరును వెళ్ళి సన త్కుమారుని మాటలను వైన్యమహారాజునకు దెలిపిరి. అప్పుడు వైన్యరాజు అత్రిమునినిజూచియిట్లనెను. మహాత్మా సకలజనులకంటె అధికముగా నీవు నన్ను పొగడితివి. నీవు పొగడిన దంతయు విని సన త్కుమారుడట్లు పొగడవచ్చునని చెప్పెను. గాన నీవు నన్ను పొగడి నందుకు సంతోషించితిని. నీవు కోరినప్రకారము నీకు కోరిన ధనము నిచ్చెదను. అని వైన్యుడు అత్రిమునీంద్రునితో జెప్పెను. అత్రి కోరిన ధనముల నిచ్చెను. అత్రి బహు ధనములను తెచ్చి తన కొడుకులకు పంచిపెట్టి తాను తపస్సు చేయుటకు వనమునకు వెళ్ళెను. అని మార్కండేయ మునీంద్రుడు రాజుతో చెప్పి మరల రాజా! సరస్వతీ గీతయను ఇతిహాసముగలదు. అందువలన కొన్ని మంచి ధర్మములు తెలియగలవు. ఆ ఇతిహాసమును జెప్పెదను వినుము.

ధర్మరాజా! పూర్వము తార్క్ష్యుడను మునీంద్రుడు సరస్వతిని ఆరాధించగా అతనికి సరస్వతి ప్రత్యక్షమాయెను. అంత నతడు సర స్వతితో యిట్లనెను. లోకమాతా! సరస్వతీ! పురుషునకు ధర్మ మేదియో చెప్పుము. దేనివలన పురుషుడు పరమ పుణ్యాత్ముడై

బహు పుణ్యగతులను పొందునో చెప్పుము. అని యడుగగా సరస్వతీ దేవి యిట్లనెను. మునీంద్రా! బ్రాహ్మణుడు నాలుగు వేదములను చదివి అనేకవిధయజ్ఞములు చేసి యుండవలెను. అట్టి బ్రాహ్మణుడు అనేక దివ్య సంవత్సరముల పర్యంతము దేవలోకమందుండును. దేవ లోకమందు దేవస్త్రీలతో నానావిధ దివ్య భోగములను అనుభవించు చుండును. మొదట చూడగలిగిన మంచి ఆవుపెయ్యను సద్బ్రాహ్మణునకు దానము చేసినయెడల అట్టి దాత దేవలోక సౌఖ్యములను పొందగలడు. ఆదానము చేసిన గోవున కెన్ని వెంట్రుకలుండునో అన్ని దివ్యసంవత్సరముల పర్యంతము దేవలోక సౌఖ్యములను అనుభవించును. గొప్పబరువును మోయుటకు శక్తిగల మంచి యెద్దును బ్రాహ్మణునకు దానము చేసినయెడల పదిగోవులను దానము చేసిన పుణ్యఫలముగలుగును. సద్బ్రాహ్మణునకు వస్త్రదానము చేసినయెడల పురుషునకు చంద్రలోకప్రాప్తి గలుగును. బంగారుదానము చేసిన యెడల స్వర్గలోకప్రాప్తి కలుగును.

ఏడుసంవత్సరముల పర్యంతము వ్రత నియమము చేత నేయి వలన అగ్నిహోత్రమందు హోమములు చేసిన యెడల అట్టి పుణ్య పురుషుడు తన యేడుతరముల పితరులతో స్వర్గమునకు పోగలడు. సర్వదా పరిశుద్ధవంతుడై ప్రదీప్తమైన అగ్నియందు హోమము చేయుచు దేవతలకు తృప్తి కలిగించిన వారికి భూలోక సౌఖ్యము కలుగును. మునీంద్రా! అగ్నిహోత్రము నాస్వరూపమని యెఱుగుము. సకల యజ్ఞములయందును కల్పింపబడు శ్రేష్ఠ ద్రవ్యములన్నియు నాయధీనములు. నేను మహనీయమైన అగ్నిహోత్రమందు పుట్టితిని. బ్రహ్మవేత్తలగు మహాత్ములకు నేను సకల సంశయములను నశింప చేయు తప స్స్వాధ్యాయదాన వ్రత నియమములుగల మహాత్ములు సకల దుఃఖములను విడిచి నాసంబంధమైన పరమ పదమందు శాశ్వత

ముగా నివసించియుండుదు. మహాయజ్ఞకర్త లనేకులు మహాయజ్ఞముల చేత నాస్వరూపమగు పరమపదమును పొందిరి. వారు చేసిన మహాయజ్ఞములయందు పాలు చెరువులయందు జలమువలె నుండెను. చక్కెర రాసులు యిసుకతిన్నెలవలె నుండెను. గారెలు, అరిసెలు మొదలగు పిండివంటలు పర్వతములవలెనుండెను. పాయసాన్నములు నదులవలె నుండెను. సకలపదార్థములను విశేషముగా సంపాదించి యజ్ఞములనుచేసి యింద్రాగ్ని మొదలగు దేవతలకు తృప్తికలిగించిరి. అట్టి యజ్ఞములను చేసిన పుణ్యపురుషు లందరును నాపరమపదమును బొందుదురు. అని సరస్వతీదేవి తార్క్ష్యమునీంద్రునితో చెప్పెను. అంత నామునీంద్రుడు రెండుచేతులను జోడించుకొని నమస్కరించుచు సరస్వతీదేవిని యిట్లని స్తుతించెను. సరస్వతీ! నీవు లోకమాతవు. పద్మములవంటి అరచేతులను గలిగియున్నావు. శరత్కాలమందుగల వెన్నెలవంటి తెల్లనిశరీరకాంతిని గలిగియున్నావు. దివ్యభూషణకాంతులచేత సకలదిక్కులను ప్రకాశింపజేయుచున్నావు. వేదములన్నియు నీప్రభావమును చెప్పుచున్నవి. నిన్ను వర్ణించుటకు నేను సమర్థుడనుగాను. నన్ను కృపతో జూడుము. అని మునీంద్రుడు సరస్వతీదేవిని స్తుతించి కృతార్థుడాయెను. అని మార్కండేయుడు ధర్మరాజుతో చెప్పగా ధర్మరాజు రెండుచేతులను జోడించుకొని మహాత్మా! మునీంద్రా! వైవస్వత మనువు ఏప్రకారముగా ప్రభావంతుడయ్యెనో చెప్పుము, అని అడుగగా మార్కండేయు డిట్లనెను.

## మార్కండేయుడు ధర్మరాజునకు వైవస్వతుని వృత్తాంతమును దెల్పుట

ధర్మరాజా! పూర్వము చాక్షుష మన్వంతర కాలమందు వైవస్వత మనువు ఆహారమును భక్షింపక పదివేల సంవత్సరముల

పర్యంతము ఘోరతపస్సు జేసెను. వైవస్వతుడు ఊర్ధ్వబాహుడై ఏకపాదమందు నిలిచి బదరికాశ్రమమందు ఘోరతపస్సు జేసెను. వైవస్వతుడు ఒకనాడు స్నానముచేసి ఒక మడుగుతీరమున ఉండెను. ఆమడుగులోనుంచి ఒక చేపవచ్చి యిట్లు పలికెను. పురుషశ్రేష్ఠా! నేను మిగుల చిన్నచేపను. బలవంతమగు పెద్దచేపవలన నాకు బాధకలుగునను భయము కలుగుచున్నది. ఈ గొప్పమడుగునందు విశేషముగా మత్స్యములున్నవి. వానివలన నాకు అపాయములేకుండ నన్నెత్తుకొనిపోయి మరియొక జలప్రదేశమున నుంచుము. అట్లు చేసితివేని నేను నీకు ప్రత్యుపకారము చేసెదను. అని చేప వైవస్వతునితో చెప్పెను. ఆచేపమాటలకు వైవస్వతుడు ఆశ్చర్యమును పొంది చేపను ఎత్తుకొనిపోయి ఒక బావియందు విడిచి మాటిమాటికి ఆచేపను చూచుచుండెను. అంతట చేప బావియందుగల జలములలో నుండి క్రమముగా వృద్ధిబొందెను. ఒకనాడు ఆచేప వైవస్వత మనువుతో యిట్లనెను. మనువా! నీప్రయత్నమువలన నాశరీరము వృద్ధి బొందెను. ఇక నేనీ బావియందు సంచరించుటకు స్థలము చాలదు గనుక నన్ను మరియొక జలప్రదేశమునకు తీసికొనిపొమ్ము. అని చేప వైవస్వతునితో చెప్పెను. వైవస్వతుడా చేపనెత్తికొనిపోయి ఒక గొప్పబావియందు విడిచెను. ఆచేప ఎప్పటివలె వృద్ధిబొంది తనకా బావి చాలదని వైవస్వతునితో చెప్పెను. వైవస్వతుడా చేపనెత్తుకొనిపోయి గంగానది మడుగులో విడిచెను. అంతట ఆచేప కాలక్రమమున వృద్ధిబొంది మనువుతో యిట్లనెను. నేను తిరుగుటకు మడుగునందు స్థలముచాలదు. గాన నన్ను సముద్రములో విడువుము. అని చెప్పగా వైవస్వతుడా చేపను ఎత్తుకొనిపోయి సముద్రములో విడిచెను. అంత చేప వైవస్వతుడా! నాయందు నీకు కృపగలవాడవై నాకుపకారము చేసితివి. నేనును కృతజ్ఞుడనై నీవు ప్రత్యుపకారము

చేసెదను. నేను జెప్పుమాటలను వినుము. ఆలస్యము లేకయే సకల భూతములు ప్రళయము పొందును. సముద్రములన్నియు ఉప్పొంగి భయంకరముగా లోకములను ముంచును. ఇదియే మన్వంతర సంధి కాలమని పెద్దలు చెప్పుదురు. నీవు ఒక ఓడను నిర్మించుకొనుము. ఆఓడకు గట్టిత్రాడును కట్టియుంచుము. ఆఓడను దృఢముగా కట్టింపుము. సకల ధనధాన్యములను ఆఓడయందుంచుము. అందు సప్త మహాఋషులును నీవును ఎక్కి సముద్రములోనున్న నన్ను తలంపుము. నీవు దలచినప్పుడు నేను వచ్చి గొప్పపర్వతశిఖరమువంటి రూపముతో నీకు కనబడెదను. అప్పుడు నేను నీకు మేలుచేసెదను. అని ఆచేప వైవస్వతునితో చెప్పి వెళ్లెను. అప్పుడు వైవస్వతుడు చేప చెప్పిన ప్రకారము ఓడను నిర్మించుకొని సప్తమహాఋషులను చేర్చుకొని ఓడమీద ఎక్కెను. వైవస్వతుడు సముద్రమును దాటి చేపను దలచెను. వెంటనే మత్స్యము గొప్పపర్వత శిఖరమువలె ప్రకాశించెను. వైవస్వతుడు ఓడకు కట్టిన త్రాటిని శిఖరాగ్రమునకు తగిలించెను. చేప అద్భుత వేగముతో ఓడను మహాసముద్రము మధ్యకు యీడ్చెను. సముద్రములన్నియు ఒక్కపెట్టున ఉప్పొంగి సకల జగత్తులను ముంచెను. సముద్రము పొంగినప్పుడు మెల్లమెల్లగా చెలియలికట్టను దాటి భూములను తడుపుచు వ్యాపించెను. చేతులను ఐసరుచు ఆడునట్లు సముద్రముల అలలు ప్రకాశింపుచుండెను. సముద్రములోని నురుగు పకపక నవ్వుచున్నట్లుండెను. మహాసైన్యములు విజృంభించి లోకముల నాక్రమించియున్నట్లు సముద్రజలము లన్నిదిక్కులు వ్యాపించెను. సముద్రములు ప్రళయకాలమందు మహావాయువుచేత విశేషముగా ఉప్పొంగి జగత్తులను ముంచెను. ఈరీతిగా లోకమంతయు ఏకసముద్రమాయెను. ప్రళయకాలమందు ఆచేప అనేక సహస్ర సంవత్సరముల పర్యంతము మహాసముద్రమందు ఓడను త్రిప్పుచుండెను. అటు

పిమ్మట ఆమహాసముద్రజలములు అణగిపోవుటకు ప్రారంభించెను. అట్టిసమయమందు హిమవత్పర్వత సమీప శిఖరమందు ఆఓడనునిల్పి చేప ఆమునులతో యిట్లనెను. మునులారా! యీఓడను యీశిఖరమునకు కట్టుడు. అని చెప్పగా మునులందరును ఆ శిఖరమున కా ఓడను కట్టిరి. అందువలన ఆ శిఖరము నౌబంధమని చెప్పబడును. అంతట వైవస్వత మనువుతో కూడియున్న మునులను చూచి ఆచేప యిట్లనియె. మునులారా! మీకు యీ ప్రళయమందు అపాయము కలుగకుండునట్లు దయచేత మిమ్ములను రక్షించితిని. సకల ప్రపంచమునకును నేను ప్రథమకర్తను. నేను విష్ణుదేవుడను. నేను మత్స్యరూపమును పొంది యిన్నివిధములుగా ప్రవర్తించితిని. మీరు భయములేనివారై సంచరింపుచు ఈవైవస్వతమనువు దేవ, రాక్షస, మనుష్యరూపమైన సకలప్రపంచమునుసృష్టించును. నాఅనుగ్రహము వలన నీవైవస్వతమనువునకు పరమజ్ఞాన ముదయించును. అని యిట్లు చేప మహామునులతో చెప్పి అదృశ్యమయ్యెను. వైవస్వత మనువు మహాతపస్సుచేసి మనువై సకల చరాచర భూతములను సృష్టించెను, అని మార్కండేయుడు ధర్మరాజుతో చెప్పెను.

ధర్మరాజా! యీవైవస్వతుని చరిత్రమును మిక్కిలి భక్తిచే వినినను, చదివినను, వ్రాసినను మహాపాపములు నశించును. ఇహపరసౌఖ్యములు గలుగును. అని చెప్పిన మార్కండేయునకు ధర్మరాజు నమస్కరించి మహాత్మా! నీవు బ్రహ్మదేవునితో సమానుడవు. పరిపూర్ణమైన మహాతపఃప్రభావముగలవాడవు. నీమహాత్త్యముఆశ్చర్యమును కలిగించును. సకల దేవమునులచేత నమస్కరింపదగినవాడవు. సకలలోకములు నశించినను నీవు జీవించియుందువు. మరల జగత్తు పుట్టినప్పుడు నీ వా జగత్తులను చూచుచుందువు. చరాచరమైన సకలప్రపంచము సముద్రముచేత మునిగినప్పుడు బ్రహ్మదేవుడు

పర్ణమంపు పండుకొని నిద్రించును. బ్రహ్మదేవుని అట్టి స్థితిలో నీవు చూచితివి. సకలలోకములకు ప్రభుడగు శివుడు నీయందు దయగలిగి యింత ప్రభావమును నీకు కలిగించెను. ఆశివుని పాదములను నీవు స్మరించుటచేత నీకు సకలరోగ జరామరణములు నశించెను. సకల చరాచర ప్రపంచముల ఉత్పత్తి స్థితిలయప్రకారము లన్నియు అనేకపర్యాయములు ప్రత్యక్షములై యుండును గాన ప్రళయకాల మందు లోకము లేవిధముగా నుండునో నీవు చెప్పవలయునని ధర్మ రాజడుగగ మార్కండేయు డిట్లని చెప్పసాగెను.

## మార్కండేయుడు ధర్మరాజునకు ప్రళయప్రకారము జెప్పుట

ధర్మరాజా! మహాత్ముడగు కృష్ణదేవుడు శాశ్వతుడు. సకల భూతేశ్వరుడు. అవ్యయుడు. ఆదిదేవుడు. సకలజగత్తు పుట్టుటకు మూలకారకుడు. ఆదిమధ్యాంతము లను కాలపరిమితిలేనివాడు. ఆశ్చ ర్యకారణములైన పనులను జేయువాడు. మహాశౌర్యవంతుడు, సర్వ లోకగురుడు, నీకు యిష్టస్నేహితుడు, మంత్రి. పద్మములవంటి నేత్ర ములుగలవాడు. బంగారువర్ణమువంటి పచ్చని వస్త్రమును ధరించిన వాడు. పద్మమువంటి బొడ్డుగలవాడు. ఇంద్రనీలమణివంటి నల్లని దేహ కాంతిగలవాడు. దేవేంద్రాది దేవశ్రేష్ఠులచేత నమస్కరింపబడదగిన వాడు. అటువంటి కృష్ణుని తలచి అతని అనుజ్ఞనుపొంది నీకు జెప్పె దను. క్రమముగా వినుము. కృతయుగ త్రేతాయుగ ద్వాపరయుగ కలియుగములు నాలుగును చేరి ఒక మహాయుగమని చెప్పబడును. ఆ మహాయుగమునకు పన్నెండువేల దివ్యసంవత్సరము లుండును. (మున్నూటఅరువది మనుష్యసంవత్సరములు ఒక దివ్యసంవత్సరము) ఆ మహాయుగమునకు నలుబదిమూడులక్షల యిరువదివేల మనుష్య సంవత్సరము లుండును. అట్టి మహాయుగములు వేయిగల కాలపర్యం

తము బ్రహ్మదేవునకు దినమంతు పగటికాలమగును. అదియే ఒక దినమని చెప్పబడును. ఆదినమే ఒక కల్పమని యందురు. ఆకల్పాంతమందు నూరుసంవత్సరముల పర్యంతము వర్షము కురియక కరవు వచ్చును. ఆ సమయమున సూర్యుడు ఏడురూపములను ధరించి మిక్కిలి వేడి కిరణములచేత సకల నదీనదసముద్రజలముల లన్నిటిని పీల్చి లోకములను పరితపింప జేయుచుండును. ఆకల్పాంతమందు గొప్ప గాలికొట్టును. మహావాయువుచేత అగ్నిహోత్రము ప్రజ్వరిల్లి సకల పర్వత, దేవ, మనుష్య, సర్ప, రాక్షసమయములైన మూడులోకములును భస్మమగునట్లు నిమిషమాత్రములో దహించును. పిమ్మట నల్లని, పచ్చని, ఎఱ్ఱని, చిత్రవర్ణములు గల మేఘములు అంతటను పుట్టును. ఆమేఘములు మెత్తగానుండును. విశేషములైన మెఱుపులను గలిగియుండును. గొప్ప పర్వతములవంటి ఆకారములు కలిగి భయంకరముగా ధ్వనించుచు పిడుగులను పడవేయును. ఆమేఘముల వలన మహావర్షములు కురియును. ఆవర్షజలమువలన అగ్నిహోత్రములు చల్లారును. మరియు నదనదీసముద్రము లన్నియు ఎప్పటివలె జలములచేత పరిపూర్ణమై యుండును.

మేఘములు విచిత్రముగా మహావర్షములు సర్వదా గురియుచు భయంకరముగా ఉరుముచు భూమి యంతయు వర్షజలములలో ముంపుచు పిమ్మట మిక్కిలి దట్టమగు చీకటి వ్యాప్తమగును. ఆ చీకటివలన యిది భూమి, యిది ఆకాశము అను వివేకము శూన్యమగును. మూడులోకములును చీకటిచే నిండియుండ బ్రహ్మదేవుని ప్రేరేపణచేత మహావాయువు చెలరేగి భయంకరముగా విసరుటచేత ప్రళయకాలమేఘము లన్నియు చెదరి నశించును. బ్రహ్మదేవుడా వాయువును భక్షించి భయంకరమైన జలమునందు గల పద్మముల మీాద పండుకొని సుఖనిద్రను పొందును. ఈ ప్రకారముగా కల్ప

ప్రళయమగును. ధర్మరాజా! యిట్టి వనేకములు మున్నే జరిగెను. అనేకము లింకను జరుగగలవు. గడచిన కల్పప్రళయమందు జరిగిన విషయమును చెప్పెదనువినుము. గడచిన కల్పప్రళయమందు మూడు లోకములు నశించి గాఢాంధకారము కలిగెను. అందు నే నెద్దియును గానక అధికభయముతో ఒక్కడనే బహుకాలము తిరుగుచుంటిని. ఆ జలమధ్యమునందు ఒకసారి ఒక గొప్ప మఱ్ఱిచెట్టు నాకు కనబడెను. అది మిక్కిలి ఎత్తుగానుండెను. అందొక బాలుడు పండుకొనియుండెను. అతడు మనోహరమైన మేఘమువలె నల్లని దేహకాంతితో చంద్రబింబమువంటి ముఖముతో సూర్యునివంటి తేజస్సుతో పరమానందముతో నుండుట నేను చూచి ఆశ్చర్యమును బొంది నా మనంబున యిట్లని తలంచితిని. లోకములన్నియు కల్పప్రళయమందు నశించెను. ఇప్పుడు అంతటను ఏకసముద్రముగానున్నది. ఇందు యీ బాలుడు ఒంటరిగా నిద్రించుచున్నాడు. ఈ బాలుడెవరో తెలియుట లేదు. అని తలంచి వానిదగ్గరకు పోగా నాతడు తెల్ల తామర రేకుల బోలు తన రెండు నేత్రములను తెరచి నన్నుజూచి గంభీరమాధుర్య ధ్వనితో నాతో యిట్లనెను. పురుషశ్రేష్ఠా! నీవు మిక్కిలి యలసితివి. నీవు కొంచెము శ్రమదీర్చుకొనవలచితివేని నా దేహములో నీవు ప్రవేశించి సుఖముగా పండుకొనుము. అని చెప్పి బాలుడు తననోటిని తెరచెను. నేను బలాత్కారముగా బాలుని నోటిలోదూరి కంఠ మార్గముద్వారా వాని కడుపులోనికి దిగిపోగా అతని గర్భమందు గంగాది సకలనదులును మేరుపర్వతము మొదలగు సకలపర్వతములును, సముద్రములును, పట్టణములును, వనములును, ద్వీపములును, దేశములును, కర్మప్రజలును, సకలపక్షులును, సమస్తమృగములును, సర్వసర్పములును, అనేకపశువులును, గల భూచక్రమంతయు గలదు. మరియు సూర్యచంద్రనక్షత్రాదులచే ప్రకాశించు ఆకాశ

మును వాయుసంచారమార్గములును, దేవేంద్రవరుణ యమధర్మ రాజులతో గూడిన సర్వలోకమును, మహాసర్పయక్షరాక్షస అసుర విద్యాధర కిన్నరకింపురుషాదుల నందరను చూచితిని. వేయేల ! ఆ బాలుని గర్భమందు సమస్తలోకములను చూచుచు నూరుసంవత్సర ముల పర్యంతము కాలు నిలువక ఆ బాలుని గర్భమందే తిరుగు చుంటిని. నాచిత్తము మిక్కిలి భయభ్రాంత మాయెను. గర్భమం దుండియే కపటబాలుని పాదకమలములను స్మరించితిని. అంత నాతడు కరుణించి తన నోటియందు గల వాయువుచేత తన నోటినుండి బయ టకు రప్పించెను. తిరిగి మఱ్ఱియాకుమీద పండుకొన్న బాలుని జూచి తిని. ఆ బాలుడు చిఱునవ్వునవ్వుచు మునీంద్రా ! నీవు నాగర్భమందు ప్రవేశించి శ్రమతీరునట్లు విశ్రమించితివిగదా అని బాలుడడుగగా నేను సంతోషముతో వానిదగ్గరకుపోయి వానిపాదములను శిరస్సున నుంచు కొంటిని. బాలునిపాదములు వ్రేళ్ళు ఎఱ్ఱతామరలవలె ఎఱ్ఱగానుండెను. పాదములు లేతచిగురుటాకులవలె మెత్తగానుండెను. నేనా పాదము లకు నమస్కరించి పాదములను శిరస్సున నుంచుకొని బాలునితో నిట్లంటిని. దేవా ! నీకృపవలన సకలచరాచర ప్రపంచము నంతను నీ గర్భమందు జూచితిని. సకలలోకములును, సర్వభూతములును నీ గర్భ మందున్నవి. నీమాయాప్రభావమును భావించుటకు నే నసమర్థుడను. లోకము లన్నిటికి. ప్రళయముగలిగి ఏకసముద్రమై నుండగా నేను చూచి ఆశ్చర్యమును పొందితిని. ఆ మహాసముద్రమందు మఱ్ఱిచెట్టును ఆ యాకున నీవు పాన్పుపై పండుకొనుటయు గర్భమున యొకప్రక్క సప్తలోకములును ప్రకాశించుటయు నేను చూచితిని. నీవు బాలు డవై కనబడుచున్నావుగాని, అన్నిటిని జూడగా నా మనస్సునకు భయము గలుగుచున్నదిగాని కొంచెమైనను సుఖము గలుగలేదు. నేను నిన్ను ఆశ్రయించుట నిశ్చయమైనచో నాయందు నీకు గల

దయను జూపి ఆదరణవాక్యములను చెప్పి నామోహమును పోగొట్టి నాయందనుగ్రహముగలవాడవై నేను సుఖినైయుండు విషయము నావతిమ్ము. అని నేనాబాలుని వేడుకొంటిని. అంత నా బాలుడైన నారాయణమూర్తి నాయందు దయగలవాడై యిట్లు చెప్పసాగెను.

## నారాయణుడు మార్కండేయునకు తన ప్రభావమును చెప్పుట

మునీంద్రా! దేవతలు మునులు నా మహిమను యెఱుగజాలరు. నీవు మహాబుద్ధిమంతుడవు. మహాపుణ్యాత్ముడవు. పితృభక్తి గలవాడవు గాన నీవు నామహిమనునిను చెప్పెదను. మునీంద్రా! జలములు, నారములని చెప్పబడును ఆయనమునగా నివాసస్థానము. నారములు నాకునివాసమగుటవలన నన్ను నారాయణుడందురు. ఆ పేరుతోనే నేను వేదములయందు చెప్పబడుదును. సర్వలోక ప్రభుడనై శాశ్వతుడనై ఆనామముచేత ప్రకాశించుచు క్రమముగా సర్వలోకములను సృష్టించుచు రక్షించుచు, సంహరించుచు, సత్య, జ్ఞానానంద స్వరూపుడనై సర్వలోకములు నశించినను నేనునిర్వికారుడనై నశింపక బ్రహ్మశివ దేవేంద్ర వరుణదేవ కుబేర యమధర్మరాజాది దేవశ్రేష్ఠులు నన్నాశ్రయింప విశ్వరూపుడనై భూమి పాదమును, అగ్నిహోత్రము ముఖమును, సూర్యచంద్రులిద్దరును నేత్రములును, ఆకాశము దేహముగా అద్భుతరూపమునుగలిగి అపరిమితమైన దక్షిణపూర్వకముగా మహాయజ్ఞ సమూహములనుజేసి బుద్ధిమంతులగు బ్రాహ్మణులు వ్రతనియమములచేత నన్నుపాసింపగా క్షత్రియులు, సుగుణవంతులగు వైశ్యులు మహాయజ్ఞక్రియలను చేయుచు భక్తిపూర్వకముగా నన్నుగొలువగా విరాజిల్లుచుందును. మునీంద్రా! పూర్వము భూచక్రమంతయు సముద్రమందు మునిగియుండ నేను వరాహరూపమును ధరించి భూమిని యెత్తితిని. శేష

మను సర్పరూపమునుధరించి అనేకములగు పడగలచేత భూమినంతను మోయుచుందును. నేను బడబాగ్నిరూపమును ధరించి సముద్రములో నుండి సప్తసముద్రజలమును త్రాగుదును. సప్తలోకములు ప్రళయము వచ్చినపుడు త్రాగినజలములను విడిచి ఏకసముద్రముగా చేయుదును. నాముఖమువలన బ్రాహ్మణవర్ణమును సృష్టింతును. నాభుజములవలన క్షత్రియవర్ణమును సృజింతును. నాతొడలవలన వైశ్యవర్ణమును పుట్టింతును. నాపాదములవలన శూద్రవర్ణమును సృష్టింతును. నాలుగువర్ణములు ప్రతియుగాదియందును నేను సృష్టింపుచుందును. నాముఖములోనుండు ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణవేదములను పుట్టును. పుట్టినవన్నియు ప్రళయకాలమందు నాలోనే జేరగలవు. మహామునులు అహంకారరహితులై క్రోధము, అసూయ మొదలగు గుణములు లేనివారై, నిస్సంగులై వేదాంతశాస్త్రమునుచదివి మహాశాంతవంతులై మోక్షాపేక్షచేత సర్వదా నన్ను కొలుచుచుందురు. సకల నక్షత్రములు అంగారకాది గ్రహములు ఆకాశ, వాయుదిక్కులు మొదలగున వన్నియు నాస్వరూపములే. సకలసముద్రములను పాన్పుగ జేసి వానియందు సర్వదానేను యోగనిద్రను జెందుదును. దానము, సత్యము, తపస్సు జ్ఞానము. అహింస అను యీ అయిదును సాత్వికగుణము లందురు. కామ క్రోధాదులన్నియు రాజస తామసగుణములని చెప్పుదురు. సర్వగుణములు నాయంశములేయని తెలుసుకొనుము. మునీంద్రా ! విశేషించి చెప్పుటవ్యర్థము. ముఖ్యమగుమాటలను చెప్పెదనువినుము. ప్రపంచమందుగల పదార్థములు. లేనిపదార్థములుగూడ నాస్వరూపములేయని తలంచవలెను. సర్వము నేనేయని మనస్సున నూహింపుము. లోకమందు వైదికధర్మము నశించునప్పుడును అధర్మము అధికమైనప్పుడును రాక్షసులు క్రూరులై వర్ధిల్లినప్పుడును దేవతలు

హీనస్థితిని బొందినప్పుడును నేను మంచికులమునబుట్టుదును. అట్లు పుట్టి ఎప్పటివలె దేవతలను ధర్మబుద్ధిలోనిల్పి వారికి నభివృద్ధిని కలిగించెదను. నేను కృతయుగమందు తెల్లనిరూపమును, త్రేతాయుగమున ఎఱ్ఱనిరూపమును, ద్వాపరమున నల్లనిరూపమును పొందుదును. ఇట్లు ఆయాయుగములయందు ఆయారూపములనుపొంది ప్రవర్తించి వైదికధర్మమును స్థాపించుచుందును. కలియుగమందు పచ్చనిరూపమును పొందుదును. సృష్టికాలమందు కాలచక్రమును సర్వోకల్పముగా ప్రవర్తించునట్లుల చేయుదును. ప్రళయకాలమున రౌద్రాకారుడనై, భయంకరముగా సకలలోకములను సంహరింపుచున్నాను మునీంద్రా నాప్రభావ ప్రకారమంతయు నీకిప్పుడు చెప్పితిని. సర్వలోకములను సృష్టించు బ్రహ్మదేవుడు నా దేహమువలన పుట్టిన కుమారుడు. అతడు నాలోసగము అంశను పొందును.

నేను నారాయణుడనుపేరుతో బాలరూపమును ధరించి శంఖ చక్ర గదాధారుడనై యీసముద్రమందు పండుకొని యుందును. వేయిమహాయుగముల పిమ్మట యోగనిద్రనుండి లేచెదను. అంత కల్పప్రళయము వేయిమహాయుగములుండును. ఇట్టిమహాభయంకర ప్రళయమునుజూచి భయపడి నీవు నన్ను ఆశ్రయింప నీభయమును నే నెరిగి నీయందనుగ్రహముచే నాయందణగియున్న సకలలోకములను నీకుజూపితిని. నీవు నిస్సంశయ బుద్ధితో నీయిష్టమగుచోట సంచరింపుము. నా నాభికమలమందు బ్రహ్మదేవుడు పండుకొని నిద్రింపుచున్నాడు. ప్రళయము నశించినపిమ్మట మేలుకొని మరల లోకములను సృష్టించును. అది నీవుచూచెదవు. అని నారాయణమూర్తియగు విష్ణుదేవుడు నాతోఆనతిచ్చి అంతర్ధానుడాయెను. అని మార్కండేయ మునీంద్రుడు ధర్మరాజుతో చెప్పి రాజా ! యిదియంతయు విచిత్రము. నాకు అనుభవగోచరము కల్పప్రళయమందు నాయందుగలదయచేత

నారాయణుడు నాకు కనపడును. అతడే యిప్పుడుకృష్ణావతారమును పొందియున్నాడు. ఆ కృష్ణుడుయీదినమందు యిక్కడ నాకు కనపడును. కృష్ణుడు నీకుజుట్టమై మంత్రియై మిత్రుడై యున్నాడు. కృష్ణుడు పుణ్యస్వరూపుడు. కృపాసముద్రుడు. అతనిని యిప్పుడు నేనుచూచితిని. నాపుణ్యములు పరిపక్వములై యిప్పుడు ప్రకాశించెను.

ధర్మరాజా! దేవదేవుండగు కృష్ణునికృపవలన నేను నిర్వికారుడనై దుఃఖములేని వాడనై యుందును. సకల దేవాదిభూతములన్నియు ప్రళయమునొందిన కాలమున కృష్ణునికృపవలన నేను నిర్వికారుడనై యుండునని తెలుసుకొనుము. ఈకృష్ణుని సన్నిధియందు నేనున్నందున నాకు కల్పప్రళయ క్రమము చెప్పదగిన బోధకలిగెను. పుణ్యపురుషుడైన కృష్ణుని శరణుపొందుము. అని మార్కండేయమునీంద్రుడు ధర్మరాజుతో చెప్పెను.

## మార్కండేయుడు ధర్మరాజునకు కలియుగధర్మములు జెప్పుట.

ధర్మరాజును అతనితమ్ములును స్తోత్రవాక్యములచేత కృష్ణుని స్తుతించి సంతోషమును కలిగించిరి. పిమ్మట మార్కండేయ మునీంద్రునిజూచి ధర్మరాజిట్లనెను. మహాత్మా! మార్కండేయమునీంద్రా! మీయనుగ్రహమునవలన అత్యాశ్చర్య కథనువిని పరమసంతోషమును పొందితిమి. కలియుగమునందు సకలధర్మలోపములు గలుగునని చెప్పుదురు. ఆ కలియుగమందుగల ధర్మప్రకారమును చెప్పుమని ధర్మరాజడుగగా మార్కండేయుడు ధర్మరాజా! కృతయుగమందు వైదికధర్మముతప్పక నాలుగుపాళ్ళు పరిపూర్ణముగా ప్రవర్తించెను. త్రేతాయుగమున మూడుపాళ్ళును, ద్వాపరయుగమున రెండుపాళ్ళును కలియుగమున ఒకపాలును ధర్మముప్రవర్తిల్లును. అందుచేత కలియుగమందు వైదికధర్మము మిక్కిలి దుర్లభము. ఒకపాలు కొంచె

ముగా ప్రవర్తించును. ఈ కలియుగమందుగల జనులప్రవర్తనమును సాకల్యముగా చెప్పెదను వినుము.

ధర్మరాజా! కలియుగమందు జనులకు సత్యప్రవర్తనముండదు. అందువలన జనులకు ఆయుర్దాయమును మిక్కిలి తగ్గిపోవును. ఆయువు తరుగుట వలన విద్యలుస్వల్పమగును అల్పవిద్యావంతులగుటవలన, జనులకు మోహమధికమగును. మోహమువలన లోభము కలుగును. లోభమువలన కామము కామమువలన క్రోధము, దానంజేసి వైరము అధికమగును. అందువలన సర్వజనులును ఒకరికొకరు బాధలుకలిగించుచుందురు. ఒకరాజ్ఞకొకరు లోబడకవర్ణసంకరముకలుగజేయుదురు. కలియుగమందు బ్రాహ్మణులు జప, నియమవేదాధ్యయనాది పుణ్య కర్మలను విడతురు. శూద్రులు గొప్పతపస్సు గలవారగుదురు. కలి యుగాంతమందు సకలదేశము లందును నానావిధవ్యాఘ్ర మృగసర్పా దులు, వ్యాపించియుండును. జనశూన్యములగు వనములు, రాజులేని రాజ్యములు, ధర్మహీనములైన ప్రజలుందురు. ద్రవిడ, ఆభీర, తురుష్క, బర్బర, పుళింద దేశజనులుసకలదేశములందు వ్యాపించి పాపరూపులై యుందురు. వారిదుర్మార్గ కార్యములచేత సకలదేశములు పాడగును. కలియుగమందు క్షత్రియులు, శూద్రప్రాయులై శూద్రకార్యములు చేయుచుందురు. వారికి శౌర్యలక్ష్మి తేజస్సులు అంతరించును. క్షత్రియులు అన్యోన్యవిరోధులై క్షత్రియత్వమును వీడుదురు కలి యుగమందు రసగంధాది వస్తువులయందు సారముతగ్గును. పైరులు స్వల్పముగా ఫలించును. పశువులపాడి తగ్గును. వృక్షములయందు పుష్పములు స్వల్పముగా నుండును. రాజులు ప్రజలవలన పన్నులధికముగా తీసుకొందురు. అందువలన ప్రజలకు భయము కలుగును. కలియుగమందు బ్రాహ్మణులు వర్తకముచేయుచు పైరులు పెట్టుచుందురు. కలియుగమందు పాషండమతశాస్త్రములు అధికముగా

వృద్ధిబొందును. వర్ణాశ్రమములన్నియు ఆ మతసంబంధములై యుండును. జనులు తమశరీరమును పోషించుకొనుచు అదియే పరమపురుషార్థమని తలచుచుందురు. పుణ్యఫలములు అలబ్ధములగును. తగిన కాలములందు వర్షములు కురియవు. ధాన్యములు పండునప్పుడు తాలుగింజలధికమై చెడిపోవును. కొనుట అమ్ముట లోనగు వర్తక వ్యవహారములయందు మోసమధికముగా నుండును. ఇండ్లయందే సొమ్ములను దొంగలుహరింతురు. సన్మార్గమందు ప్రవర్తించు జనులు కష్టములను పొందుచు లోకపీడితులగుదురు. సాధుజనులు అల్పాయుష్యవంతులగుదురు. పాపాత్ములగు జనులు దీర్ఘాయుస్సునుపొంది రోగములులేక ఐశ్వర్యవంతులగుదురు. కలియుగమందు పంటలధికముగా పండును. గొఱ్ఱెలపాడి అధికము. పురుషులకు బాటసారులు చుట్టములు, జనులు భయముతో భుజింతురు. పితృదేవతా కార్యములయందు కుత్సితులైన దేశకాలపాత్రములు లభించును. బ్రాహ్మణులు హేతుజ్ఞానవాదములు లేనివారై వేదములను దూషింపుచుందురు. యజ్ఞములును వ్రతనియమములను చేయక విడుతురు. కలియుగమందు బ్రాహ్మణులు దుర్మార్గులై పాపకర్మములను చేయుచుందురు. స్త్రీలధనములను జనులపహరింతురు. దుర్బలజనుల ధనమును గూడ హరింతురు. దీనులధనములను, బంధుజనుల ధనములను హరించుటయేకాక మిత్రమాతాపితృపుత్రులను గూడ చంపుటకు వెరవకుందురు.

అప్రయత్నముగా ఎప్పుడో ఒకసారి చేసిన పుణ్యకర్మమునకు పాపాత్ములగు జనులు అందరిచేతను పూజలనందుదురు. కలియుగమందు బ్రాహ్మణులు ధనహీనులై తమ ధనమును పోగొట్టుకొని పాపాత్ములవలన అవమానపూర్వకమైన వేతనములను గ్రహింపుచుందురు. రాజులు భూమిని పాలింపజాలక సాధువుల స్త్రీధనక్షేత్ర

ములను నపహరింతురు. రాజులకు పరస్పర విరోధముగలిగి నాశము గలుగు ఘోరయుద్ధములుజరుగును. కలియుగమందు పుత్రుడు తండ్రిని అవమానించును. భార్య భర్త నవమానించును. భార్యాభర్తలిరువురును ఒకరియం దొకరికి నచ్చక సర్వదా తమ యిష్టప్రకారము పరపురుష పరస్త్రీ సాంగత్యములను చేసి రమింపుచుందురు. దేవ క్రియ, పితృక్రియలు నడువవు. వేదార్థ ఉపదేశములు ప్రవర్తింపవు. మోహము, అజ్ఞానము జనులకు అధికముగా నుండును. లోకమంతయు పాపాత్ములచే నిండియుండును. కలియుగాంతమందు పదియారు వత్సరములే పరమాయుష్యముగా నుండును. స్త్రీలకు ఏడెనిమిది సంవత్సరములకే బిడ్డలుపుట్టుదురు. ద్రవ్యము లేనందున దాతలేక ఒకరింకొకరి ధనములను దొంగిలింతురు. వివేకులైనవారును క్రూరులై పాపములను చేయుదురు. అందరును అన్నమును విక్రయింతురు. బ్రాహ్మణులు వేదములను విక్రయింతురు. స్త్రీలు ధనమును తీసికొని పరపురుషులతో రమింతురు. శూద్రులు గర్వవంతులై, భయంకరులై ఏకీభవించి అందరిని చంపుదురు. అప్పుడు దిక్కులేక దీనులై నాలుగుదిక్కులకునుజనులుపారిపోవుదురు. దొంగలు ఆక్రమించి జనులను చంపుదురు. పాపగాములైనజనులు గ్రుక్కిన కాకులవలెచెదరిపోయి అడవులయందు ప్రవేశింతురు. వైదిక ధర్మములను శూద్రుడు చెప్పగా బ్రాహ్మణులు వినుచు వారిని సేవింపుచుందురు. బ్రాహ్మణులు నిందాపాత్రులై పాపకర్మాసక్తులై శూద్రసేవకులై యుందురు. దేవస్థానములు చెడిపోవును. బ్రాహ్మణుల ఆశ్రమములు పాడుపడును. పుణ్యస్థలములు మంచి వృక్షములు తీగెలు పుణ్యవనములు నాశము బొందును. స్త్రీలు చెడుమార్గమునందు ప్రవర్తించుదురు. జనులు కల్లు త్రాగుచుందురు. శిష్యుడు గురువును గౌరవింపడు. గురుడు శిష్యుని వంచించును. బంధుజనులు పరస్పరము విరోధులై యుందురు. కరు

వులు నిత్యము వచ్చుచుండును. జనుల కపరిమిత భయము కలుగు చుండును. ఈరీతిగా కలియుగమందు ధర్మరాజా! సకల ధర్మములు నశించును. జనులందరును తల్లడిల్లుదురు. పాపకార్యములు సర్వదా జరుగుచుండును. అనేకవిధములగు ఉత్పాతములు పుట్టును. దేశములు పట్టణములు క్రమముగా నాశము పొంది జనులందరును రక్షకుడు లేనివారై దుఃఖముచే బాధపడుచు పర్వత నదీసమీప భూముల యందు తిరుగుచుందురు.

## కలియుగమున విష్ణువు కల్కిరూపముచే ధర్మము ప్రతిష్ఠించునని చెప్పుట

ధర్మరాజా! కలియుగాంతమందు లోకప్రసిద్ధమగు శంబళ మను గ్రామముకలదు. ఆగ్రామమున విష్ణుయశుడను నొక బ్రాహ్మణోత్తము డుండును. అతనికివిష్ణుదేవుడు కల్కిరూపధారుడై పుట్టును. అతడు స్మరణమాత్రముచేతనే సకలవేదశాస్త్రములను గ్రహించెను. సకల శస్త్రాస్త్ర విశేషములను పొందును. కల్కిదేవుడు బ్రాహ్మణులను సహాయముగా దీసికొని తన దివ్యశక్తివలన భూమిని ఆక్రమించి సకల మ్లేచ్ఛులను చంపి వైదికధర్మమును నిలుపును. కల్కిదేవుడు అశ్వమేధయజ్ఞము చేయును. ఆయజ్ఞమందు సకల భూమిని బ్రాహ్మణులకు పంచియిచ్చును. కల్కిదేవుడు సార్వభౌముడగును. మహా తేజోవంతుడగును. అతడు మహాకీర్తివంతుడై ముసలితనమందు తపోవనమునకు వెళ్ళి తపస్సుచేయుచుండును. అతనిచేత ప్రతిష్ఠించ బడిన ధర్మమువలన బ్రాహ్మణవర్ణము లన్నియు మర్యాదతో ప్రవర్తింపగలవు. అంతట కృతయుగము వచ్చును. ఆ కృతయుగమందు సకలదేశములయందును ఉద్యానవనములందును. మనోహరములగు యజ్ఞశాలలును వనములును దేవాలయములును గలవు. బ్రాహ్మ

ణులు అనేకులు తపముజేయుచు సంకులముగా నుందురు. యజ్ఞములు చేయుటకు ద్రవ్యసంభారములు విశేషముగా గలిగియుండును. సర్వదా పైర్లు విశేషము ఫలించును. యీరీతిగా దేశములన్నియు ప్రకాశింపును. ఆ కాలములందు తగిన వర్షములు కురియుచుండును. ఆ కృతయుగమందు అంగారకాది గ్రహములకు వక్రగతి గలుగకుండును. నవగ్రహములు మిక్కిలి తేజస్సుగలిగి యుండును. అందువలన జనులకు ఆరోగ్య సౌఖ్యములు సంపూర్ణముగా గలిగియుండును. ధర్మరాజా! యీరీతిగా కృతయుగమందు ధర్మప్రవర్తనము పరిపూర్ణముగా గలిగియుండును. త్రేతాయుగ ద్వాపరయుగములందును ధర్మమే మిక్కిలి అధికముగా ప్రవర్తింపుచుండును. అట్టి యుగములందలి ధర్మమార్గములన్నియు నాకు ప్రత్యక్షసిద్ధములు. ఆయుగములందుగల కాలస్వభావములను అనేకములను నేను జూచితిని.

ధర్మరాజా! నీవడిగినప్రకారము యిదివరకు జరిగిన కాలస్వభావములను నీకు జెప్పితిని. ఇకను జరుగబోవు కాలస్వభావములను నీకు జెప్పితిని. ఇక నీకొక హితోపదేశమును జేసెదను. ధర్మరాజా! నీవు సర్వదా బ్రాహ్మణులకు మిక్కిలి మేలును కలిగించుచు వారిని సంతోషపరుచుము. వారు సంతోషించినయెడల సకల పుణ్యములు లభింపగలవు. నీవు సకల భూతములయందును దయగలిగి యుండుము. నీపుత్రులను నీవు పాలించునట్లుగా సకల భూతములయందును దయగలిగి యుండవలెను. గౌరవమగు నడకను నేర్చికొని ధర్మమార్గమున ప్రవర్తించుము. పాపకార్యములను జేయకుండుము. నీవు యెరుగక కొంచెము పాపము జేసినయెడల అందుకు తగిన ప్రాయశ్చిత్తమును వెంటనే జేసికొనుము. గర్వమును విడువుము. ప్రియమగు మాటలను జెప్పుచు సత్యవంతుడవై నియమము గలిగి వర్తింపుము. నీవు కాలస్వభావములను తెలిసికొని పరిపూర్ణ బ్రహ్మ

జ్ఞానమును పొందియుందువు. నీవు భరతవంశమందు పుట్టితివి-అందు వలన నీవు మిక్కిలి నిర్మల పుణ్యపురుషుడవు. నీవుపండితుడవగుదువు. నీకు బుద్ధిచెప్పవలసిన పనిలేదు. అయినను నీయందుగల ప్రేమచేత నీకు హితమును జెప్పితిని. అని మార్కండేయుడు ధర్మరాజుతో జెప్పెను. ఆ మాటలకు ధర్మరాజిట్లని చెప్పెను.

మహాత్మా! మార్కండేయమునీంద్రా! మీరు ఆనతిచ్చిన వాక్యముల నన్నిటిని చక్కగా వింటిని. నా శక్తివంచనలేక లోభ మాత్సర్యాదిగుణములను విడిచితిని. మీ యానతిప్రకారము ధర్మ మార్గమందు వర్తింతును. మీయాజ్ఞను నా తలదాల్తును. అని ధర్మ రాజు మార్కండేయునికిజెప్పి సాగిలపడి నమస్కరించి మహాత్మా! మునీంద్రా! బ్రాహ్మణప్రభావమింకను వినవలెనని నాకు కుతూహల ముగానున్నది. చెప్పవేయని ప్రార్థింపగా మార్కండేయుడు ధర్మరాజు నకు బ్రాహ్మణప్రభావమును దెలుపు ఒక యితిహాసమును చెప్ప దలంచి యిట్లనెను.

## మార్కండేయుడు ధర్మరాజునకు బ్రాహ్మణప్రభావమును జెప్పుట

ధర్మరాజా! వినుము పూర్వము పరీక్షితుడను రాజుకలడు. అతడు సూర్యునితో సమానమగు తేజస్సుగలవాడు. సూర్యవంశమందు బుట్టినరాజు మహాకీర్తివంతుడు. ఆపరీక్షిత్తు అయోధ్యాపట్టణమున రాజ్యపాలనమును జేయుచుండెను. అత డొకనాడు వేటనిమిత్తమై అడ వికివెళ్ళి ఒక్కడే తిరుగుచు మహావేగముగానడచు గుఱ్ఱము నెక్కెను. పరీక్షితు డీరీతిగా మృగముల ననేకములను చంపుచు వనమందు తిరుగు చుండగా వనములో నొకచోట యొకస్త్రీ కనబడెను. ఆమె పుష్ప ములను కోయుచుండెను. దానిని జూచి దగ్గరకు బోయి యామె సౌందర్యమును జూచుచుండెను. పరీక్షితు డధికకామము గలవాడై

మన్మథబాణములచేత పరితపింపబడెను ఆమెయు పరీక్షితుని సౌంద ర్యమును జూచి మెచ్చి ఆతనియం దపేక్షతో నున్నట్లు తనచూపు చేత తెలిపెను. అంతట పరీక్షితుడు స్త్రీతో యిట్లనెను. చిన్నదానా! నీ వెవ్వరిదానవు ? యీవనభూమియందు నీవొంటరిగా నుండుటకు కారణమేమి అని పరీక్షితుడడుగగా ఆవనిత మహారాజా! నా తండ్రి యాజ్ఞానుసారినై యీవనమందు తిరుగుచున్నాను? నేను కన్యకను. మంచివరుని గోరుచున్నాను. నే నెవ్వరిదాననుగానుండవలయును. అని పలికిన నాజాణ మాటలకు పరీక్షితుడు మిక్కిలి కామమోహము గలవాడై తనయభిప్రాయము నామెకు తెలిపెను. అంత నాకాంత రాజా! నన్ను ఎప్పుడును జలక్రీడలాడ నియమింపవలదు. ఇందుకు నీవు సమ్మతించితివేని నిన్ను నేను భర్తనుగా వరియింతును. అని బల్కిన నాపడతుకు పరీక్షితు డంగీకరించి యామెను తీసికొని అయోధ్యాపురమునకు వెళ్ళెను. అంత పరీక్షితు ఆమెతో కామభోగ ములను అనుభవించుచుండెను. అంతట శరత్కాలమం దొకానొక నాడు పరీక్షితు డుద్యానవనములందు విహరించుచుండెను. అందు నిమిత్తమై గృహములు కట్టించెను. ఆవనములయందు పుష్పములును ఫలములును వృక్షములును నిండియుండెను. మనోహరములగు పుష్ప ములుగల తీగలును పొదలును గలవు. అనేకసరస్సులు గలవు. అట్టి వనములందు సంచరించుటకై తనభార్య మొదలగు స్త్రీలతో అనేక దినము లావనమున విహరింపుచుండెను. ఒకనాడు పరీక్షితుడు తన భార్యతో గూడియుండగా అతని శరీరమంతయు చెమటచే నిండి యుండెను. అంత నాతడు భార్యాసమేతుడై గృహమునుండి బయ టకువచ్చెను. ఆగృహసమీపమున ఒక సరస్సుకలదు. ఆ సరస్తీర మందు తన భార్యనుంచి పరీక్షితుడు సరస్సులో స్నానమాడెను. పిమ్మట తన భార్యతో దేవి! యీసరస్సున గల జలములు పవిత్ర

ములు. నీదేహమందుగల చెమటపోవునట్లు యిందు స్నానమాడుము. అని చెప్పగా ఆమె నవ్వుచు ఆ మడుగులో మునిగి మాయమై పోయెను. పరీక్షితు డంతుల కాశ్చర్యమును జెంది ఆసరస్సునం దెంత వెదకినను కనుబడలేదు. అందువలన పరీక్షితు డా మడుగులోని జల ముల నన్నిటిని బయట చల్లించివైచెను. ఆసరస్సున కడుగునకప్పలు మాత్రముండెను. అంత పరీక్షితు డిట్లని తలంచెను. ఈ కప్పలు నాప్రియభార్యను మ్రింగియుండవచ్చును. లేనియెడల నామడుగునందు నాభార్య కనపడకపోవుటకు కారణమేమి? అని పరీక్షితుడు తలంచి కోపించుకొని తన పరిచారకులను పిలిచి యిట్లనెను.

ఓయీ! సేవకులారా! మీరు యీ కప్పలనన్నిటిని చంపి వేయుడు. ఇది నాయుష్టము అని బలికిన బరీక్షితుని మాటప్రకారము పరిచారకులు నాల్గుదిక్కులను మడువులోగల కప్పలనన్నిటిని చంపిరి. ఇట్లు చంపినవన్నియు కుప్పలుకుప్పలుగా పడవేసిరి. అదిచూచి ఆయువు అను పేరుగల కప్పలనాయకుడు వచ్చి పరీక్షితుతో యిట్ల నెను. రాజా! లోకమందు గల కప్పలనన్నిటిని చంపించుచున్నావు. దీనివలన నీకు గల లాభమేమియో తెలియకున్నది. నీవు కోపమును విడువుము. శాంతదృష్టితో కప్పలను జూడుము. కప్పలను జంపుట అధర్మము. అందువలన కప్పలను జంపుటమానుము. అని కప్పల నాయకుడుచెప్పగా, పరీక్షితుడు కప్పలనాయకుడా! నీవు చెప్పుమాట నాకు రుచింపలేదు. నామనస్సునకు కప్పలు కష్టముకలిగించినవి. నా ప్రియభార్య నీకప్పలు మ్రింగినవి. ఇవి మాయాస్వరూపములగు పురు గులు, మేమీకప్పలను చంపుదుము. నీవు వెళ్ళుము. అని పరీక్షితుడు చెప్పగా కప్పలనాయకుడు మిక్కిలి దుఃఖించి నేను కప్పలనాయకు డను. నాపేరు ఆయువు, నీభార్య నాకూతురు. ఆమెపేరు సుశోభ. సుశోభచేత యిదివరకు అనేకులు యీరీతిగనే మోసపోయిరి. నీవు

మోసపోవుటలో ఆశ్చర్యములేదు. అని చెప్పగా పరీక్షితుడు ఆ మునివా! అట్లైనయెడల ఆమెను తెచ్చి నాకిమ్ము. అని పలుకగా కప్పలనాయకుడు నవ్వుచు తన తలంపుచే నా సుశోభను రప్పించి పరీక్షితున కిచ్చెను. మరియు నామెనుజూచి కోపించి సుశోభా! నీవు మిగుల చెడ్డదానవు. ప్రఖ్యాతులగు రాజులను అనేకులను కష్టపెట్టితివి గాన నీకు పుట్టగల పుత్రులు కపటవంతు లగుదురుగాక యని శపించి తన యిష్టప్రకారము వెళ్ళెను. పిమ్మట పరీక్షితుడు తన భార్యయగు సుశోభను గ్రహించివెడలెను. కొంతకాలమునకు పిమ్మట పరీక్షితునకు సుశోభయను భార్యయందు శలుడు, తలుడు, వలుడు, అను పేర్లుగల ముగ్గురుపుత్రులు పుట్టిరి. పరీక్షితుడు తన పెద్దకొడుకైన శలునకు రాజ్యాభిషేకముచేసి తాను తపోవనమునకు వెళ్ళెను. శలుడు రాజ్యముచేయుచు బంగారుమయమైన రథమెక్కి అడవికి వెళ్ళి వేటాడుచు అనేక మృగములను చంపెను. అప్పుడొక మృగముమీద బాణమువేయగా ఆదెబ్బతగిలి మృగము చావక పారిపోయెను. ఆ వెనుకనే శలుడు వెన్నంటి మృగమును పట్టజాలక తన సారథిని తిట్టి శీఘ్రముగా రథము తోలుమని చెప్పెను. సారథి శలరాజా! మన మెంత వడిగాపోయినను మృగము మనకంటె మిక్కిలి వేగముగా నడచుచున్నది. గాన మన మామృగమును పట్టజాలము. మన గుఱ్ఱములు దానితో సమానముగా పరుగెత్తజాలవు. అందువలన మన రథములకు ఆడుగుఱ్ఱములను కట్టినయెడల మనము శీఘ్రముగా వెళ్ళి ఆమృగములను పట్టుకొనవచ్చును. లేనియెడల మన మామృగము చూడజాలము. అని సారథి చెప్పగా శలుడు సారథీ! ఆడుగుఱ్ఱములు ఎవనికి గలవో చెప్పినయెడల వానిని తెప్పించెదను. అని చెప్పగా సారథి శలరాజా! వామదేవ మహామునీంద్రునకు ఆడుగుఱ్ఱములు కలవని వినియుంటిని. అవి వామ్యములని చెప్పబడును మిక్కిలి వేగ

ముగా నడచును అని చెప్పగా సారథీ! వాసుదేవుని యాశ్రమ మెక్కడో యక్కడికే యిప్పుడే మన రథమును పోనిమ్మని శలుడు చెప్పగా సారథి మిక్కిలి వేగముగా రథము వాసుదేవుని ఆశ్రమము వద్దకు తోలెను. అప్పుడు శలరాజు వాసుదేవుని జూచి నమస్కరించి మహాత్మా! మృగమొకటి నాచేత దెబ్బతిని వేగముగా పరుగెత్తి పోయెను. దాని నిప్పుడు చంపవలయును. నీగుఱ్ఱముల నిచ్చినయెడల నారథమునకుపూన్చి వెళ్ళి మృగమును చంపెదను. అని శలరాజువాసుదేవునితో చెప్పెను. వాసుదేవుడు తన గుఱ్ఱములనిచ్చి రాజా! యీ గుఱ్ఱములను నీవు తీసికొనివెళ్ళి నీకార్యమును అనుకూలము చేసికొని మరల నా గుఱ్ఱములను తెచ్చి నాకు వప్పగింపవలయును. ఆలస్యము చేయవద్దు. అని చెప్పగా చేసెదనని శలుడుచెప్పి ఆ గుఱ్ఱములను రథమునకు పూన్పించివెళ్ళెను. అప్పుడా గుఱ్ఱములు వాయువేగము కంటె అధిక వేగముగా నడచుచుండెను. ఆవేగమునకు శలుడుమెచ్చుచు ఒక ముహూర్తమాత్రమున మృగమును చూచి చంపెను. పిమ్మట శలరాజుముని గుఱ్ఱములను పూన్చిన రథమును తోలుకొని తన పట్టణమునకు వెళ్ళెను. శలుడు సారథితో యిట్లనెను. సారథీ! వామ్యములను గుఱ్ఱములు మిక్కిలి శ్రేష్ఠములు. బలవేగములుగలవి. ఇట్టివి రాజులదగ్గర నుండవలసినవే కాని బాపల కుపయోగింపవు గాన గుఱ్ఱములను గుఱ్ఱపుశాలలో కట్టివేయుమని శలరాజు రాజస బుద్ధిగలవాడై తన సారథితో చెప్పి పంపించెను. ధర్మరాజా! ఆశ గలవాడు దోషము నెరుగడు. వామదేవుడు తన మనంబున ఆహా! శలరాజు నాగుఱ్ఱములను తీసికొనిపోయెను. మరల గుఱ్ఱములను తెచ్చి వప్పగించలేదు. ఆలస్యముచేసెను. అతడు బలవంతుడు, దుర్మార్గుడు, తెచ్చియిచ్చెదనని చెప్పి యివ్వకుండెను. అని మనంబున దలంచి శంకించి శిష్యుడగు ఆత్రేయుని జూచి శిష్యా! శలరాజు మన ఆశు

గుఱ్ఱములను దీసికొనిపోయి ఒకమాసమాయెను, అతఁడు తనంతట తానే మన గుఱ్ఱములను మన కీయఁడు. గాన నీ విప్పుడు వెళ్ళి రాజు నడిగి మనగుఱ్ఱములను దీసికొనిరమ్ము. అనిచెప్పిపంపించెను. ఆత్రేయు డయోధ్యాపట్టణమునకు వెళ్ళి శలరాజును జూచి రాజా! వామదేవ మునీంద్రుఁడు మా గుఱ్ఱములను నిన్నడిగి తీసికొనిరమ్మని పంపగా యిక్కడికి నేనువచ్చితిని. అని చెప్పగా శలుఁడిట్లనెను. బాపడా! వామదేవుఁడు నిన్నిక్కడికి పంపుటకును నీవు గుఱ్ఱములను తీసికొని పోవుటకును కూడ సమర్థులు. ఇట్టిమాటలను చెప్పక వెంటనే వెళ్ళి పొమ్ము. అని మహాహంకారముతో పలికెను. వెంటనే ఆత్రేయు డయోధ్యాపట్టణమునుండి బయలుదేరి వెళ్ళి శలుఁడు చెప్పినమాటల నన్నిటిని వామదేవునితో చెప్పెను. అప్పుడు వామదేవుఁడు మిక్కిలి కోపముతో శలునిదగ్గరకువెళ్ళి రాజా! మాగుఱ్ఱములను మాకిమ్ము. మాగుఱ్ఱములవలన మీ కార్యము సానుకూలమైనది. దురాశచే యితరుల సొత్తులను కోరినయెడల సొత్తులు లభించవు. యెఱువుసొమ్ము స్థిరము కాజాలదు. పరులధనము లపహరించుటవలన పాపము కలుగును. పాపమువలన వరుణదేవుని పాశములచేత బంధింపబడుదువు. అది నీవాలోచించుము. భరించలేని అగ్నిజ్వాలా రూపమైన నరకమందు పడకుము. అని వామదేవమునీంద్రుఁడు చెప్పగా శలుఁడు యిట్లనెను.

## శలుఁడు వామదేవుని తిరస్కరించుట

మునీంద్రా! నీవు బాపడవు. బ్రాహ్మణులకు గుఱ్ఱములతో బనిలేదు. మహాబలముగల రెండుఎద్దులనిచ్చెదను. కానియెడల మహా బలముగల మరికొన్ని గుఱ్ఱముల నిచ్చెదను. తీసుకొనుముగాని నీవామ్యములైన గుఱ్ఱములను కోరకుము, అధికముగా మాట్లాడకుము

అని శలుడు చెప్పగా వామదేవుడు శలుడా! నీమాటలవలన ప్రయో జనములేదు. వినినవారు నవ్వుదురు. బ్రాహ్మణుల సొత్తులను తీసు కొని అందులకుబదులు ఇతరవస్తువుల నిచ్చెదనని చెప్పుచున్నావు. ఇదియేటిచందమో తెలియకున్నది. అనిచెప్పి కఠినముగా దూషించు చుమాటలాడెను. శలుడందులకుకోపించి తనభటులతో ఓరీ! మీరు ఈ బ్రాహ్మణుని పట్టుకొని త్రాళ్ళచేత కట్టివేసి శూలాయుధములతో చంపుడు. అని యాజ్ఞాపించెను. వామదేవుడు అదియంతయు చూచి మహారోషముగలవాడై భయంకరమగు పెద్దనవ్వు నవ్వి అగ్నిహోత్ర మువలె ప్రకాశించుచుండెను. అతనిని చూచుట కెవ్వరికిని సాధ్యము కాకుండెను. ఆ సమయమున వామదేవుని మహిమచేత భయంకరా కారులగు అనేకులగు రాక్షసులుపుట్టి తీక్ష్ణములైన శూలాయుధము లచేత శలరాజునుపొడిచి చంపిరి. వామదేవుడు తన యిష్టప్రకారము వెళ్ళెను. శలుని తమ్ముడగు తలుడు రాజ్యాభిషిక్తుడై అయోధ్యా పట్టణమందు సుఖముగానుండెను. కొంతకాలమునకు వామదేవు డయోధ్యకువచ్చి తలరాజుతో రాజా! నీవు ధర్మపురుషుడవు. నీవు ధర్మము తప్పని వాడవేని నా గుఱ్ఱముల రెంటిని నాకిమ్ము. అని చెప్పగా తలుడుకోపించి తనసమీపమునగల సారథితో ఓయీ! ఈ బాపడు మిగుల క్రొవ్వి నాతో మిగుల నిర్భయముగా మాటలాడు చున్నాడు. ఇతనిబొమ్మను చీల్చివేసెదను. నీవు వేగముగావెళ్ళి విష ముపూసిన బాణమును ధనస్సును తెమ్ము అనిచెప్పి పంపించెను అంత వామదేవుడు నవ్వుచు తలునితో ఓరీ! నామీదవేయుటకు నీవు తెమ్మనిన బాణము ఇప్పుడే నీ అంతఃపురమందు సుఖముగానున్న నీకొడుకును. చంపుగాకఅనిచెప్పెను. ఆక్షణమే ఆబాణముచేత తలుని కొడుకు చచ్చెను. అంతఃపురమందు హాహారవమను దుఃఖధ్వనులు చాల రేగెను. కొడుకుచచ్చుట యెఱిగి దగ్గరనున్న జనులతో యిట్లనెను.

జనులారా! ఇప్పుడే నాబాణములచేత ఈదుర్మార్గుని చంపెదను. ఇతనిరక్తములచేత ఈప్రాణిని తడిపెదను. అని బలుకుచు ఆక్షణమందే తలుడు ధనస్సును దీసికొని బాణమును సంధి పగా వామదేవుడు తన మహిమచేత తలుని రెండుచేతులనుధనుర్బాణములను స్తంభించునట్లు కదలకుండ జేసెను. తలరాజు ఆశ్చర్యమును బొందెను. అతనికోప గర్వమహంకారములన్నియు అణగిపోయెను. ముఖము వెల్లబోయెను. కొంతసేపటికి తలరాజు జనులతో యిట్లనెను. మహాజనులారా! దురహంకారముచేత నేనువ్యర్థములైన అనేకవాక్యములను బలికితిని. నాబాణశక్తి పూర్తిగానశించెను. బ్రాహ్మణ ప్రభావము మిక్కిలి అధికముగానున్నది. నేను మునీంద్రునకు ఓడిపోతిని. ఇతడు మహాకీర్తివంతుడు. శత్రువులను చంపగలడు గాన యితని నాశ్రయించెదను. అని చెప్పి తలుడా వామదేవునకు నమస్కరించెను. తలుని బంధుమిత్రులందరును వామదేవుని శరణుజొచ్చి కోపమునుమాన్పిరి. వామదేవు డనుగ్రహముగలవాడై తలునిచేతులకుగల స్తంభనమును మాన్పెను. తలుని పుత్రునిబ్రతికించెను. అంతట తలరాజు తనభార్యా సహితముగా వామదేవునికి నమస్కరించి వామ్యములను ఆడుగుఱ్ఱములను తెచ్చి ఆయనకిచ్చెను. వామదేవుడు తనగుఱ్ఱములను తీసుకొనివెళ్ళెను. ఈరీతిగా బ్రాహ్మణ ప్రభావమిట్టిదేయని మార్కండేయమునీంద్రుడు ధర్మరాజుతో జెప్పగా ధర్మరాజు మార్కండేయునికి నమస్కరించి మహాత్మా! వయస్సునందు మీకంటె వృద్ధుడైన వాడు లోకమందు గలడేమో చెప్పుడు అని యడుగగా మార్కండేయుడిట్లనెను.

## మార్కండేయుడు ధర్మరాజునకు ఇంద్రద్యుమ్న మహారాజు చరిత్రము చెప్పుట

ధర్మరాజా! పూర్వము ఇంద్రద్యుమ్నుడను ఒక మహారాజు గలడు. అతడు కాలవశమున దేహమువిడిచి ఇంద్రసభకు వెళ్ళి స్వర్గ

సుఖముల ననుభవించుచుండెను. బహుకాలమునకు అతనికీర్తి భూలోకమందు నశించెను. అంతట దేవత లింద్రద్యుమ్నునితో రాజా! నీకీర్తి భూలోకమందు నశించెను. గాన నీవీస్వర్గమందుండ జాలవు. అని చెప్పుచు నాతని భూమికి బడద్రోచిరి. అంత నాఇంద్ర ద్యుమ్నుడు నావద్దకువచ్చి మహాత్మా! మార్కండేయ మునీంద్రా! నేను ఇంద్రద్యుమ్నుడను మహారాజును. నన్ను నీ వెరుగుదువేమో చెప్పుము. అని అడుగగా నేనిట్లంటిని. మహారాజా! నేను నిన్నెరు గను. హిమవత్పర్వత శిఖరమందు ప్రవాళకుడను పేరుగల యొక గుడ్లగూబ యున్నది. ఆగుడ్లగూబ నాకంటె పెద్దది. నీవక్కడికి వెళ్ళిన అది నిన్ను నిర్ణయముగ యెరుగగలదు. అని పల్కిన ఇంద్ర ద్యుమ్నుడు నన్ను గూడ నమ్మని యడిగెను. అంతట నేనిట్లంటిని. మహారాజా! మునిమి రోగములను పోగొట్టగల రసాయనమను దివ్యౌషధమును తింటిని. ఆ దివ్యౌషధమువలన నా దేహ మందధిక తాపముగలదు. గాన నేనిచటనుండి కదలి రాజాలను. అని చెప్పగా ఇంద్రద్యుమ్న మహారాజు గుఱ్ఱమై నన్నెత్తుకొని హిమవత్పర్వతము నకు వెళ్ళి నన్నడిగినట్లే గుడ్లగూబనుగూడ యడిగెను. గుడ్లగూబయు కొంచెముసేపు యోచించి మహారాజా! నేను నిశ్చయముగా నిన్నె రుగను. ఇంద్రద్యుమ్నమను ఒక సరస్సుకలదు. అందు నాళీకజంఘు డను పేరుగల ఒక కొంగ నివసించుచుండెను. ఆ కొంగ నాకంటె పెద్దది. గాన అది నిన్నెరుగగలదు. నీ వా కొంగదగ్గఱకు వెళ్ళుము. అని గుడ్లగూబ ఇంద్రద్యుమ్నునితో జెప్పగా ఇంద్రద్యుమ్నుడు ఎప్పటి వలె గుఱ్ఱమై నన్ను గుడ్లగూబనుకూడ మోసికొని నాళీకజంఘుడను కొంగదగ్గరకు బోయెను. అచ్చట తనపేరు జెప్పి నన్నెరుగదువా యని కొంగనడిగెను. అంత కొంగ మహారాజా! నిన్ను నేనెరుగను. నాకంటె చిరకాలజీవియగు తాబేలుకలదు. దాని పేరు యుగంధరుడు.

ఆఇంద్రద్యుమ్న సరస్సునందు తాబేలు సర్వదా నివసించి యుండును. యుగంధరుడను తాబేలు నిన్నెరుగునేమో తెలియదు. అడిగి చూతము అని నాళీకజంఘుడను కొంగ ఇంద్రద్యుమ్ననితో జెప్పెను. ఆసరస్సునందుగల తాబేలు నుద్దేశించి మరియు నిట్లనెను. యుగంధరుడా! ఒక సందేహము గలదు. ఆనిర్ణయమును నీవే చేయవలయును. పెద్దలగువారు నీనిమిత్తమై ఇక్కడకు వచ్చియున్నారు. నీవు ఈసరస్సులోనుండి బయటికి రావలయును. అని కొంగ ప్రార్థింపగా తాబేలా సరస్సులోనుండి బయటికివచ్చెను. అంతట గుడ్లగూబ కొంగలు రెండును తాబేలుతో నిట్లనిరి. మహాత్మా! నీవు ఇంద్రద్యుమ్నుడను మహారాజు నెరుగుదువేమో చెప్పుము. ఆ విషయమై సందేహముగలిగి నిన్నడుగుటకు వచ్చితిమి. అని గుడ్లగూబ కొంగలు యడుగగా తాబేలు కొంతసేపు కన్నీరుగార్చుచు గద్గదకంఠముతో అయ్యా! మహాత్ములారా! ఇంద్రద్యుమ్న మహారాజు మహాత్ముడును, మహాగుణవంతుడును అగును. ఆతనిని నే నెరుగుదును. నే నిక్కడనుండగా అనేకపర్యాయములు శత్రుభయమునుండి ఆరాజు నన్ను రక్షించెను. మహారాజు, అతని నెప్పటికిని మరువరాదు. అతడు దక్షిణపూర్వకముగా అనేక యజ్ఞములను చేసెను. ఆయజ్ఞములం దనేక గోవుల గుంపులను బ్రాహ్మణులకు దానము చేసెను. ఆగోవుల కాలిగిట్టల నలుగుడిచేత ఇక్కడ ఈసరస్సు కలిగెను. అందుచేతనే ఈసరస్సునకు ఇంద్రద్యుమ్నమను పేరు గలిగెను. అని యుగంధరుడు గుడ్లగూబ కొంగలతో చెప్పెను. దేవదూతలు విమానమును తీసుకొనివచ్చి ఇంద్రద్యుమ్ననితో యిట్లనిరి. మహాత్మా! రాజా! నీకీర్తి జగత్తంతయు వ్యాప్తమై నిలిచెను. గాన నీకు స్వర్గలోకసుఖము స్థిరమైనది. గాన స్వర్గమునకురమ్ము. ఈవిమానము నెక్కుము. ఈలోకమున నీకుగల కీర్తి స్వర్గలోకమున పురుషునకు నివాసమేర్పరచును. అని చెప్పిన ఇంద్రదూతలకు ఇంద్రద్యుమ్నుడు. దూతలారా! మాతాతయగు మార్కండేయమునీంద్రుని కార్యార్థముగా ఇక్కడికి తీసుకొని వచ్చితిని. ఈముసలి గుడ్లగూబను నాకార్యార్థమై పిలుచు

కొని వచ్చితిని. గాన వీరిద్దరిని వారి వాసస్థానముల యందుంచి వచ్చెదను. మీరిట కొంతకాలము నిలిచియుండుడు అని ఈరీతిగా ఇంద్రద్యుమ్న మహారాజు దేవదూతతో జెప్పి వారి యనుమతిని బొంది పిమ్మట నన్నును కుడ్లగూబను మా మాస్థానములకు చేర్చెను. ధర్మరాజా! అంతట ఇంద్రద్యుమ్న మహారాజు దేవవిమానమెక్కి స్వర్గమునకు వెళ్ళెను.

## మార్కండేయుడు ధర్మరాజునకు కువలయాశ్వుని చరిత్ర జెప్పుట

మార్కండేయ మహామునీంద్రుడు ఈరీతిగా ధర్మరాజుతో జెప్పగా ధర్మరాజు సంతోషముతో మునీంద్రా! నీకంటె పెద్దవారగు మంచిగుణవంతులను తెల్పితివి. ఇది మిగుల యాశ్చర్యమును కల్గించుచున్నది. అని స్తుతించి మార్కండేయునికి నమస్కరించి మహాత్మా! ఇక్ష్వాకువంశమందు పుట్టిన కువలయాశ్వునకు దుందుమారుడను పేరెట్లు కలిగెనో చెప్పుము. అని ధర్మరాజడుగగా మార్కండేయు డిట్లనెను.

ధర్మరాజా! పూర్వము ఉదంకుడను ఒక మునీంద్రుడు కలడు. అతడు శివునితో సమానుడు. తపస్సముద్రుడు. అతడు జనసంచారములులేని ప్రదేశమందున నివసించి తన మనస్సున విష్ణుదేవుని తలచుచు అనేక సంవత్సరములు తపస్సు చేసెను. అంతట ఉదంకుని భక్తికి విష్ణుదేవుడు సంతోషించి ప్రత్యక్షమాయెను. ఉదంకమునీంద్రుడు విష్ణుదేవునిచూచి సంతోషించి నమస్కరించి స్తుతించెను. మహాత్మా! విష్ణుదేవా! నీవు దేవతలకు దేవతవు. శృతిప్రమాణములచేత తెలియదగిన పరబ్రహ్మవు. సకల విశ్వరూపుడవు. సర్వలోకములును నీమాయచేత కల్పించబడెను. నీవెప్పటికిని నాశము లేనివాడవు. సత్యజ్ఞానానంద స్వరూపుడవు. నిన్నెరిగిన మొదల సంసార బంధపాపము లన్నియు నశించును. సకలదేవసిద్ధముని పక్షిశ్రేష్ఠులు అందరును సర్వదా నిన్ను గొలుచుచు నీదయవలన కృతార్థులగుదురు. నీమనస్సునకు సంతోషము గలిగినప్పుడు సర్వలోకములును

శాంతమును బొందును. నీవు కోపించినయెడల సర్వలోకములు నశించును. నీవు మూడులోకములందును స్తుతింపబడుచు పుణ్యనామములను గలిగియున్నావు. నీవు త్రివిక్రమములచేత క్రమముగా మూడులోకములను ఆక్రమించితివి. నీ చక్రాయుధముచేత యుద్ధమునందు రాక్షసులను జంపితివి. సర్వయజ్ఞములందును నీవు ఫలక్రియా స్వరూపుడవు. నిశ్చలరూపుడవు. అని యీ ప్రకారముగా ఉదంకమునీంద్రుడు ప్రత్యక్షమైన విష్ణుదేవుని గురించి స్తోత్రముచేసెను. ఆ స్తోత్రమునకు విష్ణుదేవుడు సంతోషించి కరుణించి వరమడుగుమనెను. ఉదంక మునీంద్రు డిట్లనెను. ఓ భగవంతుడగు విష్ణుదేవా! నీ దివ్యరూపమును ప్రత్యక్షముగా జూచితిని. ఇంతకన్న వేరేమియు నాకు గావలసినది లేదు అయినను, నా మనస్సు సర్వదా సత్య ధర్మ శాంతముల యందు స్థిరముగా నుండవలయును. నీయందు దృఢమైన అచంచలమగు భక్తి యుండవలయును. ఇంతకన్న వేరే వరమేమియు నాకు అక్కరలేదు. యీ వరము నిమ్ము అని యడుగగా ఉదంకునకు విష్ణుదేవు డిట్లనెను.

ఉదంకమునీంద్రా! నీవుకోరిన ప్రకారము నీకు వరమిచ్చినాను. నాయనుగ్రహమువలన నీకు బ్రహ్మజ్ఞానయోగము సిద్ధించును. మూడులోకములకు హితమును కార్యమొకటి నీచే నాచరింపబడును. అదియేదియనగా చెప్పెదవినుము. ధుంధుడను పేరుగల ఒక రాక్షసుడు లోకములకు ఉపద్రవమును చేయుచుండును. బృహదశ్వుడను రాజు కలడు. అతనికి కువలయాశ్వుడను పుత్రుడు కలడు. ఆధుంధుని చంపుటకు కువలయాశ్వుడను రాజును నీవు ప్రోత్సహించెదవు. నీప్రోత్సాహము వలన కువలయాశ్వుడు ధుంధునిపై యుద్ధము చేయుటకు వెళ్ళును. కువలయాశ్వుడు నాయనుగ్రహమువలన యోగసిద్ధిని పొందినవాడగుటవలన ధుంధురాక్షసుని చంపుటకు సమర్థుడగును. ఆ కార్యమునకు నీవలన అందరును సంతోషింపగలరు. అని విష్ణుదేవు డుదంకునితో చెప్పి యంతర్ధానమొందెను. ఉదంకుడు యథారీతిని తపస్సు చేయుచుండెను. ఇక్ష్వాకు కులమందుబుట్టిన కువలయాశ్వుని వంశావ

తారక్రమమును జెప్పెదను వినుము. ధర్మరాజా! ఇక్ష్వాకుమహారాజు యీ భూచక్రమునంతను పాలింపుచుండెను. పిమ్మట కాలవశమున స్వర్గమును జేరెను. అతనిపుత్రుడగు శశాదుడు రాజ్యమేలెను. ఆశశాదునకు కకుత్స్థుడను కుమారుడు పుట్టెను. అతనికి వేనుడను కొడుకుపుట్టెను. వేనునకు పృథుడు కలిగెను. పృథునకు విశ్వకుడను పుత్రుడుపుట్టెను, విశ్వకునకు ఆర్ద్రియను పుత్రుడు కలడు. ఆర్ద్రినకు యువనాశ్వుడను కుమారుడు కలిగెను. ఆతనికి శాబస్తియను కుమారుడు కలిగెను. ఇతడే మాంధాతృడని తెలియగలరు. అతనికి బృహదశ్వుడను పుత్రుడు పుట్టెను. బృహదశ్వునకు తిరిగి కువలయాశ్వుడు జనించెను. ఆకువలయాశ్వునకు ఇరువదియొక వేలమంది కుమారులు పుట్టిరి. వారందరునుకూడ అధికవిద్యావంతులై మహాబలవంతులై యుండిరి. అంతట బృహదశ్వుడు పుత్రవంతుడైన తనకొడుకును పట్టాభిషేకము చేసి తాను తపోవనమునకు బోవుటకు సిద్ధపడెను. ఆ సమాచారము నుదంకుడు తెలిసికొని బృహదశ్వునితో యిట్లనెను. రాజా! బృహదశ్వా! నీవు రాజ్యపాలనము చేయుము. అరణ్యమునకు పోవలదు. రాజులగువారు ప్రజాపాలనము చేసినయెడల పుణ్యవంతులగుదురు. రాజులకంటెకన్న పుణ్యకార్యమేదియు లేదు. మీపూర్వులందరును రాజ్యపాలనము చేసి ప్రజలను రక్షించుటవలననే పుణ్యగతులను పొందిరి. మీ ధర్మపరిపాలనమువలన మాబోటి మునులందరును సర్వదా మహాపుణ్యకర్మలను చేయగలుగుచున్నాము. అవన్నియు మీవేయగును. ఇప్పుడొక యద్భుతవిషయమును జెప్పెదవినుము. పూర్వము మధుకైటభులను రాక్షసులిద్దరుగలరు. వారు లోకప్రసిద్ధులు. వారికి దుందుడను కుమారుడు గలడు. అతడు మహాబల పరాక్రమవంతుడు. అతడు తన తపోబలమువలన బ్రహ్మదేవుని మెప్పించి వరమును, బడసెను. ఆవరప్రభావమువలన సకలరాక్షస గంధర్వాదులందరును వానిని జయింపజాలరు. అతడు నిర్భయముగా సంచరించుచున్నాడు. మాయాశ్రమసమీపమునయిప్పుడతడునివసించుచున్నాడు. అతడచ్చట నివసించుపద్ధతిని వివరించెదనువినుము. సముద్రతీరమున

విశాలమగు యిసుకతిన్నె లామడలకొలది దూరముండును. ఆ యిసుక యందొక మహాబిలమును జేసుకొని యందు నిద్రింపుచుండును. వాని శరీరమంతయు నిసుకచేతకప్పబడి వాని నిశ్వాసలు పొగవలె నగ్నిజ్వాలలు గ్రక్కుచుండును. అదియంతయు నిసుకతిన్నెలపై దాకి యుప్పొంగింపబడుచుండెను. అందువలన నదియంతయు ఒక్కసారిగా సంవత్సరమున కొకమారు బయటకు వచ్చుచుండును. అట్లువచ్చిన ధుంధునిశ్వాసవాయువేగముచేత యిసుక దుమ్మువెగసి భూమ్యాకాశములను కప్పివేయుచుండెను. ఏడుదినములవరకు ఆసమీపమందలి భూపర్వతవనము లన్నియు కదలుచుండెను. ఇందువలన మేము మాయాశ్రమములం దుండుటకు భయముగానున్నది గాన నీ వా పాపాత్ముడైన ధుంధురాక్షసునిచంపి మాకును లోకమునకును సంతోష మొనగూర్పుము. అట్లు చేసితివేని నీవుకృతార్థుడవు కాగలవు. నీ వా ధుంధురాక్షసుని చంపి పిమ్మట తపోవనమునకు బొమ్ము. మరియొక విశేషమును జెప్పెదవినుము. పూర్వము విష్ణుదేవుడు నాకు ప్రత్యక్షమై యిట్లు చెప్పెను. ఉదంకుడా! ధుంధురాక్షసుని చంపుటకు పూనుకొను మహాపురుషునకు మహాబలయోగశక్తి నిచ్చెదను. అందువలన ఆ పురుషునకు విజయము కాగలదు. అని విష్ణుదేవుడు ప్రియవచనములను నాతో మున్నె జెప్పెను. గాన ఓ బృహదశ్వరాజా! నీవు ఆ విష్ణుదేవుని కృపవలన దివ్యశక్తిని పొందుము. ఆ ధుంధురాక్షసుని చంపుటకు రమ్ము లెమ్ము నీవు మహాబలవంతుడవు. ఇట్టి కార్యమును జేయుటకు నీవే సమర్థుడవు, కాన నీ వా ధుంధురాక్షసునిచంపిన యెడల, నీకు కీర్తి పుణ్యము కూడ కలుగును. సకలలోకములను రక్షింపుము. అని ఉదంక మునీంద్రుడు బృహదశ్వ మహారాజుతో జెప్పెను. బృహదశ్వుడు రాజునకు యిట్లనెను.

మహాత్మా! ఉదంకమునీంద్రా! నేను నిర్మలబుద్ధిగలవాడనై తపోవనమునకు అస్త్రసన్యాసము గావింప బోవుచున్నాను. నేను తపమునకు బోవుట తప్పదు. అని బలికెను. మరియు నిట్లుచెప్పెను. యీ కువలయాశ్వుడు మహాపురుషుడు, ధర్మగుణవంతుడు, మహా

బలవంతుడు, ధైర్యవంతుడు, కీర్తివంతుడు, సజ్జనుల కుపకారము చేయు బుద్ధిగలవాడు అతడు తప్పక దుందును దెగటార్చి నీకు మేలు చేకూర్చగలడు. మరియు నీతని కనేకమంది పుత్రులుగలరు. వారు కూడ మిగుల భుజాబల సంపన్నులు. వారి సహాయమున కువలయాశ్వుడా మహారాక్షసుని బరిమార్పగలడు. నేను తపోవనమునకు బోవుట కనుజ్ఞ నిండు. అని చెప్పుచు ఉదంకుని యనుమతిని బొందెను. ఆ మహారాక్షసుని చంపుటకు కువలయాశ్వుని నియమించెను. బృహదశ్వుడా కువలయాశ్వు నుదంకునకు నప్పగించి తాను తపోవనమునకు బోయెను. అని మార్కండేయ మహాముని ధర్మరాజుతో చెప్పగా ధర్మరా జిట్లనెను. మార్కండేయ మునీంద్రా! ఆ దుందుడను రాక్షసుడు మధుకైటభుల కుమారుడని చెప్పిరి. ఆమధుకైటభులను రాక్షసు లేకాలమువారో నాకు తెలియ జెప్పుము. వారిద్దరును ఏ క్రమముగా ఎవ్వరిచేత ఏమైరో దెలుపుము. అని యీరీతిగా అడిగిన ధర్మరాజు పలుకులకు మార్కండేయ మునీంద్రుడు చెప్పసాగెను.

**మార్కండేయుడు ధర్మరాజునకు మధుకైటభుల చరిత్రము చెప్పుట**

ధర్మరాజా! పూర్వము మూడులోకములు జలప్రళయమునై ఏకసముద్రమై యుండెను. ఆసమయమున విష్ణుదేవు డొక్కడే నాగేంద్రునిమీద పండుకొనియుండెను. అట్లు ఆ యోగనిద్రయందు బహుకాలము జరిగెను. ఆప్రళయకాలమందు బ్రహ్మదేవుడు విష్ణుదేవుని నాభికమలమందు సుఖనిద్ర జెందియుండెను. ఆ సమయమున మధుకైటభులను రాక్షసులిద్దరును వచ్చి బ్రహ్మదేవుని జూచి గర్వరోషములచేత అతనిని కొట్టిరి. అప్పుడు బ్రహ్మదేవుడు భయపడి విష్ణుదేవు నుద్దేశించి అరచుచు నేడ్చెను. మహాత్మా! విష్ణుదేవా! నీవు ఆదిపురుషుడవు. నన్ను రక్షింపుము. అని బ్రహ్మదేవుడు తన మనంబునగల దేవుని తలంచి దుఃఖించెను. అది యంతయు విష్ణుదేవుడు చూచి యోగనిద్రనుండి మేల్కాంచి మధుకైటభులను రాక్షసుల నిరువురను చూచెను. ఆ రాక్షసులు ఘోర పరాక్రమ

పంతులు సింహామువంటి భయంకరాకారులునై యుండిరి. వారినిజూచి విష్ణుదేవు డిట్లనెను.

ఓ మధుకైటభులారా! మీ రీ రీతిగావచ్చి బ్రహ్మదేవునికి భయము కలిగించుటవలన ప్రయోజనములేదు. నేను సంతోషించితిని. మీకు యిష్టవరముల నిచ్చెదను. వేడుకొనుడు. అని విష్ణుదేవుడు చెప్పగా నారాక్షసు లిద్దరును కలకలనవ్వి దేవా! నీవు మా కేమి వరము లిచ్చెదవో తెలియకున్నది. నీకు మేమిద్దరము వరముల నిచ్చెదము. నీకు కావలసిన యిష్టవరములను కోరుకొనుము. అని మధుకైటభులు పలుకగా విష్ణుదేవుడు వారికిట్లనెను. మధుకైటభులారా! మీరిద్దరు సత్యవ్రతపరులగుదురు. మిక్కిలి ప్రీతిపూర్వకముగా మిమ్ములను నేను వరమడిగెదను. ఇప్పుడు మీరిద్దరును నాచేత మరణమును బొందుడు. యిదియే నాకిష్టమగు వరము. నాచేత మీరిద్దరును మృత్యువు పొందినయెడల సర్వలోకములకు మేలుకలుగును. యీవరమును నాకిమ్ము అని విష్ణుదేవుడడుగగా మధుకైటభు లిద్దరును ఒకరిముఖము లొకరుచూచుచు నవ్వి విష్ణుదేవునితో యిట్లనిరి. విష్ణుదేవా! మామాటలను వినుము. మే మెప్పటికిని యసత్యము జెప్పము. మేమిద్దరము మహాధైర్య మహాబల, మహాపరాక్రమ, మహాశౌర్యవంతులము. కాలగతిని మీకుట కెవ్వరికిని సాధ్యము గాదు. నీవడిగినప్రకారము మాప్రాణములను నీకిచ్చి నీమనస్సునకు సంతోషము గలిగించెదము. చావునకు మేము భయపడము. నీవు మాయిద్దరిని చంపదలచినయెడల జలములేని ప్రదేశమందు చంపవలయును. ఆమాట నిశ్చయము. నీచేత చచ్చుటకు మేము తగి యున్నాము. అని మధుకైటభులు విష్ణుదేవునితో జెప్పిరి. విష్ణుదేవుడు నవ్వుచు యిట్లని తలంచెను. ఇప్పుడు మూడులోకములు ప్రళయము చేత జలమయములై యున్నవి. గాన ఇప్పుడు నాతొడలను విశాలముగాజేసి ఈమధుకైటభులను చంపెదను. అని విష్ణుదేవుడు తలచి తన తొడలను విశాలముగా జేసి ఆతొడలమీంద తన చక్రాయుధము చేత ఆమధుకైటభుల శిరస్సులను రెంటిని నరికివేసెను. అని మార్కండే

దేయమునీంద్రుడు ధర్మరాజుతో చెప్పెను. ధర్మరాజా! ఈమధుకైట భుల పుత్రుడే దుందుడనువాడు. అతడు మహారాక్షసుడు. శూరుడు. మరియు గర్వమువలన దేవేంద్రాది దేవతలనెల్ల యవమానించుచుండెను. బృహదశ్వుని యాజ్ఞాప్రకారము కువలయాశ్వుడు శుభదినమందు ఆదుందురాక్షసుని జంపుటకు బయలుదేరెను. కువలయాశ్వుడు ఉదంకునిముందుంచుకొని సైన్యసమేతముగా ప్రయాణమాయెను. కువలాశ్వుడు మహోత్సాహముతో యుద్ధసంసిద్ధుడై బయలుదేరెను. అతని యిరువదియొక్క వేలమంది కొడుకులు మహాభుజబలగర్వసమన్వితులై అతని సేవించుచు అతనివెంబడినచ్చిరి. ఈరీతిగా కువలయాశ్వుని చతురంగబలములు నడచుచుండగా భూమి కదలుచుండెను. విష్ణుదేవుడు తన దివ్యతేజోశక్తిని అతనియందు ప్రవేశింపజేసెను. దేవేంద్రాది దేవతలును, మహామునులును సంతోషించి కువలయాశ్వుని కుత్సాహముకలిగించిరి. ఆసమయమందు దివ్యవాద్యములు మ్రోగెను. కల్పవృక్షములు పుష్పవర్షములను గురిపించెను. చల్లనిగాలి మెల్లగా వీవజొచ్చెను. ఆసమయమున ఆకాశములో దేవవిమానములు తిరుగుచుండెను. పక్షులు, మృగములును, శుభగమనములు చేయుచుండెను. కువలయాశ్వుని ప్రయాణసమయమున నన్నియు శుభశకునములే కలిగెను. ఈరీతిగా కువలయాశ్వుడు సముద్రతీరమందు దిగి తన యిరువదియొక్క వేల కుమారులను జూచి కుమారులారా! ఈయిసుకతిన్నెలలోపల గొప్పగొప్ప సొరంగములను జేసుకొని దుందుడను రాక్షసుడు పండుకొని నిద్రింపుచున్నాడు. గాన ఈ తిన్నెలనన్నిటిని త్రవ్వుడు. అని కువలయాశ్వుడు కొడుకులతో జెప్పి నియమించెను. అంతట నాకుమారులందరును నానావిధశూలాయుధ కుద్దాలముద్గరాయుధాదులను తీసుకొని ఆయిసుకదిబ్బల నేడు దినములపర్యంతము త్రవ్విరి. అట్లు త్రవ్వగా ఆయిసుకతిన్నెలోపల గాఢముగా నిద్రించుచున్న రాక్షసుడు కనబడెను. అతడు అగ్నిజ్వాలలతో సమానమగు నిశ్వాసములను విడచుచుండెను. కువలయాశ్వుని యిరువదియొక్క వేలమంది పుత్రులును

గదలును, కత్తులను, గండ్రగొడ్డండ్రను శూలాద్యాయుధములను, తీసికొని ఆరాక్షసుని దేహమును పొడిచి కొట్టి మిక్కిలిగా బాధించిరి. అంత బహుకాలమున కారాక్షసుడు మేల్కొని దేహము కదిలించి నీలిగి నోరు తెరచి ఆవులించెను. ఆ యావులింతవలన అతని నోటిలోనుండి, నేత్రములలోనుండి, ముక్కులలోనుండి అగ్నిజ్వాలా సమూహములు వెలుపలికి వ్యాపించెను. అందువలన ఆ యిరువది యొక్కవేలమంది కుమారులును చచ్చిరి. కపిలుని కోపాగ్నిజ్వాలల చేత సగరుని పుత్రులందరును జచ్చినట్లు కువలయాశ్వుని పుత్రులందరును చచ్చిరి. కాని వారిలో దృఢాశ్వుడు, కపిలాశ్వుడు, భద్రాశ్వుడు అనువారలు ముగ్గురుమాత్రము బ్రతికిరి. అందులకు కువలయాశ్వుడు మిగుల కోపించి ప్రళయకాలసూర్యునివలె మండిపడుచుండెను. కువలయాశ్వుడు మిక్కిలి కోపముతో ఆ దుందునిపై బడెను. దుందుడు మహాకోపముతో నొక శూలాయుధమును తీసి కువలయాశ్వునితో యుద్ధమునకు వచ్చెను, అతని దేహమందు అగ్నిజ్వాలలు కలవు. కువలయాశ్వుడా యగ్నిజ్వాలలను తన యోగవిద్యాప్రభావము వలన యణగించి బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. ఆ మహిమచేత యగ్నిజ్వాల భూమ్యాకాశ దిక్కులయందు వ్యాపించెను.

ఒక నిమిషములో ఆ బ్రహ్మాస్త్రమువలన గలిగిన యగ్నిహోత్రముచేత దుందురాక్షసుని దేహము భస్మమాయెను. ఆ సమయమున దేవతలు కువలయాశ్వునితో రాజా! దేవతలకు శత్రువైన దుందురాక్షసుని నీవిప్పుడు చంపితివి. లోకములను రక్షించితివి. దుందురాక్షసుని చంపినందున నిన్ను దుందుమారుడందురు. అని చెప్పగా దేవతలును, ఉదంకాదిమునులును కువలయాశ్వుని యందు దయగలవారై రాజా! నీవలన మేమందరమును పరమసంతోషమును

బొందితిమి. నీకిష్టమగునది చెప్పిన నీకువరమిచ్చెదము. అని అడుగగా కువలయాశ్వుడు మహాత్మా! మునులారా! నాకు సర్వదా బ్రాహ్మణులయందు భక్తి, దానములయందు రక్తి, విష్ణుదేవునియందు భక్తి, సర్వదా కలిగియుండవలయును. ఇతడు చంపిన నాకుమారులందరును బ్రతుకవలయును. ఈవరములను మాత్రమిమ్మని యడుగగా దేవమును లావరములనన్నిటిని తమతమ స్నేహమును వెలిబుచ్చుచు నొసంగి తమ నిజనివాసములం జేరిరి.

ధర్మరాజా! కువలయాశ్వమహారాజు విజయలక్ష్మిచే ప్రకాశించుచు ఉదంకమునీంద్రుని పంపించెను. కువలయాశ్వుడు తన పట్టణమగు అయోధ్యకు వెళ్ళి వేశ్యాస్త్రీల నృత్యగానముల చూచుచు గృహములో ప్రవేశించెను. పిమ్మట అతడు రాజ్యసామ్రాజ్య భోగముల ననుభవించుచు సుఖముగానుండెను. అని ఈరీతిగా కువలయాశ్వునికి దుందుమారుడను పేరుగలిగినవిధానమంతయు మార్కండేయమునీంద్రుడు ధర్మరాజుతో చెప్పెనని వైశంపాయనుడు జనమేజయునితో జెప్పెను.

ఇది శ్రీ మహాభారత వచనకావ్యమందు అరణ్యపర్వమున
చతుర్థాశ్వాసము.

మొదటిభాగము సమాప్తము.